# దేశభక్తుని దీనయాత్ర

రచయిత
ఆర్థర్ కోస్లర్
ఇంగ్లీష్ అనువాదం : డాఫిన్ హార్డీ
తెలుగు అనువాదం : డా॥ చలసాని రామారాయ్

ప్రతిభ సాహితి
విజయవాడ-2.

వెల : రు 8/-

# ఈ పుస్తకం గురించి

అనేక కారణాలవలన "దేశభక్తుని దీనయాత్ర" చాలా ముఖ్యమైన పుస్తకం. 1941 లో యిది ప్రచురించబడినప్పుడు, రాజకీయ విభేదాలు నిర్మూలించటానికి మాస్కో దేశద్రోహ విచారణలు తయారుచేసే నికృష్టపు టొప్పుదలను గురించిన యదార్థ విషయాలను బయట పెట్టింది. ప్రపంచం ఆ విషయాలను విశ్వసించలేకపోయింది. విధానాలకంటె గమ్యానికే యెక్కువ ప్రాధాన్య మిచ్చే కమ్యూనిస్టుల దృక్పథాన్ని అర్థం చేసుకోవాలనుకునే వాళ్ళు యీ పుస్తకం చదవటం యీనాడు కూడ అత్యవసరమే. సంక్షిప్త పరుపబడిన అత్యద్భుతమైన యీ నవలలో అన్ని రాజకీయ తత్త్వాల సారం, రెండు సంఘర్షణ దృక్పథాల మధ్యనున్న మూలాభిప్రాయ భేదాలు రసవంతంగా సమకూర్చబడ్డాయి. ఈ దృక్పథాలలో ఒకదానికి వ్యక్తి అతి ముఖ్యం, రెండోదానికి వ్యక్తి అతి అప్రాముఖ్యం.

ఇది ఒక జాతిని, ఆ జాతి జీవితవిధానాన్ని చిత్రించే నవల అయినప్పటికి ముఖ్యంగా ఒకవ్యక్తి జీవితచిత్రణ. ఇతర సుప్రసిద్ధ నవలాకారులలాగే కోస్లర్ కూడ పూర్వపు బోల్షివిక్ విప్లవ నాయకుడైన రుబషోవ్‌ని తన కథానాయకుడుగా మానవజాతి తరఫున నిలబెట్టాడు. అతని మృత్యువులో మన అందరిగతి యిమిడివుంది. రచయిత యిందులో యెక్కడా నీతిని వక్కాణించలేదు. స్వీయ వూహాగానం చేయలేదు. స్వగతాలు లేవు. శ్లేష ఒక్కటే కీలకం. కథానాయకుని మానసిక భావవలో, అతను తోటి ఖైదీలతో జరిపిన సంభాషణలలో — ముఖ్యంగా అతను నిరసించే వర్గానికి చెందిన తెల్లరష్యన్‌తో గదిగోడమీద తట్టటంతో జరిగిన సంభాషణలలో — నైతిక ఘర్షణ నాటకరీతిని విడివడుతుంది. రుబషోవ్ అనేకవిధాల చితికిపోయి, దుర్భ్రమపాత్రుడైనాడు. కమ్యూనిస్టు ఆర్థిక విధానంలో "నేను" అనే వ్యక్తిగతభావన పూర్ణానుస్వారమైంది, అందువల్ల దానికి "వ్యాకరణ గల్పిక" అని పేరుపెట్టి, దాన్ని అర్థంచేసుకోవటానికి యెన్నో సంవత్సరాలనుండి శిక్షణతో పెరిగిన

బుద్ధిని పాడుచేసుకొన్నాడు. అయినా అర్థంకాలేదు. ప్రామాణిక జైలు గాథలలో యిదొకటి. అనేక అంతరాలలో అనేక రకాల నైతిక అంతరాలతో కూడుకొన్న నేరం, శిక్షల గాథ.

---

ఈ నవలలోని పాత్రలు కేవలం కల్పితాలు. పాత్రల చర్యలకు కారణభూతాలైన చారిత్రిక ఘటనలు మాత్రం యథార్థం. ఈ నవలలోని కథానాయకుడు యన్. యస్. రుబషోవ్ జీవితం నామమాత్రంగా జరిగిన మాస్కో విచారణలకు గురియైన వేలాది అభాగ్యుల జీవిత సంఘటనల సంపుటీకరణ మాత్రమే ఇందులో ఉదహరించబడిన సంఘటనలు అనేకం రచయితకు స్వయంగా తెలిసినవే. ఈ పుస్తకం రుబషోవ్‌లాటి అభాగ్యులకు అంకితం.

—రచయిత

పారిస్,
అక్టోబర్, 1938 – ఏప్రిల్, 1940.

---

'నియంతృత్వం స్థాపించినవాడు బ్రూటస్‌ను, లేదా ప్రజాస్వామ్యాన్ని స్థాపించినవాడు బ్రూటస్ కొడుకులనుచంపకుండా వుంటే ఎంతో కాలం రాజ్యం చేయలేడు.

'డిస్‌కోర్సి'లో మైఖవిల్లి.

'మానవుడా, ఓమానవుడా! నిర్దయతో ప్రశాంతంగా బ్రతుకలేవు'
'నేరం– శిక్ష' లో డాస్టవస్కీ.

# మొదటి విచారణ

'ఎవరూ నిర్దుష్టంగా పాలించలేరు'

సెయింట్ - జస్ట్

# 1

రుబషోవ్ లోపలికి వెళ్ళగానే ఖైదు గది తలుపు విసురుగా మూయబడింది.

లోపల ఆ తలుపుకానుకొని కాసేపు నిలబడి తరువాత సిగరెట్ ముట్టించాడు. పక్కమీద రెండు శుభ్రమైన దుప్పట్లు కుడివైపుగా పెట్టి వున్నయ్. గడ్డిపరుపు కొత్తగా సరిచేసినట్లుంది. అతనికి ఎడమప్రక్క నున్న వాష్ బేసిన్‌కి బిరడలేదు కాని పంపు పనిచేస్తూనే వుంది. దాని ప్రక్కనే వున్న క్యాన్‌ని క్రిమిసంహారి నీళ్ళతో కడగటంవల్ల వాసన రావటం లేదు. గదిగోడలు కారురాతితో కట్టడంవల్ల బయటిశబ్దం యేమాత్రం లోపలికి రాదు. పొయ్యి, నీటిగొట్టం వున్నచోట మాత్రం గచ్చుచేసి వుండటంవల్ల అక్కడ బాగా ప్రతిధ్వని వస్తుంది. ఇది కాక వేడిగొట్టం ఒక్కటే శబ్దాన్ని తెచ్చేదిగా వున్నట్లుంది. గోడకు కిటికీ యెత్తుగావుంది. అందులోనుంచి బయటకు చూడవచ్చు, కిటికీచువ్వలు పుచ్చుకొని యెగరకుండానె. అంతవరకు అంతా సవ్యంగానే వుంది.

రుబషోవ్ ఆవులించి, కోటు వూడదీసి చుట్టగా మడత పెట్టి తలగడగా పరుపుమీద పెట్టాడు. బయటి ఆవరణలోకి చూచాడు. వెన్నెలకాంతి, ఎలక్ట్రిక్‌దీపాల కాంతి కలసి మంచుమీద పడి చిత్రమైన పసుపుపచ్చని కాంతిని ప్రతిఫలింపచేస్తున్నయ్. ఆవరణలో గోడలవెంట చుట్టూ, ప్రతిరోజూ చేసే

వ్యాయామం కోసం, మంచు తీసివేసి దాని సరిజేశాడు. ఇంకా తెల్లవారలేదు. దీపాలకాంతి వున్నప్పటికీ, నక్షత్రాలు స్పష్టంగా, చల్లగా ప్రకాశిస్తున్నయ్. రుబషోవ్ గదికి యెదురుగా వున్న గోడ ప్రాకారంమీద ఒక సిపాయి రైఫిల్‌ను పటవాలుగా పుచ్చుకొని, సైనిక విన్యాసం చేస్తున్నప్పటిలాగ, అడుగడుక్కూ నేల తట్టుతూ, అటూ యిటూ వందఅడుగులకవాతు చేస్తున్నాడు. అప్పుడప్పుడు పసుపుపచ్చని దీపకాంతి ఆ సిపాయి రైఫిల్ బాకుమీద ప్రతిఫలిస్తోంది.

రుబషోవ్ యింకా కిటికీ వద్దనే నిలబడివుండి, బూట్లు వూడదీశాడు. సిగరెట్ ఆర్పి పక్కచివర నేలమీదపడేసి పరుపుమీద కొద్దిక్షణాలపాటు కూర్చున్నాడు. మళ్ళీ కిటికీ దగ్గరకెళ్ళాడు. ఆవరణలో అంతా ప్రశాంతంగా వుంది. కాపలా సిపాయి అప్పుడే తిరుగుతున్నాడు. మరతుపాకి వున్న బురుజుప్రక్కగా ఆకాశంలో పాలపుంత కనిపించింది.

రుబషోవ్ బల్లపక్కమీద నడుంవాల్చి పైనున్న దుప్పటితీసి ముసుగుపెట్టాడు. ఐదుగంటలైంది కాని యీచలి కాలంలో ఏడుగంటలైతేగాని యెవ్వరూ లేవనట్టుగా వుంది. బాగా నిద్రవస్తోందతనికి. ఇంక మూడు నాల్గురోజులవరకు తన విచారణ జరగదని నిర్ణయించుకొన్నాడు. ముక్కద్దాలు తీసి, రాతి పరుపు నేలమీద, సిగరెట్‌పీక ప్రక్కగా పెట్టి ఒక చిరునవ్వునవ్వాడు. నెమ్మదిగా కళ్ళుమూశాడు. దుప్పట్లో వెచ్చగా పడుకొని భద్రంగానే వుందనుకొన్నాడు. కొన్నినెలల యీ మధ్య కలల్ని గురించి మొదటిసారిగా యిప్పుడు భయంలేకుండా నిద్రపోయాడు.

కొన్ని క్షణాల తర్వాత వార్డరు బయటినుంచే దీపం ఆర్పివేశాడు. తలుపుకువున్న రహస్య రంధ్రంలోనుంచి లోపలికి తొంగిచూచాడు. మాజీ ప్రజాకమిసార్ రుబషోవ్, ఎడమచెయ్యి పక్క-చివరకు చాచి, చేతిమీద తలపెట్టుకొని, గోడవైపుకు వీపుపెట్టి, పడుకొని నిద్రపోతున్నాడు. రెండో చెయ్యి వదులుగా వ్రేలాడుతోంది. నిద్రలో యీ చేతిని గుంజుకొన్నాడు.

# 2

ఇంతకు ఒకగంట ముందు ప్రజాకమిసార్‌యెట్ అధికారులిద్దరు రుబషోవ్‌ను అరెస్టుచేయటానికివచ్చి అతని గది తలుపు తట్టుతున్నప్పుడు, తాను అరెస్టుకాబడినట్టు కల కంటున్నాడు.

తలుపు తట్టే మ్రోత యెక్కువైంది. రుబషోవ్ లేవటానికి చాల బాధపడ్డాడు. పీడకలల బాధ వదిలించుకోవటానికి కొంత శ్రమపడ్డాడు. అతడు మొదటిసారి అరెస్టు అయినప్పటి కల కొన్ని సంవత్సరాలనుంచి అప్పటప్పట, గడియారపు ముల్లు విధంగా తిరిగి తిరిగి వస్తోంది. అతిప్రయాసతో ఆ కల గమనాన్ని ఆపి, మెలకువ తెచ్చుకొని, పీడకల బాధనుంచి తప్పించుకొంటున్నాడు. కాని యీసారి కృతకృత్యుడు కాలేకపోయాడు: గడచిన కొన్ని వారాలపాటు పడ్డ శ్రమవల్ల అలసిపోయాడు. నిద్రలోనే చెమటలుపోసి, రొప్పుతున్నాడు. గడియారం తిరుగుతోంది. పీడకల జరుగుతోంది.

మామూలుగా, ఎప్పుడూ తలుపుమీద తట్టుతున్నట్లుగా తనను అరెస్టు చెయ్యటానికి మనుషులు తలుపు కవతల నిలబడివున్నట్టుగా కలకంటున్నాడు. మూసిన తలుపుకవతల నిలబడి తలుపుమీద బాదుతున్న మనుషుల్ని చూస్తున్నాడు. వాళ్ళు కొత్తయూనిఫారాలు వేసుకొన్నారు. ఆ యూనిఫారాలు రాబోయే జర్మనీ నియంతృత్వ పాలనా రక్షక దళాలు ధరించేవాటిలాగ వున్నయ్. వాళ్ళ టోపీల మీద, కోటు చేతులమీద వాళ్ళ హోదాలగుర్తులు- కొట్టొచ్చినట్టుండే స్వస్తిక్ చిహ్నం గలవి- వున్నయ్. చేతుల్లో పెద్దవి, భయంకరంగా కనిపించే పెద్ద పిస్తోళ్ళున్నయ్. నడుముకి, కోటుపైనా వున్న బెల్టులు కొత్తతోలువాసన కొడుతున్నయ్. ఇప్పుడు అతని గదిలోకే, పక్క దగ్గరకే వచ్చారు. అందులో యిద్దరు బాగా ఎదిగిన రైతు బిడ్డలు. వాళ్ళకళ్లు చేపకళ్ళలాగా, పెదిమలు మొద్దుగా వున్నయ్. మూడో వాడు పొట్టిగా బలిసివున్నాడు. పిస్తోళ్ళు సరిజేసి పుచ్చుకొని గట్టిగా వూపిరి పీలుస్తూ అతని పక్కప్రక్కనే నిలబడి వున్నారు. పొట్టివాడి వుచ్ఛ్వసపు దగ్గు, రొప్పు ధ్వని లేకపోతే అంతా ప్రశాంతంగానే వుంది. అంతలో పై అంతస్తులో ఎవరో పంపుబిరడ లాగారు. గోడలనున్న గొట్టాలనుంచి నీళ్ళు జారుతున్నయ్.

గడియారపుముల్లు క్రిందికి దిగిపోతోంది. రుబషోవ్ గది తలుపుమీద తట్టేమోత ఎక్కువౌతోంది. అతన్ని అరెస్టు చేయటానికి వచ్చినవాళ్ళిద్దరూ తలుపుమీద ఆగి ఆగి గట్టిగా గుద్ది, బిగుసుకుపోతున్న చేతులు మంటగావుం

డటంవల్ల బాధపడుతున్నారు. ఇప్పుడు విషాదదృశ్యం జరుగుతుందని తెలుసు. కాని రుబషోవ్ లేవలేక పోతున్నాడు. ఆ ముగ్గురూ అతనిప్రక్కనే నిలబడివున్నారు. ఉదయపు దుస్తులు-డ్రస్సింగ్ గౌను-వేసుకో ప్రయత్నిస్తున్నాడు. అయితే చొక్కా-చెయ్యి లోపలికి ముడతపడి వుండటంవల్ల యెంత ప్రయత్నించినా చెయ్యి దూరటంలేదు. ప్రయత్నిస్తే చొక్కా చెయ్యి సరిచేసుకో గలిగినప్పటికి యేదో పక్షవాతం వచ్చినవాడిలా కదలలేక పోతున్నాడు. ఈ విదారక నిస్సహాయ స్థితితో ఆయాసపడ్డాడు, కొద్దిక్షణాలపాటు.నుదుటి పార్శ్వాలు తడిగా, చల్లగా వున్నయ్. తలుపుమీద మ్రోత దూరంగా యెక్కడో వాయిస్తున్న రండోలు మ్రోతగా నిద్రలో విని పింస్తోందతనికి. తలగడక్రింద పెట్టినచేతిని చొక్కా తొడుక్కొనే ప్రయత్నంలో నీరసంగా గుంజుకొన్నాడు. చివరకి పిస్తోలుమొనదెబ్బ గట్టిగా చెవిమీద తగిలిన తర్వాత గాని యీ బాధనుంచి విముక్తి చెందలేదు.

అలవాటైన యీ బాధ, యెన్నోసార్లు తిన్నట్లుగా వున్న యీ మొదటిదెబ్బతో-అప్పటినుంచే అతనికి చెవుడు వచ్చింది - మామూలుగా లేచాడు. కాసేపు వణికిపోయాడు. తలగడ క్రిందవున్న చెయ్యి నలిగి వుండటంవల్ల కొంతసేపటి వరకు, చొక్కా తొడుక్కోడానికి కూడా, స్వాధీనానికి రాలేదు. పూర్తి మెలకువ వచ్చేవరకు విధిగా పడవలసిన బాధ కొంతవుంది. ఆ చీకటికొట్టు గదిలో తడిరాతి నేలమీద పడివున్నట్లు, కాళ్ళవద్దకాక, తలదగ్గర నీళ్ళచెంబు, కొంచెం రొట్టెముక్కలు వున్నట్లు, యీ లేవటం స్వప్నలోకంనుంచి

యదార్థస్థితికి రావటమనీ, యదార్థానికి తాను పై స్థితిలో వున్నాననే నిరాకారభావనలో కొట్టుమిట్టాడుతున్నాడు.

ఈసారికూడ కొద్దిసేపు సందిగ్ధపుటాలోచనలో పడ్డాడు. ఆ చీకట్లో తడుముకుంటే మాత్రం తనచేతికి క్యాన్‌గాని, తనప్రక్కనే వున్న లైట్‌స్విచ్‌గాని తగులుతుందా అనే అనుమానం. అప్పుడే వెలుగువచ్చింది. మంచు విడిపోయింది. రుబషోవ్ అనేకసార్లు దీర్ఘంగా వూపిరి పీల్చాడు. కోలుకొంటున్న రోగిలాగ, రొమ్ముమీద చేతులుపెట్టుకొని స్వేచ్ఛా భద్రతల మధురభావనను అనుభవించాడు. గుడ్డతో ముఖంమీద, వెనుకవైపు బట్టతలభాగంమీద పట్టినచెమటను తుడుచుకున్నాడు. పార్టీనాయకుడు నెం. 1 వర్ణచిత్రంవైపు చూచి కళ్లుమిటకరించాడు. ఆవర్ణచిత్రం, ఆగదిలో అతని పక్కకు పైగా గోడకు తగిలించివుంది. తనగదికిప్రక్కన, క్రింద, లేదా పైనవున్న అన్నిగదుల్లోనూ, ఆయింటికున్న అన్నిగోడలకు, ఆ పట్టణంలోవున్న అన్నియిళ్ళలోను, ఆ విశాలదేశపు అన్ని ప్రాంతాల్లోను వ్రేళ్లాడుతూవుంటుంది. ఆ దేశంకోసమే తాను పోరాడి బాధపడ్డాడు. ఆ దేశమే యిప్పుడు అతన్ని తిరిగి తన విశాలమైన రక్షణాలయంలోకి తీసుకుంది. ఇప్పటికిపూర్తిగా మెలకువవొచ్చింది. కాని తలుపుమీద మోత తగ్గలేదు.

## 3

రుబషోవ్‌ను అరెస్టు చేయటానికొచ్చిన యిద్దరూ గోడ అవతల చీకట్లో నిలబడి సంప్రదించుకొంటున్నారు. ఇంటి

కాపలావాడు వాసిలిజ్ వాళ్ళకు పైకి దారిచూపించి, వాకిట్లో నుంచొని భయంతో రొప్పుతున్నాడు. వాసిలిజ్ ముసలి వాడు, సన్నగా వున్నాడు. రాత్రి ధరించే చొక్కామీద మిలటరీ ఓవర్‌కోటు తొడుక్కున్నాడు. చిరిగిన కోటు కాలర్ పైనుంచి వెడల్పాటి యెర్రటి మచ్చ కనిపిస్తోంది. ఆ మచ్చ గండమాల వ్యాధిగ్రస్తులదేమో ననిపిస్తోంది. అది, అంతర్యుద్ధం అయ్యేవరకూ రుబషోవ్ నాయకత్వాన దేశీయ దళంలో వున్నప్పుడు తగిలిన దెబ్బమచ్చ. ఆ తర్వాత రుబషోవ్ విదేశాలకు వెళ్ళాడు. వాసిలిజ్ తనకూతురు సాయంకాల పూట చదివి వినిపించేవార్తాపత్రికల వార్తల్లో అప్పుడప్పుడు మాత్రమే రుబషోవ్‌నుగురించిన విశేషాలు వింటూవచ్చాడు. కాంగ్రెసులో రుబషోవ్ యిచ్చిన దీర్ఘోపన్యాసాలు ఆమెచదివి వినిపించేది. అవి సాధారణంగా వాసిలిజ్‌కి అర్థమయ్యేవి కావు. కాని తాను బాగాయెరిగివున్న చిన్న గడ్డపు దేశీయ నాయకుని సుపరిచిత వాగ్ధోరణి, ప్రతిజ్ఞలు — ఆ వాగ్ధాటికి కాసాన్ నగరంలోని మాడోనాదేవతకూడ చిరునవ్వు నవ్వేది- పత్రికల్లోని వుపన్యాసాల్లో కనిపించటంలేదు వాసిలిజ్‌కి. ఉపన్యాసాలు చదువుతున్నప్పుడు మధ్యలోనే నిద్రపోయే వాడు. చివరలో, అతని కూతురు వుద్రేకంతో కేకలువేసినప్పుడు, మళ్లీ మేలుకొనేవాడు. ఆచారప్రాయంగా ప్రతిసారి వినపడే 'అంతర్జాతీయపార్టీ జిందాబాద్' 'విప్లవం వర్ధిల్లాలి' 'నెం. 1 జిందాబాద్' నినాదాల తర్వాత, హృదయపూర్వకంగా తనలోతాను, కూతురు వినకుండా, శాంతివచనం చెప్పుకొని, చొక్కాగుండీ విప్పి రహస్యంగా క్రీస్తుశిలువను

స్మరించేవాడు. వికల మనస్సుతో పడుకొనేవాడు. అతని పక్కకు పైగా నెం. 1 వర్ణచిత్రం గోడను వ్రేలాడుతోంది. దానిపక్కనే దేశీయనాయకుడుగా రుబషోవ్ ఫొటో కూడా వుంది. ఆ బొమ్మను చూచివుంటే యితన్నికూడా తీసుకు పోయేవాళ్ళే.

మెట్లమీద చల్లగా, చీకటిగా, ప్రశాంతంగా వుంది. ప్రాంతీయ కమిసారియెట్ అధికారుల్లో చిన్నవాడు పిస్తోలుతో ప్రేల్చి తాళం బ్రద్దలుకొడదామంటున్నాడు. వాసిలిజ్ తెరిచివున్న ద్వారంవద్ద నిలబడివున్నాడు. బూట్లు సరిగా కట్టుకోవటానికికూడ వ్యవధి లేకపోయింది. బూట్ల త్రాళ్ళు బిగించుకోవటానికికూడ వీలులేనంతగా చేతులు వాణికి పోయినయ్. రెండోవాడు ప్రేల్చటాని కంగీకరించటంలేదు. తెలివితేటలతో అరెస్టు చెయ్యాలంటున్నాడు. బిగుసుకుపోతున్న చేతుల్ని వూదుకొంటూ తలపు తట్టుతున్నాడు. అంతలో చిన్నవాడు చివరకు తనచేతిలోని రివాల్వారుపిడితో తలుపు మీద గట్టిగా బాదాడు. కొన్ని అంతస్థుల క్రిందభాగంలో ఒకమ్మాయి భయంతో గట్టిగా కేకవేసింది. చిన్నవాడు వాసిలిజ్‌తో ఆ అమ్మాయిని నోరుమూసుకోమని చెప్పమన్నాడు. 'ఇక్కడ అధికారులున్నారు. నిశ్శబ్దంగా వుండ' మని వాసిలిజ్ కేకవేశాడు. దాన్తో ఆ అమ్మాయి వెంటనే శాంతించింది. ఆ చిన్నవాడు తలుపును బూట్లతో గట్టిగా తన్నటం మొదలుపెట్టాడు ఆ మెట్లభాగమంతా ఆ మ్రోతతో ధ్వనించి పోయింది. చివరికి తలుపు వూడింది.

ముగ్గురూ రుబషోవ్ పక్కదగ్గర కెళ్ళి నిలబడ్డారు. చిన్న

వాడు పిస్తోలు సరిచేసుకొని పుచ్చుకున్నాడు, పెద్దవాడు ఆజ్ఞాబద్ధుడిలాగ బిగదీసుకొని నిలబడ్డాడు. వాసిలిజ్ వీళ్ళకు కొంచెం వెనకాల గోడకానుకొని నిలబడివున్నాడు. రుబషోవ్ యింకా బట్టతల తుడుచుకొంటూ వీళ్ళవైపు నిద్రకళ్ళతోనే నిదానించి చూచాడు. 'నికోలస్ సామనోవిచ్ రుబషోవ్, చట్టప్రకారం మేము నిన్ను అరెస్టుచేస్తున్నాం' అన్నాడు చిన్నవాడు.

దిండుక్రింద పెట్టిన ముక్కద్దాల కోసం వెదుక్కుంటూ తనకై తాను ఆసరాచేసుకొని కొద్దిగా లేవ బోయినాడు. ముక్కద్దాలు తగిలించుకొన్నాడు. ఫోటోల్లోనూ, వర్ణచిత్రాల్లోనూ, చూచిన ప్రజానాయకుని కళ్ళు పెద్దవాడికి, వాసిలిజ్ కి యిప్పుడు గుర్తుతగిలినయ్. పెద్ద అధికారి యింకా జాగ్రత్తగా నిలబడ్డాడు. కాని చిన్నవాడు, కొత్తనాయకత్వంలో తయారైనవాడు కావటంచేత ఒకడుగు పక్కదగ్గర కెళ్ళాడు. రుబషోవ్ ఏదో అమానుషంగా ప్రవర్తించటమో, మాట్లాడటమో చేస్తా డనిపించింది ఆ ముగ్గురికీ.

'ఆ తుపాకి అవతలపెట్టు కామ్రేడ్, అయితే యిప్పుడు నావల్ల యేంకావాలి?' అన్నాడు చిన్నవాడితో రుబషోవ్.

'నిన్ను అరెస్టు చేశామని విన్నావుగా. త్వరగా బట్టలువేసుకో, ఆట్టే గల్లంతుచేయక' అన్నాడు కుర్రాడు.

'వారంటుందా?' రుబషోవ్ అడిగాడు.

పెద్దఅధికారి జేబులోనుంచి కాగితం వొకటితీసి రుబషోవ్ కిచ్చి మళ్ళీ ఆజ్ఞాబద్ధుడిలా నిలబడ్డాడు.

రుబషోవ్ దాన్ని జాగ్రత్తగా చదివి, 'మంచిది... ఇటువంటి విషయాల్లో యెవడికీ బుద్ధివుండదులే. దెయ్యపు ముండాకొడుకుల్లారా' అన్నాడు.

'బట్టలు వేసుకొని త్వరగా బయల్దేరు' అన్నాడు కుర్రాడు. అతని అమానుష వర్తనకు అంతులేనట్లు కనిపించినా అతనికి సహజంగానే వున్నట్టుంది. 'చక్కని తరాన్ని సృష్టించాం' అనుకొన్నాడు రుబషోవ్. సదా చిరునవ్వుతో వెలిగొందే ముఖాలతో వున్న యువకుల చిత్రాలను ప్రదర్శించే ప్రచారచిత్రాలు గుర్తుకొచ్చినయ్. బాగా అలసిపోయినట్లయినాడు. 'ఆ రివాల్వరుతో సతమతం కాకపోతే ఆ చొక్కా యిలా యివ్వరాదూ?' అన్నాడు కుర్రాడితో. కుర్రాడి మొఖం కందగడ్డయింది కాని మెదల్లేదు. పెద్దవాడు రుబషోవ్ కి చొక్కా అందించాడు. చొక్కా తొడుక్కుంటూ "కనీసం యీ సారైనా వెళ్ళిందిచెయ్యి" అన్నాడు. తెచ్చికోలు చిరునవ్వుతో. మిగతా ముగ్గురికీ యిదేమీ అర్థంకాక మెదలకుండా వూరుకొన్నారు. రుబషోవ్ పక్కమీదనుంచి లేచి జీర్ణవస్త్రాలను ప్రోగుచేస్తుంటే చూస్తున్నారు, మిగతా వాళ్ళు.

భయంతో యింతకుముందు అరిచిన అమ్మాయిఅరుపు తప్ప మళ్ళీ యేమీ చప్పుడు వినిపించలేదు. కాని యీపాటికి ఆ భవంతిలో వున్నవాళ్ళంతా లేచి భయకంపితులై మెదలకుండా వూపిరి బిగపట్టుకూర్చునివుంటారని వీళ్ళకు తెలుసు.

పై అంతస్థులో యెవరో పంపుబిరడా లాగారు. పంపు గొట్టాల్లోనుంచి నీళ్లు సమానంగా కారుతున్నయ్.

# 4

వాకిటిముందు ఆ అధికారులెక్కి వచ్చిన కొత్త అమెరి కన్ కారు నిలబడివుంది. ఇంకా చీకటిగానే వుంది. షాఫర్ - కారుడ్రైవరు - కారులైట్లు వేశాడు. బజారు నిద్రితావస్థలో వుంది. కనీసం అలా నటిస్తున్నట్లైనా వుంది. ముందు కుర్రాడు, తర్వాత రుబషోవ్, ఆతర్వాత పెద్దవాడు కారులో యెక్కారు. యూనిఫారమ్‌లోవున్న షాఫర్ కారును స్టార్టుచేశాడు. మూల మలుపు దాటగానే తారురోడ్డు ఆగిపోయింది. ఇంకా పట్ట ణపు మధ్యలోనేవున్నారు. రోడ్డుకు రెండువైపులా తొమ్మిది, పది అంతస్తుల నవీనభవనాలున్నయ్. అయితే రోడ్డుమాత్రం పల్లెల్లోలాగ మట్టి దిమ్మసచేసినవే. పగుళ్ళలో మంచుపొడి పడివుంది. నడకమాత్రపు వేగంతో తోలుతున్నాడు కారును. అత్యంతసుందరంగా గట్టిగాతయారైన కారు ఆమాత్రానికే ఎడ్లబండిలాగ మ్రోతపెడుతోంది.

కారులో ప్రశాంతతను భరించలేక కుర్రాడు 'కారు త్వరగా నడుపు' అన్నాడు.

ఎటువైపూ తిరక్కుండా షాఫర్ గూడలురిక్కించాడు. కారులో యెక్కేప్పుడే రుబషోవ్ వైపు నిర్లక్ష్యంగా, అమిత్ర భావంతో చూచాడు. ఒకసారి రుబషోవ్‌కి ప్రమాదం జరి గింది. అప్పుడు ఆస్పత్రికి వెళుతూండగా అంబులెన్సు కారు డ్రైవరు వెనుకభాగంలో వున్న రుబషోవ్ వైపు యిలాగే చూచాడు. ఆ నిర్మానుష్యపువీధుల్లో నెమ్మదిగా కుదుపుల్తో నడుస్తూ, కారులైట్ల కాంతి వూగిసలాడుతూ దారిని అప

వ్యంగా చేస్తూవుంటే భరించటం కష్టంగావుంది. ప్రక్కవాళ్ళ వైపుచూడకుండానే 'యింకా యెంతదూరంవుంది?' అని రుబషోవ్ అడిగాడు. వెంటనే అన్నాడు: 'హాస్పిటలికి' అని, 'ఇంకా సరిగా అరగంట' అన్నాడు పెద్దవాడు. రుబషోవ్ జేబులోనుంచి సిగరెట్ పెట్టె తీసి వొకటి నోట్లోపెట్టుకొని, పెట్టెను ప్రక్కవాళ్ళకందించాడు. కుర్రాడు తడుముకోకుండా వొద్దన్నాడు. పెద్దవాడొకటి తీసుకొని షాఫర్‌కిచ్చాడు పెట్టె. షాఫర్ టోపీ సవరించుకొని, చక్రం వొకచేత్తో పట్టుకొని అందరి సిగరెట్లూ వెలిగించాడు. రుబషోవ్ హృదయం కొంచెం తేలికపడింది. కాని వెంటనే అలా తేలికపడినందుకు బాధపడ్డాడు. ఈ సమయంలో గంభీరంగా వుండాలనుకొన్నాడు, కాని కొంచెం మాట్లాడి ప్రక్కవాళ్ళల్లో మానవత్వాన్ని మేల్కొల్పాలనే వాంఛని అరికట్టలేకపోయాడు. 'కారుని చూస్తే జాలేస్తోంది. విదేశీకార్లు బోలెడుఖరీదౌతయ్. మన రోడ్లమీద ఆరునెల్లు తిరక్కముందే యెందుకూ పనికిరాకుండా పోతయ్' అన్నాడు.

'నువ్వు చెప్పింది అక్షరాలా నిజం. మనరోడ్లు చాల పాడుగావున్నయ్' అన్నాడు పెద్దఅధికారి. ఆ అధికారి మాట తీరునుబట్టి తన నిస్సహాయతను గుర్తించినట్టుగా కనిపించింది. కుక్కకు మాంసపుబొమిక విసరినట్లయిం దనుకున్నాడు మళ్ళీ మాట్లాడదలుచుకోలేదు. ఇంతలో కుర్రాడు తీవ్రంగా 'ఇంతకంటే పెట్టుబడిదారీదేశాల్లో బాగుంటయ్యా?' అన్నాడు.

రుబషోవ్ చిరునవ్వు నవ్వి అడిగాడు, 'నీవెప్పుడైనా విదేశాలకెళ్ళావా?'

'అక్క-డెలావుంటుందో నాకు బాగా తెలుసు. వాటిని గురించి నువ్వు నాకు కథలు చెప్పనక్కర్లేదు' అన్నాడు గ్రాడు.

'నేను సరిగా యెవర్ననుకొంటున్నావు?' అని శాంతంగా అడిగి, 'నిజంగా నువ్వింకా కొంచెం పార్టీ చరిత్ర చదవాలి' అని అనకుండా వుండలేకపోయాడు రుబషోవ్.

కుర్రాడు డ్రైవరువీపువైపు తదేకదృష్టితో చూస్తూ మెదలకుండా వూరుకొన్నాడు. ఎవరూ మాట్లాడలేదు. అసలే ఆయాసపడుతున్న కారుని మూడోసారి గట్టిగా మ్రోతపెట్టిస్తూ ఆకుదింపులతోనే ముందుకు పోనిస్తున్నాడు డ్రైవరు. ఆ సివారుల దౌర్భాగ్యపు కొయ్యయిళ్ళల్లో మార్పేమీ లేదు. వంకరటింకరగా వున్న యిళ్ళ పైకప్పులపైగా చంద్రుడు చల్లగా, పాలిపోయి ఆకాశంలో వేళ్లాడుతూ కనిపిస్తున్నాడు.

# 5

నవీనపద్ధతుల్లో కట్టిన క్రొత్తవిధానపు జైలువరండాల్లో ప్రతిదాంట్లోనూ ఎలక్ట్రిక్‌దీపాలు వెలుగుతున్నయ్. చల్లగా వున్న యినపమెట్లమీద, తెల్లగా సున్నంకొట్టిన గోడలమీద, ఖైదుగదుల తలుపులమీద వున్న ఖైదీలపేర్ల కార్డులమీద యీకాంతి చల్లగా పడుతోంది. ఈ వేలవకాంతి, పెంకుపరుపు నేలమీద జైలుసిబ్బంది నడిచేటప్పుడు వచ్చే ప్రతిధ్వనిలేని అడుగులచప్పుడు రుబషోవ్‌కి బాగా పరిచితములే.

ఈ వాతావరణం కొద్దిక్షణాలపాటు మళ్ళీ కలకంటున్నట్లని పించింది. ఇప్పటివరకు జరిగిందంతా యదార్థం కాదని తనను తాను నమ్మించుకో ప్రయత్నించాడు. 'నిజంగా కలగంటు న్నాననే నమ్మకం కలిగించుకోగలిగితే, యిది నిజంగా కలే అవుతుం' దనుకొన్నాడు.

తల తిరిగిపోయేటంత తీవ్రంగా ఆలోచించాడు. వెం టనే భరించలేనంత సిగ్గుతెర వచ్చింది. ఈ సిగ్గు చివరివరకూ వుంటే బాగుండుననుకొన్నాడు. వాళ్లు 404 నెంబరు జైలు గదివద్దకొచ్చారు. ఆ గది తలుపుకున్న రహస్యరంధ్రంపైగా నికోలస్ సామనోవిచ్ రుబషోవ్ అనేపేరు వ్రాసిన కార్డు పెట్టివుంది. 'వీళ్లు అంతా చాల చక్కగా యేర్పాటుచేశారే' అనుకొన్నాడు. ఆ కార్డుమీద తనపేరును చూచేటప్పటికి అతనికి నిరసనభావం కలిగింది. వార్డర్ని యింకో దుప్పటి అడుగుదా మనుకుంటుండగానే తలుపు దభాలున మూసు కొంది, రుబషోవ్ వెనకాల.

# 6

అప్పుడప్పుడు తలుపు రహస్య రంధ్రంలోనుంచి వార్డరు రుబషోవ్ గదిలోపలికి తొంగిచూస్తున్నాడు రుబషోవ్ ప్రశాం తంగా నిద్రపోతున్నాడు బల్లమీద. నిద్రలో అప్పుడప్పుడు చెయ్యి గుంజుకుంటున్నాడు. బల్ల ప్రక్కనే నేలమీద అతని ముక్కద్దాలు, సిగరెట్ పీక వున్నయ్.

ఉదయం యేడుగంటలకి- అతన్ని 404 నెంబరు గదికి

తీసుకొచ్చిన రెండుగంటలకి- బాకానూతవిని లేచాడు. అప్పటి నిద్రలో కలలేమీ రాలేదు. మనస్సు శుభ్రంగావుంది. బాకా మూడుసార్లు మ్రోగింది, చెవులు గింగురుమనేటట్లు. బొంగురుగా వొణుకుతూ వచ్చేనూత ప్రతిధ్వనించి ఆగిపోయింది. సహింపరాని ఆ ద్వేషపూరిత ప్రశాంతత అచలితంగా వుంది.

ఇంకా బాగా ప్రొద్దెక్కలేదు. ఆ గదిలో ప్రసరిస్తున్న మసక వెలుతురులో క్యాన్, వాష్ బేసిన్- కడుగుపాత్ర- ఆకారాలు స్పష్టంగా కనిపించటం లేదు. గోడకిటికీకి నల్లరంగు పూసి మసకఅద్దం అమర్చబడివుంది. పైభాగం అద్దం పగిలిపోతే వార్తాపత్రిక కాగితం అంటించారు. రుబషోవ్ లేచి కూర్చుని పక్కచివరవున్న ముక్కద్దాలు, సిగరెట్ పీక వెదకి తీసుకొని మళ్ళీ పడుకున్నాడు. ముక్కద్దాలు పెట్టుకొని యెలాగో సిగరెట్ పీకను వెలిగించాడు. ప్రశాంతత యింకా ఆవరించివుంది. ఈ సిమెంట్ కాంక్రీట్ తేనెపట్టులోని, సున్నం కొట్టినగదుల్లోని జనాభా వొక్కొక్కరే పక్కలమీదనుంచి తిట్టుకొంటూ, పెంకునేల తడుముకొంటూ లేస్తున్నారు. వరండాల్లో జైలుసిబ్బంది పాదధ్వని తప్ప యీ ఒంటరి గదుల్లోకి యింకేమీ వినిపించటంలేదు. తాను తుపాకితో కాల్చబడేవరకూ యీ ఒంటరి గదిలోనే పడివుండాలని రుబషోవ్‌కు తెలుసు, వికృత విలాసంతో వేళ్ళతో గడ్డం సవరించుకొని, సిగరెట్ పీక పీల్చి, మెదలకుండా పడుకున్నాడు.

'అయితే నన్ను కాలుస్తారన్నమాట' అనుకున్నాడు, రుబషోవ్. అర్ధనిమీలిత నేత్రాలతో కాలి బొటనవ్రేలివంక చూస్తున్నాడు. అది పక్కచివర పైకి పొడుకొచ్చినట్లు నిలబడి

వుంది. బాగా అలసి పోయినప్పటికి వెచ్చగా భద్రంగా వున్నాననుకొన్నాడు. అలాగే దుప్పట్లో వెచ్చగా వుండనిస్తే అక్కడే, అప్పుడే మృత్యువును కౌగలించుకోవటానికేమీ అభ్యంతరం లేదతనికి. 'అయితే నిన్ను కాలుస్తారన్న మాట' అని తనకు తాను చెప్పుకొన్నాడు. నెమ్మదిగా బొటనవ్రేళ్లను మేజోళ్ళలో యిరికించాడు.

క్రీస్తు పాదాలను ముళ్ళపొదలో పడిన లేడిపిల్లకు పోలుస్తూ వ్రాసిన ఒక పద్యం గుర్తుకొచ్చింది. ముక్కుద్దాలుతీసి చొక్కాచేతిమీద తుడిచాడు. ఆ తుడిచేపద్ధతి అతని అనుయాయు లందరికీ సుపరిచితమైనదే. దుప్పట్లో వెచ్చగా, హాయిగా పడుకున్నాడు కాని అందులోనుంచి లేచి, తిరగాలి పోస్తుందనే భావం కొంచెం భయపెట్టింది. 'అయితే నిన్ను నాశనంచేస్తారన్నమాట' అని అర్ధోక్తిలో అనుకొన్నాడు. సిగరెట్ పెట్టెలో మూడే సిగరెట్లు మిగిలినప్పటికీ ఒకటి తీసి కాల్చాడు. పరగడుపున త్రాగే సిగరెట్లు అప్పుడప్పుడు త్రాగుడునిషాను కలిగిస్తుంటయ్. అయినా ప్రస్తుతం మృత్యు గహ్వారంలో వున్నట్టుగా, పాత అనుభవంలాటి భావనలోనే వున్నాడు. ప్రస్తుతం తాను నిందితావస్థలో వున్నట్టు తెలుసు. కాని ఒకవిషయందృష్ట్యా అది వొప్పతగింది కాదు. అయినప్పటికి ఆ ద్వృకధంతో వాదించదలచుకోలేదు. దానికిబదులు మేజోళ్ళలో యిరికించిన బొటనవ్రేళ్ళతో ఆడుకొంటున్నాడు. చిన్న చిరునవ్వు నవ్వుకొన్నాడు. తనమీద తనకే జాలివేసింది. సాధారణంగా అలా యెప్పుడూ జాలిపడటం సహించడు. ఆ భావనను అణిచివేయటానికికూడ జాలివేసింది.

'పాతదళం చచ్చిపోయారు' 'మనం ఆఖరువాళ్ళం' 'మనం కూడ నాశనం కాబోతున్నాం' అనుకున్నాడు. 'బంగారు పాపలు అందరూ, మసితుడిచేవాళ్ళలాగ మట్టిలో కలవాల్సిందే.' ఈపాట జ్ఞాపకంచేసుకొని పాడదామని ప్రయత్నించాడు. కాని 'మట్టిలో కలవాల్సిందే' అనే పొడిమాటలు మాత్రమే బయటికొచ్చాయి. 'పాతదళంవారు చచ్చిపోయారు' అని మళ్ళీ అనుకొన్నాడు. వాళ్ళముఖాలను గుర్తుకు తెచ్చుకో ప్రయత్నించాడు. చాల కొద్దిమందినిమాత్రమే జ్ఞాపకం చేసుకోగలిగాడు. దేశద్రోహిగా వురితీయబడ్డ అంతర్జాతీయపార్టీ మొదటిఅధ్యక్షుడు, గుండ్రంగా పెరిగిన అతని చిరుబొజ్జమీద కప్పిన చెక్కగుడ్డ వేస్టుకోటు మాత్రమే గుర్తుకొచ్చింది. అతడెప్పుడూ తోలుబెల్టు పెట్టేవాడు. గుడ్డపట్టీ యెప్పుడూ వుపయోగించలేదు. విప్లవదేశపు రెండో ప్రధాని — ఇతడుకూడ వురితీయబడ్డాడు — ప్రమాదకరసమయాల్లో చేతిగోళ్లు కొరుక్కునేవాడు. 'ఏ ప్రత్యేక నేరమూ ఆపాదించకుండా చరిత్ర నీకు యథాస్థానమిస్తుందిలే' అనుకున్నాడు రుబషోవ్. గోళ్లు కొరుక్కోనటంసంగతి చరిత్రకేంతెలుసు? చచ్చిపోయినవాళ్లు చచ్చిపోయేముందు పొందిన అవమానవ్యథ తలచుకొంటూ, సిగరెట్ పీలుస్తూ పడుకొన్నాడు. ఐనా నెం. 1 మీద రావలసినంత అసహ్యం రాలేదు. తన పక్కపైగావున్న నెం. 1 వర్ణచిత్రాన్ని చూస్తూ దాన్ని ద్వేషించాలని యెంతో ప్రయత్నించాడు. వాళ్ళంతా తనని యెన్నో మాటలన్నారు. తానుకూడ వాళ్ళనన్న సంద

ర్భాలున్నయ్. చివరికి నెం.1 తన నధిగమించాడు. నెం. 1చం పిన వాళ్ళందరూ, తుపాకిగుండు వాళ్ళ పీపుల్లో దూరుతున్న ప్పుడుకూడ నెం.1న్యాయదృక్పథంలో వున్నాడనే విషయాన్ని వొప్పుకోలేకపోయేవారు. నెం. 1 న్యాయదృక్పథ అవకాశం కంటే వాళ్లు అతనిదృక్పధాన్ని అంగీకరించటానికి అతడు కలి గించిన భయోత్పాతం యెక్కువ పనిచేసింది. ఆ పరిహాసాస్పద మైన దేవవాక్కుకు చేసిన వినతినే వాళ్లు చరిత్రఅన్నారు. దాని యధార్థాన్ని శంకిస్తూ మొఱపెట్టుకొనేవాడి నోరు నొక్కుకు పోయి నేలకరుచుకొన్నప్పుడు ఆ చరిత్రకు గ్రంథకల్పన చేశారు. నమ్మకం యేమీ లేదు.

రుబషోవ్ తలుపువైపు చూడకపోయినప్పటికీ వొక కన్నుగుడ్డు తలుపు రహస్య రంధ్రంలోనుంచి తనను పరీశీలి స్తోందని గమనించాడు. ఒక్క క్షణం తర్వాత తలుపు మొద్దు తాళంరంధ్రంలో తాళపు చెవిపెట్టి త్రిప్పిన శబ్దం వినబడింది. తలుపుతీయటానికి కొంచెం ఆలస్యమైంది. ఆతర్వాత స్లిప్పర్లు తొడుక్కున్న పొట్టి, ముసలి వార్డరు వాకిట్లో నిలబడి,

'ఎందుకని లేవలేదు,' అడిగాడు.

'ఒంట్లో బాగుండలా' అన్నాడు, రుబషోవ్.

'ఏమిటీ సంగతి? రేపు వుదయంలోపల నిన్ను డాక్టరు దగ్గరకు తీసుకువెళ్ళటానికి వీల్లేదు.'

'పంటినొప్పి' అన్నాడు రుబషోవ్.

'పంటినొప్పి... కాదూ' అంటూ వార్డరు తడబడుతూ బయటికెళ్ళి తలుపు విసురుగా మూశాడు.

'కనీసం, యిప్పుడు మెదలకుండ పడుకోవచ్చు' ను

ంన్నాడు, కాని ఆభావం అతనికేమీ సంతోషాన్ని కలిగించ లేదు. దుప్పటి వెచ్చదనం యెక్కువై రోత పుట్టించింది. దుప్పటిని తన్ని పారేశాడు. బాటనవెళ్ళే కదలికను చూస్తూ పడుకోవాలనుకున్నాడు. కాని అదికూడ విసుగు పుట్టించింది. మేజోళ్ళకు మడమల దగ్గర చిరుగులున్నయ్. కుట్టుదామను కొంటే సూది, దారంకోసం తలుపు తట్టాలి. ఒకవేళ తట్టి వార్డరును పిలిచి అడిగినా అతను యేపరిస్థితుల్లోను వాటిని యివ్వకపోవచ్చుననుకొని ఆ ప్రయత్నం విరమించుకొన్నాడు. తటాలున, వార్తాపత్రిక చదవాలనే ప్రగాఢవాంఛ పెల్లుబి కింది. ఆ వాంఛ తీవ్రత, తనచేతిలో పత్రిక లేకపోయినా పత్రిక ముద్రించిన సిరా వాసన పీలుస్తున్నట్టు, పేజీలు తిర గేసేటప్పుడయ్యే శబ్దం వింటున్నట్టు భావన కలగజేసింది. బహుశా రాత్రి యేదైనా విప్లవం బయలుదేరిందేమో. లేక యేదేశ నాయకుడైనా హత్య చెయ్యబడ్డాడేమో, లేక యే అమెరికనైనా ఆకర్షణశక్తిని యెదుర్కొనే విధానాన్ని కని పెట్టాడేమో, రాత్రి అచ్చయ్యే పత్రికలో తన అరెస్టువార్త వుండదు. ఇంకా కొంతకాలంపాటు రహస్యంగా వుంచుతారు స్వదేశంలో. విదేశ పత్రికలుమాత్రం యేదోవిధంగా యీ వార్త జేరుతుంది. వాళ్ళు పదేళ్ళనాటి పాతపత్రికల్ని తిరగేసి తన బొమ్మలు తీసి, తననుగురించి, నెం.1 నుగురించి వెధవ చెత్తంతా వ్రాసి ప్రకటిస్తారు. ఇప్పుడు పత్రిక అక్కర్లేదు. కాని నెం1. మెదడులో యేమేమి ఆలోచనలు సాగుతున్న యో తెలుసుకోవాలనే వాంఛ తీవ్రమైంది. నెం. 1 గూడలు కుర్చీకి ఆసరా చేసుకొని, ఆసించి కూర్చొని నెమ్మదిగా,

బరువుగా, పేలవంగా స్టెనోగ్రాఫరుకు యేదో చెప్పి వ్రాయి
స్తున్నట్లు తన కళ్ళముందు కనుపిస్తున్నాడు. ఇతరులు ఆ సమ
యంలో తిరుగుతూ, సిగరెట్ పొగచక్రాలను వదుల్తూ, లేక
కొలతబద్దతో ఆడుతూనే చెపుతారు. నెం.1 మాత్రం కద
లడు, సిగరెట్ కాల్చడు, ఆడుకోడు ... రుబషోవ్ తానే
అయిదు నిమిషాలనుంచి అటూ యిటూ తిరుగుతున్నట్లు గమ
నించాడు. తనకు తెలియకుండానే పక్కమీదనుంచి లేచాడు.
ఒక్క క్షణంసేపుకూడ నెం.1 ను మర్చిపోలేదు. కదలకుండా
కుర్చీలో కూర్చుని స్టెనోగ్రాఫరుకు చెప్పి వ్రాయిస్తున్న
దృశ్యం క్రమేపి గోడమీద వ్రేళ్ళాడే నెం 1 వర్ణచిత్రంలో
రూపొందింది. ఆ చిత్రం దేశంలో ప్రతి యింట్లో, ప్రతి గోడ
మీద, ప్రతి మారుమూల వ్రేళ్ళాడుతూ వుంటుంది. ఆ చికిలి
కళ్ళు ప్రజలవైపు తీవ్రంగా చూస్తుంటయ్.

రుబషోవ్ గదిలో అటూయిటూ తిరుగుతున్నాడు.
తలుపుదగ్గరనుంచి కిటికీవద్దకు, కిటికీవద్దనుంచి తిరిగి తలుపు
దగ్గరకు ఆరున్నర అడుగులు లెఖ్ఖపెట్టుకుంటూ తిరుగు
తున్నాడు. తలుపుదగ్గర కెళ్ళినప్పుడు కుడివైపుకీ, కిటికీదగ్గర
కొచ్చినప్పుడు యెడంవైపుకీ తిరుగుతున్నాడు. ఇది ఖైదీల
పాత అలవాటు. అలా తిరక్కపోయేట్లయితే విసుగ్గా, తిక్కగా
వుంటుంది. నెం. 1 మనస్సులో యేమాలోచనలు సాగు
తున్నయ్యో? నెం. 1 మెదడునుగురించిన ఒక భావనా
చిత్రాన్ని వూహించాడు. డ్రాయింగుబోర్డుమీద డ్రాయింగు
పేపరు పిన్నుల్తో అమర్చబడివుంది. దానిమీద నీటిరంగులతో
బూడిదవర్ణంతో వొక చిత్రం వేశారు. ఆబూడిదవర్ణ పురంగుప్రేగు

లలాగ పైకి వుబికివుంది. ఆ ప్రేగులు నరాలపాములలాగ ఒకదానొ్నకటి మెలివేసుకొని, అస్పష్టంగా, మర చుట్టులాగ వున్న నక్షత్రాల గుంపులులాగ - ఖగోళశాస్త్ర పత్రాలలోలాగ - వున్నయ్. ఆ బూడిదవర్ణపు రేఖల్లో యేమి ప్రసరిస్తోందో? దూరానవున్న నక్షత్రమండలం విషయం తెలుసుకోవచ్చు గాని యీరేఖల్లో యేమివున్నదీ తెలియదు. అందుకే చరిత్ర శాస్త్రంగా గాక దైవవాక్యంగా వున్నదేమో! బహుశా, భవిష్యత్తులో, దూరపు భవిష్యత్తులో ఖగోళశాస్త్రంలాగ అంకెల కూటముల ఆధారంతో చరిత్రని బోధిస్తారేమో. పాఠశాలలో మాష్టరు, నల్లబల్లమీద ఫలానదేశంలో ఫలాన కాలంలో ప్రజాజీవితం యెలావుంటుందో తెలుసుకోవటానికి, బీజగణితసూత్రాన్ని వ్రాసి చెపుతాడుకాబోలు. 'ఇదుగో యిక్కడ ప్రజలు, చారిత్రికగతిని నిర్ణయించిన భౌతికకారణాలు చూడండి' అంటాడు. మళ్ళీ నెం. 1 మెదడులోని మెట్టపల్లాలమధ్య బూడిదవర్ణపు ప్రదేశాన్ని కొలబద్దతో చూపిస్తూ, 'ఈ భౌతికకారణాలకు కర్తృత్వ ప్రతిబింబం యిక్కడుంది. ఇదే యిరవయ్యో శతాబ్దపు రెండోపాదంలో తూర్పుయూరపులో ఏకైకనాయకత్వ సిద్ధాంతానికి ఘనవిజయం చేకూరుస్తుంది' అని చెపుతాడు. ఆదశకు వచ్చేవరకు రాజకీయాలు రక్తపిపాస, పచ్చి మూఢనమ్మకం, కనుకట్టుగానేవుంటయ్.

వరండాలో చాలామంది నడుస్తున్న అడుగులచప్పుడు వినబడుతోంది. ఇక యిప్పుడు దెబ్బలకార్యక్రమం సాగుతుందనుకున్నాడు, రుబషోవ్. గడ్డం ముందుకుపెట్టి, చెవులు

రిక్షించివింటూ గదిమధ్యలోనే ఆగిపోయాడు. ఆ కవాతు అడుగుల చప్పుడు చుట్టుప్రక్కలవున్న ఒక గదిముందు ఆగి పోయింది. నెమ్మదిగా ఆజ్ఞావాక్యాలు వినిపిస్తున్నయ్, తాళపు చేతులు గలగల వినిపించింది. మళ్ళీ మామూలు ప్రశాంతత ఆవరించింది.

రుబషోవ్ పక్కకీ, బకెట్‌కీ మధ్యలోనిలబడి వూపిరి బిగబట్టి వింటున్నాడు, కెవ్వుమంటూ మొదటి యేడుపు విన బడుతుందేమోనని. ఆ మొదటియేడుపు సాధారణంగా అతి దారుణంగా వుంటుందని అతనికి జ్ఞాపకంవుంది. శారీరక బాధ కంటె భయోత్పాతమే మొదటియేడుపు అంత దారుణంగా వుండటానికి కారణమౌతుంది. ఇప్పటివరకు జరిగింది భరింప శక్యంగానేవుంది. తర్వాత యేంజరిగేదీ తీరిగ్గా వూహించుకో వచ్చు. కేకల్నిబట్టి దెబ్బల తీవ్రత, హింసావిధానం నిర్ణయించ వచ్చు. గొంతులోను, స్వభావంలోను కొన్ని తేడాలు వున్న ప్పటికీ సాధారణంగా బాధితులందరూ చివరలో ఒకేవిధంగా ప్రవర్తిస్తారు. కేకల అనంతరం స్థాయి తగ్గుతుంది, మూలుగు, తర్వాత ఎక్కెక్కి యేడ్వటం జరుగుతుంది ఆతర్వాత సాధా రణంగా గదితలుపు విసురుగా మూసుకుంటుంది. మళ్ళీ తాళపుచెవుల గలగలమ్రోత వినిపిస్తుంది. ప్రక్కగదిలోని అభాగ్యుడు వీళ్ళను తలుపుదగ్గరే చూచి బావురుమంటాడు.

రుబషోవ్ గదిమధ్యలోనే నిలబడి మొదటిరోదనకోసం యెదురు చూస్తున్నాడు. కళ్ళద్దాలు చొక్కా చేతిమీద తుడుచుకొంటూ, యీసారి తనకేమైనాసరే కేకలు వెయ్య వద్దనుకొన్నాడు. ప్రార్థిస్తున్నవాడిలాగ యీమాట పదేపదే

అనుకొన్నాడు. ఇంకా కేకలు వినిపించలేదు, కొద్దిసేపటికి అస్పష్టంగా రొణగొణధ్వని, తర్వాత తలుపుమూసిన శబ్దం వినిపించింది. అడుగులచప్పుడు ప్రక్కగదివైపు కెళ్ళింది.

రుబషోవ్ తలుపుదగ్గరకెళ్ళి రహస్య రంధ్రంలోనుంచి వరండాలోకి చూచాడు. వాళ్లు దాదాపు తనగదికెదురుగా వున్న 507 నెంబరు గదిముందు ఆగారు. ఆ ముసలివార్డరూ, యిద్దరు పనివాళ్లు టీకళాయి లాక్కొస్తున్నారు; యింకోకడు నల్లరొట్టెముక్కలున్న సంచిపట్టుకొస్తున్నాడు; యిద్దరు యూనిఫారాల్లోవున్న వుద్యోగులు పిస్తోళ్ళుపుచ్చుకొని వెంట వున్నారు. దెబ్బల కార్యక్రమంలేదు. ఉదయపు అల్పాహారం పంచుతున్నారు.

407 నెంబరుకు రొట్టె యిస్తున్నారు. నిబంధనప్రకారం 407 నెంబరు ఒకడుగు తలుపవతల నిలబడ్డాడు. అందువల్ల రుబషోవ్‌కిఅతని ముంజేతులుతప్ప మొఖం కనిపించలేదు. గదిలోనుంచిరెండు కర్రలు అడ్డంగా వరండాలోకి పెట్టినట్లుగా, సన్నగా వున్న 407 నెంబరు చేతులు ముంధుకు చాచాడు. అతని అరిచేతులు భిక్షాపాత్రలాగ వంకరగా పైకి త్రిప్పివున్నయ్. రొట్టెతీసుకొని చీకటికొట్లోకి వెళ్ళిపోగానే తలుపు విసురుగా మూసుకుపోయింది.

రుబషోవ్ మళ్ళీ పచార్లు సాగించాడు. ముక్కద్దాలు తుడవటం ఆపి వాటిని యధాస్థానంలో వుంచి, గట్టిగా వూపిరి పీల్చి తేలికపడ్డాడు. ఒకచిన్న యీలపాటపాడి రొట్టెకోసం యెదురుచూచాడు. ఆ 407 నెంబరు చేతులు గుర్తుకొస్తున్నయ్. అవి యేదో అవ్యక్తవిషయాన్ని అతనికి గుర్తుకుతెస్తు

న్నాయిగాని, అవి స్పష్టంగా తెలవడంలేదు. ఆ చేతుల ఆకారం, వాటిమీదపడ్డ వెలుగునీడలు పరిచితంగా కనిపిస్తోంది. కాని పాత రాగంలాగనో సముద్రరేవుదగ్గరి సందుల్లో వచ్చే వాసనలాగనో అతని స్మృతిపథంలోనుంచి పోయింది జ్ఞాపకం.

# 7

జైలుసిబ్బంది ఆ వరసలోవున్న తలుపులన్నీ తెరిచి, మూస్తున్నారు. కాని రుబషోవ్ తలుపుతీయటంలేదు. టీకోసం యెదురుచూస్తూ చివరికైనా తన గదికొస్తారేమోనని రహస్య రంధ్రంవద్దకెళ్ళి చూస్తున్నాడు. ఆవిరివస్తున్న కళాయిలో టీ మీద సన్నని నిమ్మముక్కలు తేలివున్నయ్. ముక్కద్దాలు తీసి కన్ను రహస్య రంధ్రానికానించి చూస్తుంటే, యెదుటి వైపువరసలో 4గదులు 401నుంచి 407 వరకు కనిపిస్తున్నయ్. యీ గదులపైగా యినప పలకలతో వరండా అమర్చివుంది. ఈ వరండావెనక రెండో అంతస్తుగదులు యింకా యెన్నో వున్నయ్. ఆ సిబ్బంది కుడివైపుకు తిరిగి వెనక్కి వస్తోంది. ముందు బేసి సంఖ్యల గదుల్లో కెళుతున్నారు, తరువాత వరసలో సరిసంఖ్యగదులు. ఇప్పుడు వాళ్ళు 408 నెంబరు గది ముందువున్నారు. రివాల్వరు బెల్టులున్న వుద్యోగులిద్దరివీపులు తప్ప మిగతావాళ్ళెవరూ కనిపించటంలేదు. తలుపు దభాలు మంది. 406 నెంబరు గదికొచ్చారు. టీకళాయి, కొద్దిగా మిగిలిన రొట్టెలసంచి పుచ్చుకొన్న పనివాళ్ళు కనిపిస్తున్నారిప్పుడు రుబషోవ్‌కి. ఆ గదిలో యెవరూ లేకపోవటంవల్ల

తలుపు వెంటనే దభాలుమంది. వాళ్ళు రుబషోవ్ గదిదాటిపోయి 402 నెంబరు ముందాగారు.

రుబషోవ్ తలుపుమీద దబదబా బాదాడు. ఈ మోతవిని టీ కళాయి తెస్తున్న పనివాళ్ళిద్దరూ వొకరి వొంకొకరు చూచుకొని, తర్వాత రుబషోవ్ గదివైపు నివ్వెరపోయి చూచారు. వార్డరు 402 నెంబరు గదితాళం త్వరితంగా వేసి యీచప్పుడు విననట్లుగా నటించాడు. యూనిఫారాల్లోవున్న వుద్యోగులిద్దరూ రుబషోవ్ గదివైపు వీపులు పెట్టి నిలబడ్డారు. 402 నెంబరు గదిలోకి రొట్టెముక్కలు తోస్తున్నారు. ఈ గుంపు ముందుకు కదిలిపోతోంది. రుబషోవ్ కాలిబూటు వూడదీసి, గట్టిగా తలుపు మీద బాదుతున్నాడు.

యూనిఫారాల్లోవున్న వాళ్ళల్లో పెద్దవాడు రుబషోవ్ గదివైపు అవ్యక్తంగాచూచి తిరిగి పోయాడు. వార్డరు 402నెంబరు గది తలుపు వేశాడు. పనివాళ్ళు సంకోచిస్తూ నిలబడ్డారు. పెద్దవుద్యోగి ముసలి వార్డరు చెవిలో యేదో చెప్పిన తర్వాత అతను గూడలు రిక్కించి తాళపుచేతులు గలగల లాడించుకొంటూ రుబషోవ్ గదివైపు కొచ్చాడు. టీ కళాయి పుచ్చుకొన్నవాళ్ళు కూడ అతన్ననుసరించారు. రొట్టెముక్కలు పుచ్చుకొన్న వాడు రహస్య రంధ్రంగుండా 402 నెంబరుకు యేదో చెప్పాడు.

రుబషోవ్ ఒకడుగు వెనక్కేసి తలుపు తీస్తారేమోనని చూచాడు. అతని లోని తీవ్రత తగ్గిపోయింది. టీ వేడి చల్లారిపోయింది, వాళ్ళు తిరిగి వచ్చేటప్పటికి. నిమ్మ ముక్కలు

కూడ ముడుచుకు పోయివున్నాయ్. ఆ టీ తన కిచ్చినా యివ్వక పోయినా యిప్పుడు లక్ష్యం లేదు.

తలుపుతాళంలో తాళంచెవిపెట్టి త్రిప్పిన శబ్దమయింది. రహస్యరంధ్రంలోనుంచి ఒక కన్ను లోపలికి చూచి అంతలో వెనక్కు పోయింది. తలుపు తీశారు. రుబషోవ్ పక్కమీద కూచుని బూటు తొడుక్కుంటున్నాడు. వార్డరు తలుపుతీసి వాకిట్లో నిలబడ్డాడు. పెద్దవాడు లోపలికొచ్చాడు. అతని తల గుండ్రంగా, శుభ్రంగా క్షవరంచేసివుంది. కళ్ళు అవ్యక్తంగా వున్నయ్. బిర్రబిగిసివున్న యూనిఫారం, బూట్లు కిర్రు మన్నయ్. అతని రివాల్వరుబెల్టుతోలు బాగావాసన కొడ్తోంది. లోపలికొచ్చి బకెట్‌దగ్గరనిలబడి గదంతా కలయ జూచాడు. అతని మూలాన గదిచిన్నదైనట్లుగా కనిపించింది.

'నీగది శుభ్రం చేయలేదేం? ఇక్కడ నిబంధనలు బాగా తెలుసుగా' అన్నాడు రుబషోవ్‌తో.

ముక్కుద్దాల్లోనుంచి అతన్ని పరీక్షిస్తూ 'నాకల్పా హారం యెందుకివ్వాలా ?' అని అడిగాడు.

'నాతో వాదించాలంటే నిలబడాలి.'

'నీతో వాదించటం కాదుగదా, కనీసం మాట్లాడా లనికూడ లేదు,' అని బూటుతాడు కట్టుకొంటున్నాడు.

'అయితే యీసారి తలుపుమీద బాదకు. లేకపోతే జైలునిబంధనలు నీమీద అమలు జరపాలిసొస్తుంది' అని గదంతా మరోసారి కలయజూచి, వార్డరుతో 'యీ ఖైదీకి గది తుడుచుకోవటానికి తుడుపుగుడ్డ లేదల్లేవుంది' అన్నాడు.

వార్డరు రొట్టెలపనివాడికి యేదోచెప్పగా వాడు వెం

టనే పరుగెత్తాడు. మిగతాయిద్దరు పనివాళ్ళు గదివాకిట్లో నిలబడి లోపలికి వింతగాచూచారు. ఉద్యోగుల్లో చిన్నవాడు వీపు గదివైపుపెట్టి, కాళ్ళు పంగటించి, చేతులు వెనక్కు పెట్టుకొని వరండాలో నిలబడివున్నాడు.

రుబషోవ్ బూటుతాడు కట్టుకుంటూనే, 'ఈ ఖైదీకి తినటానికి బొచ్చెకూడ లేదు. నిరాహార దీక్ష బాధనుంచి తప్పిస్తారనుకొంటాను. మీకొత్త విధానాలు చాల బాగున్నయ్' అన్నాడు.

'నువ్వు పొరబడుతున్నావ్...' అన్నాడావుద్యోగి, రుబషోవ్ వైపు అవ్యక్తంగాచూస్తూ. అతని తలమీద పెద్ద గాయపుమచ్చ వుంది. కోటుపై విప్లవబిరుదు చిహ్నం తగిలించబడివుంది. 'ఓస్, వీడెప్పుడో అంతర్యుద్ధంలో పనిచేశాడు కాబోలు' అనుకొన్నాడు రుబషోవ్. అది యెప్పటిసంగతో, యిప్పుడు ప్రయోజనమేముంది ? .

'నువ్వు పొరపడుతున్నావ్. సుస్తీగావుందని చెప్పబట్టి నీకు అల్పాహారం యివ్వలేదు.'

తలుపుకు జేరగిలబడి నిల్చొనున్న ముసలివార్డరు 'పంటి నొప్పి' అన్నాడు అతని యూనిఫారం ముడ్డిగా, జీర్ణదశలో వుంది. ఇంకా సిప్పర్లే తొడుక్కొనివున్నాడు.

'సరే, మీయిష్టం' అని, 'మీ ప్రభుత్వం రోగుల్ని విధిగా ఉపవాసాలుంచే క్రొత్తవిధానం అవలంబిస్తోందా' అని అడగటానికి రుబషోవ్ నాలుకచివర వరకూ వచ్చిన దాన్ని తమాయించి ఆపుకొన్నాడు. ఆ దృశ్యమంతా అతనికి కంపర మెత్తించింది.

రొట్టెలవాడు రొప్పుకొంటూ, రోజుకొంటూ, పాత గుడ్డపీలిక నొకదాన్ని వూపుకొంటూ పరుగెత్తుకొచ్చాడు, వార్డరు దాన్నందుకొని బకెట్ దగ్గర మూలపడేశాడు.

'ఇంకేమైనా విన్నపాలున్నయ్యా ?' అని నిశ్లేషగానే ఆ వుద్యోగి అడిగాడు.

'ఇక యింతటితో యీనాటకం ఆపి, వెళ్ళిపొండి.' అన్నాడు రుబషోవ్. ఉద్యోగి వెనక్కితిరిగి వెళ్ళిపోయాడు. అతని వెనకే వార్డరు తాళపుచెవులగుత్తి గల గల లాడించు కొంటూపోయాడు. రుబషోవ్ కిటికీ వైపుకు తిరిగి నిలబడ్డాడు. తలుపు దభాలుమనగానే అసలు ముఖ్యమైన వస్తువు మర్చి పోయాననుకొని, తలుపు దగ్గరికొక్క గంతువేశాడు.

రహస్య రంధ్రంగుండా 'పేపరు, పెన్సిల్' అని కేకే శాడు. ముక్కద్దాలుతీసి ఆ రంధ్రంలోనుంచి వాళ్లు తనమాట విని వెనక్కు తిరిగారో లేదో చూచాడు. ఇంకా గట్టిగా అరిచాడు, కాని వాళ్లు యేమీ విననట్టుగానే వరండా చివరకు కదిలిపోయారు. ఆఖరుకు, పెద్ద వుద్యోగివీపు, వీపుమీద పెడ ల్పాటి రివాల్వరు సంచి తగిలించివున్న బెల్టు మాత్రమే కన బడింది.

రుబషోవ్ మళ్ళీ పచార్లు సాగించాడు. ఆరున్నర అడు గులు కిటికీ వద్దకు, ఆరున్నర అడుగులు వెనక్కి తలుపు వద్దకూ. ఇందాకటి దృశ్యం అతన్ని కదిలించి వేసింది. ముక్క ద్దాలు చొక్కా-చేతిమీద తుడుచు కొంటూ జరిగిన దాన్ని వివరంగా నెమరు వేస్తున్నాడు. గాయపు మచ్చవున్న వుద్యోగి మీదకలిగినద్వేషాన్నలాగే వుంచుకోడానికె ప్రయత్నించాడు.

ఎందుకంటే రాబోయే పోరాటానికి ఆ విద్వేషం తనను బింకంగా వుండేటట్లు చేయవచ్చుననుకొన్నాడు. కాని, తనకు మామూలుగా అలవాటైన స్థితికి వచ్చాడు, తనను తన ప్రత్యర్థి స్థితిలో వుంచి, యితరుల దృష్టితో పరిశీలించే విషాద స్థితిని తెచ్చి పెట్టుకున్నాడు. రుబషోవ్ అనేవ్యక్తి-పొట్టివాడు, గడ్డంవుంది, నిర్లక్ష్యంగా వున్నవాడు- చెమటతో తడిసిన మేజోడు పైన, నిజానికి ఉక్కు రోషంతో, బూటు తొడుక్కుంటూ బల్లమీద కూర్చున్నాడు. ఈవ్యక్తిలో కొన్ని యోగ్యతలు, యితనికి గొప్ప చరిత్రావున్నాయని వేరే చెప్పక్కర్లేదు. కాని యితన్ని కాంగ్రెసు సభల్లో వేదికలమీద చూడటం ఒకటీ, ఖైదుగదిలో మరుగుపడివుండగా చూడటం యింకొకటి. 'అదీ రుబషోవ్ గురించిన విచిత్రగాథ' అని పెద్ద వుద్యోగి అనుకొంటాడనుకొన్నాడు రుబషోవ్. బడిపిల్లవాడి లాగు అల్పాహారంకోసం బిక్కపడి కేకలు వేసినందుకు కూడ సిగ్గుపడటంలేదు. గది వూడ్చుకోలేదు. మేజోళ్ళు బెజ్జాలుపడి వున్నయ్. జగడాలమారి మేధావి. ప్రభుత్వానికి యెదురు తిరిగాడు: అదిసిద్ధాంతంకోసం కావచ్చు, డబ్బుకోసం కావచ్చు, కాని యేదైనా ఒకటే. విప్లవంనడిపిందిదగాకోరులకోసంకాదు. దాని విజయానికి తాను కృషిచేసినమాట నిజమే, అప్పుడు పడుచువాడు, కాని యిప్పుడు ముసలివాడై, పరిశుద్ధాత్మతో, అవసానదశలో వున్నాడు. బహుశా అప్పుడుకూడ యింతే నేమో. విప్లవ సమయంలో చాలనీటిబుడగలున్నయ్. అవన్నీ తర్వాత పగిలిపోయాయ్. తనలో యేమాత్రపు ఆత్మగౌరవ లేశమైనా మిగిలివుంటే గది వూడ్చుకుంటాడు.

కొద్దిక్షణాలపాటు తాను నిజంగా ఆ పెంకు నేలను పూడ్చాలా అనిపించి, ఆలోచిస్తూ గదిమధ్యలో నిలబడ్డాడు. తర్వాత ముక్కద్దాలు తగిలించుకొని వెళ్లి కిటికీకిజేరగిలబడ్డాడు.

గదికవతలవున్న ఆవరణలోకి యెండ బాగావస్తోంది. బూడిద వర్ణంలో పసుపు రంగు ప్రతిఫలిస్తున్నట్లుగా యింకా మంచుకురిసే సూచన తెలుపుతోంది, యెండకాంతి. ఎనిమిది గంటలైంది – తానక్కడికివచ్చి మూడుగంట లైందన్నమాట. ఆదొడ్డి చుట్టూవున్నగోడలు సైనిక నివాసాల్లాగున్నయ్. ప్రతి కిటికీకి యినపచట్రం, వాటి వెనకవున్న గదులు కన్ను పొడుచుకొన్నా కనపడనంత చీకటితోను వున్నయ్. ఆ కిటికీల వెనక తనలాగే బయటకువస్తున్న మంచును చూస్తూ యెవ రైనా నిలబడివున్నారో లేదోకూడ కనబడటం లేదు. కొద్దిగా గడకట్టి, నడిస్తే విడిపోయేట్టుగా ముచ్చటగావుంది మంచు. గోడలకి చుట్టూ పదడుగుల యెడంగా వున్నదారిలో మంచు చిన్నచిన్న గుట్టలుగా పడివుంది. ఎదురుగావున్న ప్రహరిమీద కాపలా సైనికుడు అటూయిటూ తిరుగుతూనే వున్నాడు. అతను అటూ యిటూ తిరుగుతూ మంచు పగుళ్ళలోకి వుమ్మి వూసి, అదెట్లా మంచులో కలిసిపోయిందో, మంచుగడ్డ లెలా దానిమీద పేరుకొన్నవో వినోదం చూస్తున్నాడు.

ఇదొక పాతజబ్బు; విప్లవకారులు యితరులదృక్ప థంతో చూడకూడ దనుకొన్నాడు, రుబషోవ్.

ఒకవేళ చూడాలేమో ? చూడవలసివుందేమోకూడ ?

ఎవడైనా యితరులందరితోనూ కలిసిపోతే ప్రపంచా న్నెలా మార్చగలడు ? మరి యింకోవిధంగా మార్చేదెలా ?

అర్థంచేసుకొని క్షమించగలిగినవాడికి క్రియాత్మక ప్రేరణ యెక్కడ కనిపిస్తుంది?

అది అతనికి యెక్కడ కనిపించదు?

వాళ్ళు నన్ను కాలుస్తారు. నాభావాలు వాళ్ళను కుచించవనుకొన్నాడు రుబషోవ్. కిటికీ చట్రానికి నుదురానించి తెల్లగా, ప్రశాంతంగా వున్న దొడ్లోకి చూస్తూ నిలబడ్డాడు.

కొద్దిసేపు అలాగే కిటికీ అద్దంచల్లదనం అనుభవిస్తూ నెమ్మదిగా, గదిలోకి టకటకమని చిన్న శబ్దం యెడతెగకుండ రావటం గమనించాడు.

వెనక్కుతిరిగి వింటుంటే, ఆ శబ్దం యెడతెగకుండ రావటంవల్ల యే గోడమీద కొడుతున్నారో తెలియలేదు. వింటూ పరిశీలిస్తుండగానే ఆగిపోయింది. 406 నెంబరు గది వైపుక బకెట్ పైగా గోడమీద తానే కొట్టటం సాగించాడు, కాని సమాధానంరాలేదు. 402 నెంబరు గదికి తనపక్కకి మధ్యలో గోడమీద కొట్టి ప్రయత్నించాడు. సమాధానం వచ్చింది. వేగంగా కొట్టుకొంటున్న గుండెల్లో రహస్య రంధ్రం వైపు చూస్తూ, పక్కమీద సుఖంగా కూర్చున్నాడు. మొదటి సమావేశం యెప్పుడూ వుద్రేకపూరితంగానే వుంటుంది.

402 నెంబరు యిప్పుడు నియమంగా తట్టుతున్నాడు, కొద్ది విరామంతో మూడు సార్లు; తరువాత యెక్కువ విరామం, మళ్లీ మూడుసార్లు, మళ్లీ యెక్కువ విరామం, మళ్లీ మూడుసార్లు. రుబషోవ్ కూడ ఆ పద్ధతిని తానువిన్నట్లు గోడమీద తట్టి తెలియజేశాడు. రెండో వ్యక్తికి చతురస్రాకార సాంకేతిక భాషవచ్చునో లేదో తెలుసుకోవాలను

కొంటున్నాడు. లేకపోతే అతనికి నేర్పాలంటే చాలకష్టం. గోడ చాల మందంగా వున్నందున, చెవి గోడ కానించి శ్రద్ధగా వింటేగాని మాటలు స్పష్టంగా వినబడవు, పైగా ఒక కన్ను రహస్య రంధ్రం వైపు వుంచాలి. 402 నెంబరుకి యీ భాష పరిపూర్ణంగానే వచ్చినట్లుంది. తొందరలేకుండ స్పష్టంగా పెన్సిల్‌లాటి గట్టివస్తువు దేన్తోనో తట్టుతున్నాడు. ఈ భాషతో పరిచయం పోయి చాలకాలం కావటంవల్ల మళ్లీ వివరంగా గుర్తుకు తెచ్చుకొంటున్నాడు రుబషోవ్. 402 నెంబరు 'ఎవరు' అని తట్టాడు, సాంకేతిక భాషలో.

ఇతనెవరో కార్యవాది లాగున్నాడు, తాను మాట్లాడబోయే మనిషిని గురించి తెలుసుకోవాలను కొంటున్నాడు. విప్లవ సాంప్రదాయం ప్రకారమైతే రాజకీయపు గుర్తు తెలిపి వార్తలందించాలి, తర్వాత అన్నపానాలు, సిగరెట్ల విషయం. తర్వాత, చాల రోజుల తర్వాత, అవసరమైతే వ్యక్తిని గురించి తెలుసుకోవటం. ఏమైనా యిప్పటివరకూ పార్టీ పీడింప బడే దేశాల్లోనే రుబషోవ్ పనిచేశాడు. వాటిలో పార్టీయే యితరులను పీడించే స్థితిలోలేదు. పార్టీ సభ్యులు విప్లవ కారణాలవల్ల ఒకరినొకరు క్రిష్టియన్ పేర్లతోనే యెరిగి వుండేవారు. అవి కూడ తరచు మారిపోతూండేవి. ఇక్కడంతా విరుద్ధంగావుంది. తనపేరు చెప్పొచ్చునా లేదా అని తటపటాయిస్తున్నాడు. 402 నెంబరు తొందరపడుతూ 'ఎవరు', అని మళ్లీతట్టాడు.

'సరే, ఎందుకు దాచాలి' అనుకొని 'నికోలస్ సాలమనోవిచ్ రుబషోవ్' అనితట్టి ఫలితంకోసం యెదురుచూచాడు. చాల సేపటివరకు సమాధానమేమీరాలేదు. ఆ పేరు

తన పొరుగు వాడిలో కలిగించే సంభ్రమాన్ని వూహించుకొని నవ్వుకున్నాడు. రెండు మూడు నిముషాల పాటుచూచి ప్రక్కమీద నుంచి లేచాడు. గూడలురిక్కిస్తూ మళ్లీ పచార్లు సాగించాడు, తిరిగేటప్పుడు గోడవైపుచూస్తూ. గోడ మూగపోయింది. ముక్కద్దాలు తీసి చొక్కాచేతిని తుడుస్తూ నెమ్మదిగా యీడ్చుకుంటూ రహస్యరంధ్రం దగ్గరకెళ్లి వరండాలోకి చూచాడు.

వరండా ఖాళీగావుంది. వెలవెలబోతున్న యెలక్ట్రిక్ దీపాల కాంతిమాత్రం ప్రసరిస్తోంది. చీమ చిటుక్కుమనటం లేదు. 402 నెంబరు యెందుకని మూగపోయాడు ?

బహుశా రుబషోవ్‌తో రాజీ పడాలిసొస్తుందని భయపడ్డాడేమో. ఒకవేళ, తన పొరుగునున్న యీ ప్రమాదకర వ్యక్తిని గురించి భయపడిన, రాజకీయాలతో సంబంధంలేని డాక్టరో, యింజనీరో యేమో. అతనికి రాజకీయానుభవం లేనిమాట నిజమే. లేకపోతే ముందుగానే పేరు చెప్పమని అడగడు. ఏదో విధ్వంసక కార్యక్రమంలో పాల్గొని వుండ వచ్చుననిపిస్తుంది. తప్పకుండా యింతకు ముందు చాలా కాలంగా జైలులో వుండివుండాలి. తట్టుటంలో సిద్ధహస్తుడు. తన నిర్దోషిత్వాన్ని రుజువుచేసుకోవటానికి యమబాధ పడుతున్నట్టున్నాడు. తన వ్యక్తిగత నేరంగాని, నిర్దోషిత్వంగాని లెఖ్ఖ చేయబడుతుం దనుకొంటున్నాడు గాని, యింతకంటే పెద్ద వ్యవహారాలు ప్రమాదస్థితిలో పడ్డాయని తెలియదు. యదార్థానికి అతడు తన పక్కమీద కూర్చొని, అధికారులకు

తను నిర్దోషినని నూరోసారి వ్రాస్తున్నాడేమో, దాన్ని వాళ్ళెప్పుడూ చదవరు; లేకపోతే భార్యకు నూరో వుత్తరం వ్రాస్తున్నాడేమో, అది ఆమెకు యెప్పుడూ చేరదు; కాకపోతే నిరాశ నిస్పృహల ఫలితంగా పెరిగి, సంస్కారం లేక అట్టలు కట్టుకు పోయిన గడ్డం—పుష్కిన్ గడ్డంలాంటి నల్లటి గడ్డంతో గోళ్ళు కొరుక్కోనటానికి, శృంగారపు పగటి కలలకి అలవాటు పడ్డాడేమో జైలులో వుండగా తననిర్దోషిత్వాన్ని గురించి ఆలోచించటం కంటే పాడుపని యింకోటుండదు. ఎందుకంటే ఆ ఆలోచన క్రొత్త వాతావరణాని కలవాటు పడనివ్వదు. నైతికంగా దిగజారుస్తుంది.... హటాత్తుగా తట్టటం మళ్ళీ మొదలైంది

రుబషోవ్ త్వరగా వచ్చి పక్కమీద కూర్చున్నాడు. 402 నెంబరు త్వరితంగా, ఆవేశంతో, అస్పష్టంగా తట్టటం వల్ల అప్పుడే రెండక్షరాలు మిగిలిపోయాయి.

'నీకు బాగానే అవుతుందిలే'

రుబషోవ్ అలాటి సమాధానం వస్తుందనుకోలేదు. 402 నెంబరు పట్టి అనుయాయి. అతను కావలసినంతగా ప్రతిపక్ష పాషండుల్ని ద్వేషిస్తున్నాడు. చరిత్ర, నిర్దిష్ట ప్రణాళిక ప్రకారం, నిర్దిష్ట మార్గదర్శి నెం. 1 సహాయంతో పట్టాల మీద సాఫీగా పోయే బండి అని యితని నమ్మకం. కేవలం తన అరెస్టు అపార్థాలవల్ల జరిగిందనీ, గత సంవత్సరాలలో కలిగిన అవాంతరాలన్నీ—చైనానుంచి స్పెయిన్ వరకూ, కరువునుంచి పూర్వాచారపరాయణుల నాశనంవరకూ—పశ్చాత్తాప పడవలసిన ఘటనలైనా కావాలి; లేక రుబషోవ్,

అతని ప్రతిపక్షంవారు జరిపిన పైశాచిక జిత్తులైనా కావా లని యితని విశ్వాసం. 402 నెంబరుకి యిప్పుడు పుష్కిన్ గడ్డం లేదు, ఆ మూర్ఖపు మొఖం క్షవరంచేసి నున్నగావుంది, గది అతి శుభ్రంగా వుంచుకొంటూ జైలు నిబంధనలన్ని టినీ తు.చ తప్పకుండ పాటిస్తున్నాడు. ఇతన్తో వాదించి లాభం లేదు. ఈ బాపతుకి బోధయెక్కదు. అయినా ప్రస్తుతం ప్రపంచంలో తనకున్న యీ ఒక్క సంబంధాన్ని - బహుశా ఆఖరుదికూడా చేమో - తెంచుకోవటంలో అర్థం లేదను కున్నాడు.

బహు నిదానంగా, స్పష్టంగా 'ఎవరు' అని తట్టాడు. 'ఖంగారుగా, అస్తవ్యస్తంగా 'నీ కనవసరం,' అని జవాబు.

'నీయిష్టం' అని యిక సంభాషణ ముగిసిపోయినట్లే ననుకొని రుబషోవ్ మళ్ళీ పచార్లు మొదలుపెట్టాడు. అంత లోనే గట్టిగా ప్రతిధ్వనించేటట్టుగా తట్టటం వినిపించింది. ఆ మాటలికి ప్రాధాన్యత యివ్వటంకోసం బూటుతో తట్ట తున్నట్టుంది.

'మహానుభావుడైన చక్రవర్తి వర్ధిల్లుగాక!'

'అదా కథ!' అనుకున్నాడు రుబషోవ్. ఇంకా అస లైన విప్లవ వ్యతిరేకులున్నా రన్నమాట - ఇటువంటివాళ్ళే తన అపజయాలకు కారకులని నెం. 1 ఉపన్యాసాలలో అనేవాడు. నిజానికి అటువంటివాళ్ళు లేరనుకున్నా. కాని యిక్కడ నెం. 1 రుజువు చేయగలిగిన వ్యక్తి నిజంగా ఒకడు చక్రవర్తి వర్ధిల్లుగాక అని అరుస్తూ కూర్చున్నాడన్న మాట ...

ఆకిలిస్తూ 'పాపం శేయింమగాక', అని తట్టాడు. ఈ సారి మరింత విసురుగా 'పంది', అని జవాబు వచ్చింది.

రుబషోవ్ తనలో ఆనందించాడు. ముక్కద్దాలు తీసి, దాని చట్రపుటంచుతో నిదానంగా, స్పష్టంగా 'సరిగా అర్థం కాలేదు' అని తట్టాడు.

402 నెంబరు కోపంతో కాలిపోతున్నాడు. 'ఓరి వేట కుక్కా' అని తట్టి, వెంటనే కోపాన్ని అణచుకొని 'నిన్నెం దుకు మూశారు?' అని తట్టాడు.

ఎంతో ఆప్యాయమైన అమాయకత్వం... 402 నెంబరు ముఖ కవళికలు మారిపోయినయ్. యువక దళాధికారి ముఖం లాగ నాజూకుగా, తెలివి తక్కువగా వుంది. బహుశా ఒంట ద్దపుజోడు కూడ పెట్టుకున్నాడేమో. రుబషోవ్ తన ముక్క ద్దాల చట్రంతో 'రాజకీయ విభేదాలు' అని తట్టాడు.

కొద్ది విరామం. 402 నెంబరు హేళనచేసే సమా ధానం కోసం మెదడంతా వెదుకుతూ వుండి వుండాలి. ఆ, చివ రికి దొరికింది :

'ధైర్యంగావుండు. తోడేళ్లు పరస్పరం కబళిస్తాయి.'

రుబషోవ్ సమాధానం చెప్పలేదు. ఈ బాపతువినోదం చాలసార్లు చవి చూచాడు. మళ్ళీ పచార్లు సాగించాడు. కాని 402 నెంబరు సంభాషణలోకి దిగాడు:

'రుబషోవ్' అని తట్టాడు.

సరే యిదే పరిచయానికి నాంది.

'ఆఁ' జవాబిచ్చాడు, రుబషోవ్.

402 నెంబర్కు కొంచెం తటపటాయించినట్లు కనిపిం

చింది. చివరకు :

'నువ్వు ఆఖరుసారి ఆడదాని దగ్గర యెప్పుడు పడుకున్నావ్ ?' అని దీర్ఘంగా తట్టాడు.

అతను తప్పకుండా కంటి అద్దం పెట్టుకున్నాడు. దాన్తోనే తట్టుతూ వుండి వుండాలి. రుబషోవ్ యేమీ అసహ్యించుకోలేదు. దాన్తో ఆ మనిషి స్వభావం తెలిసింది. ఒకవేళ రాజరిక ప్రణాళికలు అందజేసినా తన యీ ప్రశ్నకిచ్చే జవాబుకంటె యెక్కువ ఆనందించేవాడు కాదేమో. రుబషోవ్ ఒక్కక్షణం ఆలోచించాడు. ఆ తర్వాత, 'మూడు వారాల క్రిందట,' అని తట్టాడు.

'అయితే నాకు వివరంగాచెప్పు' అని 402 నెంబరు వెంటనే తట్టాడు.

సరే యీ విషయం చాలదూరం వెళుతుంది. ఇంతటితో యీ సంభాషణ మాగిద్దామనుకున్నాడు, రుబషోవ్. కాని ముందు ముందు యీ వ్యక్తి 400 నెంబరుకి ఆ వెనక గదులకీ మధ్యవర్తిగా వుంటాడనే సంగతి గుర్తుకొచ్చింది. ఎడం వైపు గదిలో యెవరూ లేరు. అక్కడితో వరస ఆగిపోతుంది. బుర్రపాడౌతోంది. వెనకటి పాతకాలపు యుద్ధగేయం విద్యార్థి దశలో విన్నది గుర్తుకొచ్చింది. ఎక్కడో నల్లమేజోళ్లు తొడుకున్నస్త్రీలు కాన్-కాన్ అనే ఫ్రెంచి నృత్యం చేశారు...చిరాకుగా నిట్టూర్చి ముక్కద్దాలతో తట్టాడు.

'రొమ్ములు నున్నగా, గుండ్రంగావున్నయ్.'

రుబషోవ్ అదే స్వరసధోరణ అనుకొన్నాడు. అది

నిజమేననిపించింది. ఎందుకంటే నెంబరు 402:

'చెప్పు; కానీ; యింకా వివరాలు' అని తట్టాడు.

ఈ సమయంలో అతను, నిస్సందేహంగా, వాడా విడిగా మీసాలు పీక్కుంటూ వుండివుండాలి. అతనికి చివరలు మెలిదిరిగిన చిన్న మీసాలుండి వుంటయ్, తప్పకుండ. ఓరి వీడ్ని దెయ్యంపీకా. ఇతనొక్కడే మధ్యవర్తి. ఇంతకంటే గత్యంతరం లేదుగాబట్టి సంబంధం తెంపుకోకూడదు. భోజనాల దగ్గర వుద్యోగులు మాట్లాడుకొనే విషయాలేముంటాయ్? ఆడవాళ్లు, గుర్రాలు ముక్కద్దాలుతీసి చొక్కా చేతిమీద తుడిచి జాగ్రత్తగా:

'తొడలు అడివి ఆడగుర్రం తొడల్లా వున్నాయ్' అని తట్టాడు.

అలిసి ఆగిపోయాడు. ఎంతమంచి వాడైనా యింతకంటె యెక్కువ చెప్పలేడు. 402 నెంబరు కూడా బాగా తృప్తి పడ్డాడు.

మంచి హుషారుతో 'మంచి వాడివి' అని తట్టాడు. నిస్సందేహంగా అతడు పొట్టచెక్కలయ్యేట్టు నవ్వుతో వుండాలి. ఏమీ వినిపించటంలేదు. తొడలు చరుచుకొని, మీసం మెలివేస్తూ వుండాలి. కాని యెవరికీ కనిపించదు. ఆ సిగ్గుమాలిన గోడ నిగూఢపు మూగతనం రుబషోవ్‌కి చాల యిబ్బందిగా వుంది.

402 నెంబరు 'చెప్పు' అని తొందరపెడ్తూ తట్టాడు.

ఇంకేం చెప్పగలడు ? 'ఇంతే' అని తట్టి వెంటనే పశ్చాత్తాపం... ఖించాడు. 402 నెంబరుని కించ పరచకూడదు. అదృష్ట

వశాత్తు అతను కించపడలేదు. ఒంటద్దపు జోడుతో, మొండిగా,
'దయచేసి చెప్పు, దయచేసి...' అడిగాడు.

రుబషోవ్ గుర్తుల్ని లెఖ్ఖపెట్టుకొని అక్షరాల్ని గుర్తించు కోవలసిన దశ దాటి విన్నవెంటనే అక్షరాల్ని తెలుసుకొనే స్థితికొచ్చేశాడు. 402 నెంబరు తట్టినదాన్నిబట్టి, శృంగార కలాపం కోసం అతడు పీడించే విధానాన్నిబట్టి, ఆ వ్యక్తి మాటలు వింటున్నట్లనిపించింది. పీడ మళ్ళీ సాగింది:

'దయచేసి...దయచేసి చెప్పవూ?'

402 నెంబరు తప్పకుండా యింకా యువకుడై వుండాలి. బహుశా సైనిక కుటుంబంనుంచి వచ్చి, తప్పుడు ప్యాస్ పోర్టుతో స్వదేశానికి పంపబడి – ప్రవాసంలోనే పెద్దవాడై వుండాలి. అందుకే అంత వ్యధపడుతున్నాడు. ఇప్పుడు నిస్సందేహంగా తన మీసాల్ని పీక్కుంటూ, కంటద్దం తగిలించుకొని సున్నపుగోడ వైపు నిశ్చేష్టంగా చూస్తూవుండివుండాలి.

'దయచేసి యింకా, దయచేసి....'

...నిరాశతో, ముక్కద్దంతో గోడమీదకొడితేబెత్తిక లూడిపోయి గట్టి రొమ్ములు, గుర్రపు తొడల స్త్రీబొమ్మ యేర్పడివుంటే, దానివైపు తేరిపార చూస్తూవుంటాడు.

'ఇంకా చెప్పు దయచేసి....'

ఇక ఆశ నొదులుకొని, 407 నెంబరు ఖైదీ రొట్టె తీసుకొనేటప్పుడు చేతులు ముడుచుకున్నట్లుగా ముడుచుకుని, పక్కమీద మడికాళ్ళమీద కూర్చుని వుంటాడు.

407 నెంబరు చిన్న కంకాళపు చేతులు రేపిన గతానుభవస్మృతిఛాయలిప్పటికి రూపం ధరించినయ్. పియెటా...

# 9

పియెటా.... దక్షిణ జర్మనీలో ఒక పట్టణంలో ఒక సోమవారంనాటి మధ్యాహ్నం చిత్ర ప్రదర్శనశాల. ఆ విశాల భవనంలో రుబషోవ్, అతన్ని కలుసుకోవటాని కొచ్చిన యువకుడు తప్ప యింకో మానవ మాత్రుడు లేడు. పెద్ద గది మధ్యలో ఒక ముఖమలుగుడ్డకప్పిన గుండ్రనిబల్ల ముందు కూర్చుని వాళ్ళిద్దరూ మాట్లాడుకొంటున్నారు. ఆ గది గోడలకి ప్రసిద్ధ చిత్రకారుల నగ్న స్త్రీల చిత్రాలు చిక్కరొక్కరుగా వ్రేలాడుతున్నయ్. అది రుబషోవ్ అరెస్టు కాబోయే ముందు, 1933 వ సంవత్సరంలో దేశమంతా భయోత్పాతం ఆవరించిన మొదటి మాసాల్లో, ఆ వుద్యమకర్తల్ని వెంటాడి తరిమి వేటాడి, చచ్చేవరకూ కొట్టారు. ఉద్యమం విఫలమయింది. ఆ పార్టీ రాజకీయ సంస్థగా రూపుమాసిపోయి, రక్తమాంసాల ముద్దలుగా తయారైన వెయ్యిమంది సాయుధులు, వెయ్యిమంది అనుచరులుగల గుంపుగా మిగిలింది. మానవుని మరణానంతరం కూడా వెంట్రుకలు, గోళ్ళు పెరిగినట్లుగా పార్టీ వ్యక్తుల పరంగా పెరుగుతోంది. ఈ భీభత్సాన్నించి తప్పుకోగలిగిన వాళ్లు దేశమంతటా మిగిలివున్నారు. వాళ్లు రహస్యంగా కుట్ర పన్నుతున్నారు. వాళ్లు రహస్య గృహాల్లో, అడవుల్లో, రైల్వే స్టేషనుల్లో, ప్రదర్శన శాలల్లో, క్లబ్బుల్లో కలుసుకుంటూ వుండేవారు. వాళ్లు యెప్పుడూ నిద్రపోయే స్థలాలు, పేర్లు, అలవాట్లు మార్చేస్తుండేవాళ్లు. క్రిస్టియన్ పేర్లతోనే పిల్చుకుంటూ చిరునామావివరాలేమీ అడిగేవారు

కాను. ఒకరి జీవితాలు యింకొకరిచేతుల్లోవుండేవి యెప్పుడూ. కాని ఒకరినొకరు అణుమాత్రం నమ్మేవాళ్ళుకాదు. వాళ్ళు యింకా బ్రతికున్నట్లు తమలో తమను, యితరులను తెలియటం కోసం కరపత్రాలు ప్రకటించేవాళ్ళు. రాత్రిళ్లు పల్లెల్లోకిరహస్యంగా వెళ్ళిగోడలమీద తమపాతనినాదాలు వ్రాసేవాళ్లు, తెల్లవారుఝామున ఫ్యాక్టరీ గొట్టాలెక్కి తమ పాత జెండాలను కట్టేవాళ్లు. ఆ కరపత్రాల్లోవున్న మృతులైనవారి సందేశాలను చదవటానికి వొణికిపోయి, జనం వాటిని సరిగ్గా చదవకుండానే అవతల పారేసేవారు, కోడికూసేసరికి పల్లెల్లో గోడలమీద నినాదాలు చెరిగిపోయేవి. ఫ్యాక్టరీ గొట్టాలమీద జండాలు వెంటనే దిగిపోయేవి. కాని వెంటనే మళ్ళీ అవన్నీ ప్రత్యక్షమయ్యేవి. దేశమంతా దళాలుగా జేరి యీ జనం "శెలవులోవున్న మృతజనం" అని పిల్చుకుంటూ, తాము బ్రతికే వున్నామని రుజువు చేయటానికి విశ్వ ప్రయత్నాలు చేసేవారు.

వాళ్ళల్లో వాళ్ళకి వార్తా సమపాయాలు లేవు. పార్టీ విచ్ఛిన్నమయింది. ప్రతి దళానికాదళమే స్వతంత్రంగా పని చేస్తోంది. కాని నెమ్మదిగా కలవర వార్తల్ని ప్రచారం చేయ సాగారు. గౌరవనీయులైన విదేశీ వ్యాపార ప్రతినిధులు దొంగ రవాణా పత్రాలతో, ట్రంకుపెట్టెలతోనూ దిగుతున్నారు. వాళ్లు వార్తావహులు సామాన్యంగా వాళ్లు పట్టుబడే వాళ్ళు, వాళ్ళని క్రూరంగా హింసించి తలకాయలు నరికేసే వాళ్లు, మళ్ళీ వాళ్ళ స్థానాల్ని యింకోళ్లు వెంటనే ఆక్రమించే

వాళ్ళు. పార్టీ మృతదశలో వుంది. ఎటూ మొసలటానికి, చివరికి వూపిరి పీల్చటానికి కూడ వీలులేని పరిస్థితుల్లో వుంది. కాని యీ మృతశరీరపు గోళ్ళు, వెంట్రుకలూ పెరుగుతూనే వున్నయ్. విదేశాల్లో వున్న పార్టీ నాయకులు యీ బిగుసుకు పోయిన శరీరానికి విద్యుత్ప్రవాహాల్ని పంపిస్తున్నారు. అందువల్ల అవయవాలు అప్పుడప్పుడూ కదుల్తున్నాయ్.

పియెటా...రుబషోవ్ 402 నెంబరును మర్చిపోయి, పచార్లు సాగించాడు. చిత్రప్రదర్శన శాలలో గుండ్రబల్ల ముందు, నేలమీద చేసిన పాలిష్ వాసన పీలుస్తూ కూర్చుని వున్నాడు. రైల్వే స్టేషన్నుంచి సరాసరి నియమితస్థలానికి నియమిత కాలానికి కొంచెం ముందే వచ్చాడు. తన నెవ్వరూ చూడ లేదనే గట్టినమ్మకం. రైల్వే స్టేషన్ సామాను గదిలో తను దచ్చిదేశపు నవీన దంత వైద్యపరికరాలను తెచ్చిన సూట్‌కేస్‌ను పెట్టాడు. ఆ గదిలో ముఖమలు సోఫాలో పడుకొని గోడలమీదనున్న నగ్నచిత్రాలను, ముక్కద్దాల్లోనుంచి పరిశీలిస్తూ, యెదురు చూస్తూ కూర్చున్నాడు.

ప్రస్తుతం ఆ పట్టణంలో పార్టీ కేంద్రానికి నాయకుడు రిచర్డ్ కొన్ని నిముషాలు, నియమిత సమయానికంటే, ఆలస్యంగా వచ్చాడు. రుబషోవ్, రిచర్డ్‌లు ఒకరినొకరు యింతకు ముందు చూడలేదు. రిచర్డ్ రెండు మూడు గదుల్ని చూచి వచ్చాడు, రుబషోవ్‌కోసం. అతను వచ్చేటప్పటికి రుబషోవ్ వొడిలో గోథేవ్రాసిన 'ఫౌస్ట్' వుంది. ఆ పుస్తకం చూచి, ఒకసారి అతి త్వరగా చుట్టూ కలియజూచి రుబషోవ్ ప్రక్కనే కూర్చున్నాడు. టోపీ తన మోకాలికి తగిలించుకొని భిడియ

పక్కతూ సోఫా అంచున, రుబషోవ్‌కు రెండడుగుల దూరాన కూర్చున్నాడు. అతను తాళాలుచేసే కంసాలివృత్తిలో వున్నాడు. ఆదివారపు నల్లసూటు వేసుకొచ్చాడు. రుబషోవ్, వేషాన్ని బట్టి ప్రదర్శనశాలలో అతని ప్రత్యేకతనుగుర్తించాడు.

'సరే, దయచేసి నా ఆలస్యానికి క్షమించాలి' అన్నాడు రిచర్డ్.

'మంచిది, ముందు మీ సభ్యుల వ్యవహారం చూడాలి. ఏదీ లిస్టు వుందా ?'

రిచర్డ్ తలవూపాడు. 'నేను సాధారణంగా లిస్టులు పుచ్చుకు తిరగను. అడ్రసులు వగైరా అంతా బుర్రలోనే వున్నాయ్.' అన్నాడు.

'మంచిది, అయితే నువ్వు పట్టుబడితే?'

'అందుకని ఒకలిస్ట్ ఆనీ కిచ్చాను. ఆనీ నా భార్య, మీకు తెలుసుగా.'

అని ఆగిపోయి గుటకలుమ్రింగాడు. అప్పుడు రుబషోవ్ ముఖంలోకి సరిగా మొగాదిగాచూచాడు. రిచర్డ్ కళ్ళుమెర్రగా, కనుగుడ్లు పెద్దవిగా వున్నయ్. అతని గడ్డం, దవడలూ కోటు నల్లకాలర్ పైగా కనిపిస్తున్నయ్, రుబషోవ్‌కి. 'ఆనీని రాత్రి అరెస్టు చేశారు, మీకు తెలుసా ?' అని రుబషోవ్ వైపు చూచాడు. ఆ చూపులో కేంద్రకమిటీ వార్తాహారుడైన రుబషోవ్ యేదో ఒక అద్భుతాన్ని సృష్టించి తనకు సహాయం చేయగలడనే చిన్నపిల్లల అమాయకపు టాశలాంటిది ద్యోతక మవుతుంది.

'నిజంగానా ?' అని రుబషోవ్ ముక్కద్దాలు తీస

చొక్కా చేతిమీద తుడిచి, 'అయితే లిస్టంతా పోలీసుల చేతుల్లో పడిందన్నమాట' అన్నాడు.

'లేదు. ఆవిణ్ణి తీసుకెళ్ళటానికి వాళ్ళు వచ్చినప్పుడు మామరదలు యింట్లోనే వుంది. మీకు తెలుసుగా, యీలిస్టు ఆవిడకిచ్చింది నా భార్య. మా మరదలి దగ్గర భద్రంగావుంది. మీకు తెలుసుగా, మా మరదల్ని పోలీసు కాన్స్టేబిల్ కిచ్చాం. కాని ఆవిడ మాతోనే వుంటోంది.'

'మంచిది. మీ భార్య అరెస్టయినప్పుడు మీరెక్కడున్నారు ?'

'ఆ కథంతా యెలా జరిగిందో చెపుతా వినండి. నేను మూడు నెలల్నించీ యింటివద్ద పడుకోవటంలేదు, మీకు తెలుసుగా. నా కొక సినిమా ఆపరేటరు ప్రాణమిత్రుడున్నాడు. నేను రోజూ అక్కడికెళ్ళి సినిమా కాగానే అతనితో కలిసి అక్కడే పడుకుంటున్నాను. రోడ్డుమీదనుంచి విడిగావున్న దారిలోనుంచి యెవరూ చూడకుండా సరాసరి లోపలికెళ్ళిపోవచ్చు. సినిమా వూరికినే.' కొంచెం ఆగి గుటకలు మింగాడు. 'ఆసీకి నా మిత్రుడు వుచితంగానే టికెట్లు పంపేవాడు, మీకు తెలుసుగా. హాలులో చీకటిగా వున్నప్పుడు నాకోసం ఆవిడ కాబిన్‌లోకి చూచేది. కాని నేను కనిపించే వాణ్ణిగాను తెరమీద వెలుగు బాగా వున్నప్పుడు నేను అసీని బాగా చూడగలిగేవాణ్ణి.'

ఆగాడు. అతని కెదురుగా "అంతిమ తీర్పు" చిత్రం వ్రేళ్ళాడుతోంది. అందులో నొక్కులజుట్లు, గుండ్రని భుజాలు వున్న దేవదూతల్లు బాకాలు వూదుతూ మెరుపుల తుఫానులో

మొగుతున్నారు. రిచర్డుకు ఎడంవైపుగా గోడమీద జర్మని చిత్రకళావేత్త గీసిన రేఖా చిత్రం కొంతభాగం మాత్రం కనిపిస్తోంది సోఫా, రిచర్డు తల అడ్డువచ్చి రుబషోవ్‌కి మిగతా భాగం కనిపించలేదు. ఆ చిత్రంలో భిక్షాపాత్ర ఆకారంలో పైకి వంకర తిరిగివున్న మాడోనాదేవత పల్చని చేతులు, అడ్డ గీతలతో చిత్రించిన శూన్యాకాశంలో కొంతభాగం మాత్రమే కనిపిస్తోంది. రిచర్డ్ కదలకుండ, కొంచెం వొంగి ఎర్రగా వున్న మెడ, ఆ మెడమీద అతని తలకాయ వుండటంవల్ల యింకా ఎక్కువ కనిపించలేదు.

'నిజంగానా ? మీ భార్య వయస్సెంత? ' అడిగాడు, రుబషోవ్.

'పదిహేడేళ్లు! '

'నిజంగానా ? మీ వయస్సెంత ?'

'పందొమ్మిది'.

'పిల్లలేమున్నారా ?' అని రుబషోవ్ మెడకొంచెం పైకెత్తాడు, కాని చిత్రం ముందుకంటే ఎక్కువ ఏమీ కనిపించలేదు.

'మొదటి బిడ్డ తయారౌతోంది' అని రిచర్డ్ శిలావిగ్రహంలాగ కూర్చున్నాడు.

కొంచెం విరామమిచ్చి పార్టీ సభ్యులపేర్లను చదవమన్నాడు, రుబషోవ్. అందులో షుమారు 30 మంది పేర్లున్నయ్. మధ్యమధ్య కొన్ని ప్రశ్నలడిగి దంత వైద్య పరికరాలను బుక్ చేయటానికి తెచ్చిన ఆర్డరు పుస్తకంలో కొంతమంది పేర్లు, అడ్రసులు వ్రాసుకున్నాడు. టెలిఫోన్ డైరెక్టరీలో

నుంచి ఆ పట్టణంలోని పెద్దలు, దంతవైద్యుల పేర్లు వ్రాసు కున్న లిష్టులో వదలిపెట్టిన ప్రదేశంలో వ్రాశాడు యీ పేర్లు అది ముగిసిన తర్వాత,

'ఇప్పుడు పనిని గురించిన చిన్న రిపోర్టు యివ్వాలను కొంటున్నాను, కామ్రేడ్' అన్నాడు రిచర్డ్.

'మంచిది, వింటున్నాను.'

రిచర్డ్ రిపోర్టిచ్చాడు. మాట్లాడేటప్పుడు యేమీ కదల్లేదు. రిపోర్టివ్వటం అయిన తర్వాత మోకాళ్ళమీద చేతులానించి కొంచెం ముందుకువంగి కూర్చున్నాడు. ఫ్యాక్టరీ గోట్టాలకు కట్టిన జండాలను గురించి, గోడలమీద వ్రాసిన నినాదాలను గురించి, ఫ్యాక్టరీ పాకీ దొడ్లలో పడవేసిన కర పత్రాలను గురించి చాల ధీమాగా, గుమస్తా లాగ మాట్లా డాడు. అతని కెదురుగా బాకాలూదుతున్న దేవదూతలు తుపానులో కెగురుతున్నారు. వెనక మేరీకన్య పల్చని చేతులు చాచివుంది. చుట్టూ వున్న గోడలనిండా బరువైన, బిగువైన ఆకర్షణీయంగావున్న నగ్నస్త్రీల రొమ్ములు, తొడలు, పిరు దులు వాళ్ళవైపు తేరిపార చూస్తున్నాయ్.

రుబషోవ్‌కి 'షాంపేన్ గ్లాసులో పట్టేటంత రొమ్ములు' అన్నమాట గుర్తుకొచ్చింది కిటికీ నుంచి మూడో నల్ల పెంకు మీద నిలబడి 402 నెంబరు యింకా తట్టుతున్నాడో లేదో నని వింటున్నాడు. ఏమీ శబ్దంలేదు. రహస్యరంధ్రం వద్దకెళ్లి 407 నెంబరు గది వైపు, రొట్టెకోసం సన్నటిచేతుల్ని చాచిన ఖైదీ గదివైపు చూచాడు. బూడిద వర్ణపు వుక్కు తలు పులు, వాటిమీదవున్న నల్ల గుర్తులు మాత్రం కనిపించినయ్.

ఆ తలుపుల వెనుక మానవమాత్రులు నివసిస్తున్నారంటే నమ్మటం చాల కష్టమనిపిస్తుంది. విద్యుద్దీపం వరండాలో మామూలుగానే నిశ్శబ్దంగా నీరసంగా వెలుగుతూనే వుంది.

రిచర్డ్ రిపోర్టుయిస్తున్నంతసేపూ రుబషోవ్ అతన్నేమీ మాట్లాడించలేదు. కల్లోలం తర్వాత, రిచర్డ్ చెప్పిన 30 మంది సభ్యుల్లోను 17 గురు మాత్రం మిగిలారు. పోలీసులు పట్టుకోవటానికొచ్చినప్పుడు ఫ్యాక్టరీ కూలి, అతనితోవున్న పిల్ల యిద్దరూ కలిసి మేడ కిటికీలోనుంచి దూకి చచ్చిపోయారు. ఒకడు పట్టణం వదలి అంతు లేకుండా పోయాడు. ఇద్దరూ పోలీసులకి గూఢచారులని అనుమానం. కాని యింకా ధృవపడలేదు. కేంద్ర కమిటీ విధానాన్ని వ్యతిరేకించి ముగ్గురు పార్టీని వదలిపెట్టారు. అందులో యిద్దరు క్రొత్త ప్రతిపక్షాన్ని స్థాపించారు. ఒకడు మితవాదుల్లో కలిశాడు. ఆ క్రితంరాత్రి ఐదుగుర్ని అరెస్టుచేశారు. అందులో ఆనీ కూడవుంది. ఈ ఐదుగురిలో యిద్దరప్పుడే పరలోక యాత్రకెళ్లారని తెలిసింది. ఇక కరపత్రాలు పంచటానికీ, గోడలమీద వ్రాయటానికీ, 17 గురు మిగిలారు.

ఈ వివరాలన్నీ సూక్ష్మంగా యెవరెవరో, యేది యేమిటో రుబషోవ్ వివరంగా తెలుసుకోవటానికి, అతిముఖ్య ఘటనలన్నీ వివరించాడు. రుబషోవ్‌కి యింతకుముందే యీ వివరాలను చెప్పిన కేంద్ర కమిటీ నియమించిన ముఖ్యుడు ఆ పట్టణ కమిటీలో వున్నట్లు రిచర్డ్‌కు తెలియదు. ఎవరి సినిమా కేబిన్‌లో పడుకుంటున్నాడో ఆ సినిమా ఆపరేటరు తనకు ప్రాణమిత్రుడౌనో కాదో, తాను గత రాత్రి అరెస్టయిన తన

భార్య ఆసీ చాలకాలం నుంచి సఖ్యంగా వుండటం లేదనే సంగతి తనకు తెలియదు. ఇవన్నీ రుబషోవ్ కె తెలుసు. ఉద్యమం శిథిలావస్థలోవుంది. కాని పరిశోధక, అధికారశాఖలు మాత్రం పని చేస్తున్నాయ్. ఆ సమయంలో మొత్తం వుద్యమ శాఖల్లో యివి మాత్రమే పనిచేస్తున్నయ్. రుబషోవ్ ఆ సమయంలో అగ్రనాయకుడు. ఆ మెద్దు మొడ యువకుడికీ విషయం కూడ తెలియదు. అతనికి తెలిసినదంతా—ఆసీని అరెస్టు చేశారనీ, మెడ తెగకుండా గోడలమీద వ్రాయటం, కరపత్రాలు పంచటమనీ, పార్టీ కేంద్రకమిటీనుంచి రుబషోవ్ అనే కామ్రేడ్ వచ్చాడనీ, అతన్ని పితృతుల్యంగా భావించాలనీ తనలోని బలహీనతల్ని, మనోభావాల్ని వెల్లడించకూడదనీ మాత్రమే. మెత్తనివాడు, భావుకుడు అయిన సభ్యుడు ప్రస్తుత కార్యక్రమానికి పనికిరాడు. అతన్ని బయటకు—పార్టీ బయటకు ఏకాంతానికి, బాహ్యాంధకారంలోనికి - నెట్టి వెయ్యాలి.

బయట వరండాలో అడుగుల చప్పుడు వినిపించింది. రుబషోవ్ తలుపువద్ద కెళ్ళి ముక్కద్దాలు తీసి రహస్య రంధ్రం గుండా చూచాడు ఇద్దరు రివాల్వరు తోలు పటాకాల వుద్యోగులు ఒక యువకరైతును పట్టుకొస్తున్నారు. వారి వెనక ముసలి వార్డరు తాళాలగుత్తితో వస్తున్నాడు. ఆ రైతుకు కన్ను వుబ్బి వుంది. పెదవిమీద రక్తపుమరక వుంది. నడుస్తూ చొక్కాతో ముక్కున కారుతున్న రక్తాన్ని తుడుచుకొంటున్నాడు. అతని ముఖం మట్టంగా, అవ్యక్తంగా వుంది. వరండాకు చివర, రుబషోవ్ గది కవతలి పైపున దూరంగా వున్న గదిలో అతన్ని పడేసి వాళ్ళు ముగ్గురూ తిరిగి వెళ్లారు.

రుబషోవ్ పచార్లు సాగిస్తూ, మళ్ళీ ముఖములు సోఫాలో రిచర్డ్ సమీపాన కూర్చున్నట్లు భావిస్తున్నాడు. రిచర్డ్ రిపోర్టు ముగించిన తర్వాత యేర్పడిన నిశ్శబ్దతలో వున్నాడు. రిచర్డ్ కదలకుండ మోకాళ్ళమీద చేతులు పెట్టుకొని అలాగే మౌనంగా కూర్చున్నాడు. దోషి తన తప్పిదా న్నంగీకరించి, పితృతుల్యుడైన విచారణకర్త శిక్షకోసం యెదురుచూస్తు న్నట్లు వుంది, రిచర్డ్ వాలకం. రుబషోవ్ చాల సేపు మౌనంగా వుండి చివరి కన్నాడు :

'మంచిది. అంతేనా ?'

ఆ యువకుడు తలవూగించాడు, గొంతుకాయ క్రిందకీ పైకీ వూగింది. 'చాల విషయాలు నీ రిపోర్టులో స్పష్టంగా లేవు. నీవు పదే పదే మీరు తయారుచేసిన కరపత్రాలు, చిన్న పుస్తకాలను గురించి మాట్లాడావు, అవన్నీ మాకు తెలుసు. అందులో విషయాన్ని తీవ్రంగా విమర్శించాం. అందులో పార్టీ అంగీకరించని పదజాలం చాలవుంది,' అన్నాడు రుబషోవ్.

రిచర్డ్ భయకంపితుడై రుబషోవ్ వైపు చూచాడు; ముఖం కందిపోయింది. రిచర్డ్ దవడ వేడెక్కింది. అసలే ఎర్రగా వుండే కనుగ్రుడ్లమీది నరాలు వుబికి యెర్రబడ్డయ్.

'పైగా మేం పదే పదే, ప్రజల్లో పంచటానికి, సాహిత్యం పంపాం. అందులో చిన్న సైజులో అచ్చువేసిన పార్టీ పత్రిక కూడ వుంది. మీకు అవన్నీ అందినయ్.' అన్నాడు రుబషోవ్.

రిచర్డ్ తలవూపాడు, ముఖంలో వేడి తగ్గలేదు.

'కాని మేం పంపిన పత్రాదులు పంచలేదు, మీ రిపోర్టులో కనీసం ఆ విషయం ప్రస్తావించనైనాలేదు. అందుకు బదులు పార్టీ అధికారం,అంగీకారం లేకుండా మీరు తయారు చేసిన పత్రాదులు పంచారు.'

'కా.... కాని మేం అలా చేయాల్సొచ్చింది, అతి ప్రయాసతో అన్నాడు రిచర్డ్.

రుబషోవ్ ముక్కద్దాల్లోనుంచి శ్రద్ధగా అతనివైపు చూచాడు. రిచర్డ్‌కు నత్తి వుందని అతడింతకుముందు గ్రహించ లేదు. 'చిత్రం!...పదిహేను రోజుల్లో యిది మూడోకేసు. పార్టీలో ఆశ్చర్యకరమైన లోటుమనుషులు చాలమంది వున్నారు. ప్రస్తుతంవున్న పరిస్థితులవల్లా? లేక వుద్యమమే యిటు వంటి లోటు మనుషుల్ని పైకి తెస్తున్నదా?...'

'మీ...మీరు అర్థం చేసుకోవాలి, కా...కామ్రేడ్. మీరు పంపిన పుస్తకాదుల ధోరణిలో కొ...కొంత తప్పుంది. ఎ...ఎం...దువలనంటె అన్నాడు' రిచర్డ్ మరింత వ్యధతో.

'కొంచెం స్థిమితంగా మాట్లాడు,' తీవ్రంగా అని 'తల అలా ద్వారంవైపు త్రిప్పకు,' అన్నాడు రుబషోవ్.

ప్రభుత్వం నల్లరక్షణదళానికి చెందిన ఒక పొడు గాటి వాడు, యూనీఫారం వేసుకున్న వుద్యోగి ఒక అమ్మా యిని గదిలోకి వెంటబెట్టుకొచ్చాడు. ఆ సొగసుకత్తె మాంచి హుషారుగా వుంది. ఆమె వెడల్పాటి పిరుదులచుట్టూ చేయి వేసి ఆ వుద్యోగి, అతని భుజాలమీద చేయివేసి ఆమె నడు స్తున్నారు. ఆ గదిలోవున్న రుబషోవ్‌ను, రిచర్డును గమనించ

కుండానే వాళ్ళు సోఫావైపు వీపు పెట్టి బాకాలూదుతున్న దేవదూతల చిత్రం వైపు చూస్తున్నారు.

'ఊఁ, చెప్పు నెమ్మదిగా, శాంతంగా' అంటూనే రుబషోవ్ జేబులోనుంచి సిగరెట్ పెట్టె తీశాడు. ప్రదర్శనశాలలో కాల్చకూడదని జ్ఞాపకంవచ్చి సిగరెట్ పెట్టె జేబులో పెట్టాడు. విద్యుత్ ప్రవాహపుతాకిడితో పక్షవాతంవచ్చినవాడిలా స్థబ్దుడై వాళ్ళిద్దరి వైపు చూస్తూ కూర్చున్నాడు. 'చెప్పుకుపో. చిన్న పిల్లవాడిలా నత్తులు కొడతావేం? చెప్పు, అటుచూడకు,' అన్నాడు నిదానంగా రుబషోవ్.

'అఁ... అప్పుడప్పుడు,' అని అధిక ప్రయత్నంతో అనగలిగాడు రిచర్డ్. ఆజోడా చిత్రాలవరస వెంట కదలిపోయారు. శాటిన్ పరుపుమీద నగ్నంగా పడుకొని ప్రేక్షకుల వైపు చూస్తున్న స్త్రీ చిత్రంవైపు చూస్తున్నారు. యువకుడు యేదో హాస్యంగా గొణిగాడులావుంది, ఆ అమ్మాయి యికిలించి సోఫాలోవున్న వ్యక్తులవైపు క్రీగంటగా చూచింది. ఇంకో కొంచెం ముందుకెళ్ళి చిత్రాల్ని చూస్తున్నారు.

'మ... మనం వెళ్ళిపో... కూడదూ?' అన్నాడు, రిచర్డ్

'వద్దు' అన్నాడు రుబషోవ్. ఈ కుర్రాడు వెళ్ళటానికి నిలబడ్డప్పుడు భయంచేత ఇతరులు యేమైనా అనుమానించేటట్లుగా ప్రవర్తిస్తాడేమోనని రుబషోవ్ భయపడ్డాడు. 'వాళ్లు త్వరలోనే వెళతారు. లైటు మనవెనకాలుంది, వాళ్ళు మనల్ని సరిగా చూడలేరు. నీవు కొంచెం శ్వాస నెమ్మదిగా, దీర్ఘంగా పీల్చి వదలు; ఆందోళన తగ్గి, కొంచెం సులువుగా వుంటుంది.' అన్నాడు.

ఆ పిల్ల యింకా యికిలిస్తూనేవుంది. వాళ్ళు బయటికె ళుతూ రుబషోవ్ రిచర్డ్ల వైపు తిరిగిచూచారు. గదిగుమ్మం దాటుతుండగా ఆ పిల్ల పియెటా చిత్రం వైపు వ్రేలుపెట్టి చూపింది. ఆ చిత్రం చూస్తూ నిలబడ్డారు. నేలవైపు చూస్తూ 'నేను సత్తులు కొట్టుంటే యిబ్బందిగా వుందా ?'

"ఆత్మనిగ్రహం వుండాలి," అన్నాడు రుబషోవ్ కరుకుగా. ఈ సంభాషణలో చనువుగా వున్నట్లు ప్రవర్తించటానికి వీలులేదు.

'ఒక్క క్షణంలో నా నత్తి సర్దుబాటవుతుంది. ఆనీకూడ యీ...యీ విషయంలో నవ్వుతుండేది. మీ...మీకు తె... తెలుసుగా,' అన్నాడు రిచర్డ్. అప్పుడు గొంతుకాయ వణుకుతో క్రిందికీ పైకీ కదిలింది.

ఆ జంట గదిలో వున్నంతసేపూ రుబషోవ్ సంభాషణ సాగించటానికి ప్రయత్నించలేదు. యూనిఫారంలోవున్న వుద్యోగి వీళ్ళ వెనకవుండటం వల్ల రిచర్డ్ వైపు జరిగాడు. రిచర్డ్ కూడ కొద్దిగా రుబషోవ్ ప్రక్కగా జరిగాడు.

'ఆవిడకు నేనంటే యెప్పుడూ చాల ఆపేక్ష. నాకు ఎ...ఎప్పుడూ ఆవిణ్ణెలా ఆదరించాలో తెలియలేదు. పిల్లల్ని కనటం ఆవిడ కిష్టంలేదు. కాని తప్పటంలేదు. ఆవిడ గర్భిణి గనక వాళ్ళేమీ బాధ పెట్టరనుకుంటాను. మీరు స్పష్టంగా అర్థం చేసుకుంటారనుకుంటా. గర్భిణిస్త్రీలను కూడ కొడ్తారా, మీకు తెలుసుగా, అని నిదానంగా గుసగుసలాడుతూ రిచర్డ్ తన ఆవేదన వెల్లడించాడు.

గడ్డంతో యూనిఫారమ్ వుద్యోగి వైపుచూపించాడు.

సరిగా అదేసమయంలో ఆ వృద్ధోగి రిచర్డ్‌వైపు చూచాడు. ఒక్కక్షణం వాళ్ళిద్దరు ఒకరినొకరు చూచుకొన్నారు. ప్రక్కనున్న పిల్లతో యేదో నెమ్మదిగా చెప్పాడు. ఆకిడ కూడ యిటువైపు తిరిగిచూచింది. రుబషోవ్ యీసారి కూడ సిగరెట్ కాల్చాలనిపించి జేబులో చెయ్యి పెట్టి పెట్టె మాత్రం బయటకు తీయలేదు. యువతి యేదో అని అతన్ని తనతో లాగింది. ఇద్దరూ నెమ్మదిగా బయటకు దారితీశారు. కాని యువకుడు తటపటాయిస్తూ వెళ్ళాడు. ఆపిల్ల యింకా యికిలిస్తూ పోవటం,దూరమౌతున్న వాళ్ళఅడుగులచప్పుడు వినిపించినయ్.

రిచర్డ్ తల అటు తిప్పి వాళ్ళు వెళ్ళిపోవటం, చూస్తూనే వున్నాడు. అతను కదలటం వల్ల యిప్పుడు చిత్రం స్పష్టంగా కనిపిస్తోంది, రుబషోవ్‌కి. మోచేతుల వరకూ చిన్నపిల్ల చేతుల్లా సన్నబడ్డ ఆ దేవకన్య చేతులు కనిపిస్తున్నయ్. ఆ చేతుల్ని అదృశ్యంగా వున్న క్రీస్తు శిలువ వైపు యెత్తి ప్రార్థిస్తోంది.

రుబషోవ్ తన గడియారంవైపు చూచాడు. రిచర్డ్ కొంచెం దూరంగా జరిగి కూర్చున్నాడు.

'మనం ఒకనిర్ణయానికిరావాలి. మేంపంపిన సాహిత్యం లోని విషయాలతో యేకీభవించలేక పోయారు గనుక బుద్ధిపూర్వకంగానే పంచలేదన్నమాట నిజమేగా. మరి మీ కరపత్రాలతో మేమూ యేకీభవించలేకపోతున్నాం. కొన్ని ఫలితాలు ఆ విధంగానే వుంటాయని తెలుసుకోవాలి, కామ్రేడ్,' అన్నాడు రుబషోవ్.

రిచర్డ్ యెర్రబడ్డ కళ్ళతోనే రుబషోవ్ వైపుచూచి, తల వంచుకొని 'మీరు పంపిన సాహిత్యమంతా చాల అసంద

ర్ధంగా వుందని మీకూ తెలుసు' అన్నాడు సాక్షిగా. సత్తులు కొట్టటం ఆకస్మాత్తుగా ఆగిపోయింది.

'ఆ విషయం నాకేమీ తెలియదు,' రుబషోవ్ పేల వంగా అన్నాడు.

'మీరు అందులో యేమీజరగనట్టుగానే వ్రాశారు. వాళ్ళు పార్టీని ముక్కలుచేసి చావుదెబ్బ కొట్టారు. కాని మీరు యుద్ధకాలంలో వచ్చిన వార్తల్లోలాగ, అసత్యపు పద జాలంతో అచంచలంగా విజయసాధనకు కృషి చేయాలని వ్రాశారు. ఆ కరపత్రాలు చూసినవాళ్ళు మొఖాన వుమ్మి వేస్తారు. అదంతా మీరు తెలుసుకోవాలి,' రిచర్డ్ అదే అల సిన గొంతుతో అన్నాడు.

మోకాళ్ళమీద మోచేతు లానించ్చి, గుప్పిళ్ళమీద గడ్డంఆనించీ ముందుకు వంగి కూర్చున్న రిచర్డ్‌వైపు చూస్తూ.

' అదుగో, మళ్ళీ రెండోసారి నాకు తెలియని విష యాల్ని నాకంటగడుతున్నావ్. ఇక ఆ విధంగా మాట్లాడం ఆపెయ్,' అని మెల్లగా అన్నాడు.

ఎర్రటి కళ్ళతోనే, రిచర్డ్ రుబషోవ్ వైపు అనుమా నంగా చూశాడు.

'పార్టీ ప్రమాదకరమైన పరీక్షలోవుంది. ఇతర విప్లవ పార్టీలు యింకా ప్రమాదస్థితిలో వున్నయ్. మన భవిష్యత్తును నిర్ణయించేది మన అచంచల దీక్ష ఒక్కటే. ఈ స్థితిలో బల హీనంగా, మెత్తగా వుండేవాళ్ళకు పార్టీలో స్థానంలేదు. ఈ స్థితిలో కల్లోల వాతావరణాన్ని సృష్టించే వాళ్ళవల్ల మనం శత్రువులపాలు కావలసి వస్తుంది. అలాటి వాళ్ళలా యెందుకు

చేస్తున్నారనే విషయం అనవసరం. అట్టి దృక్పథం మనవుద్యమానికి ప్రమాదం. వాళ్ళని పార్టీ సరిగానే చూస్తుంది,' అన్నాడు, రుబషోవ్.

చేతులమీదే గడ్డం వుంచి రుబషోవ్ వైపు చూస్తూ.

'అయితే నేను ఉద్యమానికి ప్రమాదమన్నమాట. శత్రువులకు ఉపయోగ పడేలాగ ప్రవర్తిస్తున్నానన్నమాట. బహుశా అందుకు ప్రతిఫలం అనుభవిస్తున్నాను. అనీకూడ... అన్నాడు.

అదే నీరవ స్వరంతో మాట్లాడుతున్నాడు రుబషోవ్:

'నీవు వ్రాశావని చెపుతున్న కరపత్రాలలో చాల భాగం దాదాపు యిలాటి పదజాలంతో వుంది - మనం ఓడిపోయాం; పార్టీ సంక్షోభంలోవుంది; అందువల్ల మనవిధానాన్ని సమూలంగా మార్చి, నూతన పంథా ననుసరించాలి. ఈ విధంగా ఆలోచించటం పాఱుబోతుతనం. పార్టీని పతనం చేస్తున్నది. పార్టీ పోరాట శక్తిని కుంటుపరుస్తుంది.'

'నాకు తెలిసిందల్లా, యేదో విధంగా అప్పటికేవాళ్ళకు తెలిసిన సత్యాన్ని ప్రజలకు చెప్పటమే. ప్రజలముందు నంటించటం చాల హాస్యాస్పదం.' అన్నాడు రిచర్డ్.

'క్రిందటి పార్టీకాంగ్రెసు ఒక తీర్మానంలో, పార్టీ అపజయం పొందలేదనీ, ఒకయెత్తుగడగా మాత్రమే ప్రస్తుతం వెనకడుగు వేసిందనీ స్పష్టంచేసింది. అందువల్ల యిప్పుడు పాత విధానాన్ని సమూలంగా మార్చాల్సిన అవసరంయేంలేదు.'

'కాని, అదంతా చెత్త.'

'నీవు అదేధోరణిలో మాట్లాడితే యికమనం మాట్లా

డటం అనవసరం.'

రిచర్డ్ కొంచెంసేపు మౌనంగా వున్నాడు. గదిలో చీకట్లు క్రమ్ముతున్నయ్. గోడలమీది చిత్రాల వర్ణాలు మరీ పేలవంగా అలికినట్లు కనిపిస్తునయ్.

'మీరన్నదానికి విచారిస్తున్నాను. నా వుద్దేశం పార్టీ పొరబాటు బడుతున్నదని, మీరు తిరోగమనపు యెత్తుగడను గురించి మాట్లాడు తున్నారు. మనవాళ్ళని సగంమందిని చం పేశారు. మిగిలినవాళ్ళు బ్రతికివుంటే చాలుననుకొని గుంపు లుగా ప్రతిపక్షంలోకి సంతోషంగా వెళ్ళటానికి సిద్ధంగా వున్నారు. ఈ స్థితిలో పైపైన తిరిగే మీరు కల్పించే వితం డపు తీర్మానాలు యిక్కడివాళ్ళ కర్థం కావు....'

చీకటిపడుతున్నకొద్దీ రిచర్డ్ కుంచించుకు పోతున్నాడు. కొంచెంసేపు మెదలకుండా వూరుకొని,

'గత రాత్రి ఆసీ కూడ తిరోగమనపు ఎత్తుగడ వేసిం దనుకుంటా. మీరు దయచేసి, అర్థం చేసుకోవాలి, మేమి క్కడ అడవిలో వున్నట్టు బ్రతుకుతున్నాం....'

ఇంకా యేమైనా చెబుతాడేమోనని చూచాడు, రుబ షోవ్. కాని రిచర్డ్ యేమీ మాట్లాడలేదు. ఇప్పుడు చీకట్లు దట్టంగా వ్యాపిస్తున్నయ్. రుబషోవ్ ముక్కద్దాలు తీసి చొక్కా చేతిమీద తుడిచాడు,

'పార్టీ యెప్పుడూ పొరపాటు చేయదు. నీవు, నేనూ తప్పులుచేస్తాం. కాని పార్టీ కాదు. కామ్రేడ్, పార్టీ అంటే నీవు నేనూగాక నీలాటి, నాలాటివాళ్ళు వెయ్యిమందికంటె యెక్కు వైంది. చరిత్రలో విప్లవభావానికి ప్రతిరూపం, పార్టీ అంటే.

చరిత్రకే న్యాయాన్యాయ విచక్షణ, వెనుక ముందాలోచనలు తెలియవు. నిర్దిష్టంగా, నిరాఘాటంగా తనగమ్యం వైపు కదిలి పోతుంది. చరిత్ర ప్రవాహ గమనంలో తిరిగే ప్రతివంపువద్దరా, తనతోవచ్చే కొంత బురదనూ, ప్రవాహంలో పడి మునిగి పోయిన శవాలను వదలివెళ్తుంది. తనదారి తనకు తెలుసు. తప్పు లెప్పుడూ చేయదు. చరిత్రలో సంపూర్ణ విశ్వాసం లేనివాడు పార్టీలో వుండతగడు.'

రిచర్డ్ గుప్పిళ్ళమీద గడ్డం ఆనించి కూర్చొని, మొదల కుండ, రుబషోవ్ మాట్లాడుతుంటే, అతనివైపే చూస్తున్నాడు.

'మా సాహిత్యాన్ని పంచకుండా చేశావు. పార్టీ గొంతు నొక్కేశావు. నీవు పంచిన సాహిత్యంలో ప్రతిమాట తప్పు, ప్రమాదమూను. "విప్లవోద్యమ శేష శక్తులన్నిటినీ సమీకరిం చాలి, ప్రభుత్వ పీడనను యెదిరించే పార్టీలన్నీ యేకంకావాలి. మనమందరం అంతర్గతాభిప్రాయ భేదాలను విస్మరించి, నూతనంగా ఐక్యపోరాటం సాగించాలి." అని వ్రాశావు. అదితప్పు. మన పార్టీ మితవాదుల్తో కలవకూడదు. వాళ్లు అనేకసార్లు వుద్యమాన్ని మోసగించారు. ఇంకాయెన్నిసార్లయినా అలాగే చేస్తారు. వాళ్ళతో రాజీపడినవాళ్లు విప్లవాన్ని పాతేసినట్లే. "ఇల్లుకాలుతుంటే అప్పటానికి అందరూ తోడ్పడాలి. సిద్ధాం తాలను గురించి కొట్లాడు కొంటుంటే మాడిమసై పోతాం" అని వ్రాశావు. అదితప్పు. మనం నీళ్ళతో నిప్పునార్పటానికి ప్రయత్నిస్తాం, వాళ్ళు నూనెతో ప్రయత్నిస్తారు. అందువల్ల నూనెతోనా, నీళ్ళతోనా యే పద్ధతి మంచిదో ముందుగానే

నిర్ణయించుకోవాలి, అగ్నిమాపక దళాలను ఆ తర్వాత సమీకరించాలి. రాజకీయాలను సవిధానంలో యెవడూ నడపడు. నిస్పృహతోనూ, మనో వికారంతోనూ విధానాన్ని రూపొందించటం అసాధ్యం. పార్టీ పంథా పర్వతాల్లో యిరుకు దారి లాగ, సూక్ష్మంగా వివరించబడింది. కుడికిగాని యెడమకుగాని కాలు యేమాత్రం జారినా పర్వతలోయ మట్టానికి జేరటమే. గాలి పల్చగావుంది. ఏమాత్రం తలతిరిగినా ఆఖరే.'

చిత్రాల్లోని వివరాలు ముఖ్యంగా పియెటా చేతులు యేమీ కనిపించనంత దట్టంగా చీకటి వ్యాపించింది. చెవులు గింగుర్లెత్తేటట్లుగా రెండుసార్లు గంట మ్రోగింది. ఇంకొక పావుగంటలో ప్రదర్శనశాల మూసివేస్తారు. రుబషోవ్ గడియారంవైపుచూచాడు. తన అంతిమనిర్ణయం చెప్పాలి. దాన్తో యిక్కడివని పూర్తివుతుంది. రిచర్డ్ అలాగే కదలకుండ కూర్చున్నాడు.

'సరే, దానికి నేను చెప్పేసమాధానం యేమీలేదు. మీరు చెప్పేది నిస్సందేహంగా నిజం. మీరు చెప్పిన కొండ దారి విషయం చాలబాగుంది. కాని నాకు తెలిసిందంతా మనం దెబ్బతిన్నాం. మిగిలినవాళ్లు మనల్ని వదిలేసిపోయారు. బహుశా మన కొండదారి అతిచల్లగావుందేమో. మిగతా వాళ్లు చలిమంట వేసుకొని చుట్టూ వెచ్చగా కూర్చొని, ఆ కాంతిలో మెరిసే ధ్వజాలు పుచ్చుకొని సంగీతంవింటున్నారు. బహుశా అందువల్ల నేనేమో వాళ్లు విజయాలన్నీ సాధించింది. మరి మనం యెందుకు తలలు తెగ్గొట్టుకోవాలి?' అని రిచర్డ్ సాక్షీగా, అలిసిన గొంతుతో, చివరి మాటగా అన్నాడు.

రుబషోవ్ మొదలకుండా విన్నాడు. తన అంతిమతీర్పు చెప్పే ముందు యీ యువకుడు యింకేమైనా చెపుతాడేమో విందామని చూస్తున్నాడు. అతను యిప్పుడేం చెప్పినా ఆ తీర్పు మారదు, అయినా యింకా వింటున్నాడు.

సంజచీకట్లో రిచర్డ్ అస్పష్టంగా కనిపిస్తున్నాడు రుబషోవ్‌కి. ఇంకా ఆధారంగా జరిగికూర్చున్నాడు. దాదాపు చేతుల్తో ముఖం కప్పుకూర్చున్నాడు. రుబషోవ్ లేచి నిటారుగా కూర్చున్నాడు, సోఫామీద. పిప్పిపన్ను మెల్లిగా నొప్పి పెట్టసాగింది. కొద్దిసేపటికి రిచర్డ్ మాట వినిపించింది.

'ఇప్పుడు నా విషయం యేమిటి ?'

నొప్పి పెడుతున్న పిప్పిపన్నును నాలుకతో నొక్కాడు. వ్రేలితో నొక్కి బాధ నణుచుకొని తర్వాత మాట్లాడదామను కొన్నాడు, కాని అలా చేయకుండానే నిదానంగా, 'రిచర్డ్, కేంద్రకమిటీ నిర్ణయం ప్రకారం నీవు యిక పార్టీసభ్యుడవు కావు' అని చెప్పాడు.

రిచర్డ్ కదల్లేదు. రుబషోవ్ కొంచెం ఆగాడు, నిలబడే ముందు, రిచర్డ్ మెదలకుండా కూర్చున్నాడు. తలపైకెత్తి రుబషోవ్ వైపు చూచి, అడిగాడు :

'ఇది చెప్పటానికేనా, మీరిక్కడ కొచ్చింది ?'

'ముఖ్యంగా' అని వెళ్లటానికి లేచి, రిచర్డ్ ముందు నిలబడ్డాడు.

'ఐతే యిప్పుడు నాకేమౌతుంది ?' అని అడిగాడు, రిచర్డ్. రుబషోవ్ మాట్లాడలేదు. కాసేపటికి,

'ఇక నా స్నేహితుడి క్యాబిన్‌లో కూడ వుండటానికి

పిల్లే దనుకుంటాను' అన్నాడు.

'మంచిదికాదు'

రుబషోవ్ ఆ మాట లన్నందుకు కొంచెం నొచ్చుకున్నాడు. అయినా ఆ మాటలో అర్థం అతనికి పూర్తిగా తెలిసిందో లేదో అర్థంకాలేదు. ఆ కూర్చున్న విగ్రహంవైపు చూస్తూ,

'మనం యిక్కడనుంచి విడివిడిగా వెళ్లటం మంచిది. శెలవు' అన్నాడు.

రిచర్డ్ నిటారుగా కూర్చున్నాడు. ఆ మసక చీకటిలో రిచర్డ్ యెర్రటికళ్ళు యెలావుంటాయో వూహించుకొన్నాడు. అస్తవ్యస్తంగా కూర్చున్న యీ విగ్రహాపు మసక ఛాయ రుబషోవ్ మనస్సులో శాశ్వతంగా ముద్రితమైంది.

ఈగదిని దాటి నిర్మానుష్యంగా, చీకటిగావున్న ప్రక్కగదినికూడ దాటివెళ్ళాడు. కలపనేలమీాద నడుస్తుంటే అడుగులుకిర్రుమంటున్నయ్. బయటి కళ్ళేదారి దగ్గర కొచ్చేటప్పటికిగాని పియెటా చిత్రంలోని వివరాలు చూడలేదని గుర్తురాలేదు. ఇప్పుడు ఆ ముకుళిత, మృదు హస్తాలు అవీ కొంత వరకు మాత్రమే వివరంగా గుర్తున్నయ్.

ప్రదర్శనశాల ముఖద్వారంలో మెట్లపైన నిలబడ్డాడు. బయట చలిగా వుంది. పిప్పిపంటి నొప్పి యెక్కువౌతోంది. ఉన్ని రుమాలు మెడకు గట్టిగా చుట్టాడు. ప్రదర్శనశాల ముందు ప్రశాంతంగా వున్న కూడలిలో వీధి దీపాలు వెలుగుతున్నయ్. ఆ సమయంలో అక్కడ జనాభా వొత్తిడి తక్కువగా వుంటుంది. చిన్న ట్రాము గంటమ్రోగించుకొంటూ

అటు వెళుతోంది. రుబషోవ్ అక్కడ అద్దెకారు దొరుకుతుం దేమోనని ఆలోచిస్తున్నాడు.

రుబషోవ్ మెట్లు దిగి ఆఖరు మెట్టుమీదకొచ్చే సరికి రిచర్డ్ రొజుకుంటూ, రొప్పుకుంటూ పరుగెత్తుకొచ్చి కలుసుకున్నాడు. రుబషోవ్ తలైనా త్రిప్పకుండ వెళ్తున్నాడు. రుబషోవ్‌కంటే రిచర్డ్ కొంచెం పొడుగు, లావు, అయినా గూడలు గూనిగా పెట్టి రుబషోవ్ ప్రక్కనే చిన్న వాడుగా కనిపిస్తూ నెమ్మదిగా అడుగులు వేస్తూ కొంచెందూరం వెళ్ళాక,

'ఇందాక నా స్నేహితుడితో వుండొచ్చా అని అడిగినప్పుడు మీరు "మంచిదికాదు" అన్నమాట నాకు హెచ్చరికా?' అని అడిగాడు.

రుబషోవ్ రోడ్డువెంట పెద్ద లైట్లతో వస్తున్న అద్దెకారుని చూచాడు. రోడ్డుప్రక్క కాలిదారిమీద నిలబడి కారు కోసం చూస్తున్నాడు. రిచర్డ్ అతని ప్రక్కనేవున్నాడు.

'ఇంక నీకు చెప్పేదేమీలేదు, రిచర్డ్' అని టాక్సీని పిలిచాడు.

'కామ్రేడ్ ... కా ... కాని మీరు నన్ను త్రోసివేయకూడదు. కా ... కామ్రేడ్!'

కారు నెమ్మదిగా వాళ్ళకు యిరవై అడుగుల దూరంలో కొచ్చింది. రిచర్డ్ వంగి రుబషోవ్ కెదురుగావచ్చి అతని కోటు చేతిని పట్టుకొని ముఖంలో ముఖంపెట్టి మాట్లాడుతున్నాడు. రిచర్డ్ ఉచ్ఛ్వాస నిశ్వాసలు రుబషోవ్‌కి తగిలి మొఖంమీద తడయింది.

'నేను పార్టీకి శత్రువును కాను. నన్ను తోడేళ్ళ

'కెయ్యకూడదు. కా...కామ్రేడ్!'

కారు వచ్చి వీళ్ళకెదురుందాగింది. బహుశా యీ చివరి మాట కారుడ్రైవరు విని వుండొచ్చు. రిచర్డ్‌ని అలాపంపించటం మంచిది కాదనుకొన్నాడు. దగ్గరలో పోలీసువాడున్నాడు. కారుడ్రైవరు పొట్టి ముసలివాడు, వీళ్ళవైపు అన్యక్తంగా చూచాడు.

'స్టేషన్‌కి' అని రుబషోవ్ కారెక్కాడు. డ్రైవరు కారెక్కి తలుపుగట్టిగా వేశాడు. రిచర్డ్ టోపీచేత్తోపట్టుకొని గుటకలు మ్రింగుతూ ఆ కాలిదారి మీదనే నిలబడ్డాడు. కారు పోలీసువాడున్న వైపుగా కదిలిపోయింది; పోలీసువాణ్ణిదాటి పోయింది. రుబషోవ్ వెనక్కితిరిగి చూడదలచుకోలేదు. రిచర్డ్ యింకా అక్కడనే నిలబడి కారు వెనుక ఎర్రలైటువైపు చూస్తూ వుంటాడని తెలుసు.

కొన్ని నిమిషాలపాటు జనసమ్మర్దం ఎక్కువగావున్న వీధుల్లోనుంచి పోయింది. కారుడ్రైవరు చాలసార్లు, కార్లోవున్న ప్రయాణీకుడు వున్నాడో లేదో చూడడానికే మోనన్నట్లుగా, వెనక్కుతిరిగి చూచాడు. కారు స్టేషన్ కెళ్తుతోందో లేదో తెలుసుకోవటానికి ఆ పట్టణం రుబషోవ్‌కి అంతపరిచితమైనది కాదు. పోనుపోను వీధులు ప్రశాంతంగా వున్నయ్. ఆ వీధి చివరన కాంతులీను పెద్ద గడియారంతోవున్న పెద్ద భవనం ముందు ఆగింది కారు. అదే స్టేషను.

ఆ పట్టణంలో టాక్సీల కింకా మీటర్లు లేవు. రుబషోవ్ కారు దిగి అడిగాడు: 'ఎంత?'

'ఏమీలేదు' అన్నాడు డ్రైవరు. అతని ముసలిమొఖం

జిడ్డు కారుతోంది తన తోలుకోటు జేబులోనుంచి యెగ్రటి మురికి గుడ్డపీలిక నొకటితీసి ముక్కు తుడుచుకొన్నాడు.

రుబషోవ్ ముక్కుద్దాల్లోనుంచి శ్రద్ధగా పరిశీలించాడతన్ని. ఆ మొఖాన్నెప్పుడూ యింతకుముందు చూడలేదు. డ్రైవరు జేబు గుడ్డను లోపల పెట్టాడు. 'మీలాటి వాళ్ళకు యెప్పుడూ వూరికనే వస్తామయ్యా' అని చేతిబ్రేకుపని చూస్తున్నాడు. చప్పున చెయ్యిచాచాడు. ఆ ముసలిచేతిగోళ్లు నల్లగా వున్నయ్. నరాలు వుబ్బినాయ్. చిరు నవ్వుతో 'శుభం, మీ స్నేహితుడికి యెప్పుడేమి కావలసినా నాకారు ప్రదర్శన శాల కెదురుగానే వుంటుంది. నాకారు నెంబరుచెప్పిపంపండయ్యా' అన్నాడు రుబషోవ్‌తో.

రుబషోవ్‌కి కుడివైపున స్తంభాని కానుకొని ఒక కూలి నిలబడివుండి వీళ్ళవైపు చూస్తున్నాడు. డ్రైవరుచేతిని స్పర్శించకుండానే ఒక నాణెం వానిచేతిలోపెట్టి రుబషోవ్ స్టేషను కెళ్ళిపోయాడు.

రైలు కదలటాని కింకా గంట వ్యవధి వుంది. అక్కడ దొరికిన పాడు కాఫీ త్రాగాడు. పన్ను చిత్రవధ చేస్తోందతన్ని. రైల్లో కూర్చుని కునికిపాట్లు పడుతూ కలకంటున్నాడు. రుబషోవ్ రైలు యింజను ముందుకు పరుగెత్తాలి సొచ్చింది. ఇంజనులో రిచర్డ్, టాక్సీడ్రైవరూ వున్నారు. వాళ్ళని వంచించాడు గాబట్టి యితని మీదుగా యింజను నడపాలనుకున్నారు. చక్రాలు మ్రోతపెట్టుకొంటూ మరీ దగ్గరగా వచ్చేసినయ్. అడుగు ముందుకు పడలేదు. వాంతి వచ్చినట్లుగా వుండి మెలుకువ వచ్చింది. మొఖంమీద చెమటపట్టి తడిగా

వుంది. ఆ పెట్టెలోవాళ్లు యితనివైపు కొంచెం వింతగా చూచారు. బయట చీకటిగావుంది. రైలు శత్రుదేశంగుండా చీకట్లో పోతోంది. రిచర్డ్ వ్యవహారం ముగించాలి. వన్ను బాధ గావుంది. ఒక నాలుగురోజుల తర్వాత అరెస్టయ్యాడు.

# 10

రుబషోవ్ నుదురు కిటికీకానించి బయటి ఆవరణలోకి చూస్తున్నాడు. పచార్లు చేయటంవల్ల కాళ్లు నొప్పిగా, తల తలదిమ్ముగా వున్నయ్. గడియారం చూచాడు. పదకొండు ముప్పావయింది. అంటే యిప్పటికి పియెటా గుర్తొచ్చినప్పటి నుంచి, దాదాపు నాలుగుగంటల నుంచి పచార్లుచేస్తున్నాడు. బంధనలో వున్నప్పుడు పగటి కలలకు, సున్నంకొట్టిన గోడలు కలిగించే మత్తుకు యిదివరకే అలవాటుపడి వున్నందువల్ల, అతనేమీ ఆశ్చర్యపడలేదు. వెనక ఒక యువక కామ్రేడ్ మం గలి చెప్పిన వృదంతం గుర్తుకొచ్చింది. ఆ కామ్రేడ్ యేకాంత జైలు శిక్ష ననుభవించాడు. అతడు రెండోసారి జైలుకు వెళ్లి నప్పుడు అనుభవించిన బాధ మరీ దారుణం. అప్పుడు మెలు కువతోనే వుండి యేడుగంటలసేపు స్వాప్నిక జగత్తులో విహ రించాడు. ఆ స్థితిలో ఐదు అడుగుల పొడుగున్న గదిలో షుమారు 17 మైళ్లు నడిచాడు; కాళ్లు బొబ్బలెక్కిన సంగతి కూడ తెలియలేదు.

అయితే యీరెండోసారి అతిత్వరగా మొదటిరోజునే వచ్చినటువంటివిషాదస్థితి వచ్చింది. పూర్వంజైలుకొచ్చినప్పుడు

కొన్ని వారాలకుగాని వచ్చేదికాదు. ఇంకో క్రొత్తవిశేషం యేమిటంటే గతజీవితాన్ని గురించి కలకనటం, సాధారణంగా యీ దివాస్వప్నవ్యాధిగ్రస్తఖైదీలు యెప్పుడూ భవిష్యత్తు గురించే కలలు కంటూంటారు. ఒకవేళ గతాన్ని గూర్చిన కలలొచ్చినా, గతం యెలావుంటే బాగుండేదోననేగాని యథార్థంగా జరిగిన దాన్ని గురించి మాత్రంకాదు. ఇంకా తన మెదడులో యేమి విచిత్రశక్తులు నిద్రాణమై వున్నయ్యోనని వింత పడ్డాడు. మృత్యువును ముఖా ముఖి యెదుర్కొనటం వల్ల మానసికంగా కలిగే మార్పులు, ఆశ్చర్యకరమైన వికారాలు-సూదంటురాయి దగ్గర పెట్టిన దిక్సూచిలోని ముల్లు తిరిగినట్లు అతనికి అనుభవమే.

ఆకాశం హిమమేఘావృతమై హిమ వర్షపాత సూచితంగావుంది. ఆవరణలో మంచుత్రవ్విన దారిలో యిద్దరు ప్రతిదినం చేసే వాహ్యాళి చేస్తున్నారు. అందులో వొకడు రుబషోవ్ కిటికీవైపు అదేపనిగా చూస్తున్నాడు; బహుశా అతని అరెస్టు వార్త యిప్పటికే ప్రాకిపోయివుండాలి. అతని చర్మం పసుపు పచ్చగావుంది; తోగ్రిపెదవి; పల్చని వాటర్ ప్రూఫ్ గుడ్డ చలికి వణికిపోతున్న వాడిలాగ కప్పుకొన్నాడు. రెండోవాడుయితనికంటె ముసలివాడు,దుప్పటికప్పుకొన్నాడు. వాహ్యాళిచేసినంతసేపూ వాళ్లు మాట్లాడుకోలేదు. పదినిముషాలైన తరువాత రివాల్వరు తగిలించిన యూనిఫారంతో వున్న వుద్యోగి వాళ్ళను లోపలికి తీసుకొచ్చాడు. వాళ్ళను వుంచే గది సరిగా రుబషోవ్ కిటికీకి యెదురుగావుంది, తోగ్రి పెదవి

వాడు లోనికెళ్తూ, తలుపు మూసేముందు రుబషోవ్ వైపు చూచాడు. ఆవరణనుంచి చూస్తే రుబషోవ్ గది చీకటిగా కనిపించటంవల్ల లోపలవున్నవేమీ కనబడవు; అయినా త్రోత్రి పెదవి వాడికళ్ళు యెందుకో యీ కిటికీవైపు వెదికినయ్. "నిన్ను చూచాను, నిన్ను యెరగను; నన్ను చూడలేవు, తప్పకుండా నన్నెరిగుంటావు" అనుకున్నాడు రుబషోవ్. పక్కమీదకూర్చుని 402 నెంబరుకి తట్టాడు.

'వాళ్ళెవరు?'

బహుశా 402 నెంబరు కించపడివుంటాడు, మాట్లాడడనుకున్నాడు. కాని ఆ వుద్యోగికి అటువంటివేమీ తెలియవు; క్రోధంలేదు; వెంటనే సమాధానం వచ్చింది.

'రాజకీయ సంబంధం'

రుబషోవ్ త్రోత్రిపెదవి వాణ్ణి చూచి నేరస్థుడనుకొన్నాడు; యీ మాటవిని ఆశ్చర్యపడ్డాడు.

'నీలాంటివాడా?'

'కాదు - నీలాంటివాడు,' ఒకవిధమైన సంతృప్తిని ప్రకటిస్తూ తట్టాడు. ఆ తరువాత వాక్యం యింకా బిగ్గరగా వినిపించింది - బహుశా తన ఒంటిఅద్దపు జోడుతో తట్టివుంటాడు:

'400 నెంబరు గదిలోవున్న నా పొరుగువాడు, త్రోత్రి పెదవివాణ్ణి నిన్న చిత్రహింస పెట్టారు'.

రుబషోవ్ ఒకనిమిషం మెదలకుండా వూరుకొని ముక్కద్దాలుతీసి చొక్కా-చేతికి తుడిచి - తట్టటానికే వుపయోగిస్తున్నప్పటికీ - 'ఎందుకు?' అని తట్టాలనుకొని, దాని బదులు,

'ఎట్లా ?' అని తట్టాడు.

'అవిరితోట్లో' 402 నెంబరు నీరసంగా చెప్పాడు.

క్రిందటిసారి కారాగార వాసంలో అనేకసార్లు దెబ్బలు తిన్నాడుగాని యీపద్ధతిని చూడలేదు; చెప్పుకోవటం మాత్రమే విన్నాడు. పంటిబాధపడుతున్న రోగికి పన్ను తీసి వేస్తారని తెలిసిన తర్వాత పన్ను తీసివేస్తే అతను ఆబాధకు సిద్ధమై వుంటాడు. గనుక పెద్దగా బాధపడడు. అలాగే తనకేం జరుగుతుందో తెలిసింతర్వాత అనుభవించే హింసవల్ల కలిగే శారీరక బాధను భరించవచ్చు. ఇది రుబషోవ్ అనుభవం. హింసావిధానం యెట్లావుంటుందో, అందువల్ల యెంత బాధ కలుగుతుందో, ఆ బాధను భరింపగలశక్తి తనకున్నదో లేదో తెలుసుకోవటాని కవకాశం లేకుండా హింసించబడినప్పుడే భరింప శక్యంకాదు. అలాటి సమయాల్లో భయంవల్ల చేసేపనులు, అనేమాటలు తలచుకోవటానికికూడ భయం వేసేంత నికృష్టంగా వుంటయ్.

'ఎందుకు?' అడిగాడు రుబషోవ్.

'రాజకీయాభిప్రాయ భేదాలు' శ్లేషతో తట్టాడు 402 నెంబరు.

ముక్కద్దాలు పెట్టుకొని సిగరెట్లు పెట్టెకోసం జేబు తడిమి తీశాడు; అందులో రెండే వున్నయ్.

'నీ పరిస్థితి యెలావుంది?' అని తట్టాడు.

'నమస్తే, చాలాబాగుంది...' అని సంభాషణ ముగించాడు, 402 నెంబరు.

రుబషోవ్ గూడలు రిక్కించి, సిగరెట్ వెలిగించి మళ్లీ పచార్లు సాగించాడు. తనకి కలగబోయే స్థితిస్మృతి వింతగా

మనశ్శాంతిని కలగజేసింది. మనిషి తేలికపడ్డాడు. నోరు పుక్కి-
లించి కడుక్కున్నాడు. ముఖం, చేతులు, రొమ్ము ఆ చన్నీళ్ళ
తోనే కడుక్కొని జేబుగుడ్డతో తుడుచుకున్నాడు. కాసేపు
యీలపాట పాడుకొని, ఆత్మానందంతో నవ్వుకొన్నాడు.
అతనికి సరియైన సంగీతజ్ఞానం లేదు ఈ మధ్యనే యెవరో
'నెం. 1 కి సంగీతం వచ్చివుంటే నిన్నిపాటికి కాల్చివేయటా
నికి యేదోసాకు సంపాదించేవాడు' అని చమత్కారంగా
అన్నమాట గుర్తుకొచ్చింది.

'ఎలాగో ఆపని చేస్తాడు', అపనమ్మకంతోనే తనకు
తాను సమాధానం చెప్పుకున్నాడు.

ఆఖరు సిగరెట్ కూడ ముట్టించి, విచారణకు తీసుకు
వెళ్ళినప్పుడు తాను అవలంబించవలసిన పంథాను గురించి
ప్రశాంతంగా ఆలోచిస్తున్నాడు. పరీక్ష కఠినంగా వుంటుందను
కుని ప్రశాంతంగా, ఆత్మవిశ్వాసంతో పరీక్షకు వెళ్ళిన తన
విద్యార్థి అనుభవంలాటి దాన్ని యిప్పుడనుభవిస్తున్నాడు.
'ఆవిరితొట్టె'ని గురించి తనకు తెలిసిన ప్రతివివరాన్ని మననం
చేసుకుంటున్నాడు. ఆ శిక్షే తనకు విధించబడితే దాని బాధ
యే యే రూపాల్లో, యే విధంగా వుంటుందో వివరంగా
వూహించుకొంటున్నాడు. అందుకు సిద్ధంగా వుంటే కొంత
బాధ తగ్గుతుందని నమ్మకం. అలా చేసినా తన విషయంలో,
అక్కడున్న యితరుల విషయంలో లాగే, వాళ్ళు కృత
కృత్యులు కాలేరని తనకు తెలుసు. తాను చెప్పదలచుకోని
మాట ఒక్కటికూడ చెప్పడు. ఆ నాటకం త్వరగా ప్రారం
భిస్తే బాగుండును,

రిచర్డ్‌ని, డ్రైవరుని తను మోసగించా డనుకొని వాళ్ళు తనని వెంటాడి వస్తున్నట్లు వచ్చినకల గుర్తుకొచ్చింది.

'సరే, నావంతు నేను చెల్లిస్తాను' అనుకున్నాడు, వికృతంగా నవ్వుతూ.

ఆఖరు సిగరెట్‌కూడ ఐపోవస్తోంది. చివరకొచ్చి వ్రేళ్లు కాలే స్థితిలో అవతల పారేశాడు. కాలితో నొక్కివెయ్య బోయి యేదో గుర్తుకొచ్చి కాలుతున్న ఆ పీకను తీసి చేతి మీద, వుబ్బిన రెండు నరాలమధ్య, పెట్టి నొక్కాడు. అలా సరిగా గడియారం చూస్తూ, అరనిముషం వుంచాడు. కాని చెయ్యి కదలలేదు. అంతసేపూ ఆత్మానందం పొందాడు. పచారు సాగిస్తున్నాడు.

కొంతసేపటినుంచి యితన్ని పరీక్షిస్తున్నకన్ను రహస్య రంధ్రంలోనుంచి తప్పుకొంది.

# 11

మళ్లీ మధ్యాహ్నపు భోజనాలు పట్టుకొచ్చినవాళ్ళు రుబషోవ్ గదిని వదలివేసి పోయారు. ఆ పదార్థాలేమిటో చూచి బాధపడ దలచుకోలేదు. కాని తనగదిలోకి మంచి వాసన కొడుతోంది.

సిగరెట్‌కోసం ప్రబలవాంఛ ప్రకోపించింది. మనో నిబ్బరంకోసం, యేదో విధంగా సిగరెట్లు సంపాదించాలి; భోజనంకంటె అవే ముఖ్యం. ఆగుంపు వెళ్లిపోయిన అరగంట సేపటివరకు వూరుకొని అప్పుడు తలుపు కొట్టాడు. ముసలి

వార్డరు గెంతుకుంటూ వచ్చేటప్పటికి యింకొక పావుగంట గడిచింది. వార్డరు మూఘనాలు చిరచిరతో 'ఏం కావాలి?' అని అడిగాడు.

'క్యాంటీన్ నుంచి సిగరెట్లు తెచ్చి పెట్టాలి!'

'నీ దగ్గర డైలు వోచర్లున్నయ్యా?'

'నేను వచ్చినప్పుడు నా డబ్బంతా తీసుకున్నారు.'

'అయితే వోచర్లు గా మార్చేవరకూ ఆగాలి.'

'మీ యీ ఆదర్శపు పద్ధతిలో యెంతకాలం పడుతుంది?'

'ఫిర్యాదు పత్తరం వ్రాయొచ్చు.'

'నా దగ్గర కాగితంగాని, పెన్సిల్ గాని యేమీలేవని నీకు తెలుసుగా.'

'అవి కొనుక్కోవటానికూడ వోచర్లు కావాలి'.

రుబషోవ్ కి ఆవేశంయెక్కుతోంది; గుండెల్లోను, గొంతులోను వొత్తిడి యెక్కువై వూపిరాడటంలేదు; కాని అణుచుకున్నాడు. వార్డరు రుబషోవ్ ముక్కద్దాల్లోనుంచి అతని కళ్ళల్లో మెరపు చూచాడు; వెనుకటి రోజుల్లో యెక్కడబడితే అక్కడ కనబడే యూనిఫారంలోవున్న రుబషోవ్ వర్ణచిత్రాన్ని గుర్తుకుతెచ్చినవా కళ్లు. ముసలి తనవు ద్వేషంతో నవ్వి, ఒక డుగు వెనక్కు వేశాడు, ముసలాడు.

'పెంటముండాకొడకా' అని నిదానంగా అంటూ వెనక్కి తిరిగి కిటికీ దగ్గరకెళ్లాడు.

'నన్ను బూతులు తిట్టాడని ఫిర్యాదు చేస్తానులే!' అంటూ తలుపు దభాలున వేసి పోయాడు.

రుబషోవ్ ముక్కద్దాలు తీసి చొక్కాచేతికి తుడిచి

ప్రశాంతంగా వూపిరి పీల్చుకునేపకు మెదలకుండా వున్నాడు. సిగరెట్లు కావాలి, లేకపోతే వుండటం కష్టం. పదినిమిషా లెలాగో మెదలకుండా వూరుకొని 402 నెంబరుకి తట్టాడు.

'నీ దగ్గరేమైనా పొగాకుందా?'

కొద్దిసేపటికి అతిస్పష్టంగా, తాపీగా,

'నీకు లేదు!' అని జవాబు వచ్చింది

నెమ్మదిగా మళ్ళీ కిటికీవద్దకెళ్ళాడు. 402 నెంబరు వుద్యోగి స్మృతిపథంలో కొచ్చాడు. చిన్నమీసం, కంటద్దం పెట్టుకొన్నాడు; వెర్రితనంగా పళ్ళికిలిస్తూ తనను వేరుచేసిన గోడవైపు చూస్తున్నాడు; కంటి అద్దంవెనుకవున్న కన్ను గాజుగావుంది; యెర్రగావున్న కనుగ్రుడ్డుఅపసవ్యంగా పైకివుంది. ఏమాలోచిస్తున్నాడో "నీకిస్తాను, బాగా నేవుంది," అనుకుంటు న్నాడో, లేకపోతే "వేటకుక్కా, మావాళ్ళ నెంతమందిని కాల్చావు" అంటున్నాడో! రుబషోవ్. సున్నపుగోడ వైపు చూచాడు; అవతలివ్యక్తి గోడ కవతల తనవైపు చూస్తున్న ట్లుగా, అతని రొప్పు తాను వింటున్నట్లుగా భావించాడు. అవును మీ వాళ్ళనెంతమందిని కాల్చాను, నాకే ఆశ్చర్యం! నిజంగా గుర్తులేదు. అదెప్పుడో అంతర్యుద్ధకాలంలో జరిగింది. బహుశా 70 కి 100 కి మధ్య వుండొచ్చు అయితే యేమిటి? అది బాగానేవుంది! దానికీ, రిచర్డ్ విషయానికీ సంబంధంలేదు. అవసరమైతే యివ్వాళకూడ అలాచేస్తాడు. విప్లవం, చివరికి నెం. 1 నే గద్దెమీద కూర్చోపెడుతుందని ముందుగా తెలిసి నప్పటికీ? అప్పుడుకూడ.

సిగరెట్ కాల్చుకుని గోడవైపు పొగవదల్తూ నిలబడి

వుంటాడు 402 నెంబరు. రుబషోవ్ సున్నపుగోడవైపే చూస్తూ నీతో పరిష్కరించుకోవలసింది నాకేమీ లేదు అనుకున్నాడు. నీకు నేనేమీ ఋణపడలేను. నీకు నాకుమధ్య సామ్యవిషయాలేమీ లేవు....సరే యిప్పుడేంకావాలి?

402 నెంబరు మళ్ళీ తట్టుతుంటే రుబషోవ్ గోడవద్దకెళ్ళాడు...'పొగాకుపంపుతున్నాను'అని విన్నాడు. తర్వాత వార్డరు దృష్టి నాకర్షించటానికి 402 నెంబరు తలుపు మీద కొడుతున్న చప్పుడు చాలా హీనంగా వినిపించింది.

రుబషోవ్ వూపిరి బిగపట్టి వింటున్నాడు; కొద్దినిమిషాల తర్వాత ముసలాడి తడబడుతున్న అడుగుల చప్పుడు వినిపించింది. 402 నెంబరు తలుపుతీయకుండానే రహస్యరంధ్రంలో నుంచి 'ఏంకావాలి ?' అని అడిగాడు.

402 నెంబరు యేంచెప్పాడో తెలుసుకోవాలనే కుతూహాలం వున్నప్పటికీ ఆమాటలు వినిపించలేదు. ముసలాడు రుబషోవ్ వినాలని బిగ్గరగా అంటున్నాడు.

'అలాంటివి కుదరవు; యిక్కడినిబంధనలకి వ్యతిరేకం.'

మళ్ళీచెప్పిన సమాధానం వినిపించలేదు. వార్డరు 'బూతులు తిడుతున్నావని రిపోర్టుచేస్తాను' అంటూ దొర్లుకుంటూ పోయాడు.

కొద్దిక్షణాలు నిశ్శబ్దంగా వుండి 402 నెంబరు తట్టాడు.

'నీ దురదృష్టం'

రుబషోవ్ మాట్లాడకుండా పచార్లు చేస్తున్నాడు. సిగరెట్ కోసం పిచ్చి యెక్కుతోంది. 402 నెంబరును గురించి ఆలోచిస్తూ, 'ఇంకా, మళ్ళీ ఆపని చేస్తాను. అది న్యాయం,

అవసరం, అయినా నీకు ఋణపడి వున్నానా? న్యాయం, అవసరమైన పనిచేసినా వాటికి మూల్యం చెల్లించాలా?' తనలో అనుకొన్నాడు.

గొంతు పొడారిపోతోంది; నుదురు నెప్పిగా వుంది; చిరాకుగా పచారు చేస్తున్నాడు. ఆలోచిస్తుంటే పెదవులు కదలు తున్నయ్.

సత్కార్యాలకు కూడ మూల్యం చెల్లించాలా? హేతువాదంకంటె భిన్నమైన వున్నత పరిమాణం యింకోటుందా? సత్పురుషుడుకూడ యీ రెండో పరిమాణపు దృష్ట్యా అపార ఋణభారం వహించాల్సొస్తుందా? ఎదుటివాళ్ళు చేసేది తమకు తెలియదుగనుక-యీ ఋణంద్విగుణీకృత మౌతుందా?

రుబషోవ్ కిటికీకి మూడో పెంకుమీద నిలబడి వున్నాడు, కదలకుండ.

'ఏమిటిదంతా? మతోన్మత్తావేశమా? కొద్ది నిమిషాలనుంచి తనలోతాను కొంచెం పైకి మాట్లాడుతున్నట్లు గ్రహించాడు. పెదవులు కదలటం గమనించినప్పటికీ, తనతో నిమిత్తం లేకుండానే,

'నేను చెల్లించాలి' అన్నయ్.

రుబషోవ్ అరెస్టయిన తర్వాత మొదటిసారిగా యిప్పుడు బెదరిపోయాడు. సిగరెట్లు కావాలి; లేవు.

అప్పుడు మళ్ళీ గోడమీద మెల్లగా శబ్దం వినిపించింది.

'తొర్రిపెదవివాడు నీకు అభివందనాలు పంపుతున్నాడు' అని తట్టాడు 402 నెంబరు.

పచ్చటి చర్మం, పైకి తిరిగిన మొఖం గుర్తుకొచ్చి నయ్. కాని ఆ సందేశం అశాంతిని కలిగించింది.

'అతని పేరేమిటి?' అని రుబషోవ్ అడిగాడు.

'అతను చెప్పడు, కాని నీకు అభివందనాలు పంపు తున్నాడు.' 402 నెంబరు సమాధానం.

## 12

మధ్యాహ్నం అయ్యేటప్పటికి రుబషోవ్ పరిస్థితి మరీ పాడుగావుంది. అప్పుడప్పుడు చలివొణుకులు వొస్తున్నయ్. పంటినొప్పి కూడ మళ్ళీ బాధపెడ్తోంది – కుడివైపు పిప్పిపన్ను సరిగా కంటినరాలకు సంబంధించివుంది. అరెస్టయినప్పటినుంచి యింతవరకు తినటానికేమీ లేకపోయినా, ఆకలికూడా కావటంలేదు. శక్తినంతా కూడదీసుకో ప్రయత్నించినా చలి వొణుకులు, సిగరెట్ కుతి, సాధ్యం కానివ్వలేదు. సిగరెట్ కోసం అమిత ఆరాటం, "నేను చెల్లించాలి" అనే వాక్యం, ప్రస్తుతం యీ రెండింటిచుట్టూ, వొకదాని తరువాత నొకటిగా అతని ఆలోచనలు సాగుతున్నయ్. పూర్వస్మృతులన్నీ ముసురుకొని, చెవుల్లోకూడ ప్రతిధ్వనించినయ్. ముఖాలు, గొంతులు కనిపించి, వినిపించి అదృశ్యమౌతున్నయ్; వాటిని యెక్కడ నిలుపుదామనుకున్నా అతనికి బాధనే కలిగిస్తున్నయ్; అతని గత చరిత్ర నెక్కడ తడివిచూచినా ప్రణాలు రేగి సలుపు పెడుతుంది. అతని గతమంతా వుద్యమం, పార్టీ; వర్తమాన, భవిష్యత్తులుకూడ పార్టీ గతిమీదనే ఆధారపడి

పెనవేసుకొని వున్నయ్; కాని అతని గతమంతా దానితో పెనవేసుకువుంది. మరి యిప్పుడా గతమే అకస్మికంగా శంకించబడుతోంది. పార్టీ ఆరోగ్యకరమైన శరీరం సలుపు పెడుతున్న వ్రణాల మయంగా, రక్త స్రావితమైన వాతలమయంగా కనిపిస్తోంది. చరిత్రలో యెక్కడైనా యెప్పుడైనా యిలాటి అపరిణత మహాత్ములున్నారా? ఎప్పుడైనా సత్కార్యం కలుషితంగా ప్రవర్తింప బడిందా? చరిత్ర సంకల్పం పార్టీలో మూర్తీభవించేటట్లయితే చరిత్రే కలుషితంగా వుందన్న మాట.

గదిగోడమీద యేర్పడిన తడి మచ్చల్ని సాలోచనగా చూచాడు. పక్కమీద దుప్పటి తీసి కప్పుకున్నాడు; చిన్న చిన్న అడుగులు త్వరితంగా వేస్తూ, పచారు వేగాన్ని హెచ్చించాడు. కాని వెన్నెముకలో చలివొణుకు మాత్రం తగ్గలేదు. చెవుల్లో అస్పష్టధ్వనుల రొణగొణలు వినిపిస్తూనే వున్నయ్; అవి వరండాలో నుంచి వస్తున్నయో, లేక తాను మతివిభ్రమణంతో బాధపడుతున్నాడో తెలుసుకో లేక పోయాడు. పిప్పిపన్ను బాధ తెగిన నరాల ఫలితంగా వస్తోందనుకున్నాడు. ఈ విషయం డాక్టరుతో వివరంగా చెప్పాలి. కాని యీలోపల చెయ్యాల్సిన పని చాలావుంది. పార్టీ అపరిణతస్థితికి కారణం తెలుసుకోవాలి. మన ముఖ్య సూత్రాలన్నీ సవ్యమైనవే. కాని ఫలితాలు మాత్రం అపసవ్యంగా వున్నయ్. ఇది వ్యాధిగ్రస్త యుగం. సూక్ష్మంగా పరిశీలించి ఆ వ్యాధి స్వరూప, స్వభావాలను, కారణాలను నొక్కుటుకవాసి తప్పులేకుండా కనిపెట్టాం; కాని యెక్కడ శస్త్ర ప్రయోగం చేయబోయినా యింకో క్రొత్త వ్రణం బయటపడుతోంది. మాది అచలిత పవిత్రసంక

ల్పం, ప్రజాభిమానం చూరగొని వుండాల్సింది. అయితే మమ్మల్ని ద్వేషిస్తారు. మేం యెందుకింత అసహ్యాంగా, నింద్యంగా వున్నాం ?

మేము మీకు నిజంచెప్పాం, అది మాం నోటినుంచి రావటంవల్ల అబద్ధమైంది. మీకు స్వాతంత్ర్యం తెచ్చాం, అది మా చేతుల్లో కొరడాలా కనిపించింది. మీకు సజీవజీవితం తెచ్చాం, మాగొంతు యెక్కడవినిపించినా పచ్చని వృక్షాలు యెండిపోయి యెండుటాకుల గల గల ధ్వనులు శృతికలిపి నయ్. రక్షిత భవిష్యత్తు వాగ్దానం చేశాం, కాని నాలుకలు నత్తిపడి మొరిగినట్లయింది....

ఒణికిపోయాడు. ఒకచిత్రం, కొయ్యచట్రంలో బిగించిన పెద్దఫొటోగ్రాఫ్ అతనికి మనోగోచరమైంది. పార్టీప్రథమ కాంగ్రెసు ప్రతినిధుల సమావేశం;కొంతమంది మోచేతులు బల్లమీద ఆనించి, కొంతమంది మోకాళ్ళమీద చేతులు పెట్టుకొని పొడుగాటి పెద్దకొయ్యబల్ల చుట్టూ కూర్చున్నారు; గడ్డాలతో, బుద్ధిమంతుల్లాగ ఫొటో కెమేరావైపు నిశ్చలంగా చూస్తున్నారు. వాళ్ల తలకాయలపైన అంకెవేసిన సున్నలు చుట్టివున్నయ్, ఆ సున్నల్లోని అంకెలు ఫొటో క్రింది భాగంలో అచ్చువేసిన పేర్లను సూచిస్తున్నయ్. ఆ సమావేశానికి అధ్యక్షత వహించిన ముసలివాడు బీటలువారిన టూర్టార్ జాతి కళ్ళతో చమత్కారంగా నవ్వుతూకూర్చున్నాడు, కానిమిగతా వాళ్ళంతా గంభీరమానముద్రవహించి కూర్చున్నారు. ముక్కద్దాలు పెట్టుకొని అతని ప్రక్కనే కూర్చున్నాడు రుబషోవ్. నెం. 1 నలుచదరంగా భార్గీగావుండి బల్లకు ఒకచివర మూల

కూర్చున్నాడు. వాళ్ళు ఒక పట్టణసంఘ సమావేశంలో లాగ వున్నారు. మానవచరిత్రలో ఒక మహావిప్లవ నిర్మాణంలో నిమగ్నమై వున్నారు. ఆ సమయంలో నూతన తరానికిచెందిన కొద్దిమంది వ్యక్తులుమాత్రమేవున్నారు; అంతా తత్వవేత్తలు. హోటళ్ళు వ్యాపార ప్రతినిధులకు యెంత పరిచితములో వీరికి యూరప్‌లో రాష్ట్రీయపట్టణాల్లోని జైళ్ళు అంత సుపరిచిత ములు. అధికార నిర్మూలనను అధికారంకోసం, పాలింపబడే అలవాటునుంచి ప్రజల్ని విముక్తుల్ని చేయటానికీ కలలుకనే వారు. వాళ్ళ భావనలు కార్యరూపందాల్చి స్వప్నాలు యదా ర్థాలైనయ్. వాళ్ళంతా యెక్కడున్నారు? ప్రపంచపుగతినే మార్చగలిగిన మేధావులందరూ తుపాకీ సీసపు గుళ్లకు యెర య్యారు; కొందరికి నుదురులో, కొందరికి మెడలో దూరాయ్. ఇద్దరు ముగ్గురుమాత్రం మిగిలారు, వాళ్లైనా ప్రపంచమంతటా చెదిరివున్నారు. ఇక తనూ; నెం. 1.

బిగుసుకుపోయి, సిగరెట్‌కోసం ఆరాటపడుతున్నాడు. ఈ సారి అతని మనస్సు బెల్జియందేశపు ఓడరేవు వద్దకెళ్లింది. ఉత్సాహవంతుడు లిటిల్ లోయీ రక్షకుడుగా అతన్ననుస రిస్తున్నాడు. లిటిల్ లోయీకి కొంచెం గూనివుంది, నావికుల చుట్టకాలుస్తాడు. ఆ నౌకాశ్రయంలో వచ్చే పెట్రోలు, కుళ్ళిన సముద్రపు పాచి వాసనల మిశ్రమ వాసన కొడుతోంది; ఆ పట్టణపు కచేరి సావడి గడియారపు శ్రావ్యమైన గంటల సం గీతం వినిపిస్తోంది; సముద్రపాయలవరకూ వచ్చిన యిరుకు బజార్లు కనిపిస్తున్నయ్. నౌకాశ్రయ ప్రాంతపు జారిణులు పగలు తడకలమీద ఆరేసినగుడ్డలు కనిపిస్తున్నయ్. ఈ

సంఘటన రిచర్డ్ వ్యవహారం జరిగిన రెండుసంవత్సరాల తర్వాత జరిగింది. వాళ్ళు తనకు వ్యతిరేకంగా యేమీ ఋజువు చేయలేకపోయారు. తనను వాళ్ళు చావ మోదినా, తన పళ్లు పీకివేసినా, చెవులు పాడుచేసినా, కంటద్దాలు పగలగొట్టినా నోరు మెదపలేదు. ప్రతిదానికీ కాదంటూ, మెదలకుండ అతి జాగ్రత్తగా, మొద్దుగా పడివున్నాడు. తనను బంధించిన నరక కూపంలో పచార్లు చేస్తూ, నేలమీద పరచిన రాళ్ళమీద దేకుతూ, భయపడుతూ, తన రక్షణ మార్గాన్ని ఆలోచిస్తు న్నాడు; అపస్మారక స్థితినుంచి చన్నీళ్లు తనను లేపినప్పుడు సిగరెట్ కోసం ఆరాటపడుతూ పడివుండేవాడు. అతన్ని హింసించిన వాళ్ళ ద్వేషాన్నిచూచి, తనవెందుకు అసహ్యించుకుంటారనే విషయాన్ని గురించి ఆరోజుల్లో ఆశ్చర్యపడేవాడు కాదు. నియంతృత్వపు చట్టయంత్రం తన కరాళదంష్ట్రిలను నూరింది, కాని తనకు వ్యతిరేకంగా యేమీ ఋజువు చెయ్యలేకపోయింది. విడుదలకాగానే తన స్వదేశానికి – విప్లవ భూమికి విమానంలో తీసుకెళ్ళారు. అక్కడ బ్రహ్మాండమైన స్వాగతాలు, బహిరంగ సభలు, సైనిక విన్యాసాలు జరిగినయ్. నెం. 1 కూడ యెక్కడ పడితే అక్కడ తనతో వుండేవాడు.

అతను కొన్ని సంవత్సరాలనుంచి స్వదేశంలో లేడు; యిప్పుడు చూస్తే చాల మారిపోయింది. ఫొటోగ్రాఫ్‌లో వున్న గడ్డాల వాళ్ళల్లో సగంమంది యిప్పుడు లేరు. వాళ్ళ పేర్లుకూడ తలవకూడదు, తలిస్తే తిట్లు, శాపనార్థాలతోనే. అదే సమయంలో కీర్తిశేషుడైన టార్టార్ కళ్ళ ముసలి నాయకుణ్ణి తప్ప యెవర్ని తలచినా అదేగతి. ఆ నాయకుడు దైవపిత

గానూ, నెం. 1 అతని కుమారుడుగానూ పూజింపబడుతు న్నారు; ఆ వారసత్వ సంపాదనకోసం ముసలివాడినుంచి పొందిన పీలునామా నెం. 1 ఫోర్జరి చేశాడని ప్రతి-చోటా గుసగుసలు వినిపించినయ్. ఫోటోగ్రాఫ్‌లోవున్న గడ్డాల వాళ్ళల్లో పోగా మిగిలినవాళ్ళని గుర్తించటానికి పీలులేకుండా వుంది. మున్నటి గడ్డాలతో క్షీణించిపోయి, దుర్భ్రమతో, నిరాశాపూరిత కల్లోలితమనస్సులతో వూగులాడుతున్నారు. నెం. 1 యిందులోనుంచి ఒక్కొక్కళ్ళ్ని యేరి పారేస్తున్నాడు. అప్పుడు వాళ్ళంతా గుండెలు బాదుకొని పాపాలకు పశ్చాత్తాప శోక గేయాల్ని మూకగా ఆలాపిస్తుంటారు. ఒక పదిహేనురోజుల తర్వాత, యింకా తాను చంక కర్రలమీద నడుస్తున్నప్పటికీ రుబషోవ్‌ని నూతన కార్యార్థం విదేశాలకు వెళ్ళనున్నారు. నెం. 1 చుట్ట పొగమేఘాల వెనకనుంచి చూస్తూ 'నీవు కొంచెం తొందరగ పడుతున్నట్టున్నావు' అన్నాడు. ఇరవై సంవత్సరాల పార్టీ సహచరత్వం తర్వాత కూడ వాళ్ళిద్దరూ యేదో పాతమర్యాద పద్ధతిలోనే వున్నారు. నెం. 1 తలపైగా ముసలి నాయకుని చిత్రం, ప్రక్కనే మిగతా వాళ్ళందరి సమూహచిత్రం వున్నాయ్. కాని ప్రక్కనున్న ఫోటో యిప్పుడు లేదు. ఈ చిత్రనాటకం కొద్ది నిమిషాల పాటు జరిగింది; చివరకు రుబషోవ్ వెళ్ళేటప్పుడు నెం. 1 చిత్రమైన వొత్తిడితో కరస్పర్శ చేశాడు. రుబషోవ్ ఆ తర్వాత చాలసేపు యీ కరచాలనాంతరార్థం, పొగమేఘాల వెనక నుంచి చూచిన నర్మాంతక చూపుల విషయమే దీర్ఘంగా ఆలోచించాడు. అప్పుడు చంకకర్రలమీద గెంతుకుంటూ

బయటికొచ్చాడు; బయటికొచ్చేటప్పుడు నెం. 1 వాకిలివర కైనా సాగనంపలేదు. మరునాడే బెల్జియం బయలుదేరాడు.

నావమీద వుండగానే కొంచెం కోలుకున్నాడు. తన కర్తవ్యాన్ని గురించి ఆలోచించాడు. తాను వెళ్ళగానే లిటిల్ లోయీ కలుసుకోవటాని కొచ్చాడు. అతను పార్టీ "ఓడ కార్మిక శాఖకు" స్థానిక నాయకుడు. మొదటి చూపుతోనే రుబషోవ్‌కి అతనంటే యిష్టం కలిగింది. తనసృష్టే అయినట్టు గర్విస్తూ రుబషోవ్‌కి నౌకా నిర్మాణపు కర్మాగారాలు, రేవు ప్రాంతపు వంకరసందులు చూపించాడు. ప్రతిచోటా నావికులు, ఓడకార్మికులు, జాలరులు అందరు పరిచయమయ్యారు; ప్రతిచోటా పానీయాలు యిచ్చారు, వాళ్ళందరికీ తాను పొగత్రాగే గొట్టం -పైప్- తోనే అభివాదాలు చేశాడు. చివరికి మార్కెట్ దగ్గర రహదారి రక్షకభటుడు కూడ వాళ్ళు ఆవైపుగా వెళ్తోంటే అభివాదంచేశాడు. విదేశీ ఓడల్లో వున్న విదేశీప్రయాణీకులు తమ భక్త్యుత్సాహాల్ని ప్రదర్శించటానికి అతని వికృత భుజాలమీద తట్టారు. రుబషోవ్ యిదంతా స్వల్ప విస్మయంతో తిలకించాడు. లోయీ యదార్థంగా నిందార్హుడు, అసహ్యమైనవాడూ కాదు. ఈ పట్టణంలోవున్న ఓడ కార్మికశాఖ ప్రపంచంలో బలీయమైన నిర్మాణ స్థాయిలోవున్న పార్టీ శాఖల్లో ఒకటిగా వుంది.

ఆ సాయంకాలం రుబషోవ్, లిటిల్ లోయీ, యింకా యిద్దరు కలిసి నౌకాశ్రయ ప్రాంతపు పానశాలల్లో ఒక దాంట్లో కూర్చున్నారు అందులో ఆశాఖ నిర్మాణకార్యదర్శి పాల్ అనే వాడున్నాడు; అతను లోగడ కుస్తీవస్తాదు, బట్ట

తల, స్ఫోటకపు మచ్చలముఖం, పెద్ద చెవులు వున్నయ్. కోటుకిరింద నావికుల నల్ల రంగు స్వెట్టరు, నెత్తికి నల్లటి బౌలర్ వున్నయ్. చెవులు ఆడించి నెత్తినున్న బౌలర్‌ను పైకెత్తి మళ్ళీ పెట్టుకోగల నేర్పుంది. అతన్తో బిల్ అనేవాడొకడున్నాడు. ఇతను నావికుల జీవిత విశేషాలతో ఒక నవల వ్రాశాడు. ఒక పాతనావికుడు. నవల వ్రాసినప్పుడు ఒక సంవత్సరంపాటు చాల ప్రసిద్ధిచెందాడు; కాని వెంటనే మరుగున పడిపోయాడు. ప్రస్తుతం పార్టీపత్రికలకు వ్యాసాలు వ్రాస్తున్నాడు. మిగతావాళ్ళు నౌకాశ్రయ కార్మికులు, భారీ మనుషులు, అతి త్రాగుబోతులు. కొత్తవాళ్ళు వస్తున్నారు; కొందరు బల్ల దగ్గర కూర్చుంటున్నారు; కొందరు నిలబడి వుంటున్నారు. ఒకవరస త్రాగుతున్నారు, మళ్ళీ సోమరిగా తిరుగుతున్నారు. ఆ పాకలోని లావుపాటి దుకాణదారు తనకు ఖాళీ దొరికినప్పుడల్లావచ్చి బల్లదగ్గర కూర్చుంటున్నాడు. అతను నోటివాద్యం బాగా వాయించగలడు. వాళ్ళంతా అధికంగా త్రాగారు.

లిటిల్ లోయీ వాళ్ళందరికీ రుబషోవ్‌ని పైనుంచి వచ్చిన కామ్రేడ్‌గా యెక్కువ వ్యాఖ్యానంలేకుండ పరిచయం చేశాడు. లిటిల్ లోయీ ఒక్కడికే రుబషోవ్ పోలికలు తెలుసు. అక్కడపోగైన వాళ్ళకి రుబషోవ్ మాట్లాడేస్థితిలో వున్నట్లూ, లేనట్లూకూడ తెలియక అతన్ని యెక్కువ ప్రశ్నలు వేయలేదు. అడిగినవాళ్ళుకూడ 'అక్కడ' జీతాలు, భూసమస్యలు, పారిశ్రామికాభివృద్ధికి సంబంధించిన ప్రశ్నలుమాత్రమే

అడిగి వూరుకున్నారు. ప్రతి సాంకేతిక వివరణ పట్ల వాళ్ళు తమవిస్మయాన్ని ప్రకటించారు. 'అక్కడ' వున్న జీవిత పరిస్థితులు, రాజకీయ వాతావరణం గురించీ కూడ యేమీ తెలియదు. చిన్నపిల్లలు కానాన్‌లో-పాలస్తీన్ దేశపు స్వర్గలోకం-ద్రాక్షపళ్లు యెంతపెద్దవి అని అడిగినట్లుగా, 'అక్కడ' తేలికలోహపు పరిశ్రమలో వుత్పత్తి అభివృద్ధి యెలావుందని అడిగారు. లిటిల్ లోయీ త్రాగటానికి పిల్చేవరకూ సారాబట్టీ దగ్గరే యేమీ త్రాగకుండా నిలబడివున్న ముసలి నౌకాశ్రయ కార్మికుడు రుబషోవ్‌తో కరస్పర్శచేసి 'మీరు అచ్చంగా పాత రుబషోవ్‌లాగనే వున్నారే' అన్నాడు. 'అందరూ అలాగే అంటుంటారు' అన్నాడు రుబషోవ్. గ్లాసు ఖాళీచేస్తూ 'పాత రుబషోవ్, మీకోసం ఒక మనిషి వచ్చాడు' అని చెప్పాడు ముసలాడు. అప్పటికి రుబషోవ్ విడుదలై నెలైనాకాలేదు. తాను బ్రతుకుతాననే నమ్మకం కలిగి ఆరువారాలే అయింది. లావుపాటి దుకాణదారునోటివాయిద్యం వాయిస్తున్నాడు. రుబషోవ్ సిగరెట్‌ముట్టించి అందరికీ ఒకవరస అర్దరిచ్చాడు. వాళ్లు అతని క్షేమం, 'అక్కడి'వాళ్ళక్షేమం కోరుతూ త్రాగారు. కార్యదర్శి పాల్ ,నెత్తిమీద బౌలర్‌ను క్రిందికీ పైకీ ఆడించాడు.

ఆ తర్వాత లిటిల్ లోయీ, రుబషోవ్‌లు యిద్దరూ, కొంతసేపు ఒక చిన్న హోటల్‌కెళ్లి కూర్చున్నారు. ఆ సమయంలో ఆ హోటలు యజమాని కుర్చీలు సర్ది దీపాలు తగ్గించి తన స్థానంలోనే కూర్చుని కునికిపాట్లు పడుతున్నాడు. రుబషోవ్‌కి లిటిల్ లోయీ స్వీయ జీవితగాథ వినిపిస్తున్నాడు. రుబషోవ్ చెప్పమని అడగలేదు; మరునాటి సంఘటనల తీవ్ర

తను వ్రూహించాడు వెంటనే. అక్కడి కామ్రేడ్ లందరూ తను జీవిత గాథలను వినిపించాలని కుతూహల పడితే అతనేం చెయ్యగలడు? వెళ్ళిపోవాలనుకున్నాడు; కాని చాల అలిసి వ్రుండి – తనశక్తే తనకు తెలియక వెళ్ళగల ననుకున్నాడు – కదల్లేక, కూర్చుని విన్నాడు.

ఆదేశపు భాష బాగా మాట్లాడగలిగి, అక్కడి వాళ్ళంద ర్నీ బాగా ఎరిగివున్నప్పటికీ అతను ఆదేశపు వాడు కాదని తేలింది. అతను దక్షిణజర్మనీలో పుట్టాడు, వడ్రంగిపని నేర్చుకున్నాడు, గైటర్ – వీణలాంటి వాద్యం – వాయించే వాడు, విప్లవోద్యమ యువక క్లబ్బు సభ్యుల ఆదివారాల విహార సమావేశాల్లో డార్విన్ పరిణామ సిద్ధాంతం మీద వుపన్యాసాలిచ్చేవాడు. నియంత రాజ్యాధిపత్యం హస్తగతం చేసుకునే ముందునెలల్లో యేర్పడిన కల్లోల సమయంలో పార్టీకి అత్యవసరంగా ఆయుధాలు కావలసి వచ్చినయ్; అప్పుడా పట్టణంలో సాహసోపేతమైన పన్నుగడ జరిగింది. ఒక ఆదివారం నాటి మధ్యాహ్నం బాగా జనసమ్మర్దంవున్న ప్రాంతంలోని పోలీసు ఠాణాలోనుంచి కొయ్య సామాన్లు జేరవేసే లారీలో యాభై రైఫుళ్ళు, యిరవై రివాల్వర్లు రెండు చిన్న మిషన్‌గన్లు, కొంత మందుసామాగ్రి వేసుకుపోయారు. ఆ లారీలో వచ్చినవాళ్ళు అధికారముద్రలున్న కాగితాలు చూపించి, యిద్దరికి పోలీసు దుస్తులువేసిఆ ఆయుధాలు తీసుకు పోయారు. ఆ తర్వాత యింకో పట్టణంలో ఒక పార్టీ సభ్యు డింట్లో సోదాచేసినప్పుడే ఆయుధాలు వగైరా దొరికినయ్. ఈ సంఘటన వివరాలు యెప్పటికీ వివరించలేము; కాని వెం

టనే లిటిల్ లోయీ అక్కడనుంచి అదృశ్యమయ్యాడు. పార్టీ అతనికి రహదారి అనుమతి పత్రం, పోలిక పత్రాలు యివ్వటానికి వాగ్దానం చేసింది; అయినా ఆ యేర్పాటు భంగమైంది అంటే అనుమతి పత్రం, డబ్బు తేవటానికి నియమింపబడిన పార్టీ వున్నతవర్గ కామ్రేడ్ నిర్ణీతకాలంలో, నియమిత ప్రాంతంలో మళ్ళీ కనిపించలేదు.

'మనకి సాధారణంగా యెప్పుడూ అలాగే జరుగుతుంది' అన్నాడు లిటిల్ లోయీ వైరాగ్యంతో. రుబషోవ్ మొదలకుండా వూరుకున్నాడు.

అలా జరిగినప్పటికీ లిటిల్ లోయీ యెలాగో వెళ్ళిపోయాడు. కాని సరిహద్దు దాటటానికి ప్రయాసయింది. అప్పటికే అతని, అపిటి భుజంతో, ఫొటోలు ప్రతి పోలీసు ఠాణాలోనూ వుంచారు. వారంటు పుట్టింది, తీవ్రంగా వెదుకుతున్నారు. అందువల్ల చాలా కాలం దేశమంతా తిరగవలసొచ్చింది. పార్టీవున్నతవర్గ కామ్రేడ్‌ను కలుసుకోడానికి బయలుదేరే టప్పటికి, మూడురోజులకు సరిపోయే భత్యాపు డబ్బులు మాత్రమే మిగిలాయ్. 'చెట్టుబెరడు తిని వుండొచ్చు అనే విషయం పుస్తకాల్లో నేవ్రాసివుంటుందనుకొనే వాణ్ణి, కాని లేత ప్లేన్ చెట్లబెరడు రుచిగా వుంటుంది.' అంటూ మొత్తిపొడిచాడు. ఆ స్మృతి కౌంటర్ వద్దకెళ్ళి రెండు మాంసపు కూర ముక్కలు తెచ్చుకొని తినేటంత బలీయంగా ప్రోత్సహించింది. ఆ ముక్క తింటూండగా రుబషోవ్‌కి జైలుపులుసు, నిరాహార సమ్మెలు గుర్తుకొచ్చినయ్.

చివరికి యెలాగైతే నేం లిటిల్ లోయీ ఫ్రెంచి సరిహద్దు

పాటాడు. అతనిదగ్గర రహదారి అనుమతి పత్రంలేదు; కాబట్టి కొద్దిరోజుల్లోనే అరెస్టయ్యాడు. అయినా తనకైతాను యింకో దేశం వెంటనే వెళ్ళిపోవాలని చెప్పి విడుదలచేశారు. 'చంద్రమండలానికెగరమని చెప్పినట్లయింది' అన్నాడు లోయీ. పార్టీసహాయాన్ని అర్థించాడు; కాని ఆదేశంలో పార్టీ అతన్నెరగదు గనుక ముందు అతనిస్వదేశపు పార్టీకి వ్రాసి వివరాలు తెలుసుకోవాలని చెప్పారు. ద్రిమ్మరిగా తిరుగుతున్నాడు; కొద్దిరోజుల తర్వాత అరెస్టుచేసి మూడు నెలలు జైలుశిక్ష విధించారు. జైల్లో తన సహచరుడికి—యింకో ద్రిమ్మరి—క్రిందటి పార్టీ కాంగ్రెసు తీర్మానాలను గురించి వుపన్యాస పరంపర దంచాడు. అందుకు ప్రతిఫలంగా పిల్లుల్ని పట్టి వాటితోళ్ళుఅమ్మి బ్రతికే విధానం వివరించా డా రెండోవాడు. మూడు నెలల శిక్ష అనంతరం ఒకనాటిరాత్రి బెల్జియం సరిహద్దులోని అడవికి తీసుకెళ్ళి, కాపలా సైనికులు రొట్టె, జున్ను, ఒక పెట్టె ఫ్రెంచి సిగరెట్లుయిచ్చి 'సరాసరి వెళ్లిపో, అరగంటలో బెల్జియం వెళ్లిపోగలవు, యీసారిమళ్ళీ యీదేశంలో కనిపించావా తల పగలకొట్టాం' అని చెప్పారు.

చాలా వారాలపాటు లిటిల్ లోయీ బెల్జియంలో తిరిగాడు. మళ్ళీ పార్టీ సహాయాన్నర్థిస్తే ఫ్రాన్సులో వచ్చిన సమాధానమే వచ్చింది. ప్లేను చెట్లు సమృద్ధిగా వున్నయ్. గనుక, పిల్లుల వ్యాపారం ప్రయత్నించాడు. పిల్లుల్ని పట్టటం కొంత సులభమే, గజ్జి, అదీ లేకుండా వున్న లేతపిల్లుల చర్మం అమ్మితే సగంరొట్టె, ఒక పొగాకు పొట్లాం కొనటానికి సరిపోతుంది. ఏహ్యమైన పనొకటి చెయ్యాలి. పిల్లి

చెప్పుల్ని ఒకచేత్తో, తోక నొక చేత్తో పట్టుకొని మోకాలి మీద కొట్టి దాని నడుం విరగ్గొట్టి చంపాలి. మొదట్లో అలా చేయటానికి చీదరగా వుంటుంది; కాని తర్వాత అలవాటయి పోతుంది. అయితే దురదృష్టవశాత్తు కొద్ది వారాలకి లోయీ అరెస్టయ్యాడు. బెల్జియంలో కూడ పోలిక పత్రాలు కావాలి. ఆతర్వాత వెళ్ళగొట్టటం, విడుదల, రెండో అరెస్టు, జైలు లన్నీ వరసనే జరిగాయ్. ఒకనాటిరాత్రి బెల్జియం కాపలా సైనికులు సరిహద్దులోని అడవికి తీసికెళ్ళి రొట్టె, జున్ను, బెల్జియం సిగరెట్లు యిచ్చి 'సరాసరి వెళ్లిపో, అరగంటలో ఫ్రాన్సు వెళ్లిపోతావు. మళ్ళీ యీ దేశంలో కనపడ్డావా తల పగలగొట్టేస్తాం' అని చెప్పారు.

ఒక్క సంవత్సరంలో మూడుసార్లు అటూ యిటూ సరిహద్దుల్ని దొంగతనంగా దాటుతూ తిరిగాడు, ఫ్రెంచి, బెల్జియన్ అధికారుల సహాయ సానుభూతులతో. ఈవిధంగా యిప్పటికి అనేక వందలమంది కీగతిపట్టినట్లు తెల్సుకొన్నాడు. ఇంకా కొన్ని సంవత్సరాలు యీ విధంగానే సాగేదీ నాటకం. ఉద్యమంతో తన సంబంధం యెక్కడ తెగిపోతుందో ననే భయంతో పదే పదే పార్టీని అభ్యర్థించాడు. ఎప్పటి కప్పుడు 'నీ రాకనుగురించి మీ పార్టీ యేమీ వ్రాయలేదు. మాకు సమాధానం వచ్చేవరకూ ఆగవలసిందే. నిజంగా నీవు పార్టీ సభ్యుడవైతే పార్టీ శిక్షణకు కట్టుబడివుండు' అంటూం డేది. ఈలోపున సరిహద్దులు దాటుతూ పిల్లుల వ్యాపారం సాగిస్తుండేవాడు. స్వదేశంలో నియంతృత్వం ప్రవేశించింది కూడ. ఇంకో సంవత్సరం గడిచేటప్పటికి, ప్రయాణాల్ల అలసట

నల్ల రక్తం కక్కటం, పిల్లుల కలలు రావటం మొదలైంది. అతను ముట్టుకొన్న ప్రతిదీ, సిగరెట్, భోజనం, చివరికి తనకి ఆశ్రయమిచ్చిన ముసలి జారిణులుకూడ పిల్లి వాసన కొడుతున్నట్టుండేవి. అప్పటికీ 'మాకింకా యేమీ సమాధానం రాలేదు' అని చెప్పింది పార్టీ. ఇంకో సంవత్సరం గడిచేటప్పటికి లోయీని గురించి చెప్పగలిగిన కామ్రేడ్స్, హత్య చేయబడి, జైళ్ళకు పోయి, పారిపోయి ఒక్కడూ మిగలలేదు. 'నీకు మేం చెయ్యగలిగిందేమీ లేదు. నీవు పార్టీ అనుమతి లేకుండా రాకూడదు. ఒకవేళ పార్టీ కిష్టంలేకుండా వచ్చావేమో, మాకేం తెలుసు? ఈరోజుల్లో చాలమంది గూఢచారులు, ఆందోళనకారులు పార్టీలో కొస్తున్నారు. మా జాగ్రత్తలో మేం వుండాలి' అన్నది పార్టీ.

'ఇదంతా నాకెందుకు చెప్తున్నావ్?' అనడిగాడు రుబషోవ్. ఇంతకుముందే వెళ్ళిపోతే బాగుండేదనుకున్నాడు.

పీపానుంచి బీర్ తెచ్చుకొని కూర్చున్నాడు. 'ఎందుకంటే యిందులో తెలుసుకోవలసిన విషయాలున్నయ్. ఇదొక చక్కని వుదాహరణ. ఇలాగే కొన్ని వందలమంది అనుభవాలు చెప్పగలను. కొన్ని సంవత్సరాలనుంచి మంచి మంచి వాళ్ళంతా యీవిధంగా అణగారి పోతున్నారు. పార్టీ అంతకంతకూ మరీ శిలారూపం ధరిస్తోంది. పార్టీ ప్రతి అవయవానికి వాతంతగిలి నరాలన్నీ అస్తవ్యస్తంగా వుబ్బినయ్. ఆవిధంగా విప్లవం విజయవంతం కాదు.'

నీకంటే నేను చాల యెక్కువ చెప్పాలను అనుకున్నాడు రుబషోవ్, కాని యేమీ చెప్పలేదు.

'ఎలాగైతే నేం తలవని తలంపుగా అతనికథ సుఖాంత మైంది. అనంతంగా చేస్తున్న జైలు ప్రయాణాల్లో కుస్తీవస్తాదు పాల్ సాహచర్యం లభించింది. పాల్ అప్పుడు నౌకాశ్రియ కార్మికుడుగా పనిచేస్తున్నాడు. సమ్మె జరిగినప్పుడు తన పూర్వవృత్తి స్మృతికొచ్చిపోలీసుమీద తన కుస్తీపట్టు ప్రయోగించాడు, తత్ఫలితంగా జైలువాసం. ఈ పట్టుప్రకారం మొదటివాడి వెనకనుంచి చంకల్లోగుండా చేతులుపెట్టి మెడ మీదకు తెచ్చి వ్రేళ్ళతో బిగించి మెడమొముక విరిగే పర్యంతం ముందుకు నొక్కాలి. గోదాంలో యెప్పుడూ యీ పట్టు విజయం తెచ్చేది. కాని వర్గ పోరాటంలో యిటువంటి పట్లు యెందుకు ప్రయోగించరా అని అతని విచారం. లిటిల్ లోయీ, పాల్ యిద్దరూ స్నేహితులయ్యారు. పార్టీ నౌకాశ్రయ కార్మికశాఖకు నిర్మాణ కార్యదర్శిగా పనిచేస్తుండే వాడు, వాళ్ళు బయటికొచ్చిన తర్వాత లోయీకి అనుమతి పత్రాలు, అతనికి పని సంపాదించి పెట్టాడు పైగా పార్టీలో మళ్ళీ స్థానం యేర్పరిచారు. ఆవిధంగా మళ్ళీ నౌకాశ్రయ కార్మికులికి డార్విన్ పరిణామ సిద్ధాంతంమీద, క్రిందటిపార్టీ కాంగ్రెసుమీద వుపన్యాసాలివ్వటం సాగించాడు. అప్పటి వరకూ యేమీ జరగనట్లే ప్రవర్తిస్తున్నాడు. పిల్లుల్ని, పార్టీ శాసితులపై కోపాన్ని మర్చిపోయి సుఖంగా వుంటున్నాడు. ఒక ఆరునెలలయిన తర్వాత స్థానిక శాఖకు రాజకీయ కార్యదర్శి అయ్యాడు. సుఖాంతమయే ప్రతిదీ సుఖాంతంగానే వుంటుంది.'

రుబషోవ్ పెద్దవాడై, అలసిపోయినట్లుగా భావించు

కొని ఆ విషయం సుఖాంతంగావాలని హృదయపూర్వకంగా వాంఛించాడు. తాపక్కడికే కార్థ్యాగ్రం పంపబడిందీ స్పష్టంగా తెలుసు కాని అతనికి తెలియనివిప్లవ ధర్మం ఒకటివుంది. ఆత్మ పంచన. లిటిల్ లోయీ వైపు అద్దాల్లోంచి నిదానంగా చూచాడు. ఆచూపు అంతరార్థమేమిటో లోయీకి అర్థంకాక కొంచెం తికమక పడి చిరునవ్వుతో చుట్టగొట్టంతో అభివాదం చేశాడు. రుబషోవ్ పిల్లల్ని గురించి ఆలోచిస్తున్నాడు. అతని నరాలు పట్టుతప్పుతున్నయ్, అధిక శ్రాగుడువల్ల లిటిల్ లోయీని చెవులూ కాళ్లూ పుచ్చుకొని మోకాలిమీద వేసి నడుం, అవిటి భుజం విరగ్గొట్టాలనే ప్రబల వాంఛను అణచుకోలేక భయపడుతున్నాడు. ఏమీ బాగుండక వెళ్లిపోయాడని భావించి, మర్యాదగా, మెదలకుండా వూరుకొని యింటికి రుబషోవ్ని అనుసరించాడు. ఒక వారం రోజుల తర్వాత లిటిల్ లోయీ వురిబెట్టుకొని చచ్చిపోయాడు.

ఆ సాయంకాలానికీ, లోయీ మృతికీ మధ్య పార్టీ సెల్ సమావేశాలు చాల జరిగాయి. జరిగిన విషయాలు చాల సామాన్యమైనవే. యూరప్ మధ్యభాగంలో క్రొత్తగా యేర్పడిన నియంతృత్వాన్ని రాజకీయ, ఆర్థిక బహిష్కరణలతో వ్యతిరేకించమని రెండు సంవత్సరాలక్రితం పార్టీ ప్రపంచకార్మిక వర్గాన్ని ఆదేశించింది. శత్రుదేశంనుంచి వచ్చే వస్తు సముదాయాన్ని కొనకూడదు. ఆయుధోత్పత్తికి సంబంధించిన వస్తువుల్ని ఆ దేశానికి తీసుకుపోయే ఓడల్ని వెళ్ళనివ్వకూడదు,

అత్యుత్సాహంతో కార్మికులు పార్టీ ఆదేశాలను పాటించారు. ఈ చిన్న రేవు పట్టణంలోని కార్మికులు ఆదేశాన్నుంచి వచ్చి పోయేవస్తువుల్ని ఓడల్లో నింపటానికి, దింపటానికి నిరాకరించారు. ఇతర కార్మిక సంఘాల్లోకూడ వీరితో సహకరించారు. సమ్మెచాలా కష్టంగా సాగుతోంది. చివరకు పోలీసులతో ఘర్షణ ఫలితంగా గాయాలు, చావులు కలిగాయ్. సల్లటి పాతరకపు విచిత్రమైన సరుకుల ఓడలు ఆ రేవులో కొచ్చినప్పుడు సమ్మె ఫలితాలు అసందిగ్ధంగానే వున్నయ్. ఆ ఓడలమీద ప్రతిదాని మీద విప్లవనాయకులపేర్లు 'పైన అక్కడి' భాషలో వ్రాసి వున్నయ్. విప్లవజెండా యెగురుతోంది. సమ్మెకార్మికులు వుత్సాహంతో ఆ పడవలికి అభివాదం తెలిపారు. వెంటనే అందులోని సరుకుల్ని దింపప్రారంభించారు. కొన్నిగంటలైన తర్వాత ఆ సరుకు ఆయుధోత్పత్తికి పనికివచ్చే అపురూపమైన లోహం అయినట్లూ, శత్రుదేశానికి అవివెళ్ళవలసి వున్నట్లూ బయటపడింది.

ఆ వెంటనే పార్టీ నౌకాశ్రయ కార్మికశాఖ సమావేశమై కొట్లాటతో ముగిసింది. ఆ వివాదం, వుద్యమంలో దేశమంతా, వ్యాపించింది. అభివృద్ధినిరోధకుల పత్రికలు యీ సంఘటనను వుపయోగించుకొని గేలిచేసినయ్. పోలీసులు సమ్మెను భగ్నం చేసే ప్రయత్నాన్ని విరమించుకొని ఓడల్లో సరకుల్నిదించుతారోలేదోకార్మికుల్నే నిర్ణయించుకోమన్నారు. పార్టీ నాయకత్వం సమ్మెను విరమించి సరుకుల్ని దించమని ఆదేశించింది. వాళ్లు విప్లవదేశ ప్రవర్తనను సమర్థించటానికి చెప్పిన సహేతుక కారణాలు, యుక్తియుక్తమైన వాదనలు

కొద్దిమందినే వొప్పించాయ్. ఆ శాఖ చీలిపోయింది. పాత సభ్యులు చాలమంది విడిపోయారు. చాలా కాలం పార్టీ ఛాయా మాత్రంగా నిలిచింది. కాలక్రమేణ పారిశ్రామిక మాంద్యం యెక్కువైనకొద్దీ మళ్ళీ పూర్వపు శక్తినీ, పలుకుబడినీ పుంజుకొంది.

రెండు సంవత్సరాలు గడిచాయ్. దక్షిణ యూరప్‌లో యింకో అకలిగొన్న నియంత ఆఫ్రికాలో దోపిడి సామ్రాజ్య యుద్ధాన్ని సాగిస్తున్నాడు. మళ్ళీ పార్టీ వస్తునిషేధాన్ని ఆదేశించింది. ఇదివరకు కంటే యీసారి మరింత వుత్సాహంతో కార్మిక వర్గం వుద్యమంలో పాల్గొన్నది. ఈసారి దాదాపు ప్రతిదేశంలోనూ ప్రభుత్వాలే దురాక్రమణదారీ దేశానికి ముడిసరకులు పంప నిరాకరించాయ్.

ముడి పదార్థాలు లేకుండా, ముఖ్యంగా పెట్రోలు లేకుండా యుద్ధం సాగటం పూర్తిగ అసాధ్యమే. మళ్ళీ నల్లటి విచిత్రపు సరకుల ఓడలు వచ్చేటప్పటికి వున్న పరిస్థితిఅది. అందులోవున్న పెద్ద ఓడమీాద యుద్ధాన్ని తీవ్రంగా వ్యతిరేకించి హత్యచేయబడిన ప్రసిద్ధ వ్యక్తిపేరు వ్రాసివుంది. పైన విప్లవపతాక యెగురుతోంది. లోపల దురాక్రమణదారుకు పెట్రోలున్నది. గమ్యం చేరటానికి రేపునుంచి వొకరోజు ప్రయాణం చాలు. లిటిల్‌లోయీాకి, అతని అనుచరులకు ఆ ఓడల రాకలను గురించి తెలియను. రాబోయే సంఘటనకు వాళ్ళను తయారు చేయవలసిన బాధ్యత రుబషోవ్‌ది.

మొదటి రోజున యేమీా మాట్లాడకుండ పరిస్థితిని గమనించాడు. రెండోరోజు వుదయాన పార్టీ సమావేశపు

గదిలో చర్చ ప్రారంభించాడు.

ఆ గది చాల పెద్దది. చిందర వందరగా, అశ్రద్ధగా పడేసిన సామాన్లతో అసహ్యంగా వుంది. సాధారణంగా ప్రపంచంలో వున్న ప్రతి పార్టీ కార్యాలయం అలాగే వుంటుంది. కొంతవరకు ఆర్థిక స్థితి కారణమైనప్పటికీ, ముఖ్యంగా వనవాస, చింతాక్రాంత సాంప్రదాయమే కారణం. గోడలన్నీ యెన్నికల ప్రచార పత్రాలు, నినాదాలు, టైపుచేసిన నోటీసు కాగితాలతో నిండివున్నయ్. ఒక మూల దుమ్ము కొట్టుకున్న పాతడూప్లికేటరుంది. ఇంకో మూల సమ్మె సమయాల్లో సమ్మెదార్ల కుటుంబాల కివ్వటాని కుద్దేశింపబడ్డ పాతగుడ్డల మూట వుంది. దానికి ప్రక్కనే పాతవైపోయిన కరపత్రాలు, చిన్న చిన్న పుస్తకాల కట్టలున్నయ్. రెండేసి కోళ్ళమీద దిగేసిన చట్రాలు రెంటి మీద రెండు బల్ల చెక్కలు నిలువుగా దిగగొట్టిన బల్ల ఒకటి గది మధ్యలో వుంది. అసంపూర్ణంగా కట్టిన కట్టడానికి పూసిన రంగులాటిది కిటికీలకు పూశారు. బల్లపైన ఒక ఎలక్ట్రిక్ బల్బు వ్రేలాడుతోంది. దాని ప్రక్కనే పురుగుల్ని పట్టే జిగురు కాగితం వ్రేళ్ళాడుతోంది. బల్లచుట్టూ గూని లోయీ, పాత వస్తాదు పాల్, గుమాస్తా బిల్, యింకా ముగ్గురు కూర్చునివున్నారు.

రుబషోవ్ కొంతసేపు మాట్లాడాడు. ఆ వాతావరణం పరిచయమైనదే, వాళ్ళ సాంప్రదాయక అపరిశుభ్రత అతనికి సరిపడింది. ఆ వాతావరణంలో వుండి తన రాకయొక్క అవసరం, ప్రయోజనం విషయమై పూర్తిగ అంగీకరించాడు. కాని క్రిందటి సాయంకాలం సారా దుకాణంలో యెందుకు

విసుగు జెందాడో అర్థం కాలేదు. యదార్థ విషయాలను గురించి శ్రద్ధతోనే వివరించాడు. కాని కేవలం బాహ్యాకారణాలనే యెక్కువగా తడివాడు. తాను వొచ్చినపని అంతరార్థం మాత్రం చెప్పలేదు. యూరోపియన్ ప్రభుత్వాల దురాశ, సంచలన ఫలితంగా దురాక్రమణదారుకు వ్యతిరేకంగా వుద్దేశించిన అంతర్జాతీయ బహిష్కరణ విఫలమైంది. ఇంకా కొన్ని ప్రభుత్వాలు బహిష్కరణకు సుముఖంగా వున్నట్లు నటిస్తున్నయ్. కాని మిగతావాళ్ళు అదికూడా చేయటంలేదు. దురాక్రమణ దారుకు పెట్రోలు అవసరం. లోగడ యూరపు అవసరాల్లో చాలభాగం విప్లవభూమినుంచి వచ్చే సరుకువల్ల తీరేది. ఇప్పుడు విప్లవభూమినుంచి పెట్రోలు రాకపోతే యితర దేశాలు ఆ అవకాశాన్ని వుపయోగించుకుంటాయ్. ఎలాగైనా ప్రపంచ మార్కెట్టునుంచి విప్లవదేశాన్ని తరిమివేయాలని వాళ్ళ వుద్దేశం. ఇటువంటి అద్భుతాభినయాలవల్ల 'అక్కడి' పరిశ్రమ దెబ్బతింటుంది. దాంతో అంతర్జాతీయ విప్లవోద్యమం కూడా ప్రపంచమంతటా దెబ్బతింటుంది. అందువల్ల యీ జోక్యం యెందుకో విశదమవుతుంది.

పాల్, మరిముగ్గురు కార్మికులు తలలూపారు. వాళ్లు కొంచెం మందబుద్ధులు. 'అక్కడి' కామ్రేడ్ చెప్పిన విషయాలన్నీ పూర్తిగా అంగీకార యోగ్యంగా కనిపించినై. వాళ్ళకది కేవలం సమీప ఫలితంలేని కేవల సిద్ధాంత చర్చగా నేవుంది. రుబషోవ్ మాట్లాడే విషయంలోని ముఖ్యాంశం వీళ్ళకు అర్థం కావటంలేదు. నల్ల నౌకాగణం ఆరేవులోకి వచ్చేవిషయం యెవ్వరూ గమనించటంలేదు. లిటిల్ లోయీ,

వంకర ముఖపు గుమాస్తామాత్రం ఒకరిద్దరైపోకరు త్వరగా హాటాద్రిష్టులను సారించారు. ఇది రుబషోవ్ గమనించాడు. నీరసంగా, శ్రద్ధలేకుండా తన చర్చను ముగించాడు.

'ముఖ్యసూత్రాలకు సంబంధించినంతవరకు నేను చెప్ప గలిగింది యధార్థంగా యింతే. కేంద్రకమిటీ ఆదేశాలను మీరంతా పాటించాల్సివుంది. ఇంకా రాజకీయంగా వెనుక బడివున్న కామ్రేడ్స్‌కి యేమైన సందేహాలుంటే అసలు విష యం లోతుపాతుల్ని వివరించి చెప్పాలి. ప్రస్తుతం యింత కంటే చెప్పవలసిన దేమీలేదు.'

ఒక నిమిషంపాటు నిశ్శబ్దంగావుంది. రుబషోవ్ ముక్క ద్దాలుతీసి, సిగరెట్ ముట్టించాడు. లిటిల్‌లోయీ మామూలు స్వరంతో,

'మన అతిథికి అభివందనాలు అర్పిస్తున్నాం. ఎవరైనా ప్రశ్నలు అడగదలచుకున్నారా?' అన్నాడు.

ఎవరూ అడగలేదు. కొంచెం సేపైన తరువాత ఆ ముగ్గురు కార్మికుల్లో ఒకడు వికృతంగా చెప్పాడు:

'దానికి యెక్కువగా చెప్పాల్సిందేమీలేదు. 'అక్కడ' కామ్రేడ్స్ వాళ్లుచేసే పనుల్ని గురించి వాళ్ళే తెలుసుకోవాలి. మేం తప్పకుండా బహిష్కరణకు పాటు పడతాం. మమ్మల్ని మీరు నమ్మవచ్చు. ఆ పందులికి మా రేవునుంచియేమీ వెళ్లదు.

అతని సహచరులు తలలూపారు వస్తాదు పాల్ సమ ర్థించి, 'ఇక్కడకాదు' అని చీలికొండిగా వికృతముఖంతో నిర్ధరించాడు.

ఒకక్షణం రుబషోవ్ తాను ప్రతిపక్షపు ముఠా నెదు

రొక్కంటున్నాననుకున్నాడు. నెమ్మదిగా వాళ్ళెవరూ అసలు సూత్రాన్ని గుర్తించలేదని గమనించాడు. ఈ అపార్థాన్ని కనీసం లిటిల్ లోయీ అయినా సరిదిద్దుతాడనే ఆశతో రుబషోవ్ అతనివైపు చూచాడు. కాని అతను తల క్రిందకువాల్చి మెదలక కూర్చున్నాడు. హఠాత్తుగా గుమాస్తా వుద్రిక్తస్వరంతో అన్నాడు,

'ఎప్పుడూ యీ రేవే కాకపోతే, మీ కార్యకలాపాలకు యింకో రేవును చూచుకోరాదూ యీసారికి ?'

నౌకాశ్రయకార్మికులు అతనివంక విస్మితులై చూచారు. కార్యకలాపాలు అనేమాట వాళ్ళకేమీ అర్థంకాలేదు. త్వరలో ఆరేవు జేరబోయే నల్లని నౌకాగణం భావన యేమాత్రం వాళ్ళమనసుల్లో లేదు. కాని రుబషోవ్ యీ ప్రశ్న వస్తుం దనుకున్నాడు.

'ఇక్కడినుంచి భూమార్గంగుండా యీ సరుకులు రవాణా కావటం రాజకీయంగా, భౌగోళికంగా మంచిది. మనం యేవిషయాన్నీ రహస్యంగా వుంచాల్సిన అవసరంలేదు. అయినప్పటికీ మన విషయాలను వుపయోగించుకొని ప్రతీ ఘాతకవర్గ పత్రికలు గేలిచేయకుండా వుండటం కోసం మనం అల్లరిలేకుండా చాలదూరదృష్టితో ప్రవర్తించాలి' అనిచెప్పాడు

గుమాస్తా, లిటిల్ లోయీ మళ్లీ హఠాద్భ్రమలను సారించారు. నౌకాశ్రయ కార్మికులికి అర్థంకాక రుబషోవ్ వైపు చూచారు; వాళ్ళను చూస్తే యీ విషయమై మన స్సుల్లో చాల వ్యధ పడుతున్నట్లు తెలుస్తుంది. హఠాత్తుగా పాల్ తీవ్రస్వరంతో,

'మీరు అసలు మాట్లాడేదేమిటి?' అని అడిగాడు.

వాళ్ళంతా అతని వైపు చూచారు. ఆతని మెడ యెర్రపడింది. కళ్ళు పెద్దవిచేసి రుబషోవ్ వైపు చూస్తున్నాడు. అప్పుడు లోయీ అణకువతో,

'నీవు యిప్పుడే గుర్తించావా?' అని అడిగాడు.

రుబషోవ్ అందరివైపు ఒకసారి చూచి నిదానంగా,

'మీకు కొన్ని వివరాలు చెప్పలేదు. విదేశవ్యాపార శాఖ సరుకుల నౌక రేపు వుదయానికే, వాతావరణం సవ్యంగా వుంటే, యిక్కడికి రావాలి' అని చెప్పాడు.

ఇప్పటికి ఆమాటలర్థం కావటానికి వాళ్ళకి చాలసేపు పట్టింది. ఎవ్వరూ యేమీ మాట్లాడలేదు. వాళ్ళంతా రుబషోవ్ వైపే చూస్తున్నారు. పాల్ నెమ్మదిగా లేచి, టోపీతీసి నేలకేసికొట్టి బయటికెళ్ళిపోయాడు. అతని సహచరులిద్దరూ అతన్ననుసరించారు. ఎవ్వడూ మాట్లాడలేదు. అప్పుడు లిటిల్‌లోయీ గొంతు సవరించుకొని,

'మన అతిథి కామ్రేడ్ యీ వ్యవహారానికి సంబంధించిన కారణాలన్నిటినీ సవివరంగా చెప్పారు. సరుకుల్ని మనం దించకపోతే, మరొకరు చేస్తారాపని. ఇంకెవరైనా మాట్లాడదలచుకొన్నారా ?' అన్నాడు.

ఇంతకుముందు మాట్లాడిన కార్మికుడు, కుర్చీలో సర్దుకొని, 'ఈ సంగీతం మాకు తెలుసు. సమ్మెచేసేటప్పుడు చాలమంది, నేను పనిచేయకపోతే మరొకడు చేస్తాడు అంటుంటారు. ఇలాటివి చాల విన్నాం. పోకిరివాళ్ళు, జూదగాళ్లు ఇలా మాట్లాడతారు' అన్నాడు.

మళ్ళీ కొంతసేపు నిశ్శబ్దం. గది బయట గుసగుసలు వినిపిస్తున్నయ్. అప్పుడు రుబషోవ్ చెప్పాడు:

'కామ్రేడ్స్, 'అక్కడి' పారిశ్రామికాభివృద్ధి లక్ష్యం అన్నిటికంటె ప్రధానం. మనోదౌర్బల్యం మనల్ని యేమాత్రం ముందుకు తీసుకుపోదు. ఆలోచించండి'

ఆ కార్మికుడు గడ్డం ముందుకు వంచి,

'మేం యిదివరకే ఆలోచించాం. ఇలాటివి చాల విన్నాం. 'అక్కడి' వాళ్ళు మీరు ఆదర్శంగా వుండాలి. ప్రపంచం యావత్తూ అందుకోసం, మీవైపు చూస్తున్నది. మీరు ఒకవైపునుంచి ఐక్యత, త్యాగం, క్రమశిక్షణ గురించి మాట్లాడతారు, రెండోవైపునుంచి అదేసమయంలో, మీనౌకల్ని పచ్చి జూదానికి వుపయోగిస్తారు' అన్నాడు.

లిటిల్‌లోయీ హఠాత్తుగా తలపైకెత్తి, తెల్లమొఖం వేసి చుట్టగొట్టంతోనే రుబషోవ్‌కి అభివాదంచేసి, తగ్గు స్థాయిలో త్వరగా,

'ఇప్పుడు కామ్రేడ్ చెప్పిందే నాఅభిప్రాయంకూడ. ఇంకెవరైనా యేమైనా చెపుతారా? సమావేశం యింతటితో ముగిసింది' అన్నాడు.

రుబషోవ్ చంకకర్రల్తో కుంటుకుంటూ బయటికెళ్ళాడు. తరువాత పరిణామాలు తప్పనిసరైన నిర్ణీత విధాన జరిగినయ్. ఆ రేవులోకి నల్లటి విచిత్ర నౌకాగణం ప్రవేశించే ముందు రుబషోవ్‌కీ, 'అక్కడి' సరైన అధికారులకూ మధ్య కొన్ని తంతివార్తలు ప్రయాణం చేసినయ్. మూడురోజుల

తర్వాత సౌకాశ్రయ కార్మిక నాయకుల్ని పార్టీనుంచి వెళ్ళ గొట్టారు. లిటిల్‌లోయీని పార్టీ అధికార పత్రికలో విచ్ఛిన్న కారుల ప్రతినిధిగా చిత్రించి, బహిరంగంగా ఆక్షేపించారు. మూడు రోజులతర్వాత లిటిల్‌లోయీ వురిబెట్టుకొన్నాడు.

# 13

ఆ రాత్రి మరీ అధ్వాన్నంగా వుంది. తెల్లవారేవరకు రుబషోవ్‌కి నిద్రపట్టలేదు. పన్నుపోటు యెక్కువై చలివులు కులు విడిచి విడిచి వచ్చినయ్. మెదడంతా వ్రణమై మంట పెడుతున్నట్లనిపించింది. కాని భావచిత్రాలు, శబ్దాల బాధ నుంచి విముక్తి చెందాలనే తీవ్రప్రయత్నంతో బాధాపూరిత మైన వొత్తిడివల్ల అలాగే పడివున్నాడు. 'నన్నుతోడేళ్ళకు పారెయ్యొద్దు, కామ్రేడ్....' అంటున్న ఆదివారపు నల్లటి సూటులోవున్న యువకుడు రిచర్డ్, 'ఇంకా యెవరు మాట్లా డాలనుకొంటున్నారు,' అంటున్న వంకర భుజపు లిటిల్ లోయీ స్మృతిపథానికొచ్చారు.మాట్లాడేవాళ్ళు చాలమంది వున్నారు. ఉద్యమానికి న్యాయాన్యాయ విచక్షణ యేమీ లేదు. తన గమ్యంవైపు యేయితర ప్రమేయం లేకుండ, తన గమనపు మలుపుల్లో మునిగిపోయిన శవాలను వదిలేస్తూ, ముందుకు సాగిపోతుంది దాని గమనంలో యెన్నోమలుపులు, వంకరలు వున్నయ్; అది దాని వునికి ధర్మం. ఆ వంకర గమ నాన్ని అనుసరించలేని వాళ్ళు ఒడ్డుకు కొట్టుకొస్తారు; అది దాని చట్టం. దానికి వ్యక్తిగతాభిప్రాయాలతో నిమిత్తం

లేదు. అతని మనస్సు, హృదయం, అంతఃకరణాలతో దానికి ప్రమేయంలేదు. పార్టీకి తెలిసిన నేరంఒక్కటే, తన నిర్ణయ పంథానుంచి తొలగటం; దానికి తెలిసిన శిక్షఒక్కటే; మరణ శిక్ష. ఉద్యమంలో, మరణం అంటే సర్వ సామాన్యవిషయం; మరణాన్ని గురించి ఘనంగా చెప్పుకోవలసింది కూడలేదు; రాజకీయ విభేదాలను సహేతుక పరిష్కారం చేసేది అదే.

తెల్లవాకుఝామున అలిసిపోయి, నిద్రపోయాడు బల్లమీద. మళ్ళీ తెల్లవారినట్లు బాగాఊరినప్పుడుగాని మెల కువరాలేదు. ఆ వెంటనే ముసలి వార్డరు, యూనిఫారంలో వున్న యిద్దరు వుద్యోగులు అతన్ని డాక్టరు దగ్గరకు తీసుకెళ్ళ టానికి వచ్చారు.

డాక్టరు దగ్గరకెళ్ళేటప్పుడు తొర్రిపెదవి వాడిపేరు, 402 నెంబరు పేరు వాళ్ళగదుల తలుపులమీద చూద్దా మనుకున్నాడు, కాని వాటికి యెదుటివైపుగా తీసుకెళ్ళారు. అతని గదికి కుడివైపు గది ఖాళీగావుంది. అది వరండాలో చివర వైపుగదుల్లో ఒకటి. ఏకాంతపు గదులవరుసకు మొదట దిట్ట మైన కాంక్రీటు తలుపులున్నయ్. ముసలివార్డరు వాటిని తీసే టప్పుడు చాలప్రయాస పడుతుంటాడు. వార్డరు ముందు, యూనిఫారమ్ వుద్యోగులు వెనుకవుండి రుబషోవ్‌ను పొడుగ్గా వున్న గ్యాలరీ గుండా తీసుకెళ్ళారు. ఆ వరస గదుల్లోనుంచి నవ్వులు, మాటలు, పాటలు విన్పిస్తున్నయ్. అందులోవున్న వాళ్ళంతా స్వల్పనేరాలకు శిక్షింపబడ్డ వాళ్ళని వూహించు కొన్నాడు. మంగలిషాపు దాటి వెళ్తున్నారు; అందులో పక్షి మొఖం పాతఖైదీకి గడ్డంగీయడం జరుగుతోంది. ఇంకా యిద్దరు

రైతులు తలగోరిగించుకొంటున్నారు; ఆ ముగ్గురు తలకాయలిటు త్రిప్పి రుబషోవ్‌ను కాపలాకాస్తూ తీసుకువెళ్ళటం విచిత్రంగా చూచారు. వాళ్లు అలావెళ్లి రెడ్ క్రాస్ గుర్తువేసిన గది దగ్గర కెళ్ళి ఆగారు. వార్డరు వినయపూర్వకంగా తలుపు తట్టి రుబషోవ్‌ను లోపలకు తీసికెళ్ళాడు. యూనిఫారం వుద్యోగులు బయటేవున్నారు.

వైద్యశాల చిన్నదిగావుంది; ఊపిరాడటంలేదు; పొగాకు, కార్బాలిక్‌ల వాసన కొడ్తోంది. రెండుబొక్కెనలు, రెండు పళ్ళాలు దూది ముక్కలతోనూ, మురికికట్లతోనూ నిండి వున్నయ్. డాక్టరు ద్వారంవైపు వీపుపెట్టి కూర్చుని రొట్టె నములుతూ, చొల్లుకారుస్తూ పట్కారులు, పిచికారులు వగైరా సామానుల గుట్టమీద పత్రికపెట్టి చదువుతున్నాడు. వార్డరు తలుపు వేసిన మోతవిని నెమ్మదిగా యీవైపు తిరిగాడు. అసామాన్యంగా వున్న చిన్న బట్టతలమీదవున్న తెల్లవెంట్రుకలకుచ్చులు చూచేసరికి రుబషోవ్‌కి నిప్పుకోడి గుర్తుకొచ్చింది.

'ఇతనికి పంటినొప్పి వచ్చిందంటున్నాడు' అని ముసలి వార్డరు చెప్పాడు.

'పంటినొప్పా?' రుబషోవ్ వైపు నిశితంగా చూస్తూ అడిగి, 'ఏదీ, నోరు తెరువు త్వరగా' అన్నాడు.

ముక్కద్దాల్లోనుంచి డాక్టరువైపు పరీక్షగాచూచాడు.

'నేను రాజకీయఖైదీని, నాకు సరియైన వైద్యం చేయించుకోనేహక్కుందని మనవి చేసుకుంటున్నాను' అన్నాడు నిదానంగా.

డాక్టరు ముసలివాడివైపు తిరిగి,

'ఎవరీ పక్షి?' అని అడిగాడు.

వార్డరు రుబషోవ్ పేరు చెప్పాడు. ఒక క్షణంసేపు ఆవృద్ధ పక్షి కళ్లు రుబషోవ్ మీద కేంద్రీకరించాయి. అప్పుడు డాక్టరు,

'నీ దవడ వాచింది, నోరు తెరువు' అన్నాడు.

ఆసమయంలో పన్ను నొప్పిగాలేదు. నోరు తెరిచాడు.

రుబషోవ్ నోట్లో వ్రేలుపెట్టి తడివిచూచి 'నీకు పైదవడ యెడమవైపున ఒక్కపన్నుకూడ లేదే' అన్నాడు. రుబషోవ్ హఠాత్తుగా తెల్లబోయి గోడకు జేరగిల బడ్డాడు.

'అదీ సంగతి, కుడివైపుదంతం పగిలిపోయి దవడలో మిగిలిపోయింది.' అన్నాడు డాక్టరు.

రుబషోవ్ చాలాసార్లు గట్టిగా వూపిరిపీల్చాలిసొచ్చింది. నొప్పి దవడనుంచి కంటికీ, కంటినుంచి తలకీ వ్యాపించింది. ఆగి ఆగి వచ్చే రక్త ప్రసారపు ప్రతిపోటు స్పష్టంగా తెలుస్తోంది, డాక్టరు మళ్ళీ కూర్చుని పత్రిక చదువుతున్నాడు.

'నీ కిష్టమైతే దంతపు వేరు తీసివేస్తాను' అని యింకో రొట్టె ముక్కనముల్తూ చొంగకారుస్తున్నాడు డాక్టరు. 'మరి యిక్కడ మత్తుమందులేమీ లేవు. శస్త్రం చేయటానికి అర గంటనుంచి గంటదాకా పడుతుంది.' అన్నాడు.

నోటితుంపరల మధ్యనుంచి వచ్చింది డాక్టరు స్వరం. రుబషోవ్ గోడకానుకుని గట్టిగా వూపిరి పీలుస్తున్నాడు. 'నమస్తే, యిప్పుడుకాదు' అన్నాడు. తొంద్రిపెదవివాడు, అపరిచితో సైన్యం, క్రిందటి రోజు సిగరెట్ పీకతో చేతివెనక కాల్చుకొనేటప్పటి వికార భంగిమలను గురించి ఆలోచిస్తూ పరిస్థితులు సవ్యంగా వుండవనుకొన్నాడు.

గదికిరాగానే బల్లమీదపడి వెంటనే నిద్రపోయాడు.

మధ్యాహ్నం పులుసు పంపిణీ వచ్చినప్పుడు అతన్ని వదలిపెట్టలేదు. అప్పటినుంచీ అతని వంతు సక్రమంగానే ముట్టుతోంది. పంటినొప్పి తగ్గి భరించ గలిగిన స్థితిలోనేవుంది. దంతపు కుదురుదానంతటదేవూడిపోతే బాగుండుననుకున్నాడు.

మూడురోజుల తర్వాత మొదటిసారిగా విచారణకు తీసికెళ్ళారు.

# 14

అతన్ని విచారణకు తీసికెళ్ళటానికి, వాళ్లు వుదయం పదకొండు గంటలకొచ్చారు. వార్డరు గంభీరతను చూచి రుబషోవ్ తన నెక్కడికి తీసికెళ్తారో గ్రహించి, సాధారణంగా ప్రమాద సమయాల్లో యాదృచ్ఛిక దయాప్రసాదంవలె అతనికి కలిగే నిర్మల, నిశ్చల భావంతో వార్డరు ననుసరించాడు.

మూడురోజుల క్రిందట డాక్టరు దగ్గరకెళ్ళినప్పుడు వెళ్ళినదారినే వెళ్లారు. మళ్ళీ తలుపు తెరుచుకుని దభాలున మూసుకుంది. తీవ్రవాతావరణానికి యెంత త్వరగా అలవాటు పడతారో అని విస్మితుడయ్యాడు. తాను అనుభవించిన పూర్వపు జైళ్ళ వాతావరణమంతా యిక్కడ మూర్తీభవించినట్లు, తాను యీ జైలు వాతావరణానికి చిరకాలం నుంచీ అలవాటు పడివున్నట్లు భావించాడు.

వాళ్ళు మంగలిషాపు దాటి వెళ్లారు. ఆస్పత్రి తలు

పులు మూసివున్నయ్. వాకిలి ముందు వార్డరు నిద్రకళ్ళతో ముగ్గురు ఖైదీలను వాళ్లనంతుకోసం, పెట్టుకూర్చున్నాడు.

డాక్టరు గది తర్వాత భాగమంతా రుబషోవ్‌కి క్రొత్తగా కనిపించింది. భూగర్భంలోకి మెలిదిరిగివున్న మెట్లు కనిపించాయి. అక్కడ సామాను గదులు, శిక్షా కూపాలు న్నాయా? రుబషోవ్ నిపుణుడులాగ వూహించ ప్రయత్నిం చాడు. మెట్లు చూడటాని కిష్టంగా లేదతనికి.

సన్నగా, చీకటిగా వున్న దారిగుండా వెళ్తున్నారు. ఆ దారి కవతలవైపున వరండాల్లో దీపాలు వెలుగుతున్నయ్. అక్కడి గదులికి కాంక్రీటు తలుపులు గాక రంగు పూసిన కొయ్యతలుపులు వున్నయ్. వాటికి యిత్తడి కొక్కాలు న్నయ్. హడావిడిగా అధికారులు తిరుగుతున్నారు ఆ గదుల్లో నుంచి. ఒకదాంట్లో వైరెస్ పనిచేస్తోంది. ఇంకో దాంట్లో నుంచి టైపు రైటరు మ్రోత వినిపిస్తోంది. వాళ్లిప్పుడు ఆఫీ సులో వున్నారు.

ఆ వరండా చివరవున్న గదివద్దకెళ్ళి వార్డరు తలుపు కొట్టాడు. ఆ లోపల యెవరో టెలిఫోన్‌లో మాట్లాడుతూ, 'దయచేసి ఒకనిమిషం' అని సాఫీగా అన్నారు. 'అవును' 'అంతే' అని టెలిఫోనులో అవతలి వాళ్లతో చెపుతున్న మాటలు వినిపిస్తున్నయ్. ఆ స్వరం తనకు పరిచితమైనట్లే వున్నా యెవరిదో స్పష్టంగా పోల్చులేక పోయాడు, రుబ షోవ్. అది యింపైన మొగ గొంతుకే; కొంచెం బొంగురుగా వుంది. ఎక్కడో నిశ్చయంగా యింతకు ముందు విన్నదే. 'లోపలికి రండి' అన్న శబ్దం వచ్చింది. వార్డరు తలుపు తెరిచి

రుబషోవ్ లోపలికెళ్ళగానే చూసివేశాడు, అక్కడ వ్రాత బల్ల, దానివెనక తన పూర్వ సహచర మిత్రుడు, పూర్వ దళాధిపతి ఇవనోవ్ కూర్చుని వున్నాడు. టెలిఫోన్ రిసీవరు పెట్టేస్తూ రుబషోవ్ వైపు చిరునవ్వుతో చూస్తూ, 'ఈవిధంగా మళ్ళీ యిద్దరం యిక్కడ కలుసుకున్నాం' అన్నాడు.

ఇంకా తలుపు దగ్గరే వుండి 'ఎంత సంతోషకరమైన విచిత్రం' అన్నాడు, రుబషోవ్ సన్నగా.

మర్యాద సూచిత భంగిమతో 'కూర్చో' అని లేచి నిలబడ్డాడు. రుబషోవ్ కంటె ఇవనోవ్ కొంచెం యెత్తుగా వున్నాడు. చిరునవ్వుతోనే చూస్తున్నాడు. ఇవనోవ్ బల్లకు వెనక, రుబషోవ్ ముందూ కూర్చున్నారు. ఒకరి వైపొకరు కొంతసేపు తదేక దృష్టితో, విస్తుపోయి చూచుకొన్నారు - ఇవనోవ్ యించుమించు సుస్మిత మందహాసంతోనూ, రుబషోవ్ పరీక్షగా, నిరీక్షణతోనూ. బల్ల క్రింద వున్న ఇవనోవ్ కాలుమీదకు మళ్లింది రుబషోవ్ దృష్టి.

'ఓ, అది సరిగ్గానే వుంది. స్వాతచ్ఛలనకీళ్లు, తుప్పుపట్టని క్రోమియంపూత వేసిన కట్టుడుకాలు. దాన్తో యీదగలను; స్వారిచేయగలను; కారునడపగలను; నాట్యంచేయగలను. సిగరెట్ తీసుకుంటావా?'

కొయ్య సిగరెట్ కేసు తెరిచి రుబషోవ్ కందించాడు.

రుబషోవ్ సిగరెట్లవైపుచూచి ఇవనోవ్ కాలు తీసివేసినప్పుడు తాను మొదటిసారిగా సైనిక వైద్యాలయానికెళ్ళటం గుర్తు తెచ్చుకొన్నాడు. సాయంకాలం వరకు సాగిన చర్చలో ప్రతివాడికీ ఆత్మహత్య చేసుకొనే హక్కున్నదని బుజువు

చెయ్యా ప్రయత్నించి, విషం తెచ్చిపెట్టమని రుబషోవ్ నడిగాడు. ఆ విషయం ఆలోచించటానికి కొంచెం వ్యవధి యిమ్మన్నాడు. ఆ రాత్రే రుబషోవ్‌ని ఆ రంగంలోనే యింకో విభాగానికి మార్చారు. కొన్ని సంవత్సరాలనంతరం యిప్పుడూ కలుసు కోవటం కొయ్యకేసుంలో సిగరెట్లవైపుచూచాడు. అతినాణ్యమైన అమెరికా పొగాకుతో, చేత్తో తయారు చేసినవా సిగరెట్లు.

'ఇది యింకా స్నేహసూచకమా? లేక మనద్వేషాలు యిది వరకే ఆరంభమయ్యాయా? రెండోదయితే నేను తీసుకోను. నీకూ తెలుసుగా మర్యాద?'

'అర్థంలేనిమాట.'

'అయితే మంచిదే, అర్థంలేనిమాటే.' ఇవనోవ్ సిగరెట్లలో ఒకటి రుబషోవ్ తీసుకుని ముట్టించాడు. తన సంతోషాన్ని కనిపించనీయకుండటం కోసం దమ్ము బాగాపీల్చాడు. 'నీ గూడల్లో కీళ్ళవాతం యెలావుంది?' అడిగాడు రుబషోవ్.

'బాగానేవుంది, నీ మంటయెలావుంది?'

మందహాసంచేసి రుబషోవ్ యెడమచేతివైపు అమాయకంగా చూపించాడు. చేతి వెనక నరాలమధ్య, మూడు రోజుల క్రితం సిగరెట్ పీకతో కాల్చినచోట రాగినాణెమంత బొబ్బవుంది. తొడమీద పెట్టిన రుబషోవ్ చేతిని యిద్దరూ మౌనంగా కాసేపు చూచారు.ఇతని కెలా తెలిసిందనుకున్నాడు, రుబషోవ్. నామీద నిగా వేశాడన్నమాట. కోపం బదులు సిగ్గు వేసింది. సిగరెట్ గట్టిగా దమ్ముపీల్చి అవతల పారేశాడు. 'నాకు సంబంధించినంత వరకు అనధికార భాగం పూర్తి యిది'

అన్నాడు రుబషోవ్.

ఇవనోవ్ సిగరెట్ పొగచుట్టలు వదుల్తూ పూర్వంలాగే సున్నిత, శ్లేషసమ్మిశ్రిత మందహాసంచేస్తూ, పరిశీలిస్తూ 'పోట్లాడబోకు' అన్నాడు.

'కొంత అవకాశంయివ్వు, నేను నిన్ను అరెస్టుచేశానా? నన్ను మీవాళ్ళు అరెస్టుచేశారా ?'

'మేమే నిన్ను అరెస్టుచేశాం' అని చేతిలో సిగరెట్ పారేసి యింకోసిగరెట్ ముట్టించి పెట్టెను రుబషోవ్ కందించాడు. అతను కదల్లేదు. 'నీ దుంపతెగా' అని 'విషం సంగతి జ్ఞాపకంవుందా ?' అనిఅడిగి ముందుకువంగి సిగరెట్‌పొగ రుబషోవ్ మొఖంలోకి వూదాడు.

'నిన్ను తుపాకితో కాల్చటం యిష్టంలేదు' నెమ్మదిగా అని కుర్చీకి జేరగిలబడ్డాడు. 'నీదుంపతెగా' అని తిరిగి మందహాసం చేశాడు

'నీతోడు, నన్ను అసలు మీరెందుకు కాల్చాలనుకుంటున్నారోచెప్పు' అడిగాడు రుబషోవ్.

ఇవనోవ్ రెండు క్షణాలు మెదలకూరుకుని, పెన్సిల్తో అద్దుడుకాగితం మీద బొమ్మలు గీలుకుతున్నాడు. సరైన పదాలకోసం వెదుక్కుంటున్నట్టున్నాడు. చివరకు అన్నాడు:

'రుబషోవ్, విను నీకొక విషయం చెప్పాలనుకొంటున్నాను. ఇప్పటికి చాలాసార్లు 'మీరు' అంటే పార్టీ, ప్రభుత్వం అనే వుద్దేశంతోను; 'నేను' అంటే నికోలస్ సామనోవిచ్ రుబషోవ్ అనీ పదప్రయోగంచేశావు. ప్రజలకైతే, నిజానికి, విచారణ, చట్టరీత్యా న్యాయనిరూపణ చేయటం కావాలి,

కాని మాకు నేనిప్పుడన్నది చాలు.'

రుబషోవ్ దీర్ఘంగా ఆలోచించాడు. కొంతవరకు గతు కు<sub></sub>మన్నాడు. ఇవనోవ్ శ్రుతిపెట్టటానికి తీగ నొక్కితే దానికి తన మనస్సు యిశ్ఛపూర్వకంగా ప్రతిధ్వనించినట్లుగా భావించాడు. నలభైసంవత్సరాల తనవిశ్వాసం, పోరాటం, ప్రబోధం అన్నీ కలిసి ఆపశక్యంకాని ఒక భావనా తరంగంగా అతని మనోవీధిలో ప్రవహించింది. పార్టీయే సర్వం, వ్యక్తి అంటే శూన్యం, చెట్టునుంచి విరిగిన కొమ్మ యెండిపోవలసిందే.

...రుబషోవ్ ముక్కద్దాలు తీసి చొక్కాచేతికి తుడుచుకొన్నాడు. ఇవనోవ్ కుర్చీకి చేరగిలబడి సిగరెట్ పీలుస్తూ, పూర్వపు మందహాసం లేకుండా కూర్చున్నాడు. హటాత్తుగా అతనిదృష్టి గోడమీద నలుచదరపు తెల్లటిమచ్చమీద పడింది. అది గడ్డాలవాళ్ళ పేర్లు వ్రాసివున్న ఫొటో ప్రదేశం అని వెంటనే గుర్తించాడు; గోడ కాగితాలకంటె కొంచెం తెల్లగా కనిపిస్తోంది – ఇవనోవ్ భంగిమ, భావం మార్చకుండానే రుబషోవ్ దృష్టి ననుసరించాడు.

'నీ వాదం కాలవ్యతిక్రమంగా వుంది' అన్నాడు రుబషోవ్.

'నీవు అన్నది నిజమే. మనం 'మనం' అని బహువచనం ప్రయోగించటానికీ, వీలైనంతవరకు వుత్తమ పురుషయేకవచన ప్రయోగం తగ్గించటానికీ అలవాటుపడ్డాం. నేను దాదాపు ఆ వాచక ప్రయోగం మరచిపోయాను; నీ వింకా అంటిపెట్టుకునే వున్నావు. నీవు యీనాడు ప్రయోగిస్తున్న 'మనం' యెవరినుద్దేశించి? దానికి నూతన నిర్వచనం కావాలి.

అదీ విషయం.'

'కేవలం నాప్రద్దేశంప్రకారం అతి త్వరలో అసలు విష యానికి వచ్చినందుకు సంతోషిస్తున్నా. ఇంకో విధంగా చెప్పా లంటే 'మనం' -అంటే పార్టీ, ప్రభుత్వం, దానివెనుక నున్న ప్రజానీకం - యిక ముందు విప్లవ ప్రయోజనాలకు ప్రాతి నిధ్యం వహించమని నీవు వొప్పుకున్నావు.'

'ప్రజానీకాన్ని అందులోనుంచి తొలగించాలి.'

'ఎప్పటినుంచి ప్రజానీకం మీద యింత విరక్తి? దీనికీ వుత్తమ పురుష యేక వచన ప్రయోగంలోకి మార్పు చెంద టానికీ యేమైనా సంబంధం వుందా?'

దయాపూరిత హాస్య దృష్టులతో బల్లమీదికి వం గాడు. ఇప్పుడు అతని తల అడ్డంవచ్చి గోడమీది ఫోటో కని పించటంలేదు; వెంటనే చిత్రప్రదర్శనశాలలో రిచర్డ్ తల అడ్డంవచ్చి పియెటా ముకుళితహస్తాలు కనిపించని దృశ్యం గుర్తుకొచ్చింది రుబషోవ్‌కి. అదే సమయంలో నొప్పి తెర ఒకటి దవడనుంచి నుదురులోకీ, చెవులోకీ వెళ్ళింది. ఒక క్షణం సేపు కళ్లుమూసుకున్నాడు. 'ఇప్పుడు చల్లిస్తున్నా' అనుకొన్నాడు; ఒక క్షణాంతర్వాత బిగ్గరగా అన్నాడోలేదో తెలియలేదు.

'ఏమంటున్నావ్?' ఇవనోవ్ అడిగాడు. ఆ స్వరం హేళనగా, కొంచెం విస్మయపూరితంగా చెవిలో ధ్వనించింది.

నొప్పి తగ్గిపోయింది; మనస్సుకు ప్రశాంత స్వస్థత చేకూరింది.

'ప్రజానీకాన్ని అందులోనుంచి తీసెయ్' అన్నాడు.

మళ్ళీ 'వాళ్ళ విషయం నీకేమీ అర్థంగాదు. బహుశా నాకూడా యెక్కువ తెలియదేమో. 'మనం' అన్న గొప్ప పదం వాడుకలో వున్నరోజుల్లో, ఒకప్పుడు వాళ్ళను యితరులెవ్వరూ అర్థం చేసుకోనంతగా మనం అర్థం చేసుకొన్నాం. మనం వాళ్ల అంతరాత్మల్లోకి చొచ్చుకుపోయాం; రూపం లేనిచరిత్ర అస్పష్టస్థితిలో మనం పనిచేశాం....'

బల్లమీద తెరిచివుంచిన సిగరెట్ కేసులోనుంచి గమనం లేకుండానే ఒక సిగరెట్ తీసుకొన్నాడు; ఇవనోవ్ ముందుకువంగి దాన్ని ముట్టించాడు. రుబషోవ్ చెప్పుకుపోతున్నాడు.

'ఆరోజుల్లో మనం ప్రజలపార్టీ అని పిలవబడ్డాం. చరిత్ర గురించి యితరులకేం తెలుసు? చిన్న అలలు, సుడిగుండాలు దాటి కెరటాలను భేదించటం. వాళ్లు పై మట్టంమీద స్వరూపమార్పులకే విస్మితులయ్యారు. వాటిని తెలుసుకోలేకపోయారు. మనం సర్వకాలాల్లోనూ చరిత్రకు ఆధార భూత పదార్థంగావున్న నామరూపరహిత ప్రజానీకం అంతరాల్లోకెళ్ళాం; మనమే దాని గతిసూత్రాలను కనిపెట్టిన మొదటి వాళ్ళం. మనం దాని స్థబత్వ సూత్రాలను నెమ్మదిగా మార్పుచెందుతున్న నిర్మాణాన్ని, హఠాత్ ప్రకోపాలను కనిపెట్టాం. అదే మన సిద్ధాంతం గొప్పతనం. విప్లవసిద్ధాంతులు కేవలం నీతివాదులు, మనం స్వానుభవ సిద్ధాంతులం. మనం చరిత్ర పురాతనభూమిని త్రవ్వి దాని సూత్రాలను పైకితీశాం. మానవ సమాజాన్ని గురించి యిప్పటివరకు యేమానవులకు తెలియని విషయాలను మనం తెలుసుకున్నాం. గనుకనే మన

విప్లవం విజయమైంది. మీరు దాన్నంతా మళ్ళీ పాతేశారు..'

ఇవనోవ్ కుర్చీకి జేరగిలబడి కాళ్ళు చాచుకొని, అద్దుడు కాగితం మీద బొమ్మలు గీస్తూ వింటూ,

'చెప్పు, నీమనసులో వున్నదేదో తెలుసు కోవాలని వుంది' అన్నాడు.

రుబషోవ్ తృప్తిగా సిగరెట్ తాగుతున్నాడు. ఈ మధ్య మానెయ్యటం వల్ల సిగరెట్ పొగాకువిషం కొంచెం దిమ్మ కలిగించింది

'నీవు గుర్తించినట్లుగా, నామెడ మీద తలకాయ లేకుండ చేసుకోవటానికే మాట్లాడు తున్నాను' అని గోడ మీద పూర్వం నాయకుల చిత్రం తగిలించివున్న ప్రాంతం వైపు చూచాడు. ఇవనోవ్ యీసారి యితని దృష్టిని అనుస రించ లేదు. మళ్ళీ రుబషోవ్ మొదలు పెట్టాడు.

'మంచిది. ఇంకోసారి అన్నందువల్ల మునిగిపోయే దేమీలేదు. మనుషులు, వాళ్ళవివేకం, ఆశలు అన్నిట్నీ మట్టికలిపారు. 'మనం' అనేదాన్ని చంపి, నాశనం చేశారు. ప్రజానీకం యింకా మీ వెనక నే వున్నారని విశ్వసిస్తున్నారా? మీ కెంతహక్కుందో, అంతే హక్కుతో యూరప్‌లోని దోపిడీగాళ్ళు కూడ అలాగే అనుకుంటున్నారు.... '

ఇంకో సిగరెట్ తీసుకొని, ఇవనోవ్ కదలకుండ కూర్చుంటే, తానే ముట్టించుకున్నాడు.

'నా వాగ్ధోరణికి క్షమించు, మీరు నిజంగా ప్రజలు యింకా మీవెనకే వున్నారనుకుంటున్నారా? ఆ ప్రజానీకం యితర దేశాల్లోలాగే మిమ్మల్నికూడా మూగగా, విరక్తితో

భరిస్తుంది. కాని వారిమనసులు అంగీకరించవు. ప్రజానీకం తిరిగి మూగగా, చెవిటిగా తయారైంది; చరిత్రలో గొప్ప నిశ్శబ్దకాలం; సముద్రం ఓడల్ని మోసినట్లు. కాంతి ప్రసరించినప్పుడల్లా మట్టంమీదే ప్రతిఫలిస్తోంది. కాని లోపల నిశ్శబ్దత, చీకటి. ఎప్పుడో మనం వాళ్ల అంతరాలను కదిలించాం, కాని అదంతా గతం. ఇంకోవిధంగా చెప్పాలంటే' ముక్రంద్దాలనుతీసి తుడిచి – 'ఆ రోజుల్లో మనం చరిత్రను సృష్టించాం; యిప్పుడు వీరు రాజకీయాలను సృష్టిస్తున్నారు. అంతే తేడా.'

ఇవనోవ్ జేరగిలబడి వుండే, పొగచక్రాల్ని వదుల్తున్నాడు. 'ఆ తేడా యేమిటో నాకు సరిగా అర్థం కాలేదు. బహుశా అర్థమయ్యేటట్లు వివరిస్తా వనుకొంటాను.'

'తప్పకుండా. ఒక గణితశాస్త్రజ్ఞుడు బీజగణితం సోమరిపోతుల శాస్త్రమన్నాడు. ఎందుకంటే 'క' వుత్పత్తి తెలియకుండా తెలిసినట్లుగా 'క' తో లెఖ్ఖలు వేస్తాడు. మన విషయంలో 'క' అనామక ప్రజానీకానికి ప్రాతినిధ్యం వహిస్తుంది. రాజకీయాలంటే 'క' యదార్థ స్వరూపం గురించిన బాధ లేకుండానే 'క' ను వుపయోగించుకోవటం. ఈ గణిత సామ్యంలో, చరిత్ర సృష్టి అంటే 'క' యదార్థస్థితిని గుర్తించట మన్నమాట.'

'బాగుంది. కాని దురదృష్టవశాత్తు నీ వ్యాఖ్య నిగూఢంగా వుంది. విషయ వివరణచేస్తే నీ వుద్దేశం ''మనం'అంటే పార్టీ, ప్రభుత్వం – విప్లవ ప్రయోజనంగాని, ప్రజల ప్రయోజనంగాని, నీ కథ్యంతరం లేకపోతే, మానవ పురోగమన

ప్రయోజనాల నేమాత్రం పరిగణించటం లేదనేగా?'

'ఈ సారి గ్రహించావు' రుబషోవ్ మందహాసం చేస్తూ అన్నాడు. ఇవనోవ్ చలించకుండా కూర్చున్నాడు.

'ఈ అభిప్రాయం యెప్పుడేర్పడింది ?'

'గత కొద్ది సంవత్సరాల్లో, క్రమ క్రమంగా.'

'సరిగా చెప్పలేవూ ? ఒకటా, రెండా, మూడా?'

'అదేమిటి, తెలివితక్కువ ప్రశ్న. నీవు యే వయస్సులో పెద్దవాడ నయ్యావ్? పదిహేడా ? పద్దెనిమిదిన్నరా ? పంధొమ్మిదా?'

'నీవు తెలివితక్కువ వాడవుగా నటిస్తున్నావు. ప్రతి వాడికీ ఆత్మాభివృద్ధి చెందేటప్పుడు ప్రతి మెట్టూ ఒక్కొక్క విస్పష్టానుభవ ఫలితంగానే అందుకో కలుగుతాడు. నీకు నిజంగా తెలుసుకోవాలనుంటే నేను పదిహేడో సంవత్సరంలో – మొదటి ప్రవాసంలో – పెద్దవాడనయ్యాను.'

'అప్పుడు నువ్వు చాల వుత్తముడవు. సరే, అది మర్చిపో' అని రుబషోవ్ గోడమీద తెల్లమచ్చవైపు మళ్ళీ చూచి, సిగరెట్టు పారవేశాడు.

'మళ్ళీ అడుగుతున్నాను' అని ఇవనోవ్ బల్లమీదకు కొద్దిగా వంగాడు. 'ఎన్నాళ్ళనుంచి ప్రతిపక్ష వుద్యమంలో వున్నావు ?'

టెలిఫోన్ మ్రోగింది. ఇవనోవ్ రిశీవరుతీసి 'ఇప్పుడు కొంచెం పనిమీదున్నా' అని పెట్టేశాడు. కుర్చీకి చేరగిలబడి, కాళ్ళుచాచుకొని రుబషోవ్ సమాధానంకోస మెదురుచూచాడు.

'నా కెంత తెలుసో నీకూ అంతే తెలుసు, నేనెప్పుడూ

ప్రతిపక్ష వుద్యమంలో చేరలేదు.'

'నీయిష్టం. నేను అధికారిలా ప్రవర్తించాల్సిన బాధాకరస్థితిలో పెడ్తున్నావు' అని డ్రాయరులోనుంచి ఫైళ్ళకట్టొకటి తీశాడు. '1933 నుంచి మొదలు పెడ్దాం' అని కాగితాలు విప్పి బల్లమీద పరిచాడు. 'ఏదేశంలో విప్లవం విజయవంతమౌతుందని ఆశించామో అక్కడ నియంతృత్వం పైకొచ్చి, పార్టీని అణిచివేయటం జరిగింది. అప్పుడు పార్టీనుంచి కొంతమందిని బయటకునెట్టి, పార్టీని పునర్నిర్మించమని నిన్ను రహస్యంగా పంపారు.'

రుబషోవ్ కుర్చీకిజేరగిలబడి తనఆత్మకథ వింటున్నాడు. రిచర్డ్, ప్రదర్శనశాలముందు వీధిలో మసక వెలుగు, టాక్సీ ఆగటం వగైరా దృశ్యాలు గుర్తుకొచ్చినయ్.

'...మూడు నెలలతర్వాత అరెస్టయావు. రెండు సంవత్సరాలు కారాగారం, ప్రవర్తన వృత్తమం. నీకు వ్యతిరేకంగా యేమీ ఋజువుకాలేదు. విడుదల, అనంతరం ఘనవిజయంతో తిరిగిరావటం....'

ఇవనోవ్ కొంచెం ఆగి హటాద్దృష్టినిచూచి, మళ్ళీ చెపుతున్నాడు.

'తిరిగొచ్చిన తర్వాత బ్రహ్మాండంగా విందులు, వుత్సవాలు జరిగినయ్. మనం అప్పుడు కలుసుకోలేదు, బహుశా చాల హడావిడిగా వున్నావు... ఎలాగైనా నేను దాన్ని తప్పిపోవటం అనుకోలేను. అయినా పాత మిత్రుల్నందర్నీ కలుసుకోవాలనుకోవటం పొరబాటే. సభల్లో వేదికలమీద

నిన్ను రెండుసార్లు చూచాను. ఇంకా చంక కర్రలతోనే, చిక్కిపోయివున్నావు. నాలుగుసంవత్సరాలు విదేశాల్లో రాయబార కార్యాల్లో గడిపి తిరిగివచ్చినతర్వాత, కొన్ని మాసాల పాటు యే ఆరోగ్య కేంద్రంలో నైనా విశ్రాంతితీసుకొని, ప్రభుత్వోద్యోగంలో ప్రవేశించాల్సింది, న్యాయంగా. కాని పదిహేనురోజుల్లో నేవిదేశాల కెళ్ళటానికిఅనుమతికోరావు....'

హఠాత్తుగా ముందుకు వంగి రుబషోవ్ ముఖంలో ముఖంపెట్టి, 'ఎందుకని___?' అని అడిగాడు. మొదటి సారిగా అతని గొంతు తీవ్రంగా పలికింది.

'బహుశా నీకు యిక్కడ బాగుండలేదు కాబోలు. నీవు లేనప్పుడు దేశంలో చాలా మార్పులు వచ్చినయ్.యదార్థానికి నీవు వాటిని హర్షించ లేదు.'

రుబషోవ్ యేమి చెప్తాడో నని యెదురు చూచాడు. కాని రుబషోవ్ మెదలకుండ, ముక్కద్దాలు తీసి చొక్కా చేతి మీద తుడుచుకొని కదలకుండ కూర్చున్నాడు.

'ప్రతిపక్షపు మొదటి జట్టును శిక్షించి, నిర్మూలం చేసిన కొద్దిరోజులనాటి విషయం. అందులో నీకు సన్నిహిత మిత్రులున్నారు ప్రతిపక్షం యెంతనాశనమైందో తెలుసుకున్న తర్వాత దేశమంతటా కోపాగ్ని ప్రజ్వరిల్లింది. దానిని చల్లార్చటానికి నువ్వేమీ చేయలేదు. ఒక పక్షం రోజులకే, యింకా చంక కర్రలతోగాని నడవలేనప్పటికీ విదేశాల కెళ్ళావు....'

రుబషోవ్ మనస్సుకు మళ్ళీ ఓడరేవు, నౌకాశ్రయ ప్రాంతంలో పెట్రోలు, సముద్రపు పాచివాసన పీలుస్తోన్నట్లయింది. పాల్ చెవులాడిస్తున్నాడు, లిటిల్ లోయీ చుట్టగొట్టం

తోనే అభివాదం చేస్తున్నాడు... తనగదిలో దూలానికి వురి తీసుకొన్నాడు. లాకీ వెళ్ళినప్పుడల్లా ఆ జీర్ణావస్థలోవున్న ఆ పాతకొంపకదిలిపోతోంది.లిటిల్ లోయీవురిబెట్టుకొన్నతర్వాత యిరుసుమీద కదులుతుంటే, యింకాప్రాణంతో కదుల్తున్నాడని రుబషోవ్‌కి చెప్పారు....

'నీవువెళ్ళిన విదేశవ్యవహారం సఫలమైంది. 'బి'లో వాణిజ్య ప్రతినిధివర్గానికి నాయకుణ్ణిచేశారు నిన్ను. ఈసారి కూడ తిరుగులేని విధంగా నీ విధుల్ని నిర్వర్తించావు. 'బి' తో చేసుకొన్న వ్యాపారపు టొడంబడిక నిశ్చయంగా ఘన విజయమే. బయటకు మాత్రం నీ ప్రవర్తన వుత్తమంగా, నిష్కల్మషంగా కనిపిస్తుంది. ఆరునెలలతర్వాత యీ వుద్యోగానికొచ్చావు. నీ సన్నిహిత సహకారులిద్దర్నీ - అందులో ఒకతె నీ కార్యదర్శి ఆర్లోవా - ప్రతిపక్ష విద్రోహపు అనుమానం మీద పిలిపించాలిసొచ్చింది. విచారిస్తే యీ అనుమానం ధృవపడింది. నీపై ఆరోపణలు నిజంకాదని బహిరంగంగా నువ్వు చాటివుండాల్సింది. కానిమౌనంవహించావు....

'మరో ఆరుమాసాల తర్వాత నిన్నే పిలిచారు. ప్రతిపక్షపు రెండో విచారణకు ప్రయత్నాలు జరుగుతున్నయ్. ఆ విచారణలో నీ పేరు పదే పదే వినబడింది. తన నిర్దోషిత్వ నిరూపణకు ఆర్లోవా నిన్ను సూచించింది. ఈ పరిస్థితుల్లో నీ మౌనం అపరాధాంగీకార సూచక మౌతుంది. నీకా విషయం తెలిసివుండికూడ, పార్టీ తుది ఆదేశం పంపేవరకు నీవు ప్రకటన చెయ్యలేదు. అప్పుడు మాత్రం, నీప్రాణానికి ప్రమాదం యేర్పడినప్పుడు, ప్రభుత్వంయెడ భక్తివిశ్వాసాలను ప్రకటించ

టానికి వొప్పుకొన్నావు. అంటే ఆర్లోవా సమాప్తి అన్న మాట. ఆవిడ గతిదేమిటో నీకు తెలుసుగా....'

రుబషోవ్ మెదలకుండ వూరుకొని, పంటినొప్పి మళ్ళీ ప్రారంభించటం గమనిస్తున్నాడు. ఆవిడ గతి తనకు తెలుసు. రిచర్డ్ గతికూడ తెలుసు; లిటిల్‌లోయీ గతికూడ; చివరకు తన గతికూడ. గడ్డాలనాయకుల స్మృత్యర్థంమిగిలినగోడమీద తెల్లని మచ్చవైపు చూచాడు. వాళ్ల గతి కూడ తనకు తెలిసే వుంది. చరిత్ర ఒక పరుగుతీసింది. అందులో మానవ జీవితం అధిక పరువు ప్రతిష్ఠలతో బ్రతికే వాగ్దానం కనిపించింది; కాని అసంతా ముగిసింది. అయితే యెందుకింకా వివాదం; ఆర్భాటం? మానవుల్లో నాశనం కాకుండా నిలిచి వుండగలదే దైనా వున్నట్లయితే అది ఆర్లోవాలో వుంటుంది. ఆర్లోవా తన ఆరాధ్య దైవం, తనను మృత్యువు కప్పగించిన కామ్రేడ్ రుబషోవ్ వైపు సుందర గోనయనాలతో నిశ్చలంగా చూస్తూ విశాల శూన్యంలో యెక్కడో ఒకచోట శయనిస్తుంది.... అతని పంటినొప్పి తీవ్రతర మయింది.

'ఆ సమయంలో నీవుచేసిన బహిరంగ ప్రకటన చదవనా?'

'వద్దు, నమస్తే.' తన గొంతు బొంగురు పోయినట్లు గుర్తించాడు, రుబషోవ్.

'నీకు తెలుసు. నీప్రకటన —దాన్నే ఒప్పుదల అని కూడ అనొచ్చు—నీవు చివరిలో తీవ్రంగా ప్రతిపక్షాన్ని ఖండిస్తూ నిర్నిబంధంగా పార్టీ విధానానికీ, నెం. 1 కీ నీ అనుబంధాన్ని ప్రకటించావు.'

'ఇదంతా ఆపు. ఆ రకపు ప్రకటన యెలాతయారైందో నీకు తెలుసు. తెలియకపోతే మరీ మంచిది. నీకు పుణ్యముం టుంది, యీ నాటకం ఆపు' అన్నాడు.

'మనం దాదాపు చివరకొచ్చాం. ఇక రెండు సంవత్స రాలున్నయ్, ప్రస్తుతానికి రావటానికి. ఈరెండు సంవత్సరాల్లో నూ నీవు ప్రభుత్వం తాలూకు అల్యూమినియమ్ ట్రస్ట్‌కు అధి పతిగా వున్నావు. సంవత్సరం క్రిందట మూడోసారి ప్రతిపక్ష విచారణలుజరిగేటప్పుడు అందులో ముఖ్యనిందితుడు నీపేరును, అస్పష్ట సంబంధాలతో, తరచు వేర్కొన్నాడు. నమ్మదగిం దేమీ బయటపడలేదు. అయినా పార్టీ వర్గాలలో అనుమానం పెరిగింది. ఇంకాతీవ్రంగా ప్రతిపక్ష నేర స్వభావాన్ని నిరసిస్తూ పార్టీ విధానం యెడల నీ భక్తిని ప్రకటించావు.... ఇది ఆరు నెలల క్రిందట. మరి యివాళ, కొన్ని సంవత్సరాల నుంచి పార్టీ విధానం, నాయకత్వం, తప్పుఅని, ప్రమాదయుతమైన దని నీవు తలుస్తున్నట్లు వొప్పుకొంటున్నావు.'

కాస్తనిదానించి, సుఖంగా మళ్ళీకుర్చీకి చేరగిలబడ్డాడు.

'అలాగైతే నీ మొదటి విశ్వాస ప్రకటనలు నిశ్చిత గమ్యానికి మార్గాలు. నేనునీకు నీతులుచెపుతున్నాననుకోకు. మన మిద్దరం ఒకే సంప్రదాయంలో పెరిగి యీ విషయాల మీద ఒకేరకపు అభిప్రాయాలను పెంపొందించుకున్నాం. నీవు మా విధానం తప్పనీ, నీ విధానం సరైనదనీ నిర్ణయించు కున్నావు. అప్పుడే బహిరంగంగా, యీ విషయం చెప్పివుంటే నీ స్వీయ కార్య కలాపాలను సాగించుకో వీలులేకుండా పార్టీ నుంచి బహిష్కరింపబడే వాడివి, కాబట్టి నీవు దేశంలో సరి

ర్థమైన దనుకొన్న నీవిధాన ప్రచారసాధనకోసం నువ్వు యిలా చెయ్యవలసొచ్చిందన్నమాట. నేనూ నీ స్థానంలో వుంటే అలాగే చేసేవాణ్ణి. ఇంతవరకు అంతా సవ్యంగానే వుంది.'

'మరి యిప్పుడేం జరుగుతుంది?'

ఇవనోవ్ మళ్ళీ సరస మందహాస వదనుడయ్యాడు.

'నా కర్థం కానిదిది. నీ విప్లవాదు బాహాటంగా, మేం విప్లవాన్ని నాశనం చేస్తున్నామని కొన్ని సంవత్సరాలనుంచి భావిస్తున్నట్లు చెప్పావు మళ్ళీ అప్పుడే ప్రతిపక్షానికి చెంది మాకు వ్యతిరేకంగా కుట్ర పన్నలేదంటున్నావు. మేం, నీ వుద్దేశం ప్రకారం, పార్టీని, దేశాన్ని సర్వనాశనంవైపు నడిపిస్తుంటే యింతకాలం నుంచీ చేతులు ముడుచుకొని చూస్తూ కూర్చున్నావని నన్ను నమ్మమంటావా, నిజంగా?'

రుబషోవ్ గూడలెగరవేసి, 'బహుశా నేను చాల ముసలివాణ్ణి, బాగా నలిగిపోయినవాణ్ణి... సరే నీ యిష్టం వచ్చిందనుకో' అన్నాడు.

ఇవనోవ్ సిగరెట్ ముట్టించాడు. అతని కంఠస్వరం ప్రశాంతంగా తీవ్రంగా వుంది.

'నీవు ఆర్లోవాను త్యాగం చేసిందీ, వాళ్ళను' అంటూ గోడమీది తెల్లమచ్చ వైపు గడ్డంతో సైగచేసి - 'నిరసించిందీ నిన్ను కాపాడుకోవటానికేనని నన్ను నిజంగా నమ్మమంటావా?' అన్నాడు.

చాల సేపటివరకు రుబషోవ్ మౌనంగా వూరుకొన్నాడు. ఇవనోవ్ బల్లమీదకు యింకా వంగాడు.

'నీవు నాకేమీ అర్థంకావటంలేదు. అరగంటక్రిందట

అత్యంత వుద్రేకంతో మా విధానంమీద విసుర్లు విసురుతూ వుపన్యసించావు; అందులో ఒక్క మాట చాలు, నిన్ను అంతం చేయటానికి. మళ్ళీ యిప్పుడు ప్రతిసత్యానికి చెందలేదని నిరాకరిస్తున్నావు. ఋజువు చేయటానికి మాదగ్గర కావలసినంత సాక్ష్యం వుంది.'

'నిజంగానా? అంత ప్రబలసాక్ష్యం వుంటే నా వొప్పుదలెందుకు? అయినా యేమిటా సాక్ష్యం?'

'వాటిలో నెం. 1 ప్రాణం తీయటానికిచేసిన ప్రయత్నం' అన్నాడు నెమ్మదిగా. రుబషోవ్ ముక్కద్దాలు పెట్టుకొన్నాడు. మళ్ళీ కొంత నిశ్శబ్దం.

'నన్నొక ప్రశ్న అడగనివ్వు. ఈ తెలివితక్కువసాక్ష్యాల్ని నీవు నిజంగా నమ్ముతున్నావా, లేక నమ్మినట్లు నటిస్తున్నావా?

ఇవనోవ్ కనుకొలకుల్లో పూర్వపు మృదు మంద హాసం కనిపిస్తోంది.

'నీకు చెప్పాను. సాక్ష్యం వుంది. ఇంకా సరిగా చెప్పాలంటే, అది నీ ఒప్పుదలలు. ఇంకా సరిగా చెప్పాలంటే: యెవర్ని నీవు నియమించావో ఆ వ్యక్తి వొప్పుదల.'

'సంతోషం, అతని పేరేమిటి?'

ఇవనోవ్ నవ్వుతూనే వున్నాడు.

'ఒక్తి అవివేకపు ప్రశ్న.'

'ఆ వొప్పుదల నేను చదవొచ్చా? లేక ఆ వ్యక్తిని కలుసుకోవచ్చా?'

ఇవనోవ్ మందహాస వదనంతోనే రుబషోవ్ ముఖం

లోకి, మిత్రహాసంతో సిగరెట్ పొగవూదాడు. అది రుబ షోవ్‌కి బాగుండకపోయినా తలను కదల్చలేదు.

'విషం సంగతి గుర్తుందా?' ఇవనోవ్ నెమ్మదిగా అడిగాడు. 'ఇదివరకే నిన్నడిగాననుకుంటా. ఇప్పుడు పాత్రలు తారుమారయినయ్. ఆనాడు ఆత్మహత్యచేసుకోబోయే పరిస్థితిలో వున్నవాడవు నీవన్నమాట. కాని నాసహాయంతో కాదు. అప్పుడు ఆత్మహత్యకేవలం పాలకవర్గాల విలాసక్రీడ అనినన్ను వొప్పించావు. అదినీవు చేయకుండా చూస్తాను. అప్పుడు మన యిద్దరికీ వంతు తీరిపోతుంది.'

రుబషోవ్ మౌనంగా వున్నాడు. ఇవనోవ్ నిజంగా అంటున్నాడా లేక అబద్ధాలాడుతున్నాడా అని ఆలోచిస్తున్నాడు. గోడమీద మచ్చను చేతితో స్పృశించాలని ఒకవిచిత్రపు కోరిక కలిగింది. 'నరాలు, తీవ్రవాంఛలు, నల్లపెంకుల మీద నడక, అర్థంలేని పదాలగొణుగుడు, చొక్కా చేతిమీద ముక్కద్దాలు తుడవటం - ఇవన్నీ మళ్లీ చేస్తున్నాను...' అనుకొన్నాడు.

'నన్ను వుద్ధరించటాని కేంపథకం వేశావో తెలుకోవాలని చాల కుతూహలంగావుంది. ఇప్పటి వరకు నన్ను నీవు పరీక్షించిన వుద్దేశం దానికి సరిగా వ్యతిరేకం.'

ఇవనోవ్ మరింత మందహాసంచేస్తున్నాడు. 'ఓరివెర్రి ముసలాడా' అని బల్లమీద కింకావంగి, రుబషోవ్ కోటు గుండీ పట్టుకొని, 'నిన్ను యింకోసారి ప్రేలనిద్దామనుకుంటున్నా, నీవు అసందర్భంగా ప్రేలకుండా. ఇక్కడ స్టెనోగ్రాఫర్ కూడలేడు, చూడలా ?' అన్నాడు.

కోటు నుండీ వదలకుండానే సిగరెట్ ఒకటి తీసి రుబషోవ్ నోట్లో పెట్టాడు. 'నీవు చిన్నపిల్లాడిలా, విలాస బాలుడిలా ప్రవర్తిస్తున్నావ్. ఇప్పుడు మనం ఒక చక్కని చిన్న ఒప్పుదలను సృష్టిం చేస్తున్నాం. ఇవాళ దాన్తో సరి.'

రుబషోవ్ చివరికి ఇవనోవ్ పట్టులోనుంచి విడిపించుకో గలిగాడు. ముక్కద్దాల్లో నుంచి తీవ్రంగా చూస్తూ, 'మరి యీ ఒప్పుదలలో యేముంటుందేమిటి?' అనిఅడిగాడు.

'ఈ ఒప్పుదలలో ఫలానా సంవత్సరంలో ప్రతి పక్షంలో ఫలానా వర్గానికి చెందినట్లూ, కాని హత్యచేయటానికే పన్నుగడ పన్న లేదనీ, పై పెచ్చు ప్రతిపక్షపుదారుణ విధ్వంసక యత్నాలు తెలిసినప్పుడు ఆ వర్గంనుంచివిడిపడ్డావనీ వ్రాస్తాం.'

ఆ చర్చ జరుగుతున్నంత సేపటిలో మొదటి సారిగా యిప్పుడు రుబషోవ్ కూడ మందహాసం చేశాడు.

'మన చర్చకంతకీ మూలాశయం అదే అయ్యేట్లయితే, మనం వెంటనే దాన్ని మానెయ్యటం మంచిది.'

ఏమీ విసుక్కోకుండా ఇవనోవ్ అన్నాడు.

'నేను చెపుతున్నది పూర్తికానియ్. నిజానికి నీవు అంగీకరించవని నాకు తెలుసు. ముందు యీ విషయం ధర్మాధర్మాల స్వభావాన్ని గురించి ఆలోచిద్దాం. నీ వంగీకరించే దాన్నిబట్టి నీవు యితరులెవ్వరికీ అపకారం చేసేదిలేదు. నీ కంటే ముందే ఆ మొత్తం అందర్నీ అరెస్టు చెయ్యటం, అందులో సగం మందప్పుడే నాశనం కావటం జరిగింది. నీకూ తెలుసు. ఇతరుల దగ్గరనుంచి యింతకంటే తీవ్రమైన ఒప్పు

దలు తీసుకోగలం; నిజానికి, మాకేవికాలంటే అవి ...ఇప్పటి కైనా నన్నర్థం చేసుకుంటా వనుకుంటాను. నా నిష్కాపట్యం నిన్ను వొప్పిస్తుందనుకుంటాను.'

'అంటే మరో విధంగా చెప్పాలంటే, నెం. 1 మీాద కుట్రకథ నీవూ నమ్మటం లేదన్నమాట. అయితే యీాదొంగ ఒప్పుదల యిచ్చినరహస్యవ్యక్తిని నాయెదకెందుకుపెట్టరు?'

'కొంచెం ఆలోచించు. నాస్థితిలోనే నీవున్నావనుకో— మరోవిధంగా అయితే నాస్థానంలో నువ్వు, నీస్థానంలో నేను వున్నామనుకో—దానికి సమాధానంనీవే ఆలోచించు.'

రుబషోవ్ ఆలోచించాడు. 'అయితే, నా విషయంలో నీకు పైనుంచి స్పష్టంగా ఆదేశాలొచ్చాయన్నమాట.'

ఇవనోవ్ కొంచెంనవ్వి, 'అలాఅంటే కొంచెం తీవ్రంగా అన్నట్టే. యదార్థానికి నీవిషయం 'ఎ' రకంలోనా; 'పి' రకం లోనా జేర్చడం అనే సంగతి నిర్ధారణ కాలేదింకా. నీకు తెలుసుగా వాటిసంగతులు?' అన్నాడు.

రుబషోవ్ తలవూపాడు. అతనికి తెలుసు.

'అర్థం చేసుకో ప్రయత్నించు. 'ఎ' అంటే పాలక సంబంధపు నేరాలు, 'పి' అంటే బహిరంగ విచారణలు.... పాలకవర్గ విచారణఅంటే రహస్యంగా, కొంతవరకు టూకీగా వుంటుంది, నీకు తెలుసుగా. ఎదురుగాపెట్టి ఋజువుచెయ్యటం లాటి వ్యవహారాల కవకాశంలేదు. ఆలోచించు. ...' ఇవనోవ్ యిద్దరిముగ్గురి పేర్లు వుదహరించాడు. తదేక దృష్టితో గోడ మీాది మచ్చవైపు చూచాడు. రుబషోవ్ వైపు తిరిగేటప్పటికి అతని మొఖంలో రుబషోవ్‌కి మొదటిసారిగా, స్పష్టంగా వ్యథ

గోచరించింది. అతనిదృష్టి కదలకుండా రుబషోవ్ పైగాక, అతని వెనుక దూరంగా దేనిమీదనో కేంద్రీకరింపబడింది.

ఇవనోవ్ తమ పూర్వ మిత్రులపేర్లు లోస్వరంతో మళ్ళీ పేర్కొన్నాడు.

'వాళ్లు నీకెంతగా తెలుసో నాకూ అంతగా తెలుసు. మా వైపునాయకులను నాశనం చేస్తే మీ విప్లవం విజయ వంతమౌతుందని మీ నమ్మకం. అలాగే నిన్ను, వాళ్ళని నాశనం చేస్తే మా విప్లవం నాశనమౌతుందని మా నమ్మకం. ఇది నువ్వు ఒప్పుకుతీరాలి. ఇదీ అసలు సంగతి. ఏ పద్ధతులను అను సరించడమనేది చివరకు తేలిన సారాంశాన్నిబట్టి వుంటుంది. న్యాయశాస్త్రపు చిక్కుల్లోబడి మేం నష్టపడలేం. నీ కాలంలో నీవు నష్టపడ్డావా ?'రుబషోవ్ యేమీ మాట్లాడలేదు.

'ఇదంతా నిన్ను 'పి' రకంలో జేర్చటంమీద, నేర విచారణనాచేతుల్లో వుండడంమీద ఆధారపడివుంటుంది. బహి రంగవిచారణ జరిపిన నేరాలు యేదృష్ట్యా నిర్ధారింపబడ్డాయో నీకు తెలుసుగా. నువ్వు కొంతవరకు ఒప్పుకున్నట్లుగా నేను ఋజువు చెయ్యవలసివుంది. అందుకోసం నీ వాఙ్మూలం నువ్వు కొంత ఒప్పుకున్నట్లు నాకు అవసరం అలా గాక నీవు వీరో చితంగా, నీనుంచి కావలసిందేమీ రాదనే అభిప్రాయాన్ని కలిగించావా, ఆ అజ్ఞాత వ్యక్తి వొప్పుదల ఆధారంతో నీపని పూర్తవుతుంది. మరో విధంగా కొంతవరకైనా వొప్పుదలను యిచ్చావా, తరువాత పూర్తిగా విచారించటానికి వీలౌ తుంది. నేరారోపణలోని అసంబద్ధాంశాలను త్రోసివేసి జాగ్ర త్తగా ఆలోచించి, కొన్ని ప్రమాదంలేని హద్దులతో నేరాన్ని

అంగీకరించవచ్చు. అలా అయినప్పటికీ యిరవై సంవత్సరాల కంటే తగ్గించలేం; అంటే నిజానికి రెండు మూడేళ్ళు, ఆ తర్వాత క్షమించి వదలడం; మళ్ళీ ఐదు సంవత్సరాల్లో పార్టీ వర్గంలో వుంటావు. కొంచెం వివేకంతో ఆలోచించి సమాధానం చెప్పు.'

'నే నిదివరకే ఆలోచించాను. నీ సూచన వొప్పుకోను. నీవు చెప్పేది తార్కికంగా యుక్తమే కావచ్చు. కాని యీ తర్కం కావలసినంత నాకూ వుంది. నాకు విసుగెత్తిపోయింది. ఇక యీ నాటకాలాడలేను. దయవుంచి, నా గదికి పంపెయ్.'

'నీయిష్టం. చెప్పగానే వింటావని నే ననుకోలేదులే. సాధారణంగా యిలాంటి చర్చల్లో చివరికి నిరాకరణే ఫలితం కావటం సహజమే. నీకు ఒకపక్షం రోజులు వ్యవధి యిస్తున్నాను. నీవెప్పుడు సిద్ధంగా వుంటావో అప్పుడు నాకోసం కబురంపు; లేదా నీవాఙ్మూలం వ్రాసిపంపు. నీవు తప్పకుండా పంపుతావని నాకు నమ్మకమే లే.'

రుబషోవ్ లేచాడు; ఇవనోవ్ కూడా లేచాడు. ఇప్పుడు కూడ రుబషోవ్ కంటే కొంచెం పొడుగ్గానే కనిపించాడు. బల్ల ప్రక్కనున్న విద్యుద్ఘంట మీట నొక్కాడు. రుబషోవ్ ను వార్డరు వచ్చి తీసుకెళ్ళటానికున్న వ్యవధిలో ఇవనోవ్ చెప్పాడు :

'కొన్ని నెలల క్రితం నీ చివరి వ్యాసంలో రాబోయే దశాబ్దం, మన యుగంలో, ప్రపంచపు గతిని నిర్ణయిస్తుందని వ్రాశావు. అందుకోసమైనా నీ విక్కడుండ దలుచుకోలేదా?'

రుబషోవ్ వైపు చిరునవ్వు నవ్వాడు. ఇద్దరు వార్డర్లు వచ్చి సలాం చేశారు. మారుమాట లేకుండా రుబషోవ్ వాళ్ళ మధ్య కెళ్ళాడు. వాళ్ళు అతని గదికి నడిచారు.

# రెండో విచారణ.

'క్రైస్తవమతానికి ప్రమాదం వాటిల్లినప్పుడు ఆ మతం నీతివిధుల్ని విసర్జించింది. ఐక్యత చరమాశయంగా పెట్టుకొని అవసరమైన ప్రతి సాధనావిధానం 'పవిత్రం చేయబడింది; చివరకు జిత్తులమారితనం, హింస, నమ్మకద్రోహం, ఖైదు, మృత్యువుకూడ పవిత్రమైన సాధనలుగానే యెంచబడినయ్. ప్రతి యేర్పాటు సమాజక్షేమంకోసమే; సమిష్టిక్షేమం కోసం వ్యక్తిని త్యాగంచేయవలసిందే!'

డీట్రిచ్ వాన్ నహీమ్,

వెర్డెన్ బిషప్ :

డీ సిస్మేట్ లిబ్రి III, క్రీ. శ. 1411.

# 1

యన్. యస్. రుబషోవ్ ఖైదు చేయబడిన ఐదవనాటి డైరీలోని భాగం.

'...అంతిమసత్యం యెప్పుడూ వుపాంత్యాన అసత్యంగానే కనిపిస్తుంది. చివరిలో సత్యంగా కనిపించేవాడూ, అంతకుముందు అసత్యంగాను, ప్రమాదంగాను కనిపిస్తాడు

'కాని యెవరు సక్రమమని ఋజువు చేయబడతారు? వారి తరువాత గాని తెలియదు. ఈలోపున చారిత్రక విమోచనంమీద ఆశతో, ఆత్మ నమ్ముకొని అప్పుమీద బ్రతకాలి.

'నెం. 1 యెప్పుడూ, సర్వకాల సర్వావస్థల్లోనూ, మైఖివెల్లీ వ్రాసిన "యువరాజు" పుస్తకం తన పక్కమీద వుంచుకుంటాడని చెప్పుకుంటారు. అంతే అయివుండాలి: అప్పట్నుంచీ రాజకీయ నీతిశాస్త్ర సూత్రాల్ని గురించి నిజంగా ముఖ్యవిషయాలేమీ ప్రసంగించటం లేదు. పంధొమ్మిదో శతాబ్దపు వుదార న్యాయవాదుల న్యాయనాటకపు నీతిశాస్త్రాన్ని మార్చి, యిరవయ్యో శతాబ్దపు విప్లవ నీతిశాస్త్రాన్ని ప్రవేశపెట్టిన మొదటివాళ్ళం మనం. అందులో కూడా మనం సక్రమంగానే వున్నాం: క్రికెట్ ఆట సూత్రానుగుణ్యంగా నడిపిన విప్లవం కేవలం అసంగతం. చరిత్రవిరామ కాలాల్లో, రాజకీయాలు సాపేక్షకంగా న్యాయంగా వుంటాయి: చరిత్ర తీవ్రపరిణామాలు చెందే సమయాల్లో 'అంత్యం తన వినాధాన్ని సమర్థిస్తుంది' అనే పురాణసూత్రం క్రింద రక్షణ పొందటం తప్ప యింకో మార్గం లేదు. మనం యీదేశంలో, నవ్య మైఖివెల్లీ తత్వాన్ని ప్రవేశపెట్టాం; ఇతరాలు, అంటే విప్లవ వ్యతిరేకమైన నియంతృత్వాలు, దానిని అసహ్యంగా అనుకరించాయి. మనం విశ్వన్యాయంపేరుతో, నవ్య మైఖివెల్లి తాత్వికులం - అది మన గొప్పదనం; యితరులు జాతీయ విప్లవంపేరుతో వుంటారు, అది వాళ్ళ కాల వ్యతిక్రమం. కాబట్టి తుదకు మనం చరిత్రవల్ల వుద్ధరింపబడతాం, కాని వాళ్లు కాదు...

'అయినప్పటికీ, ప్రస్తుతం మనం మనచర్యలు మంచిఫలితాలు తేగల

వని ఆలోచిస్తున్నాం, అందుకు పనిచేస్తున్నాం. మనం క్రికెట్ ఆటసాంప్రదాయాలవంటి నీతిసూత్రాలను అవతల పారవేశాం గాబట్టి, మనకు మార్గదర్శకం అయ్యేది పరిస్థితులకు అనుకూలమయ్యే హేతువాదం. మనం, మన వుద్దేశాలను చివరివరకూ అనుసరించవలసిన భయంకర విధిబద్ధులమై, తదనుగుణ్యంగా నడుచుకోవలసి వున్నాం. మన నావ లోబరువులేకుండ ప్రయాణిస్తోంది; అందువల్ల చుక్కాని ముట్టుకున్నప్పుడల్లా మనకు జీవన్మరణ సమస్య యేర్పడుతోంది.

'కొద్దికాలం క్రిందట బి అనే ప్రసిద్ధ వ్యవసాయదారుడు, క్షారపు యెరువులకంటె కాడికారపు కృత్రిమపు యెరువులు మంచివన్నందుకు, అతని 30 మంది అనుచరులతోసహా కాల్చి చంపబడ్డాడు. నెం. 1 క్షారం యెరువు పూర్తిగా మంచిదంటాడు. అందువల్ల బి తో బాటు 30 మందీకూడ విధ్వంసకులుగా సమాప్తిజెందారు. జాతీయ కేంద్రిత వ్యవసాయంలో కాడి కారం, క్షారాల్లో యేది మంచిదో చెప్పడం చాల ముఖ్యమైంది: అది భవిష్యత్ యుద్ధసమస్యను నిర్ణయించగలదు. నెం. 1 సక్రమంగానే వర్తించినట్లయితే చరిత్రలో ప్రసిద్ధికెక్కుతాడు, 30 మందిని వురితీయటం కేవలం దంతపుగుండ్ల ఆటగామాత్రమే వుంటుంది. అతను తప్పుగా ప్రవర్తిస్తే...

'ఆదొక్కటే ఆలోచించాల్సిన విషయం: ఎవరిది హేతుపూర్వక న్యాయం. క్రికెట్ నీతిపరున్ని యింకో సమస్య కలవరపెట్టింది: కాడికారాన్ని యెంచినప్పుడు బి వుద్దేశపూర్వక సదుద్దేశంతో వున్నాడా లేదా? అలా కాకపోతే, చివరికి క్షారంకంటె కాడికారపు యెరువులు మంచివని నిరూపణయినప్పటికీ వాళ్ళ నీతిప్రకారం, అతన్ని కాల్చవలసిందే. అతను సదుద్దేశంతో వుండి చెప్పినట్లయితే, కాడికారపు యెరువులవల్ల దేశం సర్వనాశనమైపోయినా సరే, అతన్ని విడుదల చేసి అతని అభిప్రాయ ప్రచారానికి అనుమతివ్వవలసిందే...

'అది నిజంగా, పూర్తిగ బుద్ధిహీనత. మనకు వుద్దేశిత సుస్వభావం అనే ప్రశ్న లేదు. తప్పుచేసినవాడే చెల్లించాలి; సక్రమంగా వున్నవాడే విముక్తి పొందుతాడు. అదే చారిత్రక ఋణధర్మం; మనధర్మంకూడ.

'తరచు అసత్యం సత్యంకంటె యెక్కువ వుపయోగిస్తుందని చరిత్ర మనకు నేర్పింది; మానవుడు సోమరిగా వుంటాడు గనుక ఆత్మాభివృద్ధికి వేసే ప్రతి ఒక్కడుగుముందూ, నలభైసంవత్సరాలపాటు యెడారిప్రయాణం

చెయ్యాలి. ఆ కాలంలో సోమ్రపోతుగా తయారై, మనస్సును విగ్రహారాధన కోసం మళ్ళించకుండా చెయ్యడానికై అతన్ని బెదిరింపులతో, వాగ్దానాలతో, వూహించ భయోత్పాతాలతో, వోదార్పులతో యెడారి అంతా త్రిప్పాలి.

'మనం చరిత్రను యితరులకంటె స్పష్టంగా నేర్చుకున్నాం. ఇతరులందరితోను తార్కికానుగుణ్యత విషయంలో విభేదిస్తాం. చరిత్రకు సౌశీల్యంతో నిమిత్తంలేదు; నేరాలు అశిక్షితంగానే మిగిలిపోతాయని మనకు తెలుసు; కాని ప్రతి పొరబాటుకీ పర్యవసానం వుండి యేదో తరంలోనైనా కక్ష తీర్చుకుంటుంది. అందువల్ల మనం యే పొరబాటు చేయకుండా, దాని బీజాల్ని నిర్మూలించటానికి మన శక్తి సంతటినీ కేంద్రీకరించాం. మానవజాతి భవిష్యత్తుమీద, మనవిషయంలో వున్నట్టు, అంత అధికారం, శక్తీ చరిత్రలో మరెప్పుడూ యింత కొద్దిమందిచేతుల్లో కేంద్రీకరింపబడలేదు. మనం తప్పు డభిప్రాయాలననుసరించేట్లయితే ప్రతి అభిప్రాయంవల్ల భవిష్యత్తరాలకు మనం ఒక్కొక్క నేరం చేసినట్లే. కనుక, యితరులు నేరాల్ని మరణంతో శిక్షిస్తే, మనం తప్పు డభిప్రాయాలకే మరణశిక్ష వెయ్యాలి. మనం పిచ్చివాళ్ళక్రింద జమ; యెందుకంటే ప్రతి అభిప్రాయాన్నీ దాని అంతిమ పర్యవసానంవరకు అనుసరించాం; తదనుగుణ్యంగా నడిచాం. మనం జిజ్ఞాసువుల్తో పోల్చబడ్డాం; యెందుకంటే వాళ్ళలాగ అతీత వ్యక్తిత్వజీవితంకోసం చేసే ప్రయత్నంలో సదా సంపూర్ణబాధ్యతా భారం మనం వహించాం. మనం మానవుని కార్యాల్లోనే గాక, ఆలోచనల్లోని విష బీజాల్ని కూడ నాశనం చేశాం. గాబట్టే మనం మహాజిజ్ఞాసువులతో పోల్చబడ్డాం. మానవుడిలో, చివరికి మెదడులోకూడ ప్రత్యేకస్థానాన్ని మిగల్చలేదు. మనం మన విశ్వాసాల అంతిమనిర్ణయాలను ఆచరణలో పెట్టేంతవరకూ పాటుబడాల్సిన వొత్తిడి పరిస్థితిలో బ్రతికాం. ఏమాత్రపు స్వల్పమార్గమైనా నైతికపతనాన్ని కల్గించేటంతగా మన మనస్సులు భావపూరితాలై వున్నయ్. ఆవిధంగా మనం పరస్పర నాశన విధిబద్ధులమై వున్నాం.

'నేను అందులో ఒకణ్ణి. నేను వలసినవిధంగా ఆలోచించి, ప్రవర్తించాను. నా ప్రీతిపాత్రుల్ని నాశనంచేశాను, నాకిష్టంలేనివాళ్ళకు అధికారాన్నిచ్చాను. నేనుచేసిన పనులను చరిత్రచేయించింది. దానికి నావల్ల ప్రయోజనం తీరిపోయింది. నేను సక్రమంగా వర్తించివుంటే పశ్చాత్తప్తుడను కానక్కర

లేదు ; లేదా మూల్యం చెల్లించాలి.

'భవిష్యత్తులో ఏది సత్యమని నిర్ధారణ కాగలదో వర్తమానం యెలా నిర్ణయించగలదు ? ప్రవక్తలకుండే వరప్రసాదితశక్తి లేకుండా వారిలాగ ప్రవర్తిస్తున్నాం. మనం అంతర్దృష్టికి బదులు తార్కికసారాంశాన్ని ఆశ్రయించాం. మనమందరం ఒకేచోట బయలుదేరినప్పటికీ విభిన్న ఫలితాలను పొందాం సాక్ష్యం సాక్ష్యాన్నే ఖండించింది. చివరికి మనం విశ్వాసాన్ని – నా బుద్ధికితోచినది న్యాయమనే పరమవిశ్వాసాన్ని – అంటిపెట్టుకోవలసివచ్చింది. అదే అసలు కీలకాంశం. మనం నావలోని లోటుపును తీసి పారవేశాం. ఒకే లంగరు మనల్ని ఆపుతోంది – ఆత్మవిశ్వాసం. మానవ వివేచనాశక్తి పరిశుద్ధసిద్ధి పొందిన ఫలితమే రేఖాగణితం. కాని యూక్లిడ్ సిద్ధాంతాలు ఋజువు కావు. వాటిలో నమ్మకంలేనివాడికి మానవ వివేచనాశక్తి నేలకూలినట్లుగా కనిపిస్తుంది.

'నెం. 1 కి శిలాసదృశమైన, నెమ్మదియైన, భయంకరమైన, అచలితమైన ఆత్మవిశ్వాసం వుంది. అతని చేత అతి గట్టిలంగరు వుంది. నాది గత కొద్దిసంవత్సరాల్లోనూ క్షీణించిపోయింది....

'యదార్థం యేమిటంటే : నాకు నా సర్వజ్ఞత్వంలో యిక నమ్మకం లేదు. అందువల్లనే యిలా ఐపోయాను.'

## 2

రుబషోవ్ మొదటి విచారణనాటి మరుసటి రోజున, విచారణాధికారి ఇవనోవ్ అతని సహచరుడు గ్లెట్కిన్ మధ్యాహ్న భోజనానంతరం క్యాంటిన్‌లో కూర్చున్నారు. ఇవనోవ్ అలసిపోయి వున్నాడు, తన అవిటికాలును యింకో కుర్చీమీద పెట్టుకొని యూనిఫారం కోటుకాలర్ వూడతీశాడు. క్యాంటిన్‌లో దొరికే చౌకబారు సారా త్రాగుతున్నారు. గంజిపెట్టి యిస్త్రీచేసిన యూనిఫారం ప్రతి కదలి

కనూ క్షీణమౌతూంది. గ్లెట్కిన్ ఇవనోవ్ కెదురుగా బిగ్రబిగిసి కూర్చున్నాడు. అతనుకూడ అలసిపోయి వున్నప్పటికీ రివాల్వర్ బెల్టునైనా తీయకుండానే కూర్చున్నాడు. గ్లెట్కిన్ కూడ ఒకగ్లాసు ఖాళీచేశాడు. నున్నగా గొరిగిన తలమీద ప్రధానంగా కనిపించే గాయపు మచ్చ కొంచెం యెర్రబడింది. క్యాన్టిన్‌లో పిళ్ళకు దూరంగా యింకా ముగ్గురు వుద్యోగులు మాత్రం కూర్చుని వున్నారు. అందులో యిద్దరు చదరంగం ఆడుతుంటే, మూడోవాడు చూస్తున్నాడు.

'రుబషోవ్ కిప్పుడేమౌతుంది?' గ్లెట్కిన్ అడిగాడు.

'ఇంకా పెడబార్లోనే వున్నాడు. కాని యిదివరకంత తార్కికంగానూ వున్నాడు అందువల్ల మనకు వశమౌతాడు.'

'అది నేను నమ్మను.'

'అవుతాడు. ప్రతి విషయాన్నీ తార్కిక ఫలితాల దృష్ట్యా ఆలోచించినప్పుడు అతను వశమౌతాడు. అందువల్ల అతన్ని కదిలించకుండ, ప్రశాంతంగా వుండనివ్వటం చాల అవసరం. అతనికి కాగితం, పెన్సిల్, సిగరెట్లనుమతించాను - అతని ఆలోచనాక్రమాన్ని సక్రమాభివృద్ధి చేయటానికి.'

'అదే తప్పనుకుంటాను.'

'అతనంటే నీకిష్టంలేదు. కొద్దిరోజులక్రిందట అతనితో తగాదాపడ్డావనుకుంటాను.'

రుబషోవ్ బల్లమీద కూర్చుని చిరిగిన మేజోడుమీద నుంచి బూటుతీస్తున్నప్పటి దృశ్యం గ్లెట్కిన్‌కి జ్ఞప్తికొచ్చింది.

'ఆఁ, దాన్దేముంది! అతని వ్యక్తిత్వానిదేముందిలే! అతనిపట్ల మనవిధానమే, నేను తప్పనేది. ఆ పద్ధతి యెప్పుడూ

అతన్నీ లొంగదీయాలి.'

'రుబషోవ్ వశీభూతుడ్యాడంటే భయపడిమాత్రంకాదు; తార్కికంగానే. అతనిమీద హింసాపద్ధతి ప్రయోగించటం వల్ల ప్రయోజనంలేదు. సమ్మెటపోటు తగిలినకొద్దీ కఠిన మయ్యే పదార్థంతో తయారయ్యాడతను.'

'అవన్నీ వొట్టికబుర్లు. శారీరకంగా యెంతబాధనైనా భరించగల మానవులుండరు. నే నింతవరక కెవ్వర్నీ చూడలేదు. నా అనుభవంలో స్వాభావికంగా శరీరనరాలు కొంతవరకు మాత్రమే బాధ భరించగలవు.'

'నీ వాదాన్నొప్పుకోను' చిరునవ్వుతో కొంచెం విసుగును సూచిస్తూ అన్నాడు. 'ఎలాగైనా, నీ సిద్ధాంతం తప్పు అనడానికి నువ్వే తార్కాణం.'

అతని మందహాసదృష్టి క్షణంసేపు గ్లెట్కిన్ నెత్తిమీద గాయపు మచ్చమీద పడింది. ఆ మచ్చచరిత్ర అందరికీ తెలిసిందే. అంతర్యుద్ధకాలంలో, గ్లెట్కిన్ శత్రువుల చేతుల్లో పడ్డాడు. వాళ్లు అతన్నుంచి కొంత సమాచారం సేకరించటానికి నున్నగాగొరిగిన అతనినెత్తిమీద కాలుతున్న క్రొవ్వువత్తి కట్టారు. కొన్ని గంటల తర్వాత గ్లెట్కిన్‌వర్గం తిరిగి శత్రువును ముట్టడించారు. తర్వాత చూస్తే గ్లెట్కిన్ స్పృహతప్పి పడివున్నాడు. క్రొవ్వువత్తి నెత్తిని బాగా లోపలికి కాల్చింది. గ్లెట్కిన్ మౌనంగా వున్నాడు.

ఇవనోవ్‌వైపు అస్పష్ట దృక్కులతో చూచాడు. 'అవి కూడా వట్టి కబుర్లే. నేను మూర్ఛపోయాను గనుక వాళ్ళకు లొంగలేదు. ఇంకో క్షణంసేపు స్పృహతో వుంటే యేదో చెప్పే

వాణ్ణే. అది శరీర తత్వాన్నిబట్టి వుంటుంది.'

నిర్లక్ష్యపు భంగిమతో గ్లాసును ఖాళీచేశాడు; గ్లాసు బల్లమీదపెట్టేప్పుడు కఫ్‌లు కిరుక్కుమన్నయ్.

'నాకు స్పృహవచ్చినతర్వాత వాళ్ళకు యేదో చెప్పా ననే అనుకున్నా, కాని నాతోవున్న యిద్దరు యన్. సి. ఓలు అలా యేమీ చెయ్యలేదని చెప్పారు. ఆ విధంగా నేను గౌర వింపబడ్డాను. అదంతా శరీర తత్వాన్నిబట్టి వుంటుంది; తక్కిన వన్నీ కట్టుకథలు.'

ఇవనోవ్ కూడ త్రాగుతున్నాడు. ఇప్పటికే ఆ చౌక బారు సారా చాల త్రాగాడు. భుజాలు యెగురవేశాడు.

'ఎప్పటినుంచి యీ అద్భుత శరీరతత్వ వాదం?'

'యదార్థానికి మొదటిరోజుల్లోయీాపదముల్లేవు. అప్పుడు మనం పూర్తిగా భ్రమ పూరితులంగా వున్నాం. శిక్షలరద్దు; నేరానికి ప్రతీకారం; పతితులకు పుష్పవన ఆరోగ్య మందిరాలు, యిదంతా బూటకం.'

'అలాఅని నేను నమ్మను. నీవు విరక్తుడవు. ఒక వంద సంవత్సరాల్లోపల అదంతా సాధిస్తాం. కాని ముందు మనం బయటపడాలి. ఎంత త్వరగా అయితే అంతమంచిది. ఆకాలం అప్పుడే వచ్చిందనుకోవటంలోనే భ్రమపడ్తున్నాం. నన్ను యిక్కడ వేసిన మొదట్లో, నేనూ ఆ భ్రమలోనే వున్నాను. మనలో చాలాభాగం – క్రిందినుంచి పైవరకూవున్న యంత్రం – అంతే. ముందుగానే పుష్పవనాలతో ప్రారంభించా లనుకొం టాం. అదే తప్పు. ఒక వందసంవత్సరాల్లోగాని నేరస్థునిలో వివేకాన్ని, సాంఘిక ప్రవృత్తిని చూడలేం. ఇవాళ అతనిశరీర

తత్వంతోనే పనిచేయాలి; అవసరమైతే శారీరకంగా, మాన సికంగా నొక్కేసెయ్యాలి.'

గ్లెట్కిన్ తప్పు త్రాగాడేమోనని ఇవనోవ్ ఆశ్చర్య పడ్డాడు. కాని ప్రశాంతంగావున్న అవ్యక్త దృష్టినిచూచి కాదనుకున్నాడు. ఇవనోవ్ వుద్దేశ రహితంగా అతని వైపు చిరునవ్వుతో చూచాడు. 'ఒక్కమాటలో, నేను విరక్తుణ్ణి, నీవు నీతి మంతుడవు.'

గ్లెట్కిన్ మాట్లాడలేదు. బిగబిగిసిన యూనిఫారంలో నిట్టంగా కూర్చున్నాడు. రివాల్వర్ బెల్టు క్రొత్తతోలు వాసన కొడ్తోంది. కొద్దిసేపైన తర్వాత,

'చాల సంవత్సరాలక్రితం ఒక చిన్నరైతును అడ్డు పరీక్షకోసం నాదగ్గరకు తీసుకొచ్చారు. నీవు అంటున్నట్టు మనం పుష్పవన తత్వంలో వున్నరోజుల్లో, పల్లె ప్రాంతంలో జరిగిందిది. అడ్డుపరీక్షలు చాలా పెద్దమనిషి తరహాలో జరి గేవి. ఆ రైతు తన పంటను పాతిపెట్టాడు; అవి సమిష్టి వ్యవ సాయం ప్రవేశపెడుతున్న రోజులు. నేను అతి జాగ్రత్తగ నిర్ణీత మర్యాదకు కట్టుబడివున్నాను. పరిశ్రమల నిర్మాణా నికి, పెరుగుతున్న పట్టణ జనాభాకుధాన్యం కావాలని, యెగు మతుల కూడా కావాలని, అందువల్ల తాను ధాన్యంయెక్కడ దాచాడో చెప్పవలసిందని స్నేహపూర్వకంగా వివరించాను. అతను నాదగ్గరికి వచ్చినప్పుడు దెబ్బలు తగుల్తాయేమోనని గూడలు బిగపట్టి వచ్చాడు. ఆ రకం నాకు తెలుసు; నేనూ పల్లెటూరినుంచి వచ్చినవాణ్ణేగా. కొట్టటానికి బదులుగా అత నితో వాదించటం మొదలుపెట్టాను; నాతో సమాన

హోదాలో మర్యాదగా 'పౌరుడా' అని పిలిచి మాట్లాడాను; నన్నొక వెధవగా చూచాడు. ఆ భావం అతని కళ్ళల్లోనే కనిపించింది. అరగంటసేపు మాట్లాడాను. అతను నోరు మెదపలేదు, పైగా ముక్కు, చెవులు తుడుచుకో మొదలెట్టాడు. నేను చెప్పిందంతా వేళాకోళంగా తీసుకుంటూ, యేమీ వినటంలేదని తెలిసికూడ మాట్లాడుతూనే వున్నాను. నావాదన అతని చెవుల్లో యేమాత్రం దూరలేదు ఆ చెవులు, శతాబ్దాల పూర్వం నుంచీ పెరిగిన పశువాతపు మైనంతో పూడిపోయి వున్నయ్. నేను ఖచ్చితంగా, నియమబద్ధంగా వున్నాను; కాని యింకా యితర మార్గాలున్నాయని తెలియదు వాడికి ...

'ఆరోజుల్లో యిటువంటివి రోజూ యెగవై హెచ్చుగా వుండేవి. నా తోటివాళ్ళకూడా యింతే. ఈ బండరైతుల మూలాన విప్లవం నాశనమైపోయే ప్రమాదంలో పడింది. కార్మికులకు ఆహారకొరత, జిల్లాలన్నీ ఆకలి జ్వరాలతో నాశనమైపోయినయ్. ఆయుధపరిశ్రమను వృద్ధిచేయటానికి పెట్టుబడి కనిపించలేదు ; యే నెలకానెల దాడిప్రమాదం యెక్కువౌతున్నది. వీళ్లు పండినపంటలో సగభాగం భూస్థాపితం చేశారు. రెండువందల మిలియన్లు ( 20 కోట్లు ) ఖరీదుచేసే బంగారాన్ని వున్నిమేజోళ్ళలో దాచారు. వాళ్ళని అడ్డుపరీక్ష చేసేటప్పుడు, 'పౌరులు'గా సంబోధించేవాళ్ళం; మేం చెప్పేదంతా వేళాకోళంగా భావించి, ముక్కులు తుడుచుకొంటూ, వెధవజిత్తుల కళ్ళతో మావైపు మిటకరించి చూచేవాళ్లు.

'నేను చెపుతున్నవాడిని మూడోసారి, రాత్రి రెండు గంటలవేళ విచారించాను ; అప్పటికి పద్ధెనిమిదిగంటల్నుంచి

తెరపి లేకుండా పని చేస్తున్నా. వాణ్ణి లేపారు ; 'మహా గాఢ నిద్ర పోయాడు. చట్టున లేపగానే భయపడ్డాడు. భయపడి అసలు సంగతి చెప్పేశాడు. అప్పటినుంచి ముఖ్యంగా అడ్డుపరీక్షలు రాత్రిళ్లే చేసేవాణ్ణి....ఒకసారి, ఒకమ్మాయి నా గది బయట రాత్రంతా నిలబెట్టబడి వున్నానని ఫిర్యాదు చేసింది. ఆవిడ కాళ్ళు వొణుకుతున్నయ్, బాగా అలిసిపోయింది; విచారణ మధ్యలో నిద్రపోయింది ఆవిణ్ణి లేపాను ; గొణుగుడు స్వరంతో తా నేమి చెపుతున్నదీ తనకు తెలియకుండానే చెప్పుకుపోయింది, మళ్ళీ నిద్రపోయింది. మళ్ళీ లేపాను ; ప్రతిదీ వొప్పుకొని, వాఙ్మూలంమీద చదవకుండానే సంతకం చేసింది, త్వరగా నిద్రపోవచ్చుగదా అని. ఆ అమ్మాయిభర్త తనకు క్రీస్తుయొక్క శత్రువు కలలో కనిపించాడనీ, అందుచేత పంటనంతా తగలబెట్టవలసిందనీ గ్రామస్థులకు చెప్పి, తన కొట్టంలో రెండు మరతుపాకుల్ని దాచాడు, అతని భార్యని రాత్రంతా నిలబెట్టి వుంచడం కేవలం కాపలాసిపాయి నిర్లక్ష్యంవల్ల నేతప్ప, వుద్దేశంతో జరగలేదు. అప్పటినుంచిఅలాంటి నిర్లక్ష్యాన్ని ప్రోత్సహించాను ; మొండివాళ్ళను ఒకేచోట నలభై యెనిమిది గంటలుకూడ నిలబెట్టేవాళ్ళు అప్పటికి వాళ్ళ చెవుల్లో మైనం కరిగి వాళ్ళతో మాట్లాడ వీలయ్యేది....'

వీళ్ళ కవతలగా చదరంగం ఆడుతున్న యిద్దరూ బల్ల మీద పావుల్ని తీసేసి క్రొత్తఆట మొదలెట్టారు; మూడోవాడు చాలాసేపటి క్రితమే వెళ్ళిపోయాడు. గ్లెట్కిన్ మాట్లాడుతున్నంతసేపూ, ఇవనోవ్ అతన్ని పరీక్షగా చూచాడు. అతని స్వరం మామూలుగానే స్థిమితంగా, యాదాలాపంగావుంది.

'నా సహచరులకు కూడ యిటువంటి అనుభవాలే కలిగినయ్. ఇదొక్కటే సత్ఫలితాలను పొందేమార్గం. నియమాలుకూడ పాటించబడినయ్, యెవ్వరూ దీనిముట్టుకోలేదు. కాని వాళ్లు తమతోటి వైద్యులు ప్రతీయటం చూడటం జరిగింది. ఇది యాదృచ్ఛికంగా జరిగిందనే చెప్పాలి. అటువంటి సృశ్యాల ఫలితం, పాక్షికంగా మానసికం, పాక్షికంగా శారీరకం. ఇంకో వుదాహరణ: ఆరోగ్యం కోసం స్నానాలు, నీటి జల్లులుండేవి. శీతాకాలంలో సాంకేతిక కారణాల వల్ల వేడినీటి పంపులు యెప్పుడైనా పనిచేసేవికావు, నౌకర్ల శ్రద్ధనుబట్టి స్నానాలకు నీరువచ్చేది. కొన్నిసార్లు వేడినీటి పంపులు చాలబాగా పని చేసేవి. అదికూడ నౌకర్లమీదే ఆధారపడివుండేవి. వాళ్ళంతా పాత కామ్రేడ్స్, వాళ్ళకుపూర్తిగా చెప్పనక్కరలేదు. వాళ్లకు యెప్పుడెలా ప్రవర్తించాల్సిందీ తెలుసు.'

'అదంతా యెలా చెయ్యాలనేదానికి.'

'నాతత్వం నేను యెలా కనిపెట్టానని అడిగావు, అందువల్ల వివరిస్తున్నాను. ఇక్కడ గణించాల్సిన విషయం యేమిటంటే చివరకేది అవసరమో దాన్ని మనసులో వుంచుకోవాలి, లేకపోతే, విరక్తుల మాత్రాం, నీలాగ. ప్రొద్దుపోతోంది. నేను వెళ్ళాలి.'

ఇవనోవ్ గ్లాసుఖాళీచేసి అవిటికాలుకుర్చీమీద పెట్టాడు. కాలుమొదల్లో వాతనొప్పులొచ్చినయ్. ఈ సంభాషణ తను వుపక్రమించినందుకు చాల విచారించాడు.

క్యాంటీన్ బిల్లు గ్లెట్కిన్ చెల్లించాడు. క్యాంటీన్ వాడు

వెళ్ళినతరువాత 'రుబషోవ్‌కి యేంజరుగుతుంది?' అని అడిగాడు.

'నావుద్దేశం చెప్పానుగా. ప్రశాంతంగా వుండనివ్వాలి.'

గ్లెట్కిన్ ఇవనోవ్ కాలుపెట్టిన కుర్చీ ప్రక్కన నిలబడ్డాడు; నిలబడినప్పుడు బూట్లు కిర్రుమన్నయ్.

'అతనిలోని గత యోగ్యతల్ని గుర్తించాను. కాని ప్రస్తుతం నేను చెప్పినరైతు కంటె యెక్కువ ప్రమాదంగా తయారైనాడు.'

ఇవనోవ్ అతని మొద్దుకళ్ళల్లోకి చూచాడు.

'ఫలితంకోసం నేనతనికి పదిహేను రోజుల వ్యవధి నిచ్చాను. అప్పటివరకు ప్రశాంతంగా వుంచాలనుకుంటున్నా.'

ఇవనోవ్ తన అధికార స్వరంతో అన్నాడు. గ్లెట్కిన్ అతనిక్రింది వుద్యోగి. బూట్లు కిర్రుమంటూ ఇవనోవ్‌కి సలాం చేసి వెళ్ళిపోయాడు.

ఇవనోవ్ కూర్చునే వుండి, యింకో గ్లాసు ఖాళీచేసి, సిగరెట్ వెలిగించి, తనముందే పొగచక్రాల నూదుతున్నాడు. కొంతసేపటికి గెంతుకుంటూ చదరంగం ఆట చూడటానికి వాళ్ళదగ్గర కెళ్ళాడు.

## 3

అతని మొదటి విచారణానంతరం రుబషోవ్ జీవిత ప్రమాణం ఆశ్చర్యకరంగా పెరిగింది. ఆ మరునాటి వుదయమే ఆ ముసలి కాష్‌దారు పేపరు, పెన్సిల్, సబ్బు, తుండు అన్నీ తెచ్చిచ్చాడు. అతను జైలుకు వచ్చేటప్పటికి తనదగ్గర వున్న

రొఖ్ఖం విలువను సరిపడు జైలుచీట్లు కూడ తెచ్చిపెట్టి, యిప్పుడు తనకేమి కావలసినా పొగాకు, అదనపు ఆహారం వగైరాలు ఖైదీల క్యాంటిన్నుంచి తెప్పించుకోగల హక్కున్నదని చెప్పాడు.

రుబషోవ్ సిగరెట్లు, కొంత ఆహారం కావాలన్నాడు. ముసలివాడు తన సహజ చరచరస్వభావంతోను, యేకాక్షర శబ్ద సమాధానాలతోనే వున్నాడు. కాని సకాలంలోనే రుబషోవ్ అడిగినవాటిని తెచ్చాడు. జైలు బయటనుంచి ఒక డాక్టరును పిలిపించుకొందా మనుకొన్నాడు, కాని మర్చిపోయాడు. ప్రస్తుతం పంటినొప్పిలేదు. పరిశుభ్రంగా కడుక్కొని భోజనం చేసిన తర్వాత చాలా బాగా తృప్తిపడ్డాడు.

లో ఆవరణలోని మంచుని తుడిచివేశారు; ఖైదీలు తమ దిన వ్యాయామంగా ఆవరణంచుట్టూ నడుస్తున్నారు. మంచువల్ల వ్యాయామం ఆపివేశారు; ఒక్క తొర్రిపెదవివాడు, అతని సహచరుడు మాత్రం రోజూ పదినిమిషాలపాటు, బహుశా డాక్టరు ప్రత్యేక సలహాతో, వ్యాయామం చేస్తున్నారు. తొర్రిపెదవివాడు అక్కడికొచ్చేటప్పుడు, వెళ్ళేటప్పుడు రుబషోవ్ కిటికీవైపు చూస్తాడు. ఆభంగిమ యేమాత్రపు అనుమానానికి చోటివ్వదు.

రుబషోవ్ నోట్సు వ్రాసుకోకుండా, పచార్లు చేయకుండా వున్నప్పుడు కిటికీ బద్దకి నుదురానించి ఖైదీలువ్యాయామం చేస్తుంటే చూస్తూ వుండేవాడు. ఈ వ్యాయామం, పన్నెండుమందిని ఒకేసారి తీసుకొచ్చి యిద్దరిద్దర్ని జట్లుగా యేర్పరచి, ఒకొక్క జట్టును పదడుగులదూరంతో దొడ్డిచుట్టూ

పర్యవేక్షించేవారు. మధ్యలో నలుగురు యూనిఫారం పుడ్డోగులు నిలబడి ఖైదీలు పరస్పరం మాట్లాడుకోకుండా చూస్తూంటారు. ఈ నలుగురు, ఖైదీల తిరుగుడుచక్రానికి యెదురుగా వున్న ట్లుండేవారు; వ్యాయామం సరిగా యిరవై నిమిషాలు సాగేది. వీళ్ళని వ్యాయామం అయిపోగానే జైలుభవంతికి కుడివైపు ద్వారంగుండా లోపలికి తీసుకుపోగానే, యెడంవైపునుంచి యింకోజట్టును తీసుకొచ్చేవారు; వాళ్ళుకూడ తరువాతవాళ్లు వచ్చేవరకు యీ యేకరీతివ్యాయామం చేసేవాళ్లు.

మొదటి కొద్దిరోజులు రుబషోవ్, పరిచితముఖాలు కని పిస్తవేమోనని చూచాడు, కాని యేమీ కనిపించలేదు. అది అతనికి వుపశమనం కలుగజేసింది; బాహ్యప్రపంచపు స్మృతుల్ని వీలైనంతవరకు తన ప్రస్తుత కార్యానికి విఘ్నం కలుగకుండ చేసుకోవాలనుకున్నాడు. భూత, భవిష్యత్తులతోనూ, జీవన, మరణాలతోనూ రాజీపడి, తన అభిప్రాయాల అంతిమనిర్ణ యానికి రావటమే అతని కార్యం. ఇవనోవ్ అతనికిచ్చిన గడువు యింకా పదిరోజులుంది.

తన అభిప్రాయాలను వ్రాతమూలకంగానే అట్టిపెట్ట గలడు, కాని రోజుకు ఒకటి రెండుగంటలు వ్రాసేటప్పటికే పూర్తిగ అలిసిపోయి అంతకంటె యెక్కువ చేయలేకపోతు న్నాడు. మిగతా కాలంలో మెదడు దానిష్టమొచ్చినట్టు పని చేస్తోంది.

రుబషోవ్‌కి తనను గురించి తనకు బాగా తెలుసునని యెప్పుడూ నమ్మకం. అతనికి నైతిక విద్వేషాలు లేవుగనుక 'ఉత్తమ పురుష యేకవచనం' మనే తత్వం గురించిన భ్రమ

లేమీ లేవు; సాధారణంగా ప్రజలు అంగీకరించమనస్కరించని కొన్ని ప్రత్యేక ప్రదేశాలు యీ తత్వానికి వున్నాయని విశ్వసించాడు. ఇప్పుడు, కిటికీకి ఎదురానించి నిలబడినప్పుడో, హఠాత్తుగా మూడో నల్ల పెంకుమీద ఆగివున్నప్పుడో, ఆకస్మిక శోధనలు చేస్తున్నాడు. 'స్వగతం' అని తప్పుగా పిలవబడే విధానాలు నిజంగా ఒక రకమైన సంభాషణలు; తన ప్రద్దేశాలను అణిచిపెట్టుకొని, ఆత్మవిశ్వాసం కలిగించుకోవటం కోసం 'నీవు' అనటానికి బదులు 'నేను'అని వ్యాకరణ సూత్రాలకు భిన్నంగా సంబోధించుకొని, ఒక పాత్ర నిశ్శబ్దంగా వుండి, రెండో పాత్ర మాట్లాడే సంభాషణ యిది; నిశ్శబ్దంగా వున్న పాత్ర నిశ్శబ్దంగానే వుండి, పరిశీలనకు మరుగుపడి, స్థల, కాల అవధులకందకుండానే వుంటాడు.

ఇప్పుడు, యెలాగైనా, ఆ నిశ్శబ్దపాత్రను సంబోధించక పోయినా, అది అప్పుడప్పుడూ సంభాషిస్తున్నట్లు రుబషోవ్‌కి గోచరిస్తోంది. అతని స్వరమే రుబషోవ్‌కి పూర్తిగా అపరిచితంగా, నిజంగా ఆశ్చర్యపరుస్తూ వినిపిస్తోంది; అతని పెదవులే కదల్తున్నట్లు గుర్తించాడు. ఈ అనుభవాలు యేమీ మాయగా కనిపించలేదతనికి. ఇవన్నీ నిజమైనవే. ఇన్ని సంవత్సరాలుగా నిశ్శబ్దంగావుండి, యిప్పుడు పలుకుతున్నట్లున్న యీ ప్రథమపురుష యేకవచనం పూర్తిగా వాస్తవ స్వరూపం కలదని అతనికి నమ్మకం కలిగింది.

ఇవనోవ్‌ను కలుసుకున్నప్పుడు మాట్లాడిన విషయాల కంటే యీ నూతన శోధనకే అతనిమనస్సు యెక్కువగా నిమగ్నమైవుంది. ప్రతిపాదనల్ని తిరస్కరించటానికి నిర్ణయించు

కొన్నళ్లే భావిస్తున్నాడు; అంటే అతడింక స్వల్పకాలం మాత్రమే జీవిస్తాడన్నమాట; యీ నిశ్చయమే అతని పర్యాలోచనలకు పునాది.

నెం.1 ప్రాణాలుతీయడానికి తనుకుట్రపన్నినట్లు చెప్పిన కల్పిత కథనుగురించి యేమీ ఆలోచించటంలేదు. ఇవనోవ్‌ను గూర్చి అధికంగా ఆలోచిస్తున్నాడు. వాళ్ళపాత్రలు సమానంగా తారుమారు కావచ్చునన్న నటంలో ఇవనోవ్ చాల సక్రమంగా అన్నాడు. ఆత్మాభివృద్ధి విషయంలో యిద్దరూ కవలలు; ఒకే అండంనుంచి వుద్భవించకపోయినప్పటికీ, ఒకే విశ్వాసంతో పెరిగినవారు. వారి మనోభావాలు రూపంధరించవలసిన వయస్సు వచ్చేటప్పటికె పార్టీయొక్క తీవ్రమైన కట్టుబాట్లలోవున్నారు. అందుచేత పార్టీవాతావరణం వారిరువురి శీలాన్ని తీర్చిదిద్దింది. వాళ్ళవి ఒకే నైతిక పరిమాణం; ఒకే తత్వం; ఒకే ఆలోచనావిధం. వాళ్ళస్థానాలు మాత్రం మారిపోయి వుండవచ్చు.అప్పుడు, రుబషోవ్ బల్లకు వెనుక, ఇవనోవ్ బల్లకు ముందు కూర్చునేవారు, ఆ స్థానంనుంచి రుబషోవ్ బహుశా, ఇవనోవ్ వాదనలే సరిగా వుపయోగించి వుండేవాడు. ఆటకు నియమాలు నిర్ణయమైనాయ్. వివరాలు మాత్రం వేరుగావున్నాయని వారు అంగీకరించారు.

ఇతరుల దృష్టితో తనను చూచుకోవటమనే పాత భావపు వొత్తిడి తిరిగి వచ్చింది. ఇవనోవ్ స్థానంలో తాను కూర్చుని, తనను ఇవనోవ్ దృష్టితో చూచు కుంటున్నాడు. నేరస్థుని స్థానంలోలోగడ రిచర్డ్‌ని, లిటిల్ లోయీని తాను చూచినట్లుగా, యీ పతిత రుబషోవ్‌ను — పూర్వపు అనుచ

రుని ఛాయ – చూచాడు. తనపట్ల ఇవనోవ్‌కు రాగద్వేషాలు మిశ్రమమై వుండడం అర్థంచేసుకొన్నాడు. వాళ్ళచర్చలో ఇవనోవ్ న్యాయంగా వున్నాడా, లేక కపటంగా వున్నాడా అనీ; వల పన్నుతున్నాడా లేక బయటకు మార్గం చూపిస్తున్నాడా అనీ పదే పదే ప్రశ్నించుకున్నాడు. ఇప్పుడు ఇవనోవ్ స్థానంలో తాను కూర్చుంటే, ఇవనోవ్ న్యాయంగానే వున్నట్లు తెలుసుకున్నాడు–తాను లిటిల్ లోయీ, రిచర్డ్‌ల విషయంలో వున్నంత హెచ్చుతగ్గులతోనే.

ఈ పర్యాలోచనలుకూడా స్వగతాల రూపంలో, అయితే పరిచితమైన మార్గంలో వున్నాయి. తను క్రొత్తగా తెలుసుకోగలిగిన ఆ నిశ్శబ్దపాత్ర వీటిలో పాల్గొనలేదు. ప్రతి స్వగతంలోను ఆ పాత్రను వుద్దేశించి సంబోధిస్తున్నట్లు భావించినప్పటికీ,దానివునికి 'ఉత్తమపురుష యేకవచనం' అనే అవ్యక్త వ్యాకరణ పదార్థం మేరకు పరిమితమై, మూగగా వుంటుంది. ప్రత్యక్ష ప్రశ్నలు, తార్కిక ధ్యానాలు దాన్ని పలికించలేవు. దాని పలుకులకు దృశ్యకారణాలేమీ వుండవు సరికదా, యింకా విచిత్రంగా యెప్పుడూ పంటిపోటుతో కలిసివస్తుంది. దాని మానసిక ప్రాంతమంతా విభిన్న, విచ్ఛిన్న భాగాల స్మృతులలో – పియెటా ముకుళిత హస్తాలు, లిటిల్ లోయీ పిల్లులు, 'మట్టిపాలైంది' అనే గేయరాగాలాపన, ఒకానొక సమయంలో ఆర్లోవా అన్న ఒకానొక మాట – నిండివున్నట్లుంటుంది. దాని భావప్రకటనా మార్గాలుకూడ చిందరవందరగానే వుంటాయ్. ఉదాహరణకి, ముక్కద్దాలు చొక్కాచేతి మీద తుడవాలనే వొత్తిడి; ఇవనోవ్ గదిలో గోడమీది

తెల్లని మచ్చను చేత్తో తాకాలనే వుద్వేగం; 'నేను చెల్లించాలి' అనే అర్థంలేనిమాటల్ని గొణిగే పెదవుల కదలిక; తన జీవితంలోని పాత గాధలను దివా స్వప్నాలుగా పొందే భ్రాంతి.

ఈ నూతన శోధిత తత్వాన్ని గాఢంగాపరిశీలించటానికి రుబషోవ్ తనగదిలో పచార్ల సమయంలో ప్రయత్నించాడు. ఉత్తమ పురుష యేకవచనాన్ని గట్టిగా ప్రయోగించటానికి పార్టీలో సిగ్గు పడడంఆచారం. అదేసిగ్గుతో దానికి 'వ్యాకరణ గల్పిక' అని నామకరణం చేశాడు. బహుశా అతని జీవితం కొద్ది వారాల వరకే వుంది, అందువల్ల దీనివిషయంలో సహేతుక నిర్ణయానికి రావటానికి ఆలోచించి, పూర్తిచేయాలనే ఆసక్తి యెక్కువైంది. కాని 'సహేతుక నిర్ణయాలోచన' అంతమైన చోటనే 'వ్యాకరణ గల్పిక' వంశంపుట్టినట్లుంది. బహుశా సహేతుకాలోచనల పరిధులకు అది దూరంగా వుండడం, హఠాత్తుగా పంటినొప్పి, పగటి కలలువగైరాల రూపంలో కనిపించడం నిజానికి దాని స్వభావమై వుంటుంది. ఆవిధంగా రుబషోవ్ యేడవనాడు — మొదటి విచారణ తరువాత మూడవ రోజు — గడిచింది; తన గతజీవితంలో కాల్చబడ్డ ఆర్లోవాతో సంబంధం వున్న కాలం స్ఫురణకు తెచ్చుకొన్నాడు.

ఏనిమిషంలో నిద్రవచ్చిందో చెప్పటం యెంతకష్టమో, తన నిర్ణయాలకు వ్యతిరేకంగా యెప్పుడు పగటికల ప్రారంభమైందో చెప్పటంకూడ కష్టమే. తర్వాత, ఈ యేడవరోజు వుదయం నోట్సు వ్రాసుకున్న తర్వాత బహుశా కాళ్ళగుదులు తీర్చుకొవటానికి నిలబడ్డాడు - గదితలుపు మ్రోత విన్నతర్వాత గాని అప్పటికి మధ్యాహ్నమయిందనిగాని; నిలబడినప్పటి

నుంచి గంటలతరబడి పచార్లు చేస్తున్నట్లుగాని తెలియ లేదు. కొన్ని గంటల తరబడినుంచి కణతల్ని పగలేస్తున్న పంటినొప్పి అదోవిధంగా బాధపెడుతున్నందువల్ల కాబోలు దుప్పటికూడ కప్పుకోనేవున్నాడు. పనివాళ్ళు యిచ్చిపోయిన పులుసును పర ధ్యాన్నంగానే గరిటెతో త్రాగి మళ్ళీ పచార్లు మొదలు పెట్టాడు. ఎప్పటికప్పుడు రహస్య రంధ్రంనుంచి కనిపెడుతున్న వార్డరు రుబషోవ్ వణుకుతూ గూడలు బిగించుకోవటం, పెది మలు కదులుతూండటం చూచాడు.

మరోకసారి తన పూర్వపు వ్యాపార రాయబారవర్గ కార్యాలయపు వాయువుల్ని పీలుస్తున్నాడు. ఆ కార్యాల యం ఆర్లోవా పరిపుష్టిత, మందర శరీరంనుంచి వచ్చే విచి త్రమైన పరిచితపరిమళంతో నిండివుంది. తెల్లని జాకెట్ పైగా, వ్రాయటానికి, వంగిన మెడవంకర, తాను చెప్పేటప్పుడు చేసే పచార్ల విరామకాలంలో తనవైపు చూచే గుండ్రనికళ్లు కని పిస్తున్నయ్. ఎప్పుడూ మెడచివరివరకు లేసుపనిచేసిన తెల్లని జాకెట్లు — యింటివద్ద రుబషోవ్ అక్కచెల్లెళ్ళు తొడుక్కునే లాటివి — వుపయోగించేది. వ్రాయటానికి వంగినప్పుడు దవడల వరకు వచ్చి వ్రేలాడే చౌకరకపు లోలకులే యెప్పుడూ వుప యోగించేది. ఆమె నెమ్మదైన స్వభావం ఆ వుద్యోగానికే పుట్టిందాన్నట్లుండేది; పైగా రుబషోవ్ అధికశ్రమచేత అలసి పోయినప్పుడు అతని కామెసహచర్యం యెంతో పూరటగలి గించేది. లిటిల్ లోయీ సంఘటన తర్వాత 'బి'లో వ్యా పార ప్రతినిధివర్గానికి నాయకుడుగా యీ క్రొత్తవుద్యోగంలో

ప్రవేశించాడు. ప్రవేశించిందే తడవుగా తలమునకలుగా పనిలో నిమగ్నుడయ్యాడు; తనకా అధికారస్థాన మిచ్చినందుకు కేంద్రకమిటీకి యెంతో కృతజ్ఞతను వెల్లడించాడు. అంతర్జాతీయ సంస్థనుంచి సభ్యుల్ని (అంతర్జాతీయ పాశ్చాత్యవర్గం), రాజకీయ వ్యవహారశాఖకుతీసుకోవటం చాల అరుదు. నెం.1కి యితనియెడ బహుశా యేవో ప్రత్యేక వుద్దేశాలుండివుండాలి, లేకపోతే సాధారణంగా యీ రెండుపీఠాలను ఖచ్చితంగా విడిగానే వుంచుతారు, పరస్పరం యేవిధమైన సంబంధం అంగీకరించరు; పైగా యీ రెండు ఒక్కొక్కప్పుడు వ్యతిరేక విధానాల ననుసరించేవి. నెం. 1 అనుచరవర్గాల దృష్టిలో అవసరమైనప్పుడుమాత్రమే యీ రెండుపీఠాలకు సామ్యం కుదిరి, విభేదాలు అంతరించి వుద్దేశాలు స్పష్టమయ్యేవి.

కొత్తజీవితాని కలవాటు పడటానికి రుబషోవ్‌కి కొంత కాలం పట్టింది. పాస్‌పోర్టు తనపేరుతో వుండటం ఆనందాన్ని కలిగించింది. అదికూడ వుచిత దుస్తుల్లో ఆహ్వానాల్లో పాల్గొనటం, పోలీసులు తనకోరకై నిలబడటం, సాదాదుస్తులలో వుండే అంగరక్షకులు అప్పుడప్పుడు కేవలం తనయందు ఆదరాభిమానాలతో, భద్రతకోసం తనను అనుసరించటం వగైరాలు అతన్ని పులకితుణ్ణి చేసేవి.

రాయబార కార్యాలయానికంటివున్న వ్యాపార ప్రతినిధివర్గం కార్యాలయపు గదుల్లోని వాతావరణం, అతనిలో మొదట కొంచెం విముఖత కలిగించింది. పాలకవర్గాలలోవున్న వాడు ప్రాతినిధ్యం వహిస్తూ పాలకుల నాటకాలను ఆడాలి. కాని బయటకు కనిపించేదానికి, యదార్థానికి భేదం తెలియ

నంతగా యిక్కడ నాటకం అతిచక్కగా ఆడవచ్చుననుకున్నాడు. రాయబార కార్యాలయపు ప్రథమ కార్యదర్శి (ఈ ప్రథమ కార్యదర్శి విప్లవానికి పూర్వం ఫోర్జరీచేసి కొంత డబ్బును పార్టీకి తెచ్చాడు)- మొదట్లో రుబషోవ్‌కి దుస్తుల్లో కొన్ని అవసరమైన మార్పులు, జీవిత విధానంలో కావలసిన మార్పులు సూచించినప్పుడు సౌహార్ద్రంతోనూ, సరసంగానూ గాక, అనాదరకమైన హాస్యంతో, శీవితోను చెప్పాడు. ఆ విధానం, ఆ ప్రవర్తన రుబషోవ్‌కి చిరాకు, అసహ్యాన్ని కల్గించింది.

రుబషోవ్ క్రింద పన్నెండుమంది పనిచేస్తున్నారు. అందరికీ స్పష్టమైన నిర్ణీత విధులు నిర్ణయించబడివున్నయ్. ప్రథమ, ద్వితీయ సహాయాధికారులు, ప్రథమ, ద్వితీయ గుమస్తాలు, కార్యదర్శులు, సహాయకార్యదర్శులు. ఈ మొత్తంగూడంతా తనను జాతీయనాయకుడికీ, దొంగలనాయకుడికి మధ్యస్థితిలో వున్న వాణ్ణి గౌరవించినట్లుగా భావించాడు. వాళ్లుఅతన్ని మితిమీరిన మర్యాదతోనూ, సహనంతోను గౌరవిస్తున్నారు. రాయబార కార్యదర్శి యేదైనా అధికార పత్రాన్ని గురించి, చెప్పవలసివచ్చినప్పుడు, చిన్నపిల్లలకో అనాగరికులకో చెప్పే విధానంలో చెప్పడానికి ప్రయత్నిస్తాడు. అతనికేవిధమైన బాధనూ కల్గించనిది తన ఆంతరంగిక కార్యదర్శి ఆర్లోవా ఒక్కతే; ఆమె తన సాదా జాకెట్, లంగాలనుతోడు వికృతంగావున్న ఖరీదైన మెత్తుమడమల తోలు బూట్లు యెందుకు తొడుగుతుందో అర్థంకాదు.

ఒకనెల రోజుల తర్వాతగాని ఆమెతో పరిచయంగా మాట్లాడలేదతను. పచార్లుచేస్తూ ఉత్తరాలుచెప్పి వ్రాయించి

విసుగా త్రిప్పాడు. హఠాత్తుగా ఆ గదిలో నిశ్శబ్దతను గుర్తించి 'నీవెప్పుడూ యేమీ మాట్లాడవేం, క్లాస్‌లో ఆర్లోవా' అని అడిగి వ్రాతబల్ల వెనుకవున్న కుర్చీలో హాయిగా కూర్చున్నాడు.

'మీకిష్టమైతే ప్రతివాక్యంయొక్క చివరిపదాన్ని తిరిగి అంటూంటాను' అని నిర్ఘమత్తులో అన్నట్లు చెప్పింది.

ప్రతిరోజూ బల్లముందు తనకుర్చీలోనే కూర్చుంటుంది. లేసుకుట్టిన జాకెట్ వేసుకుంటుంది. బరువైన గుండ్రని వక్షస్థలం నోటుపుస్తకం మీదకు వంగుతుంది. తలవంచితే చెవి లోలకులు దవడలతో సమానాంతర స్థానంలో కనిపిస్తాయి. అయితే ఆవిడ ముగ్ధసౌందర్యాన్ని పాడుచేసినవి మొన తేరిన ఎత్తు మడమల బూట్లు; ఆవిడ యెప్పుడూ, రుబషోవ్ యెరిగిన చాలమంది యితర ఆడవాళ్ళలా, కాళ్లు మడతవెయ్యదు.

రుబషోవ్ ఆమెకు చెప్పేటప్పుడు ఆమె వెనుకభాగం, ప్రక్కసగభాగం పరిశీలిస్తుండేవాడు. కానీ అతనికి బాగా గుర్తున్నది, వంచిన మెడ వంకర ఒక్కటే. ఆమె మెడమీద నూగు వెంట్రుకలుగాని, క్షవరంచేసినగాని వుండేదిగాదు. తెల్లగా బిగుతుగా వుండేది. వెన్నెముకపైన జాకెట్ లేసు పుష్పలత కనిపించేది.

రుబషోవ్‌కు యౌవ్వనంలో, ఆడవాళ్ళతో యెక్కువ పరిచయంలేదు. వాళ్ళతో వున్నదంతా స్నేహం మాత్రమే. ఎప్పుడూ వాళ్ళకుగాని తనకుగాని ఆఖరు ట్రామ్ తప్పిపోయే వరకు చర్చల్లో ప్రొద్దుపోయేది.

ఆవిడతో సంభాషణను నిష్ఫలయత్నం జరిగినతర్వాత పదిహేను రోజులు గడచినయ్. మొదట్లో రుబషోవ్ చెప్పే

టప్పుడు ఆమె వాక్యంలోని ఆఖరు మాటను మెల్లగానే తిరిగి అనేది. తర్వాత అలా అనటం మానేసింది. అప్పుడు రుబషోవ్ వాక్యాలమధ్య విరామకాలంలో గదంతా నిశ్శబ్దంగా ఆమె పరిమళ వాయువుల్తో నిండిపుండేది. ఒకనాటి మధ్యాహ్నం తనకి ఆశ్చర్యం గొలిపేవిధంగా, ఆమె కుర్చీవెనుక నిలబడి ఆమె భుజాలమీద రెండు చేతులు వేసి, తనతో ఆసాయంకాలం షికారు కొస్తుందేమో నని అడిగాడు. ఆమె యేమీ చలించలేదు, పైగా అతని చేతుల్ని తీయటానికికూడ ప్రయత్నించలేదు, తలైనా అతడివైపు త్రిప్పకుండా తన యిష్టాన్ని నిశ్శబ్దంగా తలవూంపుతో సూచించింది. రుబషోవ్‌కి మొకసక్కాలు ఆడడం అలవాటులేదు. కానిఆ రాత్రి ప్రొద్దుపోయిన తర్వాత మందహాసం చేస్తూ 'నీ వింకా వ్రాస్తూ కూర్చున్నావనుకుంటాను' అని అనకుండ వుండలేక పోయాడు. చక్కని తీరుగల ఆమె పెద్ద చనుకట్టు ఆకారాన్ని అతడు ఆగది చీకటి భాగంలో చూస్తుంటే అది అతని హృదయంలో హత్తుకు పోయింది. ఆమె ఎల్లప్పుడూ ఆగదిలోనే వున్నదన్నంత పరిచయంగా ఆ చనుకట్టు దృశ్యం గోచరించింది అతనికి. ఆమె చెవుల లోలకులు మాత్రం తలగడమీద పడివున్నయ్. ఆమె కళ్లు 'నన్ను సర్వకాలాల్లోనూ మీ యిష్టం వచ్చినట్లు వినియోగించుకోగలరు' అని ఆమెన్నప్పుడు వెలిబుచ్చినభావాన్నే యిప్పుడూ స్ఫురింప జేస్తున్నయ్. పియెటా ముకుళిత హస్తాలు, రేవు పట్టణపు సముద్రపు పాచివాసనెలా అతని మనస్సును వదలవో యీ వాక్యం, ఆమెచూంపు అతన్నలా వదల్లేవు.

'ఎందుకని?' సంభ్రమాశ్చర్యాలతో అడిగాడు,

ఆమె సమాధానం చెప్పలేదు బహుశా అప్పటికే నిద్రపోయిందేమో. ఎందుకంటే సుషుప్తి, జాగ్రదవస్థలలో కూడ ఆమె ఉచ్ఛ్వాస నిశ్వాసాలు ఒకేవిధంగా నిశ్శబ్దంగా వుంటయ్. ఆమెయెప్పుడూ శ్వాసపీల్చటం రుబషోవ్ గమనించలేదు. ఆమె కళ్లు మూసుకున్నప్పుడుకూడ యెప్పుడూ చూడలేదు. అందుచేత ఆమె నిద్రిబోతున్నప్పుడు ముఖం వింతగా, కనిపించింది. కళ్లుతెరచి వున్నప్పుడుకంటే మూసివున్నప్పుడే ఆమె ముఖంయొక్క భావస్ఫురితంగావుంది. జాగ్రదవస్థలో రొమ్ముల కానుకొనుండే గడ్డం శయనావస్థలో పైకి పొడుచుకొచ్చినట్లుంది. కాని ఆకాంతి, ఆపరిమళం తనునిద్రపోతున్నప్పుడు కూడ పరిచితంగానే వున్నయ్.

ఆ మరునాడు, తర్వాత అన్నిరోజులూ ఆమె తన మామూలు తెల్లజాకెట్‌తో తనమామూలు కుర్చీలోనే కూర్చొని మామూలుగానే వంగి వ్రాస్తుండేది; ఆ మరుసటి రాత్రి తర్వాత అన్నిరాత్రిలూ పడకగది తెరలోనుంచి ఆమె పెద్దచనుకట్టు ఆకారపు ఛాయాచిత్రం కనిపిస్తూనే వుండేది. రుబషోవ్ రాత్రింబవళ్ళు ఆమె స్థూల దేహచ్ఛాయల్లో బ్రతికాడు. పనిచేసేటప్పుడు ఆమె ప్రవర్తనలో, స్వరంలో, చూపులో యేమీ మార్పులేదు. వాటిల్లో పూర్వగాధల్ని స్ఫురింపజేసే విధమేమీ గోచరించేదికాదు. చాలసార్లు రుబషోవ్ ఆమెకు లేఖలు చెప్పేటప్పుడు అలిసిపోయివుంటే ఆమె వెనక్కు-వెళ్లి భుజాలమీద చేతులువేసి నిలబడేవాడు; అతను యేమీ మాట్లాడేవాడుకాదు; ఆమె జాకెట్ క్రింద వెచ్చని భుజాలు తాకుతూ వుంటే కొంతసేపటికి తనకు కావలసిన

పదాలు స్ఫురణకొచ్చేవి, అప్పుడు, తిరిగి పచార్లు సాగిస్తూ, చెప్తూండేవాడు.

అప్పుడప్పుడు తాను చెప్పే విషయాలమీద యెత్తిపొడుపు వ్యాఖ్యానాలు చేసేవాడు; అప్పుడామె పెన్సిల్‌ను చేతిలో పట్టుకొని ఆ వ్యాఖ్యానాలు పూర్తయ్యే వరకూ వ్రాయటం మానేసికూర్చునేది. కాని, యీ యెత్తిపొడుపులకు యెప్పుడూ నవ్వేదికాదు. రుబషోవ్ వేటని గురించి ఆమె యేమనుకుంటోందో యెన్నడూ గ్రహించలేదు. ఒక్కసారి మాత్రం, రుబషోవ్ నెం. 1 వ్యక్తిగత అలవాట్లను గురించి ప్రమాదకరమైన చిన్న ఛలోక్తి విసిరినప్పుడు, తన హీన స్వరంతో 'ఇతరులముందు అటువంటి విషయా లనకూడదు, మీరూ పూర్తిగ జాగ్రత్తగ వుండాలి....' అన్నది, హఠాత్తుగ. కాని అప్పుడప్పుడు, ముఖ్యంగా పైనుంచి సూచనలు, సర్క్యులర్‌లు వచ్చినప్పుడు, వాటిని విమర్శిస్తూ ఛలోక్తులు విసరాలనిపించేదతనికి.

ప్రతిపక్షం రెండో విచారణ కాలమది. రాయబార కార్యాలయపు వాతావరణం వింతగాతయారైంది. గోడల మీది ఫొటోగ్రాఫ్‌లు, వ్యక్తుల వర్ణచిత్రాలు రాత్రిరాత్రి మాయమైనవి. అవి వున్నంతకాలం వాటివైపు యెవ్వరూ చూడలేదు; కాని తీసివేసిన తర్వాత గోడలమీది తెల్లని మచ్చలు అందరి దృష్టుల్ని ఆకర్షించినయ్. అక్కడి వుద్యోగ వర్గం కేవలం కార్యాలయ సంబంధ విషయాలకే వారి సంభాషణల్ని పరిమితం చేశారు, వాళ్ళు పరస్పరం అత్యంతజాగ్రత్త ప్రత్యేకపు మర్యాదలతోనే మాట్లాడుకొనేవారు, రాయబార

కార్యాలయపు క్యాంటీన్‌లో భోజనాలసమయంలో, మాట్లాడుకోవటం తప్పనిసరైతే, ఉప్పుసీసా, ఆవపిండి పాత్ర అడిగే వారు కావాలని క్రొత్తగా వచ్చిన కాంగ్రెసు ప్రణాళికా ప్రకటనలోని పట్టుపదాలనే వాడేవాళ్ళు; మామూలు పరిచిత వాతావరణంలో అధికారయుక్త పదాల ప్రయోగం చాల అసహ్యాన్ని, విసుగును గలిగించేది. ఎక్కువగా యెవరైనా యేదైనా మాట్లాడితే, అది తప్పువ్యాఖ్యానమని యింకొకరంటే మొదటివాడు తనప్రక్కవాళ్ళను సాక్షానికి పిలిచి 'నేనన్నదానికి అదికాదర్థం' అనో 'నేను అలా అనలేదు' అనో అంటూండటం జరుగుతుండేది. ఇదంతా రుబషోవ్‌కి చిత్రంగా తమతమ పాత్రానుగుణ్యంగా మాట్లాడే తోలు బొమ్మలాట లాగవుంది. ఒక్క ఆర్లోవా మాత్రం తన మౌన అర్ధ నిద్రావస్థలో యేమీ మారనట్లు కనిపించింది.

గోడమీది వ్యక్తిచిత్రాలేగాదు గ్రంథాలయపు అలమారుల్లోని పుస్తకాలుకూడ తగ్గిపోయినయ్. పైనుంచి సందేశం వచ్చిన మరునాడు కొన్ని పుస్తకాలు, కొన్ని చిన్న పుస్తకాలు చాల తెలివిగా అదృశ్యమయేవి. ఆర్లోవాకు వుత్తరాలు చెప్పేటప్పుడు యీ విషయమై యెత్తిపొడుపు వ్యాఖ్యలు చేసేవాడు; కాని ఆమె మౌనంగానే వుండేది. ఎక్కువగా విదేశవాణిజ్యం, కరెన్సీ విషయాలను గురించిన పుస్తకాలు మాయమైనయ్; వాటిగ్రంథకర్తయిన ఆర్థిక ప్రజాకమిసార్, అప్పుడే అరెస్టయాడు. అవేగాక విదేశవాణిజ్యం, కరెన్సీల గురించిన దాదాపు పాత కాంగ్రెసు రిపోర్టులు, విప్లవ చరిత్ర; అంతకు పూర్వపుచరిత్ర; ధర్మశాస్త్రం, వేదాంతం

గురించిన అనేక గ్రంథాలు, జన్మ నిగ్రహానికి సంబంధించిన అన్ని పుస్తకాలు, ప్రజాసైన్యనిర్మాణానికి సంబంధించిన పుస్తకాలు, కార్మికసంఘతత్వం మీద వ్రాసిన వృద్ధగ్రంథాలు, ప్రజా ప్రభుత్వంలో సమ్మోహకున్ను గురించిన పుస్తకాలు, దాదాపు రెండు సంవత్సరాలకు పూర్వపు రాజ్యాంగనిర్మాణపు సమస్యలను గురించిన పుస్తకాలన్నీ, చివరకు విద్వత్సభ ప్రచురించిన సర్వసంగ్రహ సర్వస్వం సంపుటాలుకూడ—త్వరలో పరిష్కృత సంపుటాలుపంపుతామని వ్యాఖ్యానం చేయబడింది — ఇవన్నీ లేకుండపోయినయ్.

క్రొత్త పుస్తకాలు వచ్చినయ్‌కూడ, సాంఘికశాస్త్ర ప్రామాణిక గ్రంథాలు నూతనార్థ, భాష్యాలతోనూ, పాత చరిత్రలకు బదులు క్రొత్త చరిత్రలు, గతించిన పూర్వ విప్లవ యోధుల స్మృతిగాథలకు బదులు నూతనవీరుల గాథలు. పాత వార్తాపత్రికల నవ్య, పరిష్కృత ముద్రణాలు అచ్చువేయటం ఒక్కటే యింక మిగిలిందని ఆర్లోవాతో చెప్పేటప్పుడు ఛలోక్తిగా అన్నాడు.

ఈలోగా, కొన్ని వారాలక్రిందట, రాయబార కార్యాలయ గ్రంథాలయపు రాజకీయ బాధ్యత వహించే ఒక గ్రంథాలయాధికారిని నియమించమని పైనుంచి తాఖీదు వచ్చింది. ఈ స్థానానికి ఆర్లోవాను నియమించారు. మొదట్లో శిశు సంరక్షణాలయాన్ని గురించి యేదో గొణిగాడు. కాని వారాంతంలో రాయబార కార్యాలయం పార్టీ సెల్ సమావేశపు సాయంకాలంవరకు యిదంతా బుద్ధిలేని పని అను

కున్నాడు. ఆ సమావేశంలో అన్ని వైపులనుంచి అర్లోవా మీద తీవ్రారోపణలు వచ్చినయ్. ప్రథమ కార్యదర్శితో కూడ ముగ్గురు నలుగురు సభ్యులు లేచి, నెం. 1 ముఖ్యమైన వుపన్యాసాల పుస్తకాలు గ్రంథాలయంలో లేవనీ, పైగా ప్రతి పక్ష వర్గ పుస్తకాలు యింకా చాలా వున్నాయనీ, గూఢచారులుగా, దేశద్రోహులుగా, విదేశీ యేజెంట్లుగా పనిచేసినట్లు బయట పడిన రాజకీయవేత్తల పుస్తకాలు కొద్ది కాలం క్రిందటి వరకూ ప్రముఖంగా బీరువాలనిండా వున్నాయనీ, ఇదంతా యేదో వుద్దేశంతో జరుగుతూన్నట్లు అనుమానించలేకుండా వున్నామనీ విమర్శించారు. ఆ సమావేశంలో మాట్లాడినవాళ్ళంతా వుద్రేకరహితంగా వ్యాపార సరళిలో, జాగ్రత్తగ పదజాలాన్ని వుపయోగించి మాట్లాడారు. ఇదివరకే వల్లించుకునచ్చి ఒకరికొకరు అందించుకున్నట్లుగా వుంది వాళ్ళు మాట్లాడటం. వాళ్ళవుపన్యాసాలసారాంశమంతా తప్పుల్ని బహిరంగంగా, నిర్దాక్షిణ్యంగా అధిక్షేపించాలనీ, యెవరు తమ కర్తవ్యాన్ని సవ్యంగా నిర్వర్తించరో వాళ్ళని నీచ విచ్ఛిన్న కారులుగా తయారైనట్లు గుర్తించుకోవాలనీ చెప్పడం. అర్లోవానువాఙ్మూలం యిమ్మని పిలిచారు. ఆమెమామూలు నిబ్బరంతోనే తన కేవిధమైన దుష్ట చింతనా లేదనీ, తనకిచ్చిన ప్రతి సూచనను తు. చ. తప్పకుండా అమలు జరిపాననీ చెప్పింది. ఆమె కొంచెం గీరపోయిన, స్పష్టమైన స్వరంతో మాట్లాడుతూ, రుబషోవ్ మీద దీర్ఘకాలం దృష్టినిలిపింది. ఇతరుల సమక్షంలో రుబషోవ్ వైపెన్నడూ అంతసేపు చూచియెరుగదు. అర్లోవాకుతీవ్రమైన

హెచ్చరిక నివ్వాలనే తీర్మానంతో సమావేశం ముగిసింది.

రుబషోవ్‌కి పార్టీలో కొత్తగా ప్రవేశించిన విధానాలు బాగా తెలుసు; చిరాకు పడ్డాడు. అర్లోవాకు యేదో మూడనున్నదని వూహించాడు. కాని తన నిస్సహాయతకు బాధపడ్డాడు; ఎందుకంటె అక్కడ వాదించటానికి తగ్గ అంశం యేమీ లేదు.

రాయబార కార్యాలయపు వాతావరణం మరింత తీవ్రమైంది. తాను లేఖలు చెప్పేటప్పుడు వ్యక్తిగత వ్యాఖ్యలేమీ చేయటం లేదు. కాని తనలో దోషం వున్నట్లు భావించుకొనేలాగ చేసింది. అర్లోవాతో అతని సంబంధంలో యే మార్పూ లేదు. కాని తాను వ్యక్తిగతంగా వ్యాఖ్యానించలేననే చిత్రమైన భావన కలిగినప్పటినుంచీ అర్లోవా కుర్చీ వెనక్కెళ్లి ఆమె భుజాలమీద చేతులేసి నిలబడటం మానివేశాడు. ఒక వారం తర్వాత ఆమె సాయంకాలాలు అతనితో కలిసి వుండటం మానివేసింది. మూడు రోజుల తర్వాతగాని అతడు కారణం అడగలేకపోయాడు. తన హీన స్వరంతో పార్శ్వపునొప్పి కారణమని చెప్పింది. తరువాత రుబషోవ్ ఆమెను కారణం గురించి వొత్తిడి పెట్టలేదు. ఆ తర్వాత మళ్లీ యెప్పుడూ రాలేదు; ఒకసారి తప్ప.

ఈ రావటం ఆమెకు పార్టీ తీవ్ర హెచ్చరిక చేసిన మూడు వారాలకు; రుబషోవ్ వద్దకు రావటం మానివేసిన పదిహేను రోజులకు, ఆవిడ ప్రవర్తన యించుమించు మామూలుగానే వుంది. కాని, రుబషోవ్ యేదో ఒక నిశ్చయాన్ని చెప్పామన్నాడనుకొని ఆమె యెదురుచూస్తున్నట్లు అతనికి ఆ సాయంకాలమంతా అనిపించింది. అయితే ఆమె మళ్ళీ

వచ్చినందుకు సంతోషిస్తున్నాననీ, అధిక శ్రమతో అలిసిపోయి వానని మాత్రమే అన్నాడు. అతడు అలసిపోవడం నిజమే, ఆ రాత్రి ఆమె మెలకువతోనే వుండి శూన్యాంధకారంలోకి తేరిపార చూస్తున్నట్లు చాలసార్లు గమనించాడు. తను తప్పు చేస్తున్నట్లుగా పడుతున్న వ్యధనుంచి విముక్తుడు కాలేకపోతు న్నాడు. పంటినొప్పి కూడ యెక్కువైంది. ఆమె అతడిని చూడడానికి వెళ్ళడం అదే ఆఖరుసారి.

మరునాడు ఆర్లోవా ఆఫీసుకువచ్చేముందు ప్రథమ కార్యదర్శి రుబషోవ్ దగ్గరకొచ్చి, రహస్య మన్నట్లుగా, ప్రతి వాక్యం జాగ్రత్తగా కూర్చి, ఆర్లోవా అన్నను, వదినెను ఒక వారం క్రిందట 'అక్కడ' అరెస్టు చేశారని చెప్పాడు. ఆర్లోవా అన్న విదేశీయురాల్ని పెళ్ళిచేసుకున్నాడు. ప్రతిపక్షాని కను కూలంగా, వాళ్లు ఆమె స్వదేశంలో విద్రోహకర సంబంధాలు కలిగివున్నారని వాళ్లిద్దమీద ఆరోపించారు.

కొద్ది నిమిషాల్లోనే ఆర్లోవా పనిలోకి వచ్చింది. మామూలుగానే తన కుర్చీలో, తన మామూలు లేసు జాకెట్ తోనే, బల్లముందు కూర్చుని కొంచెం ముందుకు వంగివుంది. ఆమెవెనుకనే రుబషోవ్ పచార్లు చేస్తున్నాడు. కాని యెంత సేపూ ఆమె మెడవంకర, మెడమీద వెన్నెముక మొదట్లో సాగిన తెల్లని చర్మం కళ్ళముందు కనిపిస్తున్నయ్. ఆ ప్రదేశం నుంచి తన దృష్టిని మార్చలేకపోయాడు. శారీరకంగా బాధను గలిగించేటంత వ్యాకులపాటు చెందాడు. 'అక్కడ' ఆర్లోవా అన్ననీ, వదిననీ యీ పాటికి మెడమీద కాల్చిచంపి వుంటా రనే భావన అతన్ని వదలట్లేదు.

మరుసటి పార్టీ సెల్ సమావేశంలో ప్రథమ కార్య దర్శి ప్రతిపాదన ఆధారంగా యే విధమైన చర్చ, వ్యాఖ్య లేకుండా ఆర్లోవా రాజకీయ అవిశ్వాస ప్రవర్తనకు ఆమెను గ్రంథాలయాధికారి పదవినుంచి తొలగించారు. దాదాపు భరించలేని పంటినొప్పితో బాధపడుతూ, క్షమాపణలు చెప్పు కొని, సమావేశంనుంచి రుబషోవ్ వెళ్ళిపోయాడు. కొద్ది రోజుల తర్వాత ఆర్లోవా, యింకొక వుద్యోగి విచారణకు పిలవ బడ్డారు. ఈ యిద్దరి పేర్లను వారి సహచరులు ఆ తర్వాత మరెన్నడూ ప్రస్తావించలేదు. కాని, రుబషోవ్ తర్వాత కొన్ని నెలలపాటు మాత్రమే ఆ కార్యాలయంలో పనిచేశాడు. అనంతరం అతన్ని సయితం విచారణ చెయ్యడానికి స్వదేశా నికి పిలిచారు. అంతవరకు రుబషోవ్ తన ఆఫీసుగది గోడలు ఆర్లోవాయొక్క పరిమళాన్ని వెదజిమ్ముతున్నట్లు భావించేవాడు.

## 4

'నిద్రలే, దౌర్భాగ్య చక్రవర్తీ!'

రుబషోవ్ వచ్చినపదోరోజున 406 నెంబరులో వున్న అతని కొత్తపొరుగు ఖైదీ, కొంతకొంత విరామంతో పైవాక్యాన్ని పదేపదే వుదయంనుంచీ తట్టుతున్నాడు. అతనితో చాలాసార్లు సంభాషణ సాగించాలని చూచాడు, రుబషోవ్. రుబషోవ్ తట్టినంతసేపూ మౌనంగా వినేవాడతను. కాని, గజిబిజిగా, పొంతనలేని అక్షర సముదాయంతో, పైవాక్యం ఒక్కటే సమాధానంగా వినిపించేది.

గత రాత్రి యీ కొత్తపొరుగు వ్యక్తిని తీసుకొచ్చారు. రుబషోవ్ లేచాడు. 406 నెంబరు గదితలుపు తాళం వెయ్యటం, మాటలశబ్దం అస్పష్టంగా వినపడ్డాయి. తెల్లవారినట్లు బాకాకూత అయినవెంటనే 406 నెంబరు వ్యక్తి 'నిద్రలే బౌర్బాన్య చక్రవర్తి' అని తట్టడం మొదలుపెట్టాడు. రహస్య సందేశాలను అందించడంలో ఆరితేరిన వాడిలాగ గబగబా తట్టాడు; అక్షరాల తప్పులనుబట్టి, అర్థంలేని సందేశాలను బట్టిచూస్తే, తట్టటంలో సిద్ధహస్తుడు కాకపోవడం కారణమనిపించదు. అతనికి మానసికమైన కారణాలు వుండివుంటా యనిపిస్తుంది. బహుశా అతనికి మతిచెడిందేమో.

ఉదయపు భోజనంతర్వాత 402 నెంబరులోని యువకాధికారి తాను మాట్లాడ కోరుతున్నట్లు తెలియజేశాడు. 402 నెంబరుకు, రుబషోవ్‌కు మధ్య ఒకవిధమైన స్నేహసంబంధం వృద్ధి చెందింది. ఒంటద్దపు జోడుతో, మెలిదిరిగిన మీసంతో వున్న ఆ వుద్యోగి చిరకాలపు యేకాకితనంవల్ల విసుగెత్తిపోయి, అప్పుడప్పుడు కనీసం తనతో మాట్లాడుతున్న రుబషోవ్‌కు కృతజ్ఞుడై వున్నాడు. రోజులో కనీసం ఐదారు సార్లు అయినా రుబషోవ్‌ను,

'నాతో మాట్లాడవూ....' అని అడిగేవాడు.

రుబషోవ్‌కి యెప్పుడోగాని మాట్లాడా లనిపించేదికాదు. అదీగాక అతనితో మాట్లాడవలసిన విషయాలేమిటో తెలియలేదు. సాధారణంగా 402 నెంబరు సైనికోద్యోగుల భోజనశాల గురించిన పాత విశేషాలను తట్టేవాడు. అసలు విషయాని కొచ్చేసరికి నిశ్శబ్దంగా వుండేవాడు. ఆనిశ్శబ్దం బాధగా

వుండేది. ఆ గాథలన్నీ అనుశ్రుతంగా వస్తున్న బూజుపట్టిన బూతు గాథలు; తట్టటం అయిన తర్వాత విన్నవాళ్ళు కడుపుబ్బ నవ్వుతారని, తెల్లని మూగ గోడలవైపు 402 నెంబరు యెదురు చూస్తుంటాడేమో. రుబషోవ్ కేవలం సానుభూతికి మర్యాదకు 'ఆహా, హా'అని అప్పుడప్పుడు తన ముక్కుద్దాల చట్రంతో గట్టిగా, నవ్వుకుబదులు తట్టేవాడు.

ఇక తర్వాత పట్టపగ్గాలు లేకుండా పగలబడి నవ్వుతూ గుప్పెట్లతో, బూట్లతో, 'ఆహా, హా, హా' అని తట్టుతూ, రుబషోవ్ తన ఆనందంలో పాల్గొంటున్నాడో లేదోనని ,మధ్య మధ్య ఆగి వింటున్నాడు. రుబషోవ్ మౌనంగా వుంటే, 'నీవు నవ్వటం లేదు....' అని నిందించేవాడు. ఒకవేళ యీ పీడ వదిలించుకొని ప్రశాంతంగా వుండటం కోసం, రుబషోవ్ రెండు మూడుసార్లు 'ఆహా హా' అంటే, వెంటనే 'మనం చాలా సరదాగా వున్నాం' అని తట్టేవాడు.

అప్పుడప్పుడు రుబషోవ్‌ని యేడ్పించేవాడు. అప్పుడప్పుడు రుబషోవ్‌నుంచి సమాధానం రాకపోతే అసంఖ్యాక పాత సైనిక గేయాల్ని తట్టేవాడు. రుబషోవ్ పచార్లు చేసేటప్పుడు, పగటి కలకంటూనో దీర్ఘ ఆలోచన చేస్తూనో గమనం లేకుండానే ఆ పాత సైనిక గేయాల్ని వింటూండేవాడు.

అయినప్పటికీ 402 నెంబరు వుపయోగంగా నేవున్నాడు. అతను అప్పటికే రెండేండ్లనుంచీ వుంటున్నాడు; అక్కడున్న చాలమందితో సంబంధం పెట్టుకున్నాడు; ఆ భవంతిలో జరిగే ప్రతివిషయమూ, ప్రతి సోదీ అతనికి తెలుస్తూంటుంది.

406 నెంబరు వచ్చిన మరునాటి వుదయం మామూలు

సంభాషణలో తన క్రొత్త పొరుగువ్యక్తిని గురించి 402 నెంబరు కేమైనా తెలుసునేమోనని రుబషోవ్ అడిగితే,

'రిప్ వాన్ వింకిల్' అని చెప్పాడు.

సంభాషణలో వుత్సాహం తేవటానికి, 402 నెంబరు సంభాషణను చిన్నచిన్న కట్టుకథలులాగ నడపడమంటే సరదా. రుబషోవ్ పూర్వస్మృతులకోసం బుర్రంతా గాలించేశాడు. ఒకడు యిరవైఐదు సంవత్సరాలు నిద్రపోయి లేచి చూచేసరికి క్రొత్త ప్రపంచంలో వున్నట్లు భావించిన గాథ గుర్తుకొచ్చింది.

'అతనికి మతిపోయిందా ?' అడిగాడు, రుబషోవ్.

402 నెంబరు యీ ప్రశ్నతో తృప్తిచెంది, తనకు తెలిసిందంతా రుబషోవ్‌కి చెప్పాడు. ఆగ్నేయ యూరఫ్‌లోని ఒక చిన్న దేశంలో సాంఘిక శాస్త్రోపాధ్యాయుడుగా ఒకప్పుడు పనిచేశాడు. ఇతరఐరోపాదేశాల్లోలాగే తనస్వదేశంలో గత యుద్ధానంతరం చెలరేగిన విప్లవంలో పాల్గొన్నాడు. దానిలో ఒక 'ప్రజా ప్రభుత్వాన్ని' కొద్ది వారాల పాటు సాగించారు. కాని అది మామూలు రక్తపాత గాథగానే అంతమైంది. అక్కడి విప్లవ నాయకులంతా తరుణులు; కాని వారి ప్రతిపక్షులు పగడ్బంది యేర్పాట్లతోనే వాళ్ళను అణచివేశారు. ప్రజా ప్రభుత్వం మన 406 నెంబరును గొప్పగా 'ప్రజాభ్యున్నతి శాఖకు రాష్ట్ర ప్రభుత్వకార్యదర్శి'గాచేశారు. తర్వాత వురిశిక్ష విధించబడింది. శిక్షననుభవించటానికి సంవత్సరం నిరీక్షించిన మీదట యావజ్జీవ కారాగారశిక్షగా మార్చారు. ఇరవై సంవత్సరాలు శిక్ష ననుభవించాడు.

బాహ్య ప్రపంచంతో సంబంధం లేకుండా, వార్తా పత్రికలు కూడ లేకుండా యిరవై సంవత్సరాలు గడిపాడు. ముఖ్యంగా చాల భాగం ఒంటరిగానే. ప్రతి విషయంలోనూ అతన్నందరూ మర్చిపోయారు. తనస్వదేశంలో న్యాయపాలన శాఖ యింకా ఒకేనాయకుని అధీనంలో వుంది. ఒక నెలక్రిందట ఖైదీలందర్నీ విడుదల చేసే సమయంలో యితను కూడ హఠాత్తుగా బయటికొచ్చాడు. రిప్‌వాన్‌వింకిల్ ఇరవైసంవత్సరాల అంధకారం, నిద్ర తర్వాత మళ్ళీ భూమి మీదపడ్డాడు.

విడుదలైన వెంటనే అతడు మొదటి రైలులో బయలుదేరి, తను కలలు గంటున్న యీ దేశానికి వచ్చి పడ్డాడు. వచ్చిన పద్నాల్గురోజుల తర్వాత అరెస్టయ్యాడు. బహుశా, యిరవై సంవత్సరాల యేకాంతవాస బాధన తర్వాత అతివాగుడు పుట్టినట్లుంది. బంధిఖానాలో వున్న రోజుల్లో రాత్రింబవళ్లు యిక్కడి - తన స్వాప్నిక జగత్తు - జీవితం యెలా వుంటుందని వూహించాడో కనబడ్డ వాళ్ళందరికీ చెప్పివుంటాడు. బహుశా విప్లవ వీరులైన తన పాత మిత్రుల చిరునామాలు - వాళ్లు దేశద్రోహులుగా, గూఢచారులుగా పరిగణింపబడుతున్నారని తెలియక - అడిగివుంటాడు. బహుశా, పొరబాటుగా వెయ్యగూడని సమాధిమీద పుష్పగుచ్ఛం వేసి వుంటాడు.

లేక తన ప్రసిద్ధ పొరుగువ్యక్తి కామ్రేడ్ రుబషోవ్‌ను చూడాలనుకున్నాడేమో.

ఇప్పుడు, బందిఖానాలో రెండు దశాబ్దాల అంధకారం,

గడ్డి పరుపుమీాద స్వప్న జీవితం బాగుందో, లేక రెండు వారాల వెలుగులోని యదార్థ జీవితం బాగుందో తెలుసుకో గలడు; బహుశా, యింకా మతిస్థిమితం వుండి వుండదు. అదీ రిప్‌వాన్ వింకిల్ కథ....'

402 నెంబరు యీా దీర్ఘ గాథను చెప్పిన తర్వాత, రిప్‌వాన్ వింకిల్ ఐదారుసార్లు 'నిద్రలే, దౌర్భాగ్య చక్రవర్తీ' అని విరిచివిరిచితట్టి తర్వాత మెదలకుండ వూరుకున్నాడు.

రుబషోవ్ బల్లమీాద కళ్లుమూసుకు పడుకున్నాడు. మళ్ళీ వ్యాకరణ గల్పిక ప్రత్యక్షమైనట్లుంది. ఈ సారి మాటల్లో గాక వ్యాకులపాటును గలిగించే ఒక భావనతో ప్రత్యక్షమైంది.

'దానికికూడ నీవు మూల్యం చెల్లించాలి; దానికికూడ నీవే బాధ్యుడవు; అతను స్వాప్నిక స్థితిలో వుంటే నీవు కార్య రంగంలో వున్నావు గనుక.'

ఆ సాయంకాలమే రుబషోవ్‌ని క్షౌరానికి తీసుకువెళ్లారు. ఈ సారి ముసలి వార్డరు రెండడుగులు ముందు గెంతుతూనూ, ఒక యూనిఫారమ్ కాపలావాడు రెండడుగులు వెనక నడుస్తుం డేనూ రుబషోవ్ వాళ్ళమధ్య వెళ్ళటంతో సరిపోయింది. 406 నెంబరు గది మీాదుగా వెళ్ళారు. కాని యింకా తలుపుమీాద పేరుచీటిలేదు. మంగలిషాపులో దాన్ని నడుపుతున్న యిద్దరు ఖైదీలలోను ఒక్కడే వున్నాడు. రుబషోవ్‌కి అక్కడ చాల మందితో పరిచయం లేనట్లు కనిపించింది.

వెళ్ళి కుర్చీలో కూర్చున్నాడు. ఇతరవాట్లతో పోలిస్తే

ఆ షాపు పరిశుభ్రంగావున్నది. అద్దంకూడ వుంది. ముక్కు-ద్దాలు తీసి అద్దంలో చూచుకొన్నాడు, మార్పేమీలేదు; చెక్కిళ్ళమీద గుబురుతప్ప.

మంగలి జాగ్రత్తగా, త్వరగా మౌనంగా పనిచేశాడు. గదితలుపు తీసేవుంది. ముసలి వార్డరు అటూయిటూ గెంతుతున్నాడు. కాపలా సిపాయి తెరచివున్న తలుపు గోడ కానుకొని లోపల జరుగుతున్నదంతా చూస్తున్నాడు. నులివెచ్చని సబ్బు నురుగు కొంచెం సుఖంగా వున్నట్లనిపించింది. స్వల్ప సుఖాలకోసం మరులు పుట్టుతున్నట్లు భావించాడు. మంగలితో బాతాఖానీ వేసుకోవాలని కుతూహలపడ్డాడు, కాని అటువంటిదేమీ అక్కడసాగదని తెలుసు. విశాలంగా, నిష్కపటంగా వున్న మంగలి మొఖంచూస్తే రుబషోవ్ కతనిమీద యిష్టం కలిగింది. అటువంటి వాడికి బాధలు తెచ్చిపెట్టటం యిష్టంలేకపోయింది. మంగలి శరీరావయవ నిర్మాణాన్ని బట్టి అతను తాళాలుచేసే కంసాలో, లేక యంత్రకారుడో అనుకొనే వాడే, సబ్బురాయటం అయిన తర్వాత ఆ కత్తితో ఒక దూత దూసి కత్తి మంటగా వుందా అని అడిగాడు, 'పౌరుడు రుబషోవ్' అని సంబోధిస్తూ.

రుబషోవ్ షాపు కొచ్చిన తర్వాత మంగలి మాట్లాడిన మొదటి మాట అదే. అతని స్వరం మామూలుగా వున్నా అందులో యేదో ప్రత్యేక ప్రాముఖ్యత గోచరించింది. మళ్ళీ నిశ్శబ్దం ఆవరించింది. వాకిట్లోవున్న సిపాయి సిగరెట్ ముట్టించాడు మంగలి రుబషోవ్ గడ్డం, తల త్వరగా చక్కగా చేశాడు. అతను రుబషోవ్ మీద వంగినప్పుడు యిద్దరిద్దనకులూ

కలిశాయ్ ఒకక్షణం; అదే సమయంలో మెడమీాద జుట్టు తేలికగా పట్టుకోవటానికా అన్నట్లు వంగి తనచేతివ్రేళ్ళు రెండు కాలరుకింద పెట్టాడు. మంగలివ్రేళ్ళు కాలరు బయట కొచ్చేటప్పుడు రుబషోవ్‌కి కాలరుకింద కాగితపు వుండ గర గర స్పర్శ తగిలింది. కొద్ది నిమిషాలకు యీా కార్యకలాపం ముగిసి, రుబషోవ్‌ను అతనిగదికి తీసుకుపోయారు పక్కమీాద కూర్చుని రహస్య రంధ్రంవైపు, యెవ్వరూ చూడడంలేదని నిర్థారించుకోవటానికి, చూచి మెడకింద కాగితపు వుండతీసి, కాగితం విప్పిసరిజేసి చదివాడు. అందులో అతివేగంగా గిలి కిన రెండుమాటలే వున్నయ్.

'మౌనంగా మరణించు.'

ఆ కాగితాన్ని బొక్కెనలో పారవేసి మళ్ళీ పచార్ల కుపక్రమించాడు. బయటి ప్రపంచం నుంచి అతనికి జేరిన మొదటి సందేశం అదే. శత్రుదేశాల్లో ఖైదుల్లో వున్నప్పుడు సందేశాలు చాల దొంగతనంగా జేరేవి. తనమీాద ఆరోపిం చిన ఆరోపణలను త్రిప్పి వాళ్ళమీాద ఆరోపించమని, అధికార ధిక్కారం చేయమని అతన్ని ఆదేశించారు. విప్లవకారుడు కూడ మౌనంగా వుండవలసిన ఘడియలు కూడ చరిత్రలో వున్నాయా? మౌనంగా మరణించటమనే విషయమే ధర్మ మైనదనీ, అదొక్కటే తనకు మిగిలివున్న విషయమనీ, చరిత్రగతి మారిపోయిన ఘట్టాలు వున్నాయా?

అతను గదికి తిరిగి రాగానే, 402 నెంబరు ఆసక్తితో తన నెక్కడకు తీసుకెళ్లారో చెప్పమని గట్టిగాబాది తట్టటం

ప్రారంభించే సరికి, రుబషోవ్ ఆలోచనలకు భంగం కలిగింది.

'క్షవరం కోసం' రుబషోవ్ వివరించాడు.

'అప్పుడే విషాదఘటన జరిగిందేమోనని భయపడ్డాను.' బాధను ప్రకటిస్తూ అన్నాడు, 402 నెంబరు.

'నీ తర్వాతే!'

402 నెంబరు మామూలుగానే శ్రద్ధగా విన్నాడు.

'హా, హా! నువ్వు రాక్షసి మనిషిలా గున్నావే....'

చిత్రమేమంటే ఈ పాత ప్రశంస రుబషోవ్‌కి ఒకరకమైన సంతృప్తి నిచ్చింది. జీవన్మరణాల సమయాల్లోనేవిధంగా కఠిన నియమాలననుసరించి ప్రవర్తించాలో తెలిసిన 402 నెంబరు లాంటి వాళ్ళను చూచి అసూయపడ్డాడు. వాటినే వాళ్ళు అంటిపెట్టుకొని వుంటారు. తనజాతికికే విధమైన పాఠ్య గ్రంథమూ లేదు. ప్రతిదీ ఆచరించి చూడవలసిందే.

చావటానికి కూడ మర్యాద లేదు. ఇంతకంటె గౌరవ ప్రదమైందేది? మౌనంగామరణించటమా లేకతన ఆశయాలను కొనసాగించటానికి బహిరంగంగా అవమానింప బడటమా? వీప్లవానికి తన జీవితం యెక్కువ విలువైన దనటం వల్ల ఆర్లోవాను త్యాగం చేశాడు. తనను వొప్పించటానికి అతని స్నేహితులు వాదించి నిశ్చయించిన విషయమిది. చిన్నచిన్న వున్నత వర్గాల మర్యాదల్ని పాటించటంకంటే భవిష్యత్తులో వుద్యమాని కెక్కువ విలువగల వ్యక్తులు యిక్కడే మిగిలి వుండటం చాల ముఖ్యం. చరిత్ర స్వరూపాన్నే మార్చిన వ్యక్తులు యిక్కడే యెప్పుడూ సిద్ధంగా వుండటమే కర్తవ్యం. 'నన్ను మీ రేమైనా చేసుకోవచ్చు' నన్నది ఆర్లోవా.

ఆమె అలాగే చేసింది. తనను గురించి యింత యెక్కువగా ఆలోచించట మెందుకు? రాబోయే దశాబ్దంలో మన శకపు గతి తేలిపోతుంది అని ఇవనోవ్ వుదహరించాడు. కేవలం వ్యక్తిగత విరక్తి, విసుగు, అహంకారాలతో పారిపోగలడా? ఒకవేళ నెం. 1 సక్రియ మార్గంలోవుంటే మాత్రమేం? ఇక్కడ మట్టిలో, రక్తంలో, అబద్ధాల్లో యేది యేమైనా; చివరికి భవిష్యత్తుకు బ్రహ్మాండమైన పునాదులు వేయబడుతుంటే? చరిత్ర యెప్పుడూ అబద్ధపు రక్తపుమట్టిని అడుసుగా కలిపి భవనాలను నిర్మించే అమానుష అధర్మ నిర్మాతగానే వుండలేదా?

మౌనంగా మరణించు — అంధకారంలో అంతరించు— ఈ మాటలు చాల తేలికగా చెప్పారు....

కిటికీవద్ద మూడో నల్లపెంకుమీద హఠాత్తుగ ఆగిపోయాడు. మౌనంగా మరణించు అనే మాటలను, వాటి అసంగతాన్ని హెచ్చించటానికా అన్నట్లు తిరస్కారపు వ్యంగ్యస్వరంతో తనకు తెలియకుండానే బిగ్గరగా ఉచ్చరిస్తూన్నట్లు గమనించాడు.

ఇప్పుడు మాత్రం ఇవనోవ్ ప్రతిపాదనను తిరస్కరించటానికి నిర్ణయించుకొన్న నిశ్చయం తాను నమ్మినదానికంటే యేమాత్రం చలనంలేనిదని గుర్తించగలిగాడు. తాను నిజంగా ఆ ప్రతిపాదనను తిరస్కరించి, మారుమాట లేకుండా రంగం నుంచి నిష్క్రమించ దలచుకొన్నాడో, లేదో యిప్పుడు అనుమానాస్పదంగా కనిపించింది.

# 5

రుబషోవ్ జీవనస్థాయి పెరుగుతూనేవుంది. పదకొండో రోజున **మొదటిసారి** ఆవరణలోకి వ్యాయామానికి తీసి కెళ్ళారు.

మంగలిషాపు కెళ్ళినప్పుడు రక్షకుడుగా వచ్చిన సిపాయి తోనే ముసలి జైలుఅధికారి వచ్చి రుబషోవ్‌ను వుదయపు భోజనానంతరం, మొదటి వరసలోనే వ్యాయమంకోసం తీసు కెళ్ళాడు. 'ఈ వేళనుంచి ప్రతి రోజూ యిరవై నిమిషాలు వ్యాయమంచేయటానికి అనుమతించబడ్డావు' అని చెప్పాడు. అప్పుడు వరుసనే నియమాలను వల్లించాడు. వ్యాయమ కాలంలో ప్రక్కవాడితోగాని మరేఖైదీతోగాని మాట్లాడ కూడదు. గీతతప్పి నడవటంగాని, ప్రక్క వాళ్ళకు వ్రాతసందే శాలందివ్వటంగాని, సైగలుగాని చేయకూడదు. ఈనియమాల నుల్లంఘించిన వాళ్ళకు వెంటనే వ్యాయామావకాశాన్ని లేకుండ చేస్తారు. క్రమశిక్షణకు భంగకరమైన తీవ్రోల్లంఘనలకు నాల్గు వారాలు చీకటికొట్లో బంధించే శిక్ష విధిస్తారు. గది బయటికొచ్చి తలుపు దభాలున మూసి, ముగ్గురూ కలిసి వెళ్ళారు. కొన్ని అడుగుల దూరం వెళ్ళగానే 406 నెంబరు గది తలుపు తెరిచాడు.

వాకిలికి కొద్దిదూరంలో యూనిఫారమ్ సిపాయికి ప్రక్కనే నిలబడివుండి గదిలో బల్లమీద పడుకొనివున్న రిప్ వాన్ వింకిల్ కాళ్లను చూచాడు, రుబషోవ్. నల్లటి గుండీల బూట్లు, చివర్లు చిరిగినా శుభ్రంగా దులిపి బాగుచేసిన చెక్క-గుడ్డలాగు వేసుకొన్నాడు. వార్డరు, నియమాలను మరొక

సారి వల్లించాడు. ఆ తర్వాత పొట్టి ముసలివ్యక్తి బల్లమీద నుంచి తడబడుతూ లేచి నాకిట్లోకొచ్చి మిటకరించిచూచాడు. మొఖంమీద పెద్ద బూడిదరంగు గుబురువుంది; చూడ ముచ్చటగావున్న చెక్కలాగుతో బాటు నల్లనివైస్టుకోటు, లోహపు గడియారపు గొలుసు, నల్లగుడ్డకోటు వేసుకున్నాడు. గుమ్మంలో నిలబడి రుబషోవ్‌ను చాలా ఆత్రంగా పరికించాడు, తర్వాత స్నేహపూర్వకంగా తల నెమ్మదిగా పంకించాడు, నలుగురూ కలిసివెళ్ళారు. రుబషోవ్ మతిచెడిన వాడిని చూస్తాననుకొన్నాడు. కాని యిప్పుడాభిప్రాయం మార్చుకున్నాడు. బహుశా, దీర్ఘకాల అంధకార కారాగారవాసం వల్ల కనుబొమ్మల నరాలు వంగి వంకరతిరిగివున్నా, రిప్‌వాన్ వింకిల్ కళ్లు శుభ్రంగా, అమాయకబాలుడిలాగ స్నేహపూరితంగా వున్నయ్. అప్పుడప్పుడు రుబషోవ్ వైపు స్నేహపూరితంగా చూస్తూ, ఆచి తూచి చిన్న చిన్న అడుగులు అతి కష్టంగా వేస్తూ నడుస్తున్నాడు. మెట్లక్రిందభాగంలో హఠాత్తుగా కాలు జారిపడేవాడే, కాని సమయానికి సిపాయి రెక్కపట్టుకొని ఆపాడు. రుబషోవ్ వినాలని, రిప్‌వాన్ వింకిల్ యేవో గొణిగాడు. బహుశా, తన కృతజ్ఞతను తెలపటానికి కాబోలు; కాపలా సిపాయి వెర్రిగా పళ్లునూరాడు. తెరచివున్న ముఖద్వారంగుండా ఆవరణలో కెళ్ళారు. అప్పటికే మిగతా ఖైదీలు జంటలుగా యేర్పడి సిద్ధంగా వున్నారు. కాపలా వుద్యోగులు నిలబడే మధ్యభాగంనుంచి రెండు ఈలలు మ్రోగినవెంటనే మొదటి వ్యాయామవరుస ప్రారంభమైంది.

ఆకాశం విరితగా వెలార్చిన నీలపు రంగుతో నిర్మలంగా

వుంది, గాలి మంచుకణాల ధ్వనితో నిండివుంది. రుబషోవ్ దుప్పటి తెచ్చుకోవటం మర్చిపోవటంవల్ల, వణికి పోయాడు. ఆవరణలోకి రాగానే రిప్‌వాన్‌వింకిల్ వారరిచ్చిన పాత బూడిద వర్ణపు దుప్పటి కప్పుకున్నాడు. రుబషోవ్ పక్కనే నెమ్మదిగా చిన్న చిన్న అడుగులువేస్తూ మౌనంగా, పై నీలాకాశాన్ని మిటకరిస్తూ చూస్తూ నడుస్తున్నాడు. కప్పుకున్న దుప్పటి మోకాళ్ళ వరకూ వచ్చిపడుతూ అతన్ని గంటాకారంగా కన్పింప జేసింది. రుబషోవ్ తన గది కిటికీయేదో శ్రమపడి గుర్తించాడు. మిగతా అన్నిటిలాగే తన కిటికీకూడ దుమ్ముకొట్టుకొని, చీకటిగా, లోపలేమున్నదీ కనపడకుండా వుంది. 402 నెంబరు కిటికీవైపు కాసేపు చూచాడు. అక్కడకూడ కిటికీ మసకఅద్దం మాత్రమే కనిపించింది. 402 నెంబరు వ్యాయామానికి రానటానికి అనుమతించరు; క్షౌరానికి తీసికెళ్ళరు; విచారణకూడ తీసికెళ్ళరు. అతన్ని బయటికి రానివ్వటమెప్పుడూ రుబషోవ్ వినలేదు.

ఆవరణలో చుట్టూ మౌనంగా, నెమ్మదిగా తిరిగారు. బూడిదరంగు గుబురు మధ్యలో 406 నెంబరు పెదిమలు పోల్చుకోలేనివిధంగా కదిలినయ్, తనలో తాను యేదో గొణుక్కున్నాడు. రుబషోవ్‌కి మొదట్లో యేమీ అర్థంకాలేదు. తర్వాత 'నిద్రలే, దౌర్భాగ్య చక్రవర్తీ' అని రాగయుక్తంగా గొణుగుతున్నాడని గ్రహించాడు. అతను పిచ్చివాడు కాదు, కాని యేడువేల రాత్రిందివాలు కారాగారంలో గడపటంవల్ల విచిత్రంగా తయారైనట్లు కనిపిస్తున్నాడు.

రుబషోవ్ అతన్ని ప్రక్క చూపులు చూస్తూ, రెండు దశాబ్దాలు బాహ్య ప్రపంచంతో సంబంధం లేకుండా గడపటం యెలా వుంటుందోనని వూహిస్తున్నాడు. ఇరవై సంవత్సరాలక్రితం మోటారు కారులు అపురూపంగా, విస్మృతంగావుండేవి; వైర్ లెస్ లేనేలేదు; యీ నాటి రాజకీయ నాయకుల పేర్లు అప్పుడు తెలియనే తెలియవు. నూతన ప్రజావుద్యమాలు, గొప్ప రాజకీయ పతనాలు, వక్రమార్గాలు, విప్లవ ప్రభుత్వాం చేరుతున్న దిగ్భ్రమజెందించే ఘట్టాలు లేవు ఆ రోజుల్లో వూహా స్వర్గపు తలుపులు తెరిచి వున్నాయనీ; దాని గడపల మీద మానవసమాజం నిలబడివుందనీ నమ్మేతుండేవారు....

ఇతరుల దృష్టితో ఆలోచించగల నేర్పున్నప్పటికీ తన పొరుగు వ్యక్తి మానసిక స్థితిని, రుబషోవ్ తన వూహాగానంతో చిత్రించుకోలేననుకున్నాడు. ఆ విధంగా ఇవనోవ్, నెం. 1, చివరకి ఒంటద్దపు జోడు ధరించే అధికారి మానసిక స్థితికూడ తేలిగ్గా చిత్రించగలడు, కాని రిప్ వాన్ వింకిల్ విషయంలో మాత్రం పరాజయం పొందాడు. ప్రక్కగా చూచాడు. ముసలివా డప్పుడే తల నిటు త్రిప్పాడు. మంద హాసం చేస్తున్నాడు. దుప్పటి భుజాలమీదకప్పి పట్టుకొని రుబషోవ్ ప్రక్కనే నెమ్మదిగా నడుస్తూ, అస్పష్ట స్వరంతో 'నిద్రలే, దౌర్భాగ్య చక్రవర్తీ' రాగాన్నాలాపిస్తున్నాడు.

తిరిగి వాళ్ళ గదుల కెళ్ళేప్పుడు గది గడపలో వుండి ఆ ముసలివాడు రుబషోవ్ వైపు తిరిగి మళ్ళీ తలవూపాడు. అతడు కళ్లు మిటకరించాడు. వాటి భావస్ఫురణ హఠాత్తుగా మారింది; వాటిలో నిరాశ, భీతావహం గోచరించాయి. తనను

పిలుస్తాడేమోనని రుబషోవ్ అనుకుంటుండగానే వారరు తలుపు మూశాడు. రుబషోవ్ వెనక తలుపు మూయగానే గోడ వద్దకెళ్ళి తట్టాడు, గాని 406 నెంబరు మౌనంగావున్నాడు.

402 నెంబరు వీళ్ళు వ్యాయామానికి వెళ్ళటం తన కిటికీలో నుంచి చూచాడు. అక్కడ జరిగిన విషయాలను గురించి ప్రతి చిన్న వివరంతో సహా చెప్పమని అడిగాడు. అక్కడి గాలి చలిగా వుందా లేక కొద్దిగా చలిగా వుందా, గాలి వాసనెలావుందీ, వరండాలో క్రొత్త ఖైదీ లెవరైనా కలిశారా, యేమైనా చివరికి రిప్‌వాన్ వింకిల్‌తో కొద్ది మాటలైనా నడిచినాయా వగైరా విషయాలన్నీ చెప్పవలసి వచ్చింది. రుబషోవ్ అన్నిటికీ ఓపిగ్గా సమాధానాలిచ్చాడు. ఎన్నడూ బయటకు రా వీలులేని 402 నెంబరుతో పోల్చుకుంటే తాను యెంతో ప్రత్యేక వ్యక్తిగా భావించుకున్నాడు. అతనికోసం బాధపడ్డాడు. తాను దాదాపు దోషిననే భావం తట్టింది.

మరునాడు, ఆ తరువాత కూడ సరిగ్గా వుదయపు భోజనానంతరం రుబషోవ్‌ను వ్యాయామానికి తీసుకెళ్ళే వాళ్లు. ఆ సమయంలో యెప్పుడూ రిప్‌వాన్ వింకిల్ అతని తోడుగా వుండేవాడు మౌనంగా నెమ్మదిగా దుప్పట్లు కప్పుకొని పక్క పక్కనే నడిచేవారు. మిగతా ఖైదీలవైపో, కిటికీలవైపో తన ముక్కద్దాల్లోనుంచి పరీక్షగా చూస్తూ ఆలోచనా నిమగ్నుడయ్యాడు. ముసలివాడు పెరుగుతున్న గడ్డపు దుబ్బుతో, సరళమైన పసి మందహాసంతో తన అమరగేయాన్ని గొణుగుతున్నాడు.

మిగతా ఖైదీలు అప్పుడప్పుడు మాట్లాడుకుంటున్నా, కావలా వుద్యోగులు నిశ్శబ్దనియమాలను పాటింప జేయటానికి, గట్టిగా ఒత్తిడి పెట్టకున్నా, రుబషోవ్ మూడవవరస వరకు తనప్రక్క వ్యక్తితో యేమీ మాట్లాడలేదు. మిగతా ఖైదీలు తల లెటూ త్రిప్పకుండా, రుబషోవ్‌కి పరిచితమైన జైలువిధానంతో పెదిమలు కదిలీ కదలనట్లు మాట్లాడుకొంటున్నారు.

మూడోరోజున తనయెడమవైపు జేబులో నోటుపుస్తకం, పెన్సిల్ పెట్టుకొచ్చాడు. పదినిమిషాలైనతర్వాత ముసలి వాడది చూచి మొఖం గంపెడంత చేశాడు. ఆవరణమధ్యలో నుండి లోకాభి రామాయణంలో మునిగివున్న వుద్యోగులు ఖైదీలవైపు శ్రద్ధగా చూడటంలేదని చాటుగాచూచి తెలుసుకున్నాడు. వెంటనే వేగంగా రుబషోవ్ జేబులో పుస్తకం, పెన్సిల్‌లాగి, గంటాకారపు దుప్పటి ముసుగులో, పుస్తకంలో యేదో గిలకటం మొదలుపెట్టాడు. త్వరగాముగించి ఆకాగితం చించి రుబషోవ్ చేతిలో నొక్కాడు; యెలాగైతేం, పుస్తకం పెన్సిల్ తానట్టే పెట్టుకొని యింకా యేదో గిలుకుతూనే వున్నాడు. కావలా వాళ్లు తమ వైపు చూడటం లేదని నిర్ధారణ చేసుకొని కాగితం చూచాడు. దానిమీద యేమీ వ్రాయలేదు. అత్యాశ్చర్యంగొలిపేంత కచ్చితంగా వాళ్ళ దేశపు భౌగోళిక చిత్రం గీసివుంది. అందులో ముఖ్యపట్టణాలు, పర్వతాలు, నదులు గుర్తింపబడ్డాయ్. మధ్యలో విప్లవ చిహ్నంతో పతాకను చిత్రించాడు.

మళ్ళీ యింకోచుట్టు సగం తిరిగేలోపున 406 నెంబరు యింకో కాగితంచించి రుబషోవ్ చేతిలో నొక్కాడు. ఇందులో

కూడ పూర్వ చిత్రమే కచ్చితంగా విప్లవదేశాన్ని చిత్రిస్తోంది. రుబషోవ్‌లో కలిగే మార్పుకోసం 406 నెంబరు అతనివైపు చూచాడు. రుబషోవ్ 406 నెంబరు చూపులతో కొంచెం కలవరపడి, అభివందనలు తెలియ జేస్తూ గొణిగాడు. ముసలి వాడు కన్ను గిలిపి,

'కళ్లుమూసుకొని కూడ గీయగలను' అన్నాడు.

రుబషోవ్ తల పంకించాడు.

ముసలివాడు చిరునవ్వుతో, 'నీవు నన్ను నమ్మవుగాని, యిరవై సంవత్సరాలనుంచి అభ్యాసం చేస్తున్నాను' అన్నాడు.

కాపలావాళ్ళవైపు వేగంగా చూచి, నడక తగ్గించి ముసుగులో యింకో కాగితం మీద యేదో గిలికాడు. కళ్ళు గట్టిగా మూసుకొని అంధుడులాగ తలపై కెత్తాడు. రుబషోవ్ కాపలా వాళ్ళవైపు ఆరాటంగా చూచాడు. ముసలివాడు తడబడతాడేమో, వరసలో పడిపోతాడేమోనని భయప డ్డాడు. కాని మరుచుట్టు సగంలోనే పూర్తిచేశాడు. గీతలు కొంచెం యెక్కువ వంకర టింకరగ వున్నయ్. కాని ఆ పటం పూర్వపు వాటంత కచ్చితంగానూ వుంది. దేశపుమధ్యలో జెండామీది చిహ్నం మాత్రం కొంచెం పెద్దదిగా వుంది.

'ఇప్పుడు నన్ను నమ్ముతావా ?' అని రుబషోవ్ చెవిలో చెప్పి సంతోషంతో అతని వైపు చూస్తూ మందహాసం చేశాడు. రుబషోవ్ తల వూపాడు. అప్పుడు ముసలివాడి ముఖాన విషాద ఛాయ లలముకొన్నాయ్. రుబషోవ్ ప్రతి సారీ గదికెళ్ళేప్పుడు అతని ముఖంలో కన్పించే ఆ భీతావహ భావాన్ని గుర్తించాడు.

'మనమేం చెయ్యాలేం, నన్ను తప్పు బండిలో యెక్కించారు' అని రుబషోవ్‌తో గుసగుసలాడాడు.

'అంటే అర్థమేమిటి ?'

రిప్‌వాన్ వింకిల్ రుబషోవ్‌వైపు సరళంగా, విచారంగా చిరునవ్వు నవ్వాడు. 'నేను బయలుదేరేటప్పుడు నన్ను తప్పు రైల్వేస్టేషన్‌కు తీసికెళ్ళారు. నేను కనిపెట్టలేదనుకున్నారు. నాకు తెలుసునని యెవరితోనూ అనకు' కాపలా వాళ్ళవైపు కనుగిలుపుతూ గుసగుస లాడాడు.

రుబషోవ్ తల వూగించాడు. ఆ వెంటనే వ్యాయామం ముగిసిందని యీల వేశారు.

ద్వారంలోనుంచి వెళ్ళేప్పు డింకోక్షణం మాట్లాడుకొనే అవకాశం దొరికింది. మళ్ళీ 406 నెంబరు కళ్ళు విప్పారి స్నేహపూరితాలైనయ్.

'బహుశా, నీకూ్కడా యిలాంటిదే జరిగిందా ?' సానుభూతిగా అడిగాడు రుబషోవ్‌ని.

రుబషోవ్ తల వూపాడు.

రుబషోవ్ చేతిలోని గిజిబిజి చిత్రాన్ని చూపిస్తూ,

'ఎవరూ ఆశను వదలకూడదు. ఒకరోజున మనమంతా అక్కడికి వెళ్తాం' అన్నాడు.

నోటుపుస్తకం, పెన్సిల్ రుబషోవ్ జేబులో కుక్కాడు. మెట్లమీద మళ్ళీ తన అమర గేయాన్నాలాపించాడు.

ఇవనోవ్ నిర్ణయించిన గడువుకు ముందురోజు కూడ గడిచి పోయింది. రాత్రి భోజనాలప్పుడు వాతావరణంలో యేదో అసాధారణంగా కనిపిస్తోంది. అలా యెందుకుందో మాత్రం అర్థం కాలేదు; మామూలు ప్రకారం భోజనం వచ్చింది, నిర్ణయకాలానికి తప్పకుండ యాలస్యమోగింది; అయినా వాతావరణంలో యేదో తీవ్రత వున్నట్లుగా భావిస్తున్నాడు. బహుశా, పనివాడు రోజూకంటే భిన్నంగా కొంచెం పరీక్షగా చూడటం వల్లనేమో; బహుశా, ముసలి వార్డరు స్వరంలో చిత్రమైన నీరసం ధ్వనించింది. రుబషోవ్ కేమీ తెలియలేదు. కాని ఆలోచించలేక పోయాడు. కీళ్ళ వాతపు రోగిలాగ నరాల వుద్రేకింపు ననుభవించాడు.

ఆఖరు గదిలోకూడ భోజనం యివ్వటం పూర్తయి నిశ్శబ్దంగా వున్నతర్వాత రహస్య రంధ్రంలోనుంచి వరండాలోకి తొంగిచూచాడు, విద్యుద్దీపాల్లో విద్యుచ్ఛక్తి తక్కువై మసక వెల్తురును పెంకులపైన ప్రసరింపజేస్తున్నయ్. వరండాలోని ప్రశాంతత అంతిమ దశలోను, నిరాశాపూరితంగానూ కనిపించింది. రుబషోవ్ బల్లమీద పడుకుని మళ్ళీలేచి కాస్త ప్రాయాలని బలవంతంగా ప్రయత్నించి, సిగరెట్ ఒకటి బయటకులాగి ముట్టించాడు. బయటి ఆవరణలోకి చూచాడు. ఆకాశం మేఘావృతమై మంచు కురుస్తోంది. మంచు మురికిగా, నున్నగావుంది. ఎదుటి ప్రహరీగోడమీద గస్తీసిపాయి రైఫిల్తో అటూయిటూ పహారా తిరుగుతున్నాడు. మళ్ళీ యింకో

సారి తలుపు సందులోనుంచి వరండాలోకి చూచాడు. నిశ్శబ్దత, నిర్మానుష్యం, విద్యుద్దీపం.

అలవాటుకు భిన్నంగా, ప్రొద్దు పోయినప్పటికే 402 నెంబరుతో సంభాషణ కుపక్రమించాడు: 'నిద్రపోతున్నావా?'

కొద్ది సేపటివరకు సమాధానం రాకపోతే, నిరుత్సాహంతో యెదురు చూచాడు. తర్వాత మామూలుకంటే నిదానంగా, లో స్వరంతో వచ్చింది,

'లేదు, నీవుకూడ అదే అనుకుంటున్నావా?'

'అనుకోవటం— ఏమిటి?' రుబషొవ్ అడిగాడు. కష్టంగా శ్వాస పీల్చాడు. బల్లమీద పడుకొని, ముక్కద్దాల చట్రంతో తట్టుతున్నాడు.

మళ్ళీ 402 నెంబరు కాసేపు తటపటాయించాడు. అతి హీనస్వరంతో మాట్లాడు తున్నట్లుగా తగ్గు స్థాయిలో తట్టాడు.

'నీవు నిద్రపోవటం మంచిది....'

రుబషోవ్ యింకా బల్లమీద పడుకొనే వున్నాడు. 402 నెంబరు అలా పితృవాత్సల్యపు స్వరంతో మాట్లాడేప్పటికి సిగ్గుపడ్డాడు. చీకట్లో వెల్లికిల పడుకొని సగం పైకెత్తి గోడకానించినచేత్తో ముక్కద్దాలుపుచ్చుకొని చూస్తున్నాడు. బయట నిశ్శబ్దత అతని చెవుల్లో గింగిరుమ నేంతదట్టంగావుంది. హఠాత్తుగా గోడ మోగింది:'చిత్రం— వెంటనే బాధపడ్డావే.'

'బాధపడిందేమిటో వివరించు.' బల్లమీదకూర్చుని తట్టాడు.

402 నెంబరు. పునరాలోచిస్తున్నాడు. తాత్సారంచేసి,

'ఈ రాత్రి రాజకీయాభిప్రాయభేదాలు తుడిచి పెట్ట

బడుతున్నాయ్....' అని తట్టాడు.

రుబషోవ్ కర్థమైంది. చీకట్లో గోడకానుకొని కూర్చున్నాడు. ఇంకేమైనా విందామని. కాని 402 నెంబరు యేమీ చెప్పలేదు. కొద్దిసేపటికి రుబషోవ్ తట్టాడు:

'మరణశిక్షలు'

'అవును,' సంగ్రహంగా అన్నాడు, 402 నెంబరు.

'నీకెలా తెలుసు?'

'తొర్రిపెదవి వాడు చెప్పాడు.'

'ఎప్పుడు?'

'తెలియదు,' కొంతసేపటికి, 'వెంటనే' అన్నాడు.

'పేర్లు తెలుసా?'

'లేదు,' సమాధానమిచ్చి, మళ్ళీకొంతసేపటికి 'నీలాంటి వాళ్ళు. రాజకీయ విభేదాలు' అన్నాడు.

రుబషోవ్ పడుకుని మళ్ళీ యెదురుచూచాడు. కాసేపటికి ముక్కద్దాలు తగిలించుకొని మెడక్రింద చెయ్యి పెట్టుకొని మెదలక, కదలక పడుకున్నాడు. బయటినుంచి యేమీ వినరావటంలేదు. ఆ భవంతిలో ప్రతి నిమిషం బిగుసుకుపోయి, అంధకారంలో అంతరించిపోతోంది.

అంతర్యుద్ధంలో తన స్వానుభవం— దాదాపు మరణశిక్ష తప్ప మరెప్పుడూ చంపడం చూడలేదు. అదే విషయం, సామాన్య పరిస్థితుల్లో క్రమవిధానంలో భాగంగా యెలా వుంటుందో సరిగా చిత్రించుకోలేక పోయాడు. చంపడాలు రహస్య గృహాల్లో రాత్రిళ్ళు జరుగుతాయనీ, అపరాధి మెడ

మీద కాల్చి చంపుతారనీ అస్పష్టంగా తెలుసుగాని వివరా లేమీ రుబషోవ్‌కి తెలియవు. పార్టీలో మరణమంటేవింతేమీ కాదు; ప్రేయసీప్రియుల మరణంలాంటిదేమీ కాదది. చివరకు జరిగే ఫలితం అది. ప్రతివాడు రహస్యంగా వుంచే యదార్థం అది. మృత్యువునుగురించి అరుదుగామాట్లాడుతారు. 'మరణ శిక్ష' అనేమాట యెప్పుడోగాని ప్రయోగించరు. దానికి సాం ప్రదాయ పర్యాయపదం 'భౌతికసమాప్తి'. 'భౌతికసమాప్తి' అనేమాట మళ్ళీ ఒక స్పష్టభావాన్ని లేవనెత్తింది; అది రాజ కీయ కార్యకలాపాల అంత్యం.

ముక్కద్దాల్లో నుంచి చీకట్లోకి తేరిపారచూస్తున్నాడు. కార్యక్రమం అప్పుడే ప్రారంభమైందా, లేకయింకా కావలసి వుందా? బూట్లు, మేజోళ్లు తీసివేశాడు. దుప్పటి చివర అతని నగ్నపాదాలు పేలవంగా పొడుచుకొచ్చినయ్. నిశ్శబ్దత మరీ అసహజంగాతయారైంది. మామూలుగాహాయినిచ్చే ప్రశాం తత కాదు, శబ్దాన్నంతటినీ మ్రింగి వేసిన నిశ్శబ్దత; బిర్రుగా బిగించిన డోలు తోలు ప్రసరింపజేసే నిశ్శబ్దత. తన నగ్న పాదాల వైపు తేరిపార చూచి నెమ్మదిగా బొటన వ్రేళ్ళను కదిలించాడు. తన బొటనవ్రేళ్లు స్వయంగా జీవిస్తున్నట్లుతోచి, ఆ భావం భయంకరంగా, అసహ్యంగా కనిపించింది. తన శరీరం అసాధారణంగా వుద్రేకపూరితమైవున్నట్లుతోచిందతనికి. కాళ్ళ మీద దుప్పటి నులివెచ్చదనం, మెడక్రింద చేతివ్రేళ్ళు తడి తగులు తున్నయ్. 'ఈ భౌతిక సమాప్తి' యెక్కడ జరుగుతోంది? మంగలిషాపుపైన మెట్లక్రింది భాగంలో ఐ వుండాలి. గ్లాట్కిన్ రివాల్వరు బెల్టుతోలు వాసన వస్తున్నట్లుంది. అతని యూని

ఘోరం క్రీరు వినిపిస్తున్నది. అపరాధితో యేమంటున్నాడు? 'గోడవైపు మొఖం పెట్టి నిల్చో' 'దయజేసి' అంటాడా? 'భయ పడక, నిన్నేం బాధించనులే....' అంటాడా? బహుశా, వాళ్లు నడుస్తుండగానే, హెచ్చరిక యేమీ లేకుండా, వెనకనుంచే కాలుస్తాడేమో - కాని నిందితుడు యెప్పుడూ వెనక్కు తిరిగి చూస్తూనే వుంటాడు. బహుశా, దంత వైద్యుడు పట్కారు దాచినట్లు యితను రివాల్వరు చొక్కా చేతిలో దాస్తాడేమో. బహుశా, యితరులుకూడ వుంటారక్కడ. వాళ్ళెలావుంటారు? నిందితుడు ముందుకు పడతాడా, వెనక్కు పడతాడా? లేక లేస్తాడా? బహుశా, అనుమానం లేకుండటం కోసం రెండో గుండుకూడ కాల్చాలేమో.

రుబషోవ్ సిగరెట్ దమ్ము పీల్చి బొటనవ్రేళ్ళ వైపు చూచాడు. సిగరెట్ కాగితం కాలుతూ చేసే శబ్దంకూడ వినపడేటంత ప్రశాంతంగా వుంది. సిగరెట్ దమ్ము గట్టిగా లాగాడు. 'అర్ధం లేదు' తనకై తాననుకున్నాడు. వాస్తవానికి 'భౌతిక సమాప్తి' యొక్క సాంకేతిక యదార్ధతను అత నెప్పుడూ నమ్మలేదు. బహుశా యీ పాటికంతా ముగిసి వుం టుంది, గతించిన దానికి యదార్ధతలేదు. చీకటిగా, ప్రశాం తంగా వుంది. 402 నెంబరు తట్టటం ఆపేశాడు.

ఈ అసహాజపు నిశ్శబ్దతను చీల్చటాని కెవరైనా బయట భయంతో కేకలువేస్తే బాగుండు ననుకున్నాడు. ముక్కు చీదాడు, అప్పుడు కొంతసేపటినుంచి ఆర్లోవాపరిమళం ముక్కు రంధ్రాల్లో వుందని గ్రహించాడు. చివరికి సిగరెట్లుకూడ ఆమె వాసనే వేస్తున్నయ్. ఆవిడ చేతిలో తోలుసంచి వుండేది.

అందులో సిగరెట్లనుంచి ఆవిడ వుపయోగించే ముఖపరిమళపు పౌడివాసన వచ్చేది... నిశ్శబ్దత మరీ గట్టిపడింది. అతను కదిలి నప్పుడు బల్ల మాత్రం కిర్రుమంది.

రుబషోవ్ లేచి యింకో సిగరెట్ ముట్టిద్దామనుకొంటుం డగా గోడమీద మ్రోత ప్రారంభమైంది: 'వాళ్లొస్తున్నారు.'

రుబషోవ్ విన్నాడు. తన నవరగంతలవద్ద నాడిమ్రోత తప్ప యింకేమీ వినిపించలేదు. ఎదురు చూచాడు. నిశ్శబ్దత బిగుసుకుపోయింది. ముక్కద్దాలు తీసి తట్టాడు.

'నా కేమీ వినిపించలేదు.'

చాలసేపు మెదలకుండ వుండి 402 నెంబరు హఠా త్తుగ గట్టిగా, స్పష్టంగా తట్టనారంభించాడు.

'380 నెంబరు వార్త అవతలకు పంపు.'

రుబషోవ్ త్వరగా లేచి కూర్చున్నాడు. అర్థమయింది. 380 నెంబరు నుంచి పదకొండు గదులు దాటి, పొరుగువాళ్ళ ద్వారా యిక్కడి కొచ్చింది వార్త. 380 నెంబరు నుంచి 402 నెంబరు వరకూ వున్నగదుల్లో ఖైదీలు, నిశ్శబ్దాంధ కారంలో, నాద ధ్వనికి మెట్లుగా వున్నారు. వాళ్ళునాలుగు గోడలమధ్య నిర్బంధంలో అరక్షితంగా వున్నారు. ఇదేవాళ్ళ సంఘీభావం. రుబషోవ్ బల్లమీదనుంచి దూకి అవతలి గోడ వద్దకు నగ్నపాదాలతో దడదడ పరుగెత్తి, బాకెట్టన ప్రక్కన పాతుకుపోయి, 406 నెంబరుకి తట్టాడు.

'హాజరుగా వుండు, 380 నెంబరును యిప్పుడు కాలు స్తారు. వార్తనవతలకు పంపు.'

అతను వినటానికి కూర్చున్నాడు, బాకెట్టన బోర్ల

పడింది, దాన్లోనుంచి వచ్చినవాసన ఆర్లోవా పరిమళాన్ని నెట్టి వేసింది. జవాబేమీలేదు, మళ్ళీ హడావిడిగా దడదడలాడుతూ బల్లవద్దకు పరుగెత్తాడు. ఈసారి ముక్కుద్దాలతోగాక వ్రేళ్ళ కణుపులతో తట్టాడు.

'380 నెంబరు యెవరు?'

మళ్ళీ ఈసారికూడ జవాబులేదు. తనలాగే 402 నెంబరుకూడ రెండుగోడల మధ్య ఆసులో గొట్టంలాగ తిరుగుతూ వుండి వుంటాడని రుబషోవ్ వూహించాడు. తన గది కవతల పదకొండు గదుల్లోనూ వాళ్ళు గోడలమధ్య నగ్న పాదాలతో ముందుకూ, వెనక్కూ, నిశ్శబ్దంగా, హడావిడి పడుతున్నారు. ఇప్పుడు 402 నెంబరు గోడవద్దకొచ్చి చెప్పాడు:

'వాళ్లతని శిక్షను చదువుతున్నారు. అవతలకుపంపు.'

రుబషోవ్ తన పూర్వప్రశ్నను మళ్లీ అడిగాడు:

'అతనెవరు?'

కాని 402 నెంబరు అవతలివైపు కెళ్ళిపోయాడు, రిప్ వాన్ వింకిల్ కి యీవార్త నందించటం అనవసరమైనప్పటికీ, వార్తా ప్రసారం చేయటం తనవిధి అనే ఒక అవ్యక్తభావ ప్రోద్బలంతో, యీ వార్తా ప్రవాహం యెక్కడా ఆగకూడదనుకొని బొక్కెనవద్దకు దడదడ లాడుతూపోయి తట్టాడు. బొక్కెన సాన్నిహిత్యం తలనొప్పి తెప్పించిందతనికి. పక్క దగ్గరకొచ్చి యెదురు చూస్తున్నాడు. ఇప్పటికీ బయటనుంచి యేమాత్రం శబ్దంకూడ వినపడటంలేదు గోడమీద మాత్రమే శబ్దం వస్తోంది: 'అతను రక్షించండి అంటూ అరుస్తున్నాడు.'

అదే వార్తను 406 నెంబరు కందించాడు. విన ప్రయ

శ్నించాడు. ఏమీ వినిపించలేదు. ఇక నింకోసారి బొక్కెన వద్దకెళితే రోగంరావటం ఖాయమనుకున్నాడు.

'అతన్ని తీసుకొస్తున్నారు. గిజగిజతన్నుకుంటూ యేడుస్తున్నాడు. అవతలకు పంపు' అని 402 నెంబరు తట్టాడు.

'అతని పేరేమిటి?' 402 నెంబరు తనవాక్యం పూర్తి చేయకముందే రుబషోవ్ త్వరగాతట్టాడు. ఈసారిజవాబువచ్చింది.

'బొగ్రోవ్. ప్రతి పక్షంవాడు, అవతలకు పంపు'

రుబషోవ్ కాళ్ళు హఠాత్తుగ బరువెక్కినయ్. గోడకు వ్రేలబడి 406 నెంబరుకు తట్టాడు.

'మైఖెల్ బొగ్రోవ్, పోటెమ్కిన్ యుద్ధనౌకమీద పూర్వనావికుడు, తూర్పుదళానికి నాయకుడు, ప్రథమ విప్లవ చిహ్నం ధరించినవాడు, వురికి వెళ్తున్నాడు...'

నుదురు మీద చెమటతుడుచుకొని, మెలాగోమిగతా 'అవతలకు పంపు' వాక్యాన్ని ముగించాడు.

బొగ్రోవ్ రూపదృశ్యాన్ని గుర్తుకు తెచ్చుకోలేక పోయాడు. కాని అతని భారీ విగ్రహం; వికృతంగా, పొడుగ్గా వ్రేలాడు చేతులు, కొంచెం పైకి దిరిగిన ముక్కువున్న విశాల ముఖంమీద మచ్చలు కనిపిస్తున్నాయ్. వీళ్ళిద్దరూ 1905 తర్వాత ప్రవాసంలో ఒకే గదిలోనివాసులు. రుబషోవ్ అతనికి వ్రాయను, చదువను, చారిత్రక విజ్ఞానపు మూలసూత్రాలను నేర్పాడు. అప్పటినుంచి రుబషోవ్ యెక్కడున్నా సంవత్సరానికి రెండుసార్లు జాబులు స్వదస్తూరితో వ్రాస్తుండేవాడు. జాబు చివర తప్పకుండ 'జీవితాంత విశ్వాసపాత్రుడు, నీ కామ్రేడ్, బొగ్రోవ్' అని వుండేది.

బాక్కెన ప్రక్కన గోడకు తలనాన్చి ఆలోచిస్తున్న రుబషోవ్‌కి వినిపించేటంత దగ్గరగా, హడావిడిగా, 'వాళ్ళు వస్తున్నారు' అని తట్టాడు 402 నెంబరు.

'రహస్య రంధ్రం దగ్గర నిలబడు. డోలు మ్రోత. అవతలకు పంపు.'

రుబషోవ్ కొయ్యబారి పోయాడు. 406 నెంబరుకు అందించాడు వార్తను. చీకట్లోనే రహస్యరంధ్రంవద్దకు దడ దడ లాడుతూ వెళ్ళి చూచాడు. పూర్వం లాగే నిశ్శబ్దత.

కొద్దిక్షణాల తర్వాత గోడమీదమ్రోత: 'ఇప్పుడు'

వరండాలో అణిచిపెట్టి మ్రోగిస్తున్న డోలు శబ్దం వినవస్తోంది, తట్టటం బాదటం ఆగిపోయాయి. అంధకారంలోగది తలుపుల వెనుక గౌరవ సైనిక వందనం చేయడానికా అన్నట్లుగా 380నుంచి 402వరకు వున్న వ్యక్తులు నిలబడివున్నారు. రహస్య రంధ్రానికి కన్ను ఆనించి కాంక్రీటు గోడలమీద చేయబడుతున్న ధ్వనులతో శృతికలిపాడు. అతని కాశ్చర్యం కలిగించేట్టుగా ఆ వూపి రాడనీయని శబ్దతరంగం 406నెంబరు మీదుగా పైకి, కుడి వైపుకి పోయింది. రిప్‌వాన్ వింకిల్ కిదంతా చివరకి అర్థమైవుండాలి. అతనుకూడ మ్రోగిస్తున్నాడు. అదే సమయంలో యెడమవైపున, అతని దృష్టి గోచరం కానంతదూరాన, యినప తలుపులు వాటి అడుగు పట్టాలమీద కదుల్తూ చేసే కిరకిర ధ్వని వినిపించింది. ఎడమవైపు డోలుమ్రోత కొంచెం దగ్గరగా వినవస్తోంది. ఏకాంత వాసపు గదుల వరుసను, సామాన్య గదుల వరుసను వేరు చేసే యినప తలుపు తెరవబడిందని రుబషోవ్ గ్రహించాడు.

తాళాలగుత్తి గలగలమంది, యినపతలుపు యిప్పడమూయ బడింది; పెంకులమీద జారుతున్న తప్పటడుగులచప్పుడు దగ్గర కొస్తోంది. ఎడమవైపు డోలుమోత హెచ్చింది. 401 నుంచి 407 వరకు మాత్రం కనిపిస్తున్న అతని దృష్టిపథం యింకా శూన్యంగానే వుంది. తలుపు చప్పుడు కీచు ధ్వనులు చటున వినిపించాయ్. పిల్లల మూలుగుల లాంటి మూలుగులు విని పించాయ్. అడుగులు త్వరితంగా వేయబడ్డాయ్, యెడమ వైపు మోత సన్నగిల్లి, కుడివైపున అధికమైంది.

రుబషోవ్ చిటెకెలు వేస్తున్నాడు. క్రమేణ స్థల, కాల జ్ఞానమే నశించిదతనికి; అడవి తప్పెట్లలాటిశబ్దం ఒక్కటే విని పిస్తోంది. అడవికోతులు వాటిబోనుల చువ్వలవెనుక నిలబడి రొమ్ములుబాదుకుంటూ చేసే మోతలాగ వుంది. తానుచిటె కెలు వేస్తున్నప్పుడు క్రిందికైపైకీ మునివ్రేళ్లమీద కదుల్తూ రహస్యరంధ్రానికి కన్నుఅటించి చూస్తున్నాడు. పూర్వంలా పసుపు పచ్చని పోలిన విద్యుద్దీపపు కాంతి తప్ప, 401 నుంచి 407 గదుల యినప తలుపులు గాక, యెతరమేమే కన్పించ టంలేదు. డోళ్ళమోత హెచ్చింది, కిరుు, మూలుగు సమీ పించింది. హఠాత్తుగా విగ్రహఛాయలు అతని దృష్టి పథంలో ప్రవేశించినయ్. వాళ్ళు వచ్చేశారు. రుబషోవ్ మోగించ టం మానివేసి తేరిపార చూచాడు. ఒక్క క్షణంలో వాళ్ళు దాటిపోయారు.

ఈ కొద్ది క్షణాల్లో తానుచూచినది మనస్సులో ముద్రి తమైంది. ఇద్దరు పెద్ద యూనిఫారం వ్యక్తులు మూడో వ్యక్తిని చంకల క్రింద చేతులుపెట్టి యీడ్చుకు వెళ్లారు. మధ్య వ్యక్తి

వాళ్ళ పట్టునుంచి తప్పించుకొని బోర్లగాపడి, బొమ్మలాగ బిగిసి, వ్రేలాడుతున్నాడు. కాళ్లు యీడ్చుకొస్తున్నయ్. బూట్లు మొనలు నేలను రాచుకొని, యింతకుముందు రుబషోవ్ విన్న కీచు ధ్వని చేస్తూ దున్నుకొస్తున్నయ్. నోరు తెరుచుకునివుంది, తలమీదనుంచి తెల్లని వెంట్రుకల పాయలు మొఖంమీదగా వ్రేళ్లాడుతున్నయ్. చెమట చుక్కలు కారుతున్నయ్. వాటి వెంట, గడ్డంమీదుగా చొల్లు కారుతోంది. రుబషోవ్ దృష్టిపథంనుంచి వరండాచివరకు లాక్కుపోతుంటే క్రమేణా మూలుగు అణగిపోయింది. అది 'ఉ, అ, ఒ' అచ్చు అక్షరాల ప్రతిధ్వనిలా వినిపించింది. మంగలి షాపుపైన వరండా మలుపు తిరిగే టప్పుడు బొగ్రోవ్ రెండుసార్లు పొలి కేకలు వేశాడు. ఈసారి అక్షరాలేగాక పూర్తిమాట వినిపించింది. అతని పేరే, సుస్పష్టంగా విన్నాడు; రు-బ-షో-వ్.

అప్పుడుయెవరో సంజ్ఞ చేసినట్లు నిశ్శబ్దత ఆవరించింది, విద్యుద్దీపాలు మామూలుగా వెలుగుతున్నయ్. వరండా శూన్యంగా వుంది. గోడమీద మాత్రం 406 నెంబరు, 'నిద్రలే, దౌర్భాగ్య చక్రవర్తీ.' అని తట్టుతున్నాడు.
ఎలావచ్చి పడుకున్నాడో తెలియకుండానే బల్లమీద పడుకున్నాడుమళ్లీ. ఇంకా అతని చెవుల్లో మోతగింగురు మంటూనే వుంది. కాని యిప్పటి నిశ్శబ్దతమాత్రం యదార్థమైన నిశ్శబ్దత. 402 నెంబరు నిద్రపోయివుంటాడు. బొగ్రోవ్, లేక అతని అవశేషం యీ పాటికి అంతమయ్యే వుంటుంది.

'రుబషోవ్' రుబషోవ్....'

ఆ చివరికేక అతని మనోఫలకం మీద శాశ్వతమైన ముద్ర వేసింది. బొగ్రోవ్ రూపం మాత్రం అస్పష్టంగా వుంది. తన ముందునుంచియీడ్చుకువెళ్ళినబొగ్రోవ్‌నుయిప్పటికీ సరిగా పోల్చుకోలేకపోతున్నాడు. ఇప్పుడా తెల్ల వెంట్రుకలు గుర్తు కొస్తున్నయ్. బొగ్రోవ్ నేంచేశారు వాళ్ళు? ఆ బలిష్ఠపు గొంతులోనుంచి అటువంటి పసిమూలుగు రావటానికి బలిష్ఠ నావికుని వాళ్ళేంచేశారు? అర్లోవాకూడ యిలాగే యీడ్వబడుతూ మూలిగిందా ?

రుబషోవ్ లేచి 402 నెంబరు నిద్రపోతున్న గదివైపు గోడకు తలాన్చి కూర్చున్నాడు. మళ్ళీ జబ్బుపడ్తానేమోనని భయంవేసింది. ఇప్పటి వరకు అర్లోవా మరణాన్ని గురించి యింత వివరంగా వూహించలేదు. అది అతనికొక అగోచరమైన ఘటనగానే వుంటూవచ్చింది. అది అతనికి తీవ్రవ్యాకుల భావాన్ని మిగిల్చింది. కాని తానెప్పుడూ తన ప్రవర్తనను శంకించలేదు. ఇప్పుడు కడుపును కలచివేసిన యేహ్యాభావన వల్ల తన గత ఆలోచనా విధానమంతా మతివిభ్రమణమనిపించింది. బొగ్రోవ్ మూలుగు తార్కిక సామ్యతను తల్లక్రిందులు చేసింది. ఈ సామ్యతలో, అర్లోవా అత్యల్పాంశంగా వుందిప్పటివరకు ఇక అసామ్యతకుదరదు. వరండాలో యీడ్వబడిన అర్లోవా యెత్తు మడమల బూట్లకాళ్ళ స్వాప్నికదర్శనం గణిత సమత్వాన్ని తలక్రిందులు చేసింది. అప్రాముఖ్యవిషయం అపరిమిత విషయంగా పెరిగింది.... బొగ్రోవ్ మూలుగు, తన పేరును అమానుషంగా పిల్చినస్వరధ్వని, డోళ్ళబోలుమ్రోత చెవుల్లో గింగుర్లెడుతున్నయ్; అవి న్యాయంయొక్క స్వల్ప

స్వారాన్ని అణచివేసినయ్, నీటమునుగుతున్న వాని బుడగల చప్పుడును కెరటం ముంచివేసినట్లుగా.

అలసిపోయిన రుబషోవ్ కూర్చునే నిద్రపోయాడు — గోడను తలనాన్చి, ప్యూన్సినకళ్లముందు ముక్కద్దాలతో.

# 7

నిద్రలో గురకపెట్టాడు. తను అరెస్టయినట్లు మొదట వచ్చినకల మళ్ళీ వచ్చింది; పక్కమీద నుంచి వ్రేలాడుతున్న చెయ్యి డ్రెస్సింగుగౌనుకోసం తంటాలుపడింది. ఆ కల యధాప్రకారం పూర్తిగా వస్తుందనుకున్నాడు, కాని రాలేదు.

పైగా, విద్యుద్దీపం హఠాత్తుగా వెలగటం మూలాన లేచాడు. తనవైపు చూస్తూ ఒక మానవ విగ్రహం తనకు ప్రక్కగా నిలబడివుంది. ఒకపావుగంట నిద్రపోయాడో లేదో, కాని వెనక స్వప్నం వచ్చిన తర్వాత తేరుకోవటానికి కొన్ని నిమిషాలు పట్టేది. దీపపు కాంతిలో మిటకరించి చూచాడు, మై మరచిన క్రతువును చేస్తున్నట్లు; అలవాటైన వ్యూహాల్లో మనస్సు భారంగా పనిచేస్తోంది. అతను కారాగారంలోనే వున్నాడు గాని కలలో అనుకున్నట్లు శత్రుదేశంలో లేడు. అందుచేత స్వేచ్ఛగా వున్నట్లే — కాని అతని మంచం పైభాగంలో గోడను వ్రేలాడుతున్న నెం. 1 వర్ణచిత్రం స్థానంలో బొక్కెనవుంది. ఇంతేగాక ఇవనోవ్ తన పక్కకు ప్రక్కనే నిలబడి తన ముఖంలోకి సిగరెట్ పొగ వూదాడు, ఇది కూడ

స్వప్నమేనా? కాదు; ఇవనోవ్ యదార్థం; బొక్కైన యదార్థం. తాను స్వదేశంలోనే వున్నాడు, కాని అది తనకు శత్రుదేశమైంది; తనకు మిత్రుడైన ఇవనోవ్ యిప్పుడు శత్రువైనాడు; ఆర్లోవా మూలుగుకూడ స్వప్నంకాదు. కాని, యీడ్చబడ్డది ఆర్లోవా కాదు, బొగ్రోవ్ మైనపు బొమ్మ లాగా యీడ్చబడ్డాడు; కామ్రేడ్ బొగ్రోవ్, ఆజన్మాంత విశ్వాసపాత్రుడు; తన పేరు కేకేసినవాడు; అది స్వప్నంకాదు. పైగా ఆర్లోవా చెప్పింది: 'నన్ను మీరేమైనా చేసుకోవచ్చు....'

'సుస్తీగా వుందా?' ఇవనోవ్ అడిగాడు.

కాంతిలో కళ్ళు చీకట్లు క్రమ్మి ఇవనోవ్ వైపు మిటకరించి చూచి, 'నా రాత్రిగౌను యివ్వు' అన్నాడు రుబషోవ్.

ఇవనోవ్ పరీక్షగా చూచాడు. రుబషోవ్ మొఖం కుడివైపు వాచింది. 'కొంచెం బ్రాందీ తీసుకుంటావా?' అనడిగాడు, ఇవనోవ్. జవాబు కోసం ఆగకుండానే రహస్యరంధ్రం వద్దకెళ్ళి వరండాలోకి యేదో చెప్పాడు: మిటకరిస్తూనే ఇవనోవ్ వెనకచూస్తున్నాడు, రుబషోవ్. అతనితలదిమ్ము యింకా పోలేదు. మెలకువతోనే వున్నాడా, కాని మంచు తెరలోనే చూస్తున్నాడు, వింటున్నాడు, ఆలోచిస్తున్నాడు.

'నిన్నుకూడ అరెస్టుచేశారా?'

'లేదు' ఇవనోవ్ నిదానంగా చెప్పాడు 'నిన్నుచూడటానికే వచ్చాను. నీకు జ్వరం వచ్చిందనుకుంటాను.'

'నాకో సిగరెట్టివ్వు, రుబషోవ్ అడిగాడు. ఒకటిరెండుసార్లు బాగా దమ్ము పీల్చాడు. అప్పుడు దృష్టి స్పష్టమైంది. సిగరెట్ కాలుస్తూ పడుకొని పై కప్పు చూస్తున్నాడు. గది

తలుపు తెరచుకుంది. వార్డరు బ్రాందీబుడ్డి, గ్లాసు తీసు కొచ్చాడు. ఈసారి వచ్చింది ముసలి వార్డరుకాదు, ఉక్కు చట్రపు కంటి అద్దాలు పెట్టుకొని యూనిఫారంలో వున్న పల్చని యువకుడు. ఇవనోవ్‌కి సలాంచేసి బ్రాందిబుడ్డి, గ్లాసు యిచ్చి బయటకెళ్ళి తలుపు వేశాడు. వరండా దాటి వెళ్తున్న అతని అడుగుల చప్పుడు వినిపించింది.

రుబషోవ్ బల్లచివర ఇవనోవ్ కూర్చుని గ్లాసు నింపి 'తాగు' అన్నాడు. రుబషోవ్ గ్లాసుఖాళీచేశాడు. అతని తలలోని మంచుతెర విడిపోయింది. వ్యక్తులు, ఘటనలు — అతని మొదటి, రెండుకారాగార వాసాలు, ఆర్లోవా, బ్రాగోవ్ ఇవనోవ్ — యెవరి స్థానాల్లో వాళ్ళు కాలాను గుణ్యంగా సర్దుకున్నారు.

'నీకు బాధగా వుందా?'

'లేదు' రుబషోవ్ చెప్పాడు. ఇవనోవ్ తనగదిలో యేం చేస్తున్నాడో యింకా తెలియదు.

'నీ దవడ బాగా వాచింది. బహుశా జ్వరంకూడా తగిలిందేమో'

రుబషోవ్ బల్లమీదనుంచి లేచి రహస్యరంధ్రం దగ్గర కెళ్ళి శూన్యంగావున్న వరండాలోకి చూచి, తిరిగొచ్చి వొకటి రెండుసార్లు పచార్లు చేశాడు. ఇప్పుడు తలకాయ తెరపిగా వుంది. తీరికగా సిగరెట్ పొగ చక్రాలు వొదుల్తూ పక్క చివర కూర్చున్న ఇవనోవ్‌కు యెదురుగా వచ్చి నిలబడ్డాడు.

'ఇక్కడేం చేస్తున్నావ్?'

'నీతో మాట్లాడాలి; పడుకో మళ్ళీ; కొంచెం బ్రాంధి

తీసుకో.'

ముక్కుద్దాల్లోనుంచి శ్లేషగా మిటకరించా డతనివైపు.

'ఇప్పటివరకు నీవు సుహృద్భావంతో వున్నావని భ్రమ పడ్డాను. కాని యిప్పుడు పందిలా కనిపిస్తున్నావ్. పో యి కక్కుణ్ణించి.'

ఇవనోవ్ కదలల్లేదు. 'ఇలా అనటానికి కారణం?'

రుబషోవ్ 406 నెంబరు గదివైపు గోడ కానుకొని నిలబడి, ఇవనోవ్ వైపు చూస్తున్నాడు. ఇవనోవ్ నిశ్చింతగా సిగరెట్ కాలుస్తున్నాడు.

'మొదటి అంశం, బొగ్రోవ్‌తో నాకున్న స్నేహం నీకు తెలుసు. అందువల్ల బొగ్రోవ్‌నీ, లేక అతని అవశే షాన్ని నాకు జ్ఞాపకం చేస్తున్నట్లుగా, నా గది ముందుగా అతన్ని అంతిమ ప్రయాణం చేయించావు. ఈ దృశ్యం నేను తప్పకుండా చూడటంకోసం బొగ్రోవ్ మరణశిక్ష వార్తను, అనాలోచితంగా, నాకు జేర్చటానికి ముందుగానే ప్రకటిం చావు, నా పొరుగు ఖైదీలు యీ వార్తను నా కందిస్తారనే వుద్దేశంతో, కాని యదార్థంగా అదెలాగో జరిగేది. ఈ తతం గంలో మరొకటి యేమిటంటే, బొగ్రోవ్‌ను ఆఖరు దశలో యీడ్చుకు పోయేటప్పుడు నే నిక్కడున్నానని అతనికి చెప్పారు; ఆ వార్త అతనిలో రేకెత్తించే భయోత్పాత ఫలి తంగా యేమైనా రహస్యాలు వెల్లడిస్తాడేమోనని. సహజంగా జరిగేదే అది. ఇదంతా నన్ను కుంగ దీయటానికి లెఖ్ఖప్రకా రం వన్నిన పన్నుగడ. ఇటువంటి నిశీథ సమయంలో కామ్రేడ్ ఇవనోవ్ నన్నుద్ధరించటాని కవతరించినట్లుగా, ఛంకలో

బాంబిందీబుద్ధి పెట్టుకొచ్చాడు. దీని పర్యవసానం, రాజీపడి, వొకరి కౌగిలిలో యింకొకరుదూరి, యుద్ధకాలపు స్మృతులను తలచుకొంటూ నా వొప్పుదల ప్రకటనమీద సంతకం పెట్టించే విదారక దృశ్యం. ఆ తర్వాత ఖైదీ సుఖనిద్ర చెందటం; కామ్రేడ్ ఇవనోవ్ ప్రకటన జేబులో పెట్టుకొని నిశ్శబ్దంగా మునిగాళ్ళమీద నడుస్తూ వెళ్ళటం; కొద్ది రోజులకే హోదా పెరగటం....ఇప్పుడు మర్యాదగా బయటికి వెళ్లు.'

ఇవనోవ్ కదల్లేదు. తన బంగారు కట్టు పళ్లు కనిపించేలాగ చిరునవ్వు నవ్వుతూ సిగరెట్ కాలుస్తున్నాడు 'నా కటువంటి అనాగరిక బుద్ధి వుందని నిజంగా అనుకుంటున్నావా? లేక సరిగ్గా చెప్పాలంటే, నే నటువంటి దౌర్భాగ్యపు మనస్తత్వవేత్త ననుకుంటున్నావా?'

రుబషోవ్ భుజాలు ఎగరేశాడు. 'నీ జిత్తులు నాకు వెగటు కలిగిస్తున్నయ్. నిన్ను నేను బయటకు తోసెయ్యలేను. నీలో అణుమాత్రమైనా మర్యాద మిగిలివుంటే నన్ను వొదిలి పో, మీరంతా నా కెంత వెగటు కలిగిస్తున్నారో నీ వూహించలేవు.'

ఇవనోవ్ క్రిందనుంచి గ్లాసు తీసి నింపి ఖాళీ చేశాడు.

'మనం యీ విధంగా రాజీపడదాం. నన్ను మధ్యలో అడ్డుపెట్టకుండా నేను చెప్పేదంతా ఐదు నిమిషాలపాటు, పరధ్యాన్నం లేకుండా విను. ఆ తర్వాత కూడ నన్ను వెళ్ళిపొమ్మంటే — పోతాను.'

'వింటున్నాను.' అని, ఇవనోవ్‌కు ఎదురుగా గోడకు ఆనుకునే వుండి, గడియారం వంక చూస్తున్నాడు.

'మొదటి విషయం, నీ అనుమానాలు, భ్రమలు తొలగించటం కోసం: బొగ్రోవ్‌ను వాస్తవంగా కాల్చి వేశారు. రెండో విషయం, చాలా మాసాల నుంచి యిక్కడుంటు న్నాడు, చివరిలో చాలరోజులు బాగా హింసించారు. ఈ విషయం బహిరంగ విచారణలో చెప్పావా, లేక యిరుగు పొరుగు ఖైదీలు తట్టడం ద్వారా వార్తను ప్రసారం చేసిన సంగతైనా సరే - నా పని అఖరు. బొగ్రోవ్‌ను ఆ విధంగా యెందుకు చేశామనే విషయం తర్వాత మాట్లాడుదాం. మూడో విషయం, నీగది ముందుగా తీసికెళ్ళటం, నీ విక్కడ వున్నావని అతనితో చెప్పటం అంతా వుద్దేశ పూర్వకంగా జరిగిందే. నాలుగో విషయం, యీ నీచపు యెత్తు, నీ వంటు న్నట్టుగా నేను యేర్పాటు చేసింది కాదు. నా సహచరుడు గ్లెట్కిన్, నేనలా చెయ్యొద్దనిస్పష్టంగా చెప్పినప్పటికీ, చేశాడు.'

కొంచెం ఆగాడు; రుబషోవ్ అలాగే కదలకుండా నిల బడి వున్నాడు.

'అటువంటి పొరబాటు నే నెప్పుడూ చెయ్యను. నీ మీద గౌరవంతో కాక పోయినా నాయెత్తులకీ, నాకు తెలిసిన మన స్తత్వానికి విరుద్ధం. ఇటీవల నీవు లోకహితన్యాయంవైపు మొగ్గినట్లు, లేక అటువంటి యితరభావనలు చేస్తున్నట్లు కని పించావు. పైగా ఆర్లోవాకథ కూడ నీ కడుపులోయింకావుంది. బొగ్రోవ్ దృశ్యం నిన్ను మరింత కృంగదీయటానికీ, నీలోని నీతివాదపు పోకడలను బలపర్చటానికీ — అది ముందుగానే చెప్పొచ్చు; గ్లెట్కిన్ లాంటి మాయలాడి మన స్తత్వవేత్త చేసే పొరబాటది. పదిరోజుల్నించి నా చెవులో యిల్లుకట్టుకు పోరు

పెడుతున్నాడు, నీ మీాద క్రూరవిధానం ప్రయోగించమని. ఇంకో సంగతి; నీ వతనికి నీ మేజోళ్ళచిరుగులు చూపించావని నీ మీాద కోపంగావున్నాడు. రెండోది, అతను యిప్పటివరకు రైతులతోనే అవస్తపడటం అలవాటు.... బొగ్రోవ్ వ్యవహారానికి సంబంధించినంతవరకు వివరణ అది. ఇక బ్రాందీసంగతి. నే నిక్కడకొచ్చినప్పుడు నీ మనస్సు సరిగాలేదు, అందుకని నేనే తెప్పించాను. నీచేత త్రాగించటంవల్ల నాకేమీా ప్రయోజనంలేదు, నిన్ను మానసికవ్యథతో పడుకోవ్వటం నాకేమీా ప్రయోజనంలేదు. అదంతా నిన్ను యింకా నైతికోన్నతికి తీసుకుపోతుంది. నీవు స్థిరంగా, సహేతుకంగా వుండాలి. నాకు కావలిసినదంతా, నీవు ప్రశాంతంగా ఆలోచించి నిర్ణయానికి రావటమే. ఎందుకంటే ప్రతిదీ నీవు ప్రశాంతంగా ఆలోచించి, నిర్ణయానికి వచ్చిన తర్వాతనే మాకు లొంగుతావు....'

రుబషోవ్ భుజాలు రిక్కించాడు. అతను మాట్లాక ముందే ఇవనోవ్ అందుకొన్నాడు.

'నీవు లొంగకుండా వుండటానికే నిశ్చయించుకొన్నావనినాకు తెలుసు. నా కొక్కదానికి జవాబుచెప్పు. లొంగుబాటు కావటం నిజానికి న్యాయమేననీ, సహేతుకంగా అవసరమనీ నీకు తోస్తే అప్పుడు చేస్తావా ఆ పని ?

వెంటనే రుబషోవ్ జవాబివ్వలేదు. తనకు మనస్కరించని విధంగా సంభాషణ జరిగినందుకు కొంచెం బాధపడ్డాడు. ఐదు నిమిషాలు గడిచినయ్, ఇవనోవ్‌ను బయటకు పంపలేదు, అలా చెయ్యకపోవడం బొగ్రోవ్, ఆర్లోవా, రిచర్డ్,

లిటిల్‌లోయిాలకు అపచారం చేయటమనిపించింది.

'వెళ్ళిపో, అదేం లాభంలేదు.' ఇవనోవ్‌తో అన్నాడు. ఇవనోవ్ ముందు కొంతసేపటినుంచి పచార్లు చేస్తునట్లు యిప్పుడే గుర్తించాడు.

ఇవనోవ్ బల్లమీాద కూర్చునేవున్నాడు. 'నీ గొంతు స్వరాన్ని బట్టి బొగ్రోవ్ విషయంలో నా పాత్రను గురించిన నీ పొరబాటును గుర్తించావనుకుంటాను. అటువంటప్పుడు నన్నెందుకు పొమ్మంటున్నావ్ ? నే నడిగిన ప్రశ్నకు జవాబివ్వవేం ?....' కొంచెం ముందుకువంగి పరిహాసంగా రుబషోవ్ ముఖంలోకి చూచాడు. అప్పుడు నెమ్మదిగా ప్రతిమాటనూ వొత్తి పలుకుతూ అన్నాడు. 'నేనంటే భయపడుతున్నావు కాబట్టి, నా ఆలోచన, వాదన అచ్చంగా నీ వాటిలాగే వున్నాయి గాబట్టి, యింకా నీ తలకాయలోని ప్రతిధ్వనికి భయపడుతున్నావు గాబట్టి నన్ను పొమ్మంటున్నావు. ఇంకో నిమిషంలో 'రాక్షసుడా పో, దూరంగా పో' అంటూ మెలుగెత్తి అరుస్తావు.'

రుబషోవ్ మెదల్లేదు, కిటికీప్రక్కనే, ఇవనోవ్ ముందుగా పచార్లు చేస్తున్నాడు. తన నిస్సహాయతను, స్పష్టంగావాదించలేని అశక్తతను తెలుసుకొన్నాడు. రుబషోవ్ యే విషయం గురించి అయితే తను దోషంచేసినట్లు భావిస్తున్నాడో దానినే ఇవనోవ్ 'నైతికానందం' అన్నాడు. ఆ దోషాన్ని సహేతుక సూత్రాలతో వివరించవీలులేదు. వ్యాకరణ గల్పిక ప్రాంతంలో వుంటుందది. ఆ సమయంలోనే ఇవనోవ్ మాట్లాడే ప్రతీ వాక్యం యదార్థంగా రుబషోవ్‌లో ప్రతిధ్వనించింది. ఈ చర్చ

లోకి తాను యెప్పుడూ యీాడ్వబడకుండా వుండాల్సిందని కున్నాడు. అడ్డులేకుండా జారిపోయే నునుపైన యేటవాలు చెక్కమీాద వున్నట్లుగా భావించాడు.

ఇవనోవ్ యింకో గ్లాసు ఖాళీచేశాడు. 'పూర్వపురోజుల్లో ప్రేరణ అనేది విషయసుఖాల పరంగా వుండేది. ఇప్పుడు అనుభవశూన్య హేతువాదరూపం ధరించింది. విలువలు మారాయ్. మోహ ప్రధాన నాటక మొకటి ప్రాయాలను కొంటున్నా. అందులో రుబషోవ్ మహర్షి యొక్క ఆత్మకోసం దేవుడూ, దెయ్యమూ పోట్లాడుకుంటారు. పాపపు జీవితానంతరం పారిశ్రామిక వుదారతత్వం, మోక్షప్రదానం అనే రెండు ముఖాల దేవుని వద్దకు రుబషోవ్ వెళ్తాడు. తద్వ్యతిరేకంగా దయ్యం మూార్ఖ హేతువాద భక్తుడు, తపస్వి; సన్నగా వుంటాడు. ఇతను మైఖవిల్లి, లయోలావాసి ఇగ్నేషియన్, మార్క్సు, హెగెల్ల రచనలు చదువుతాడు. మానవజాతి పట్ల కూారంగా, దయాశూన్యంగా వుంటాడు. అతనెప్పుడూ తనకుబొత్తిగా యిష్టంలేని పనులనే చేయవలసి వస్తుంది; గొఱ్ఱెలనెవ్వరూ వధించకుండా చెయ్యడానికై వాటిని వధించెయ్యాలి; ప్రజలు కొరడాదెబ్బలు తినకుండా తప్పించుకొనే మార్గం తెలుసుకోవడానికై వారిని కొరడాపెళ్ళతో కొట్టాలి; అతను వున్నత ఋజువర్తనుడు కావటానికి ప్రతి న్యాయసూత్రాన్నీ వదలివేయాలి; కామ్రేడ్ రుబషోవ్ స్వధర్మవీరుడుగానే వుండదలచుకొన్నాడు. ఉదారవాద పత్రికలన్నీ, అతన్ని జీవితకాలంలో ద్వేషించినవి, మరణానంతరం పావనంచేస్తాయ్. అతడొక జ్ఞానాన్ని కనిపెట్టాడు. ఆ జ్ఞానం విప్లవాని కన

ర్షణ్ణి చేస్తుంది. జ్ఞానం షేహారణంలాగ మెదడులోని పదా ర్థాన్ని తినివేస్తుంది. పిశాచి దెబ్బతిని వెనక్కొస్తాడు. కాని కోపంతో పళ్లుకొరికి, నిప్పులు క్రక్కుతాడనుకోను. అతను భుజాలు రిక్కిస్తాడు; అతను సన్నని తపస్వి. అతను, చాల మంది బలహీనులను గొప్పగొప్ప సాకుల్తో తన వర్గంనుంచి నిర్గమించటం చూచాడు....'

ఇవనోవ్ కొంచెం ఆగి యింకొక గ్లాసు ఖాళీచేశాడు. రుబషోవ్ యింకా పచార్లు చేస్తూనే వున్నాడు. కాసేపటికి అడిగాడు: 'బొగ్రోవ్ నెందుకు చంపారు ?'

'ఎందుకు ? జలాంతర్గామి సమస్యవల్ల, జలాంతర్గామి యెంత బరువు వుండాలనేసమస్య. పాత తగాదాయే. దీని మొదలు నీకు పరిచయమేగా.

'బొగ్రోవ్ పెద్ద బరువుగలవి, యెక్కువ కాలం పని చేసేవి తయారు చెయ్యాలన్నాడు. పార్టీ తక్కువ బరువు గలవి, తక్కువకాలం పనిచేసేవి కావాలంది. ఒక్కొక్క పెద్ద జలాంతర్గామి నిర్మాణపు ఖర్చుతో మూడు చిన్నవి తయా రవుతాయ్. ఈ రెండు పక్షాలకు వాదనకు సబబైన సాంకేతిక అంశాలున్నయ్. నిపుణులు సాంకేతిక చిత్రాలు; బీజగణిత సూత్రాలను బ్రహ్మాండంగా ప్రదర్శించారు. కాని అసలు సమస్య పూర్తిగ యింకొకరి అధీనంలో వుంది. పెద్ద జలాంత ర్గాముల నిర్మాణం అంటే, ప్రపంచ విప్లవాన్ని కొనసాగించ టానికి, దురాక్రమణ జరపటానికి అన్నమాట. చిన్నవాటి నిర్మాణమంటే కోస్తారక్షణ, ఆత్మరక్షణ, ప్రపంచ విప్లవం వాయిదా; ఈ రెండో దృక్పథం నెం. 1 ది, పార్టీది.

'బొగ్రోవ్‌కి పాత రక్షకదళాల అధికారుల్లోనూ, నావికాధికారుల్లోనూ బలవత్తరమైన అనుచర వర్గముంది. అతన్ని దారినుంచి తొలగిస్తే సరిపోదు. అపహాస్యం పాలు చేయాలి. పెద్ద జలాంతర్గాముల నిర్మాణానికి సుముఖులుగా వున్న వాళ్ళందర్నీ విద్రోహులుగా, విచ్ఛిన్నకులుగా నిరూపించటానికి ఒకవిచారణ జరపాలని ఆలోచించారు. అప్పటికే చాల మంది చిన్నచిన్న యింజనీరుల్ని మేం కోరిన విధంగా బహిరంగంగా వొప్పుకోవటానికి సిద్ధాంచేశాం. బొగ్రోవ్ చివరి ఘడియదాకా ప్రపంచవిప్లవం, పెద్ద జలాంతర్గాముల నిర్మాణం విషయాన్ని వదలలేదు. అతను రెండు దశాబ్దాలు వెనకబడ్డాడు. కాలం మనకు వ్యతిరేకంగా వుందనీ, యూరపంతా ప్రతీకార దశలో వుందనీ, ప్రస్తుతం తరంగ గర్భంలో వున్నామనీ, మళ్ళీ నూతన తరంగం వచ్చి మనల్ని ఒడ్డుకు జేర్చే వరకూ వేచి వుండాలనీ, యెంత చెప్పినా బొగ్రోవ్ అర్థం చేసుకోలేదు. బహిరంగ విచారణలో అతను ప్రజల్ని మరింత తికమక పెట్టేవాడు. అందువల్ల అతన్ని అధికార రీత్యా అంతం చేయటం కంటే వేరు గత్యంతరం లేదు. మా స్థానంలో వుంటే నీవు మాత్రం అలా చేసేవాడివి కాదూ?'

రుబషోవ్ మెదల్లేదు. పచార్లుఆపి, బొకెట్టన ప్రక్కగా గోడకు చేరగిలబడి నిల్చున్నాడు. అందులో నుంచి దుర్గంధం గుప్పుమంది. ముక్కద్దాలు తీసి ఇవనోవ్ వైపు యెత్రటి, వేటాడు దృష్టితో చూచాడు.

'అతను మూలగటం నీవు వినలేదు.'

కాలుస్తున్న సిగరెట్ పీకతో యింకో సిగరెట్ ముట్టిం

చూడు, ఇవనోవ్. అతనికూడా బొక్కెనలోని దుర్గంధం భరింపశక్యంగాకుండా వుంది.

'లేదు, వినలేదు. ఇటువంటివి యిదివరలో చాల చూచాను; విన్నాను. అయితే యేమిటి దాన్ని గురించి?'

రుబషోవ్ మెదలకుండా వూరుకున్నాడు. దాన్ని గురించి వివరించడానికి ప్రయత్నించటం అనవసరం ఆ మూలుగులు, డోలు మ్రోత ప్రతిధ్వనిలాగ అతని చెవుల్లో గింగురుమన్నయ్. దాన్నెవ్వరూ వివరించలేదు. ఆర్లోవా రొమ్ముల మొనలు, వెచ్చదనం కూడ వివరించటం కుదరదు. ఏమీ వివరించ లేదు. మంగలియిచ్చిన కాగితంలో 'మౌనంగా మరణించు' అనివుంది.

'దాన్ని గురించి యేమిటి ?' తిరిగి ప్రశ్నించాడు, ఇవనోవ్. కాలుచాచుకొని కొంచెం యెదురు చూచాడు. ఎంతకీ జవాబు రాకపోయేసరికి ఇవనోవ్ చెప్పుకుపోతున్నాడు.

'నీమీద యేమాత్రపు దయా లేశమైనావుంటే నిన్ను వొంటరిగా వదలివెళ్ళాను. కాని యేమీమిగల్లేదు. త్రాగాను; యీసారి తప్పత్రాగాను; నీవుచూచావుగా; యిప్పటివరకు నీమీదున్న దయను తొలగించ ప్రయత్నించి సఫలుణ్ణాయివాను. ఒక చిన్న మోతాదు, దాన్తో నీపని ఆఖరు. మానవజాతికోసం యేడ్వటం, తనకై శోకించటం — మనజాతికున్న యీ రోగ లక్షణ స్వభావం నీకు తెలుసుగా. ఈ విషంతో మన మహా కవులంతా నాశనమయ్యారు. నలభై, యాభై సంవత్సరాల వరకు వాళ్లు విప్లవకారులు - అప్పుడు వాళ్లు దయా ప్రపూరితులయ్యారు: వాళ్ళను ప్రపంచం పునీతులుగా ప్రకటించింది. నీకూడా అటువంటి కాంక్ష వున్నట్లుంది. అది

నీవ్యక్తిగతవిధానమనుకుంటున్నావులావుంది,' బిగ్గరగామాట్లా డుతూ సిగరెట్ పొగ మేఘాలను వొదిలాడు. 'ఇటువంటి పారవశ్యాల విషయంలో జాగ్రత్త. ప్రతి సారాబుడ్డిలోనూ యేదో కొంత పారవశ్యత వుంటుంది. దురదృష్ట వశాత్తు, చాల కొద్దిమంది, ముఖ్యంగా మనదేశీయులు, యీ వినయ పారవశ్యాలు, బాధలు సారావల్ల కలిగే వాటిలాగే చాలా చౌకబారువని యెప్పుడూ గుర్తించలేదు. మత్తునుంచి లేచి, నా శరీరం యెడమ మోకాలివద్ద ఆగిపోయిందని తెలుసుకు న్నప్పుడు, నేనుకూడ ఒక విధమైన దౌర్భాగ్యపు పారవశ్యా న్ననుభవించాను. ఆ సమయంలో నీ విచ్చిన వుపన్యాసాలు గుర్తున్నయ్యా?' ఇంకోగ్లాసు నింపి ఖాళీ చేశాడు.

'నావుద్దేశం యిది. ఈప్రపంచాన్ని మన మనోవిభ్రమా లకు తాత్వికభోగగృహంగా యెంచగూడదు. మనకిది మొదటి ఆదేశం. కరుణ, అంతఃకరణ, విరక్తి, నిస్పృహ, పశ్చాత్తా పం, పాపపరిహారం మనకు వెగటు కలిగించే వ్యభిచారం లాటివి. తీరికగా యోగనిద్రాముద్రితుడై, మెడను గ్లెట్కిన్ తుపాకి గుండుకు అప్పజెప్పటం – సమస్యా పరిష్కారానికి తేలిక మార్గం. మనలాటి వాళ్ళకు గొప్ప ప్రేరణ యేమిటంటే హింసను పరిత్యజించటం, పశ్చాత్తాపపడటం, ఆత్మతో రాజీ పడటం. స్పార్టాకస్ నుంచి డాంటన్, డాస్టవస్కీలవరకూవున్న గొప్ప విప్లవకారుల్లో చాలమంది యిటువంటి ప్రేరణలకు వశులయ్యారు; ఆశయద్రోహానికి వీళ్ళు ప్రామాణిక రూపం. మానవజాతికి దైవపారవశ్యాలు, పైశాచిక పారవశ్యాల కంటె యెక్కువ ప్రమాదం. ప్రపంచాన్ని కల్లోలం పాలిస్తున్నంత

కాలం దేవుడు కాలవ్యతిక్రమమే. స్వీయాంతః కరణతో చేసు కొనే ప్రతిరాజీ వంచనే అవుతుంది. నీ పాపిష్టి అంతర్వాణి మాట్లాడుతున్నప్పుడు చెవులుమూసుకో....'

తన వెనకనున్న బుడ్డికోసం తడివి తీసుకొని యింకో గ్లాసు నింపాడు. అప్పుడే సీసా సగంఖాళీ కావటం రుబషోవ్ గుర్తించాడు. 'నీవుకూడ కొంచెంత్రాగి ఓదార్చుకోకూడదూ' అనుకున్నాడు.

'చరిత్రలో మహాద్రోహులు, నీరో, ఫాష్‌లాటివాళ్లు కాదు, కాని గాంధి, టాల్‌స్టాయ్‌లాటి వాళ్ళు.' ఇవనోవ్ చెప్పుకుపోతున్నాడు. 'బ్రిటీష్‌వాళ్ళ తుపాకులకంటె గాంధి అంతర్వాణే భారతదేశపు స్వాతంత్ర్యాన్ని యెక్కువగా అరి కట్టింది. ముప్పైవెండినాణాలకు తనకై తాను అమ్ముడుబోవటం చాలగౌరవ ప్రదమైనవ్యవహారం, కానిఅంతరాత్మకు అమ్ముడు బోవట మంటే మానవజాతిచే బహిష్కరించట మన్నమాట. చరిత్ర సన్యాసి మోహంలాంటిది. దానికిఅంతఃకరణలేదు. చరి త్రను ఆదివారపు పాఠశాల నియమానుసారంగా నడపాలంటే యెక్కడిదక్కడ, వున్న దున్నట్లుగా వుంటమే ఔతుంది. ఈ విషయం నాకెంత తెలుసో నీకూ అంతేతెలుసు. ఈ ఆటలో అవాంతరాలు నీకూ తెలుసు, యిక్కడ బొగ్రోవ్ మూలుగు విషయం మాట్లాడొచ్చావు....'

గ్లాసు ఖాళీచేసి మళ్ళి అన్నాడు: 'లేకపోతే నీ బండ ఆర్లోవా నీ ఆత్మను బాధిస్తోవుండాలి.'

పూర్వాన్నుంచీ ఇవనోవ్‌కు చాలా తెలుసునని రుబ షోవ్‌కి తెలుసు; మామూలుకంటె కొంచెం వాత్రిపలకటం

తప్ప అతని ప్రవర్తనలో మార్పేమీ కనిపించటం లేదు. బహుశా, నాకంటె నీకే ఎక్కువ ఓదార్పు కావాలి' అనుకున్నాడు. మళ్ళీ రుబషోవ్ ఇవనోవ్ కెదురుగా వున్న చిన్న పీట బల్ల మీద కూర్చుని వింటున్నాడు. ఇదేమీ క్రొత్తకాదతనికి, ఇదే విధంగా లేక యివే మాటల్తో కొన్ని సంవత్సరాలనుంచి అదే దృక్పథాన్ని తాను సమర్థిస్తున్నాడు. ఇప్పుడు ఇవనోవ్ ద్వేషిస్తూ మాట్లాడిన అంతఃకరణ విధాన విషయాన్నంతా, ఆనాడు కేవలం నిగూఢవిషయంగానే పరిగణించాడు; అప్పటి నుంచి స్వశరీరంలో 'వ్యాకరణకల్పిక' ఒక భౌతిక భాగంగా అనుభవాన్ని పొందుతూ వచ్చాడు. కాని యీ నిరాకార క్రమాలు, తనకు స్వీయానుభవం కావటంవల్ల నా యిప్పుడు ఎక్కువ అంగీకార యోగ్యమవుతున్నవి? తనకు మత్తుకలిగించినది అంతర్వాణియే గనుక, ఆ మత్తును వదలించుకోవలసిన అవసరం అంతగా లేదా? ఒక సంవత్సరం క్రితం అర్లోవాను మృత్యువుకు బలివేసినప్పుడు, యీ మరణ శిక్షల వివరాలను చిత్రించుకోవటానికి ఎక్కువ వూహా తనకు లేదు. ఇప్పుడు దాని సంబంధమైన కొన్ని దశల్ని చూచాడు గాబట్టి తన ప్రవర్తన మారుతుందా? అర్లోవా, రిచర్డ్, లిటిల్ లోయీలను బలిచేయటం తప్పు కావచ్చు; ఒప్పు కావచ్చు. కాని, రిచర్డ్ నత్తి, అర్లోవా రొమ్ముల ఆకారం, బ్యాగ్రోవ్ మూలుగులకు, బాహ్యమైన తప్పొప్పుల కొలతకు సంబంధమేమిటి?

రుబషోవ్ మళ్ళీ పచార్లు సాగించాడు. తాను ఖైదుకొచ్చినప్పటినుంచి అనుభవించిందంతా ప్రస్తావన అనే తన

తలపోతలన్నీ తనను శూన్యంలోకి — ఇవనోవ్ అన్న 'తాత్విక భోగ గృహప్రాంగణంవద్దకు — నడిపించినాయనీ, మళ్ళీ మొదటి నుంచీ పునరాలోచించాలనీ అనుకున్నాడు. కాని యింకా యెంత వ్యవధివుంది ? ఆగి ఇవనోవ్ చేతిలో గ్లాసు తీసుకొని ఖాళీచేశాడు. ఇవనోవ్ పరిశీలిస్తున్నాడు.

'అది మంచిది' నమ్మరాని చిరునవ్వుతో ఇవనోవ్ అన్నాడు. 'సంభాషణ రూపంలో స్వగతాలు చాల వుపయోగం. నేను ప్రేరకుని పాత్రను ఫలవంతంగానే నిర్వహించాననుకుంటాను. ఎదుటి పాత్ర లేనందుకు కొంచెం బాధగావుంది. కాని అది దాని జిత్తుల్లో ఒకభాగం, అదెప్పుడూ వివేక, విశిష్టవంతమైన సంభాషణల్లోకిరాదు. మనిషి అరక్షితంగా వున్న సమయాల్లోనో, ఒంటరిగా, అటువంటి విపత్కర పరిస్థితుల్లోనో, మండే ముళ్ళకంపల్నుంచో, మేఘాచ్ఛాదిత పర్వత శిఖరాలనుంచో అది దాడి చేస్తుంది. మహానీతిపరుల విధానాలన్నీ కొంచెం అపసవ్యంగా నాటకరీతిలో వుంటాయ్....'

రుబషోవ్ యిక యేమీ వినటంలేదు. వచార్లుచేస్తూనే ఆర్లోవా యింకా బ్రతికుంటే, తాను మళ్ళీ బలిచేసేవాడేనా అని ఆశ్చర్యపోతున్నాడు. ఈ సమస్య అతన్ని భ్రమభ్రాంతుణ్ణి చేసింది; అందులోనే అన్నిప్రశ్నలకూ సమాధానం యిమిడివున్నట్లు కనిపించింది...ఇవనోవ్ ముందుఆగి, అడిగాడు.

'రాస్కోల్నికోవ్, జ్ఞాపకం వున్నాడా ?'

ఇవనోవ్ వ్యంగ్యంగానవ్వాడు. 'ముందు వెనుకలుగా కొద్దికాలంలో నీవు ఆస్థితి కొచ్చేటట్టున్నావు. నేరం, శిక్ష... నీవు నిజంగా పసివాడవో, పండు వృద్ధుడవో అవుతున్నావు....'

‘కొంచెం ఆగు, కొంచెం ఆగు,’ రుబషోవ్ పచార్లు చేస్తూ, ఆందోళనగా అన్నాడు. ‘ఇదంతా వట్టి శుష్కప్రలాపం. కాని యిప్పుడు మనం అసలు అంశం దగ్గరకొస్తున్నాం. నాకు జ్ఞాపకమున్నంతవరకు, విద్యార్థి రాస్కోల్నికోవ్ కి ముసలిదాన్ని చంపటానికేమైనా హక్కున్నదా అనేదే సమస్య. అతను యువకుడు, తెలివైనవాడు, ఆమె ప్రపంచానికెందుకూ పనికిరాని మనిషి. కాని యీ సామ్యం నిలవదు. మొదటి విషయం, పరిస్థితులు అతను రెండో వ్యక్తిని హత్యచేయటానికనుమతించినయ్; అది పైకి సామాన్యంగా, సహేతుకంగా కనిపించే అపూర్వగోచరమైన కుతార్కిక ఫలితాంశం. రెండోది, యీసామ్యం యే విషయంలోనైనా విచ్ఛిన్నంకావచ్చు, యెందుకంటే మానవుల్ని గణితప్రమాణంగా తీసుకుంటే రెంటికి రెట్టింపు నాలుగుకాదని కనిపెట్టాడు....’

‘నిజంగానా? నా అభిప్రాయం నీవు వినదల్చుకుంటే, ఆ పుస్తకం* తాలూకు ప్రతి ప్రతినీ తగలబెట్టమంటాను. ఈ లోకహిత మండూక వేదాంతాన్ని అక్షరశః తీసుకోవాలిసొస్తే, వ్యక్తి అతి పవిత్రవంతుడనే ధర్మ నియమానికే అంటిపెట్టుకోవాలిసొస్తే, గణితశాస్త్రసూత్రానుగుణ్యంగా మానవ జీవితాలను పరిగణించకపోతే మనల్ని అదియెక్కడకు తీసుకుపోతుందో ఒక్క క్షణం ఆలోచించు. అంటే సైన్యాన్ని రక్షించటానికి సైన్యాధికారి గస్తీ దళాన్ని త్యాగం చేయకూడదన్నమాట. అంటే బొగ్రోవ్ లాంటి తెలివి హీనుల్ని త్యాగం చెయ్యకుండా రెండుసంవత్సరాల్లో కోస్తాపట్టణాలన్నీ

* డాస్టవస్కీ వ్రాసిన ‘నేరం : శిక్ష’ నవల; కథానాయకుడు రాస్కోల్నికోవ్.

సర్వనాశనం కావటాని కంగీకరించట మన్నమాట....'

రుబషోవ్ తల వంకించాడు: 'నీ వుదాహరణలన్నీ యుద్ధంలోవి - అంటే అసాధారణ పరిస్థితుల్లోవి.'

'ఆవిరి యంత్రం కనిపెట్టబడ్డప్పటినుంచీ ప్రపంచం శాశ్వతంగా అసాధారణ పరిస్థితుల్లో వుంది; యుద్ధాలు, విప్లవాలు యీస్థితికి దృశ్యోదాహరణలు మాత్రమే. ఎలాగైనా, నీ రాస్కోల్నికోవ్ ఒక బుద్ధిహీనుడు, నేరస్థుడు; ముసలిదాన్ని చంపటంలో సహేతుకంగా ప్రవర్తించటంవల్ల నేకాదు, ఆ పని తన స్వలాభం కోసం చేశాడు గాబట్టి. గమ్యం మార్గాన్ని సమర్థిస్తుందనే సూత్రం యెప్పుడూ రాజకీయ నీతిగానే వుంది; వుంటుంది; తదితరమంతా శుష్క ప్రేలాపన; ప్రేళ్ళమధ్య కరిగిపోతుంది.... రాస్కోల్నికోవ్ పార్టీ ఆదేశంతో—ఉదాహరణకు సమ్మె నిధుల్ని అభివృద్ధి చేయటానికో, రహస్యంగా ప్రెస్సు పెట్టడానికో—ముసలిదాన్ని చంపినట్లైతే, అప్పుడు ఆ సామ్యం నిలుస్తుంది; మరి పెడదారి సమస్యతో ఆ నవల వ్రాయబడేదేకాదు; ఆ నవల లేకపోతే మానవజాతికే మంచి జరిగి వుండేది.'

రుబషోవ్ జవాబు చెప్పలేదు. గత కొన్ని నెలల్నించీ పొందుతున్న అనుభవం తర్వాతకూడ ఆర్లోవాను బలిచేస్తానా అనే భ్రమభ్రాంతిలోనే వున్నాడింకా. అతనికి తెలియదు. ఇవనోవ్ చెప్పిందంతా సహేతుకంగా, సక్రమమే; అదృశ్య ప్రత్యర్థి పాత్ర మౌనంగా వున్నాడు. కాని అతని వునికి కొద్దిపాటి వ్యాకులపాటుద్వారా సూచితమైంది. ఈ అదృశ్యప్రత్యర్థి వాదనకురాక, మనుష్యుల్ని అసహాయ సమయాల్లోనే యెదు

ర్కొనే స్వభావాన్ని కలిగివుంటాడని అనడంలో కూడ ఇవనోవ్ సరిగానే అన్నాడు.

ఇవనోవ్ చెప్పుకుపోతున్నాడు:

'వివిధ ఆదర్శాలను మిశ్రమంచేయటం నే నంగీకరించను. మానవ నైతిక సూత్రాలను గురించి రెండు దృక్పథాలున్నయ్. అవి రెండూ రెండు ధృవాలవద్ద వున్నయ్. అందులో ఒకటి కరుణా పూరితమైన క్రైస్తవం. ఇది మానవుడు వ్యక్తిగతంగా పవిత్రుడని చాటుతుంది, మానవ ప్రమాణాలను గణిత సూత్రబద్ధంగా అన్వయింపచేయగూడదని నొక్కి వక్కాణిస్తుంది. రెండోది, సమిష్టి ఆశయం ప్రతి మార్గాన్ని సమర్థిస్తుందనే మూల సూత్రంతో ప్రారంభ మౌతుంది. వ్యక్తిని సమిష్టి క్షేమంకోసం, ప్రతి విషయంలోనూ లొంగిపోయి, త్యాగం చేయమనీ, అవసరాన్నిబట్టి పరిశోధనకుపయోగించే కుందేటిలాగనో, బలి వేసే మేకపిల్లలాగనో సంఘం వుపయోగించుకోవటానికి ఆదేశిస్తుంది. మొదటి దృక్పథాన్ని పరిశోధనకు శరీరం కోయటాన్ని వ్యతిరేకించే నీతి అనొచ్చు; రెండోది, దాని కనుమతించే నీతి. దగాఖోరులు, విలాసార్థ విద్యాభ్యాసకులు యీ రెండు దృక్పథాలను మిశ్రమంచేయ ప్రయత్నించారు. కాని ఆచరణలో దుస్సాధ్యం. అధికార భారాన్ని మోసేవాడు ప్రప్రథమంగా యీ రెండో దృక్పథాన్ని విధి ప్రేరితంగా అనుసరిస్తాడు. క్రైస్తవమత స్థాపన నాటి నుంచీ యీ నాటివరకూ యేదేశమైనా, నిజంగా ఆ మతాన్ననుసరించటం యెరుగుదువా? ఒక్క దేశాన్ని కూడ చూపించలేవు. అవసర సమయాల్లో — రాజకీయా లెప్పుడూ

అవసర సమయంలోనే వుంటాయ్ — పాలకులు యెప్పుడూ, 'ప్రత్యేక పరిస్థితుల్ని' సృష్టించి, ప్రత్యేక రక్షణ విధానాలను కోరతారు. దేశాలు, వర్గాలు యేర్పడినప్పటినుంచీ మానవత్వ వాదానుచరణకు వాయిదాలు వేస్తూ, శాశ్వతంగా పరస్పర ఆత్మరక్షణ స్థితిలోనే మానవులు బ్రతుకుతున్నారు ...'

రుబషోవ్ కిటికీలోనుంచి చూస్తున్నాడు. కరిగినమంచు పసుపు, తెలుపు ముక్కలుగా గడ్డకట్టి మెరుస్తోంది. భుజం మీద రైఫిల్‌తో గస్తీసిపాయి ప్రహరీమీద ప్రహరా యిస్తు న్నాడు. ఆకాశం నిర్మలంగా నేవుంది, కాని చంద్రుడులేడు; మరతుపాకి గోపురంపైన పాలపుంత మసకకాంతులీనుతోంది.

రుబషోవ్ భుజాలురిక్కించి, తర్వాత అన్నాడు.

'మానవత్వ వాదం, రాజకీయాలు, వ్యక్తికి గౌరవం, సామాజికాభివృద్ధి అసంగతమైన విషయాలని వొప్పుకొందాం. భారతదేశానికి గాంధి ఒకఅవాంతరమనీ, విధానాలదృష్ట్యా సౌశీల్యం రాజకీయ నపుంసకత్వానికి దారితీస్తుందనీ వొప్పు కొందాం. అభావాలతో మనకంగీకారం కుదిరింది, మరి ఆ రెండోవిధానం యెక్కడకు తీసికెళ్లిందో చూడు...'

'మంచిది, ఎక్కడికి?'

రుబషోవ్ ముక్కద్దాలుతీసి చొక్కా చేతిమీదతుడిచి, అతనివైపు హ్రస్వదృష్టితో చూచాడు. 'ఎంతఅయోమయం. మనస్వర్ణయుగాన్ని యెంత అయోమయం చేశాం?'

ఇవనోవ్ మందహాసం చేశాడు. 'కావచ్చు,' హాయిగా అన్నాడు. 'గాల్ఫా, సెయింట్-జెస్ట్, పారిస్ కమ్యూన్‌ల నొక సారి పరికించు. ఇప్పటివరకు విప్లవాలన్నీ పడకకుర్చీవిజ్ఞాననీతి

పరులచేతనే నడుప బడ్డాయి. వాళ్లంతా సంపూర్ణ విశ్వాసంతోనే వున్నారు. కాని వారివిలాసస్వభావంవల్ల విఫలమయి నాయ్. మొదటిసారిగా మనం ప్రతిఫలసహితంగావున్నాం...'

'అవును మనం యెంత ప్రతిఫల సహితంగా వున్నామంటే, భూమిని న్యాయంగా, సమానంగా పంచటం కోసమని, ఒక సంవత్సరంలో యాభై లక్షల మంది రైతులను, వారి కుటుంబాలను ఆకలి బాధతో వుద్దేశపూర్వకంగా చావనిచ్చాం, పారిశ్రామికపు దోపిడీయొక్క బంధనాల నుంచి మానవుల్ని విముక్తుల్ని చేయటంకోసం ఆర్కిటిక్ ప్రాంతాల్లోనూ, తూర్పు అడవుల్లోనూ, పురాతన బానిసలు బ్రతికిన పరిస్థితుల్లాంటి పరిస్థితుల్లో పెట్టి, కోటిమందిని బానిస శిబిరాలకు పంపాం. ఒక అభిప్రాయ భేదాన్ని — అది జలాంతర్గామి సమస్య, యెరువుల సమస్య, ఇండో-చైనాలో పార్టీ విధానం యేదైనా కావచ్చు — పరిష్కరించటానికి మనకు తెలిసిన వాదం ఒక్కటే : మృత్యువు. అంచనాల్లో ఒక్క తప్పు పడితే అది జైలుకో, వురికంబానికో తీసుకెళ్తుందని నిరంతరం గుర్తుంచుకొని మన ఇంజనీర్లు పనిచేస్తున్నారు. మన పాలనలో పైఅధికారులు తమవల్ల యే ఒక్క చిన్న పొరపాటు జరిగినా స్వనాశనానికి దారితీస్తుందని, వాళ్ళ క్రింద వాళ్ళను నాశనం చేసి, చంపేస్తున్నారు; మన కవులు తోటి కవుల మీద రహస్య పోలీసులకు ఫిర్యాదులు చేసి సమాధానపర్చుకుంటున్నారు, యెందుకంటే రీతివాదులు సహజశైలిని ప్రతివిప్లవ విధానమంటున్నారు. ఒకరి నొకరు విమర్శించుకుంటున్నారు, ఎంత ప్రతిఫల సహితంగా పనిచేస్తున్నామంటే, భవి

ష్యత్తరాల లాభంకోసం ప్రస్తుత తరం జీవిత ప్రమాణంలో నాలుగోవంతు తగ్గిపోయేంత భారాన్ని వాళ్ళనెత్తిన మోపు తున్నాం. దేశ భద్రతను కాపాడటం కోసం తీసుకొనే ప్రతి చర్యలోనూ, ప్రతి తాత్కాలిక చట్టంలోనూ విప్లవాశయ విరుద్ధంగా ప్రవర్తిస్తున్నాం. విప్లవానికి పూర్వం కంటే విప్ల వానంతరం జీవిత ప్రమాణం తగ్గిపోయింది; కూలి పరిస్థితి చాల క్లిష్టంగా వుంది; క్రమశిక్షణ అమానుషంగా వుంది; వలసదేశాల్లోని స్వదేశి కూలీలకంటె హీనంగా వుంది, యిక్కడి రోజువారీ కూలీపరిస్థితి పన్నెండేళ్ళ వయస్సు పిల్ల లకు కూడా మరణ శిక్ష విధిస్తున్నాం. మన వివాహ శాస నాలు ఇంగ్లండ్‌లోకంటే చాల సంకుచితంగా వున్నయ్; మన నాయక పూజ, ప్రతీఘాత నియంతలకంటె చాల విపరీతంగా వుంది. మన పత్రికలు, విద్యాలయాలు స్వదేశాభిమానం, విదేశ ద్వేషం, సైనిక తత్వం, పిడివాదం, అనుసరణ తత్వం, అజ్ఞానం నేర్పుతున్నయ్. మన ప్రభుత్వపు నిరంకుశాధికారం అనంతం; చరిత్రలో అద్వితీయం; మానవ హక్కుల ప్రకటన యెన్నడూ జరుగలేదన్నట్లుగా, భావ, పత్రికా, ప్రయాణ స్వాతంత్ర్యాలు నిర్మూలింప బడ్డాయ్. మనం రహస్య వార్తా హారులతో జాతీయ సంస్థ సృష్టించాం; తద్వారా అతి ఘోర మైన విధానాల ననుసరించి, శారీరక, మానసిక హింసకు బ్రహ్మాండమైన పోలీసు యంత్రాన్ని నిర్మించాం; భావిలో సుఖపడతామనే సిద్ధాంతమొక్కటే మనకు తెలుసు. అందు కోసం, నానాహింసల పాలవుతున్న ప్రజలను కొరడాలతో బాదుతున్నాం. విప్లవంలోనే యీతరం శక్తిసామర్థ్యాలన్నీ

వుడిగిపోయినయ్. వాళ్ళ రక్తం పాలిపోయింది; మూళ్లు, దడ మాంసపుముద్ద మాత్రమే మిగిలాయ్....మన ప్రతిఫలసహిత తత్వానికి ప్రతిఫలమివి. దీన్నే పరిశోధనకు శరీర ఖండన నీతి అన్నావు. నాకు అప్పుడప్పుడు నేరస్థుణ్ణి చర్మం వొలిచి రక్త మాంసాలను గాలికొదిలిపెట్టి నిలబెడ్తారా యీ పరిశోధకులు, అనిపిస్తుంది....'

'మంచిది, అయితే యేమిటి?' అన్నాడు, ఇవనోవ్ హాయిగా. 'చిత్రంగాలేదూ? ఇంతకంటే చిత్రం చరిత్రలో యెప్పుడైనా జరిగిందా? మానవుల పాత చర్మం వొలిచి క్రొత్తచర్మం యిస్తున్నాం. అది బలహీనుల వృత్తికాదు, కాని ఒకప్పుడు దానివల్ల నీవుకూడ వుత్సాహపడిన రోజులున్నయ్. నిన్ను ముసలిదానిలా శుష్కించిపోయేటంతగా మార్చిందేది?'

రుబషోవ్ 'అప్పటినుంచీ బొగ్రోవ్ నాపేరు పిలవటం వింటున్నాను' అని జవాబు చెప్పదలచుకొన్నాడు. ఈ జవాబుకు అర్థం యేమీలేదని తెలుసు. అందువల్ల దానికి బదులు యిలా చెప్పాడు:

'అదే వుపమానంతో చెప్పాలంటే, యీ తరం చర్మం వొలిచిన శరీరాన్నే చూస్తున్నాను. కాని క్రొత్తచర్మం ఛాయ యేమీ కనిపించటంలేదు. భౌతిక శాస్త్ర ప్రయోగాల లాగ చరిత్రతో కూడ ప్రయోగం చేయగలమనుకొన్నాం. భౌతికశాస్త్రంతో ప్రయోగాన్ని వెయ్యిసార్లు తిరిగి చెయ్య వచ్చు; కాని చరిత్రలో ఒకసారే; అదే తేడా. డాంటన్, సెయింట్—జెస్ట్‌లను ఒకసారే వురికంబాలకు పంపగలం; పెద్ద

జలాంతర్గాముల నిర్మాణమే సవ్యమైన విధానమని చివరకు ఋజువైననాడు, కాప్టేన్ బొగ్రోవ్ ప్రాణాలతో తిరిగిరాడు.

'మరి ఆతర్వాత యేం జరుగుతుంది?' ఇవనోవ్ అడిగాడు. 'ఒకపనియొక్క ఫలితార్థాలను గురించి యెప్పుడూ పూర్వజ్ఞానం సరిగావుండదు గాబట్టి, ప్రతిపని చెడ్డదేనని చేతులు ముందుపెట్టుకుని సోమరితనంగా కూర్చుందామా? ప్రతిపనికి మనబుర్రలతోనే రూపమిస్తాం—అంతకంటే మన నుంచి యెక్కువ ఆశించకూడదు. మనప్రతిపక్షంలోని వాళ్లు పెద్ద ధర్మబద్ధులేంగాదు. ఏ ముసలిచవట సేనాపతిఅయినా వేలాది మానవశరీరాలతో ప్రయోగం చేయొచ్చు; అతను పొరబాటుచేస్తే మహాయితే వుద్యోగంనుంచి విరమింప జేస్తారతన్ని. ప్రతీఘాతుక, ప్రతివిప్లవశక్తులకు న్యాయాన్యాయ విచక్షణ, నైతికసమస్యలు వుండవు. రాస్కోల్నికోవ్ పుస్తకాన్ని చదివిన ఒక సల్లానో, గల్లిఫెట్ నో, కోల్చక్ నో వూహించుకో. నీలాంటి యీ విచిత్ర పక్షిగాళ్ళు, విప్లవం అనే చెట్ల మీదనే కనిపిస్తారు. అలాగ కానివాళ్ళకు యేబాధావుండదు.

గడియారం చూచాడు. గదికిటికీ అసహ్యంగా బూడిద వర్ణపు రంగుగా మారింది. పగిలిపోయిన కిటికీఅద్దానికి అంటించిన వార్తాపత్రిక కాగితం గాలికి రెపరెపలాడుతోంది. ఎదురుగావున్న ప్రహరీమీద కాపలా సిపాయి యింకా వందడుగుల కవాతు చేస్తున్నాడు. ఇవనోవ్ మాట్లాడుతూన్నాడు:

'నీకున్నటువంటి గతచరిత్రవున్న వాడికి యీ ప్రయోగం విషయంలో హఠాద్వైరాగ్యం రావడంనీచం. ప్రతిసంవత్సరం కోట్లాదిప్రజలు యే కారణంలేకుండానే అంటువ్యాధులతోనూ,

ప్రకృతి అవాంతరాలతోను మరణిస్తున్నారు. మరి మనం చరిత్రలో అత్యంత ప్రయోజనకరమనిపించే ప్రయోగం కోసం కొన్ని లక్షలమందిని బలిచేయటానికి జంకాలా? ఇంకా వీళ్లుగాక పుష్టికర ఆహారకొరతవల్ల, క్షయవల్ల, బొగ్గు, పాదరసపు గనుల్లోను, వరి పొలాల్లోనూ, పత్తిపొలాల్లోనూ చనిపోయే వాళ్ళ సంగతి లెఖ్ఖలేదు. వాళ్ళ విషయం యెవరూ పట్టించుకోరు; ఎందుకని, యేమిటి అని యెవరూ అడగరు; కాని మనం కొన్ని వేలమందిని — యదార్థంగా ప్రమాదకరవ్యక్తుల్ని — కాలిస్తే ప్రపంచ హితవాదులు ప్రపంచ మంతటా నోటి చొల్లును జిమ్ముకుంటూ అరుస్తారు. అవును, మనం రైతుల్లోని చీడపురుగుల్ని యేరి పారవేశాం; వాళ్ళని ఆకలితో చావనిచ్చాం. అది శాశ్వతంగా చేయాల్సిన కత్తికోత. కాని విప్లవపూర్వపు సుదినాల్లో అనావృష్టి వచ్చినప్పుడల్లా దాదాపు అంతమందీ చచ్చిపోయారు. అది అర్థంలేని చావు. చైనాలో ఎల్లోనది వరదవల్ల లక్షలాది ప్రజలు మరణించేవారు. ప్రకృతి మానవజాతిమీద అర్థంలేని ప్రయోగాలు విరివిగా చేస్తుంది. మానవజాతితనమీదతానెందుకు ప్రయోగంచేసుకోకూడదు?'

కొంచెం ఆగాడు; రుబషోవ్ జవాబివ్వలేదు. ఇవనోవ్ చెప్పుకుపోతున్నాడు.

'నీవెప్పుడైనా ప్రతి-ప్రయోగాత్మకవాద సమాజపు కరపత్రాలను చదివావా? అవి చదువుతుంటే హృదయ విదారకంగా, కదిల్చివేస్తూ వుంటాయి. ఒక చిన్నజంతువు కాలేయం తీసేటప్పుడు అది మూల్గుతూ, తనను కోసేవాడిచేతిని నాకుతూవుంటేగతరాత్రి నీవు పొందిన మనోవికారంలాటిదే కలుగు

తుంది. ఇక యీ సమాజంవాళ్ళను అధికారమేవుంటే మనకు కలరా, విషజ్వరం, గ్రహణి వ్యాధులకుమందులే దొరకవు...'

సీసాలో మిగిలినదాన్ని ఖాళీచేసి, ఆవులించి, కాళ్ళు ఝాడించి, లేచి నిలబడ్డాడు. రుబషోవ్ మీదుగా వంగి కిటికీలోనుండా చూచాడు.

'వెలుగొస్తోంది. రుబషోవ్, బుద్ధితక్కువగా ప్రవర్తించకు. ఈ రాత్రి నీకు చెప్పినదంతా నీకూ, నాకూ తెలిసిన ప్రాథమిక విషయం. నీ విప్పటివరకు కృంగిపోయి వున్నావు. ఇప్పుడదంతా పోయింది.' రుబషోవ్ ప్రక్కనే నిలబడి అతని భుజాలచుట్టూ చేయివేశాడు; అతని స్వరం చాలమృదువుగా వుంది. 'ఇప్పుడెళ్ళి పడుకుని నిద్రపో. రేపు మన యిద్దరి మనస్సులూ నీ వాఙ్మూలం సృష్టించటానికి నిర్మలంగా వుండాలి. భుజాలు రిక్కించకు—యీపాటికి నీలో నీవైనా సంతకం చేయటానికి అర్ధాంగీకారాన్ని కొచ్చివుంటావు. కాదంటావా, అది కేవలం నైతిక భీరుత్వం. అది చాలమందిని ఆత్మబలిదానం చేయించింది.'

రుబషోవ్ మసక వెలుగులోకి చూచాడు. కాపలా సిపాయి అప్పుడే కుడివైపుకు తిరుగుతున్నాడు. మరతుపాకి గోపురంపైన ఆకాశం మెరుపురంగుఛాయతో పాలిసబూడిద వర్ణంగా వుంది. 'దీన్ని గురించి మళ్ళీ ఆలోచిస్తాను' అన్నాడు కొంచెంసేపాగి.

అతని అతిథివెనక తలుపు మూసుకున్న సమయంలో తానుఅప్పుడే సగంలొంగినట్లు గుర్తించాడు. అలిసి బల్లమీద వచ్చిపడ్డాడు. అయినా విచిత్రంగా కొంత ప్రశాంతతను

పొందాడు. తానుతొలిచివేయబడి, పీల్చివేయ బడినట్లుగ భావించాడు; అదేసమయంలో యేదోబరువు నెత్తిమీదనుంచి దింపినట్లయింది. అతని స్మృతిపథంలోని బొగ్రోవ్ ని గురించిః ఆందోళన కొంతతగ్గింది. చచ్చినవాళ్లకుబదులుబ్రతికున్నవాళ్ల మీద విశ్వాసంవుంచితే ద్రోహంచేయటమని యెవరంటారు?

రుబషోవ్ ప్రశాంతంగా, స్వప్నాలులేకుండా నిద్రపో యాడు; పంటినొప్పికూడ తగ్గింది. ఇవనోవ్ తనగదికెళుతూ గ్లెట్కిన్ వద్దకెళ్లాడు. గ్లెట్కిన్ యూనిఫారమ్‌తోనే, తనబల్ల ముందు కూర్చుని ఫైళ్లనుచూస్తున్నాడు. వారానికి రెండు, మూడుసార్లు రాత్రి తెల్లవార్లు పనిచేయటానికి కొన్ని సంవత్స రాలనుంచి అలవాటుపడి వున్నాడు. ఇవనోవ్ రాగానే లేచి, హాజరులో నిలబడ్డాడు.

'అంతా బాగానేవుంది. రేపు అతనుసంతకంచేస్తాడు. నీబుద్ధితక్కువతనాన్ని సరిదిద్దటానికి చెమటలు కార్చాలి సొచ్చింది' అన్నాడు.

గ్లెట్కిన్ జాబివ్వలేదు; తన బల్లముందు కొయ్యలా నిలబడ్డాడు. రుబషోవ్ గదికి వెళ్ళకముందు గ్లెట్కిన్‌తో జరి గిన తీవ్రదృశ్యం గుర్తుంది, అంత త్వరగా తిరస్కారాన్ని గ్లెట్కిన్ మర్చిపోడనికూడ తెలుసు. ఇవనోవ్ భుజాలురిక్కించి గ్లెట్కిన్ మొఖంలోకి సిగరెట్ పొగ వూదాడు 'బుద్ధితక్కు వగా ప్రవర్తించకు. నీవు యింకా వ్యక్తిగతంగా బాధపడ తావు. అతని స్థానంలో నీవే వుంటే యింకా మొండిగావుండే వాడివి' అన్నాడు.

'నాకు నడుం గట్టిగానేవుంది; కాని అతనికి లేదు.'

'కాని, నీవు వట్టివెర్రివాడివి. ఆ జవాబుకి అతనిముందే నిన్ను కాల్చాలి.' తలుపుదాకా కుంటుకుంటూపోయి తలుపు అవతలికెళ్ళి దభాలున మూశాడు.

మళ్ళీ గ్లెట్కిన్ బల్లముందు కూర్చున్నాడు. ఇవనోవ్ సఫలుడౌతాడని నమ్మకంలేదు; పైగా అదే సమయంలో భయంవేసింది. ఇవనోవ్ అన్న ఆఖరు వాక్యం బెదిరింపుగా ధ్వనించింది. మరి అతను పరిహాసంగా మాట్లాడుతున్నదీ, తీవ్రంగా మాట్లాడుతున్నదీ యెప్పుడూ తెలుసుకోలేం. ఈ వైజ్ఞానిక విరక్తులందరిలాగే బహుశా, తన సంగతి తనకు తెలియదు—ఇవనోవ్‌కి.

గ్లెట్కిన్ భుజాలురిక్కించి, కాలరు, కఫ్‌లు దులిపి, సర్దుకొని ఫైళ్ళపొత్తులతో పని చూచుకొంటున్నాడు.

# మూడో విచారణ

'అప్పుడప్పుడు మాటలు యదార్థాన్ని కప్పిపుచ్చేందుకు వుపయోగించాలి. కాని యిది జరుగుతున్నట్టు తెలియకుండా జరగాలి. లేక గుర్తించటం జరిగితే వెంటనే ప్రయోగించడానికి సాకులు సిద్ధంగా వుండాలి.'

మైఖివిల్లి :
రాఫెల్లో గిరోలమికి వుపదేశాలు

# 1

రుబషోవ్ జైలుకొచ్చిన 20వ రోజు దినచర్యలోని భాగం :

'...వ్లాడిమిర్ బొగ్రోవ్ వూపులోనుంచి పడిపోయాడు. నూట యాభై సంవత్సరాల క్రిందట, బాస్టిల్‌ను ముట్టడించిననాడు ప్రారంభమైన యూరోపియన్ వూపు, చిరకాలనిస్తబ్ధత తర్వాత మళ్ళీ కదల నారంభించింది. పీడితపాలననుంచి అనంతశక్తితో త్రోసుకొచ్చింది. బహుశా అజేయమైన వుద్వేగంతో వచ్చి, స్వతంత్రదిశగా మళ్ళింది. ఒక వందసంవత్సరాలపాటు వుదారవాదంగానూ, ప్రజాస్వామ్యంగానూ పైపైకి పెరుగుతూ వచ్చింది. కాని క్రమేపి దాని గమనం మందగించింది. ఊపు పైకంటా వెళ్ళి తిరోగమనం చేసింది. అప్పుడు రెండవసారి నిస్తబ్ధత తర్వాత దాని గమనం నిరంతరాతిశయ వేగంతో వెనుదిరిగింది. పైకి పోయినప్పటి వేగంతోనే ఆ వూపు తన ప్రయాణీకుల్ని మళ్ళీ స్వేచ్ఛనుంచి పీడితపాలనవద్దకు తెచ్చి పడేసింది. దాన్నే అంటిబెట్టుకోకుండా పైకిమాచినవాళ్లు కళ్లుతిరిగి క్రిందపడ్డారు.

'కళ్ళు తిరక్కుండా చేసుకోవాలనుకొనేవాళ్ళు దాని గమన ధర్మాలను తెలుసుకోవాలి. చరిత్రలో మనం నిరంకుశత్వంనుంచి ప్రజాస్వామికానికి, ప్రజాస్వామికంనుంచి నిరంకుశత్వానికి వుయ్యాలలాగ వూగే పరిస్థితిని యెదుర్కోవలసినట్లు కనిపిస్తుంది.

'ఒక జాతి సాధించి నిలబెట్టుకునే వ్యక్తి స్వాతంత్ర్యపు విలువ ఆ జాతి రాజకీయ పరిణతి అంతస్తుమీద ఆధారపడి వుంటుంది. పైన పేర్కొన్న గమనం, వ్యక్తి అభివృద్ధివలె ప్రజానీకపు రాజకీయ పరిణతి అవిరామంగా పెరిగే వక్రరేఖను అనుసరించదనీ, అది అతిక్లిష్టమైన ధర్మాలచేత నడుపబడుతుందనీ సూచిస్తున్నట్లు కనిపిస్తుంది.

'ప్రజల పరిణతి, వారు తమ అవసరాలను గుర్తించగలిగే సామర్థ్యం మీద ఆధారపడి వుంటుంది. ఏమైనా, వస్తువుల వుత్పత్తి, వినిమయ విధానాలను వారు మొదట కొంతవరకు అర్థం చేసుకొన్న మీదట యీ సామర్థ్యం

రాగలదు. అందువల్ల, తమ సమాజం యావత్తు యెటువంటి నిర్మాణం కలదో, యేవిధంగా అది పనిచేస్తున్నదో ప్రజలెంత యెక్కువగా అర్థంచేసుకోగలుగుతారో అంతెక్కువగా వారు ప్రజాస్వామికంగా స్వపరిపాలన చేసుకోగల సామర్థ్యం కలిగివుంటారు.

'ఇప్పుడు సాంకేతిక అభివృద్ధి ఆర్థిక సాధనాలకు నూతన క్లిష్టతను సృష్టిస్తుంది. కొంతకాలంవరకు జనసామాన్యం అర్థం చేసుకోలేని నూతన విషయాలకు, సందేహాలకు కారణభూతమవుతుంది. ప్రతి సాంకేతికాభివృద్ధి ఒక అడుగు ముందుకు జరిగినప్పుడల్లా ప్రజలలో దానికి సంబంధించిన మనోవికాసాన్ని ఒక అడుగు వెనక్కు నెట్టుతుంది. మారిన పరిస్థితులకు అలవాటుపడి వాటిని క్రమేణ అర్థంచేసుకొని, వెనుకటి నాగరికత దశల్లో పొందిన స్వయంపాలనా సామర్థ్యాన్ని తిరిగి పొందేటప్పటికి, ఒకోసారి కొన్ని దశాబ్దాలు పట్టొచ్చు, లేక కొన్నితరాలు పట్టొచ్చు. అందువల్ల ప్రజానీకపు రాజకీయ పరిణతి పూర్ణాంకంతో కొలవటం సాధ్యంకాదు, కాని సామ్యంతో కొలవాలి; అంటే ఆసమయంలో వున్న నాగరికతయొక్క దశనుబట్టి కొలవాలి.

'యదార్థ స్థితిగతులను గ్రహించగలిగేటంతగా ప్రజలు చైతన్యం పొందినప్పుడు శాంతియుతంగా గాని, వొత్తిడితోగాని ప్రజాస్వామ్య సాధన తప్పనిసరిగా జరుగుతుంది. సాంకేతిక విజ్ఞానం మరొక ముందడుగు వేసేవరకు — వుదాహరణకు, యంత్రపు మార్గాలను కనిపెట్టటం — ప్రజల జ్ఞానం మళ్లీ తగినంత అపరిపక్వస్థితిలోకి వెనక్కి పోతుంది. అందువల్ల ఒక నిరంకుశ నాయకత్వ స్థాపనకు అవకాశాన్నో లేక అవసరాన్నో కూడా కల్పిస్తుంది.

'ఈ క్రమాన్ని అనేక అరలున్న లాకులోనికి ఓడను తీసుకురావటంతో పోల్చవచ్చు. మొదట ఓడను ఒక అరలోకి తీసుకు వచ్చినప్పుడు అందులోని నీటిమట్టం, ఆ అర పరిమాణంతో పోలిస్తే, చాల తక్కువలో వుంటుంది. నీటిమట్టం ఉపరిస్థానం జేరేవరకు నెమ్మదిగా పెంచబడుతుంది. కాని, ఓడ క్రమంగా పైకి లేవడం భ్రమ. ఎందుకంటే ప్రక్క అర నీటిమట్టం మొదటి అర నీటిమట్టంకంటె పెద్దది. అందులో మళ్లీ నీటిమట్టాన్ని పెంచే క్రమం పునఃప్రారంభం కావాలి. ఈ లాకు అరలగోడలు సమాజశక్తులను కంట్రోలు చేస్తున్నా యనవచ్చు. లాకుఅరలోని నీటిమట్టాన్ని ప్రజానీకపు రాజకీయపరిణతికి పోల్చవచ్చు. సముద్రం నీటిమట్టంతో పోలిస్తే అరలోని నీటిమట్టం యింక పైకి లేవ దనుకొనడంలో అర్థంలేదు. ఇక్కడ గుర్తించా

ల్సిన విషయం, ఒక ఆరలోని నీటిమట్టం యెంతయెత్తు వున్నదనేది మాత్రమే.

'ఆవిరియంత్రాన్ని కనిపెట్టటంవల్ల యదార్థంగా శ్రీమహాశ్లోకమన శకా రంభమైంది. తత్ఫలితంగా, రాజకీయరంగం పక్షపాతయుతమై వెనకడుగు వేసింది. చరిత్రలో పారిశ్రామికయుగం యింకా శైశవదశలోనే వుంది. దీని క్లిష్టతరమైన ఆర్థిక నిర్మాణానికీ, ప్రజలు దాన్ని అర్థంచేసుకోవటానికీ మధ్య వున్న భేదం మరీ యెక్కువైంది. అదేవిధంగా యిరవయ్యోశతాబ్దపు పూర్వార్థంలోని వివిధజాతుల సామ్య రాజకీయపరిణతి, క్రీ పూ. 200 సంవత్సరాల నాటికంటే లేక జమీందారీ యుగాంతంనాటికంటే తక్కువగానే వుందని గ్రహించవచ్చు.

'ప్రజానీకపు చైతన్యం నిరంతరంగా, నిశ్చయంగా పెరుగుతూన్నదని విశ్వసించుటయే సామ్యవాద సిద్ధాంతంలోని తప్పు. అందువల్లనే, కడపటి విప్లవానికి ముందు సామ్యవాద సిద్ధాంతం నిస్సహాయస్థితిలో వుండిపోయింది; అంటే, ఆ సిద్ధాంతాన్ని ఆయా దేశాల ప్రజలు ఛిన్నాభిన్నం చేసివేశారు. పరిస్థితులు మార్పుచెందినప్పుడల్లా, కొలదిసంవత్సరాలలో ప్రజలఅభిప్రాయాలను అందు కనుగుణంగా మార్చడం సులభమని మనం విశ్వసించాం. అంటే యదార్థంగా, మనకున్న చారిత్రకఅనుభవం దృష్ట్యా ఆ మార్పును శతాబ్దాల తోనే అంచనావేయటం యెక్కువ అనుకూలంగా వుండేదనిపిస్తుంది. యిరోపా ప్రజలు యింకా ఆవిరియంత్ర ఫలితాలను మానసికంగా పూర్తిగా జీర్ణంచేసుకో లేదు. ప్రజలు దాన్ని అర్థంచేసుకునే లోగా పెట్టుబడిదారివిధానం కూలి పోతుంది.

'ఇక విప్లవ పితృభూమి విషయం. అక్కడి ప్రజలుకూడ యితరదేశాల లోని మన సత్వాలతోనే పాలింపబడుతున్నారు. వాళ్ళు లాకులో రెండవ అరవు జేరారు. కాని నీటియొక్క కిందిమట్టందగ్గరే వున్నారు. పాతవిధా నపు స్థానంలో వచ్చిన నూతన ఆర్థిక విధానం మరింత దుర్గ్రాహ్యంగా వుంది. ఈ కష్టమైన, బాధాకరమైన పెరుగుదల పునఃప్రారంభం కావలసిందే. విప్లవం వల్ల తమకై తాము సృష్టించుకొన్న నూతనవిధానాలను అర్థంచేసుకోవటానికి బహుశా కొన్ని తరాలు పట్టవచ్చు.

'అప్పటివరకు, యెలాగైనా, ప్రజాస్వామిక ప్రభుత్వ స్థాపన దుస్సాధ్యం అవుతుంది, ప్రజల కివ్వబడే వ్యక్తిస్వాతంత్ర్యం యితరదేశాలలోకంటే చాల తక్కువగా వుంటుంది. అప్పటివరకు మన నాయకులు శూన్యప్రదేశంలో

వున్నట్లుగా పాలించవలసి వస్తుంది. సాంప్రదాయకమైన వుదారవాద ప్రమాణాలతో పోలిస్తే యిదేమీ సంతోషించదగిన దృశ్యంకాదు. అయినా మన కంటికి కనిపించే ఘోరం, వంచన, నీచస్థితి అన్నీ కేవలం పై నుదహరించిన ధర్మంయొక్క అనివార్య బాహ్య నిదర్శనాలుమాత్రమే. దీనికి బుద్ధిహీనుడు దుఃఖిస్తాడు, రసజ్ఞాని యెలా అని అడుగుతాడు; కాని యెందుకని అడగడు. ప్రజలలో యిటువంటి అపరిపక్వదశ ప్రతిపక్షానికికూడ దుఃఖహేతువే.

'ప్రజల వివేక, విజ్ఞానాలు పరిపక్వం చెందిన కాలాల్లో తన ఆశయ, సిద్ధాంతాలను వారికి నచ్చచెప్పడం ప్రతిపక్షంయొక్క విధి, కర్తవ్యంకూడా. ప్రజలు యింకా అలాగ పరిపక్వంచెందని కాలాల్లో వారిమూఢత్వాన్ని తమరాజకీయాధిపత్యానికి అనుకూలంగా వుపయోగించుకోవాలనే నాయకులు మాత్రమే "ప్రజల ఉన్నతవివేకాన్ని" తమపక్షంగా రెచ్చగొడతారు. అట్టి స్థితుల్లో ప్రతిపక్షానికి రెండు అనుసరణీయ విధానాలున్నాయి. ప్రజల అండదండలమీద ఆధారపడకుండా బలవంతంగా అధికారాన్ని హస్తగతం చేసుకోవటం; లేక నిస్పృహతో, మౌనంగా మరణించటానికి వూపులోనుంచి బయట పడటం.

'మనదేశంలో ఒక పద్ధతిగా పెంపొంది పైవాటికి తీసిపోని మూడో విధానముంది: ఒకడి స్వీయవిశ్వాసాన్ని ఆచరణలో రూపొందే అవకాశం లేనప్పుడు దాన్ని అంగీకరించక, అణచివేసుకోవటం. మనం గుర్తించే యేకైక నైతికప్రమాణం యేమిటంటే, సాంఘికప్రయోజనమొక్కటే; నిష్ప్రయోజకంగా పోరాటం సాగించే విపరీత సాహసయత్నం చేసేకంటే తన విశ్వాసాన్ని బహిరంగంగా త్రోసివేసి పార్టీలో వుండటం యెంతో గౌరవప్రదంగా తోస్తుంది.

'స్వీయాహంభావాన్ని, కొన్ని విద్వేషాల్ని, అలసట, విసుగు, సిగ్గు మొదలైన వ్యక్తిగత భావనల్ని మొదలంటు పీకిపారేయాల్సిందే....'

## 2

ఇవనోవ్ వచ్చివెళ్ళిన మరునాటి వుదయం గస్తీవాని బాకా మ్రోత కాగానే రుబషోవ్ వూపును సంబంధించిన ఆలో

చన క్రమాన్ని వ్రాయటం మొదలుపెట్టాడు. ఉదయపు భోజనం వచ్చినప్పుడు ఒక గ్రుక్కెడు కాఫీ మాత్రం త్రాగి మిగతాది వదిలేస్తే అలాగే చల్లబడిపోయింది. గత కొద్దిరోజుల్నుంచి నిలకడగా, కుదురుగాలేని దస్తూరి యిప్పుడు కుదురుగా, పొందికగా వుంది. అక్షరాలు చిన్నవిగా, వంకరటింకరగా పోయిన అక్షరాలు సరియైన రూపం పొందివున్నయ్. వ్రాసింది చదివేటప్పుడు యీ మార్పును గమనించాడు.

పదకొండు గంటలకు, మామూలుగా వ్యాయామానికి తీసుకువెళ్ళినప్పుడు వ్రాత ఆపి వేయాల్సొచ్చింది. ఆవరణలో కెళ్ళగానే పూర్వపు సహచరుడు రిప్‌వాన్ వింకిల్ గాక యీ సారి సన్నటి రైతు, నారపట్ట చెప్పులు వేసుకొన్నవాడు, తనకు సహచరుడుగా వున్నాడు. రిప్‌వాన్ వింకిల్ యెక్కడా కనిపించలేదు, ఉదయపు భోజనంవేళ 'ఓ దౌర్భాగ్య చక్రవర్తీ' వినిపించక పోవటం రుబషోవ్‌కి గుర్తుకొచ్చింది. ముసలాణ్ణి యెక్కడికో తీసుకు పోయినట్లు కనిపిస్తోంది. భగవంతుడికే తెలియాలి, యెక్కడికి తీసుకెళ్ళిందీ. సంవత్సరం నుంచీ యీ దౌర్భాగ్యపు చిమ్మటపురుగు అద్భుతంగా, నిష్ప్రయోజనంగా బ్రతికి అకాలంలో బయటపడి, గ్రుడ్డిగా అటూ యిటూ తిరిగి, యేదో ఒకమూల మట్టిలో కలసి వుంటుంది.

ఆ రైతు మొదట్లో కొంతసేపు ప్రక్కచూపులుచూస్తూ కదం త్రొక్కినట్లుగా నడిచాడు. రెండు వరసలు కాగానే సకిలించి గొంతు సవరించుకొని, యింకో వరస తర్వాత,

'నేను 'డ' రాష్ట్రంనుంచి వచ్చాను. తమరెప్పుడైనా అక్కడి కొచ్చారా?' అని అడిగాడు.

రుబషోవ్ లేదన్నాడు. 'డ' రాష్ట్రం తూర్పునవున్న కట్టడో పెడగా వుంది. దాన్ని గురించి రుబషోవ్‌కు అస్పష్ట భావన మాత్రమే వుంది.

'అది చాల దూరం అక్కడికెళ్ళాలంటే ఒంటెలమీద ప్రయాణం చెయ్యాలి తమరు రాజకీయ వ్యక్తులా?' రైతు అడిగాడు

రుబషోవ్ అవునన్నాడు. రైతు చెప్పులమడమలు చిరిగి వ్రేళ్లు బయటపడి గడ్డల మంచులో యీడ్చుకుపోతున్నయ్. మెడ సన్నం కావటంవల్ల మాట్లాడేటప్పుడు చర్చిలో పవిత్ర వచనం చదివేటప్పుడు వూపినట్లుగా తల వూగుతుంది.

'నేను కూడ రాజకీయసంబంధమైనవాణ్ణే, అంటే ప్రతీఘాతకుణ్ణి. ప్రతీఘాతకులంతా పదిసంవత్సరాలు ప్రవాసశిక్ష అనుభవించాలంటారు వాళ్ళు. నన్నుకూడ ప్రవాసంపంపుతారంటారా?'

తలవూపి, ఖైదీలవైపు చూడకుండ, కాళ్ళు నేలకొడ్తూ మధ్యలో నిలబడివున్న వార్డరువైపు ఓరగా చూచి,

'ఏంచేశావ్?' అని అడిగాడు రుబషోవ్.

'పిల్లలికి మందుపొడిచే కార్యక్రమాన్ని వ్యతిరేకించినందుకు నేను ప్రతీఘాతకుడుగా బయటపడ్డాను. ప్రతి సంవత్సరం ప్రభుత్వం ఒక కమిషన్‌ను పంపిస్తుంది. రెండుసంవత్సరాల నాడు మాకు కొన్ని కాగితాలు, బొమ్మలు పంపింది. క్రిందటి సంవత్సరం గింజలను రాల్చే ఒక యంత్రం, పళ్ళు తోముకునే కుంచెలు పంపింది. ఈ సంవత్సరం పిల్లలికి మందు పొడిచేందుకు చిన్నగాజుగొట్టాలు, సూదులు పంపారు. అందులో ఒకా

విడమగవాళ్ల దుస్తుల్లోవుంది. వరసనే పిల్లలందరికీ పాడవాలంది. ఆవిడ మాయింటికొచ్చేసరికి నేనూ, మాయావిడ తలుపులు మూసేశాం. తర్వాత ప్రతీఘాతకులుగ బయటపడ్డాం. అప్పుడు మేమంతా కాగితాలు, బొమ్మలు తగులబెట్టాం. యంత్రం విరగ్గొట్టాం. ఆ తర్వాత నెలరోజులకి మమ్మల్ని తీసికెళ్లారు.

రుబషోవ్ కాసేపు యేదో గొణిగి, తర్వాత స్వయం ప్రభుత్వ విధానాన్ని గురించిన శాస వ్యాసాన్ని గురించి ఆలోచిస్తున్నాడు. న్యూగినీ స్వదేశీయుల్ని గురించి ఒకప్పుడు తాను చదివిన విషయం గుర్తుకొచ్చింది. వాళ్ళు, యీ రైతుస్థాయి కంటే యెక్కువ వైజ్ఞానికస్థాయిలో లేకపోయినా అద్భుతమైన సామాజికసమైక్యత, ప్రజాస్వామికసంస్థల్ని అభివృద్ధిచేశారు. లాకుక్రిందిఅరలో పై వరకువచ్చిన నీటిమట్టపుస్థాయికొచ్చారు.

రుబషోవ్ మానాన్ని తృణీకారంగా భావించి, మరింతగా తనలోతాను కృంగిపోయాడు. అతని బొటనవ్రేళ్ళు బిగుసుకుపోయి నీలిరంగుకు తిరిగాయ్; మాటకుముందు నిట్టూరుస్తున్నాడు. రుబషోవ్ విధినిబద్ధుడై ప్రక్కనే కదంత్రొక్కుతూ నడుస్తున్నాడు.

రుబషోవ్ తన గదికి రాగానే వ్రాతపని ప్రారంభించాడు. తాను 'సామ్య పరిణత న్యాయం' మీద ఒక నూతన సిద్ధాంతం కనిపెట్టినట్లు భావించి, అదే బిగిని వ్రాస్తున్నాడు. మధ్యాహ్నపు భోజనం వచ్చేవేళకు సరిగా ముందే పూర్తి చేశాడు. ఆ భోజనం పంపిణీలో తనభాగం తిని తృప్తిగా బల్ల మీద పడి నిద్రపోయాడు.

ఒక గంటసేపు కలలు లేకుండ, ప్రశాంతంగా నిద్ర

పోయి, తేరుకుని లేచాడు. కొంతసేపటినుంచి 402 నెంబరు గోడమీద తట్టుతున్నాడు; నిర్లక్ష్యం చేయబడినట్లు భావించాడు. రుబషోవ్ సహచరుణ్ణి తనకిటికీలోనుంచిచూచి అతన్ని గురించిన వివరాలు అడిగాడు. కాని రుబషోవ్ మధ్యలోనే అడ్డుతగిలాడు. తనలో నవ్వుకుంటూ ముక్కద్దాలతో తట్టాడు:

'నేను లొంగిపోతున్నాను.'

ఫలితంకోసం జిజ్ఞాసతో యెదురు చూచాడు.

చాలా సేపటివరకేమీ రాలేదు, 402 నెంబరు మౌనముద్రవహించాడు. కొంతసేపటికి అతని సమాధానం వచ్చింది.

'నేనైతే అంతకంటే వురితీసుకుంటాను....'

రుబషోవ్ మందహాసంచేసి తట్టాడు.

'ప్రతి వాడు తన స్వభావాన్ని బట్టి.'

402 నెంబరు కోపంతో మండిపోతాడనుకున్నాడు. కాని అందుకు బదులు తట్టుడు శబ్దం విరక్తితో వుంది.

'నీవు ప్రత్యేక వ్యక్తివని అనుకోవలసివస్తుంది. నీ లో యేమాత్రపు గౌరవచిహ్నం కూడ మిగల్లేదా?'

రుబషోవ్ వెల్లకిలా పడుకున్నాడు. చేతిలో ముక్కద్దాలున్నయ్. తృప్తిగా, ప్రశాంతంగా వున్నాడు.

'గౌరవాన్ని గురించి మనఅభిప్రాయాలు భేదిస్తయ్.'

402 నెంబరు వేగంగా, స్పష్టంగా తట్టాడు,

'గౌరవమంటే తన విశ్వాసాలకోసం బ్రతకటం, వాటికొరకే చావటం.'

రుబషోవ్ కూడ అంతే వేగంతో జవాబిచ్చాడు.

'గౌరవమంటే అహంకారంలేకుండ వుపయోగపడేది.'

402 నెంబరు యీసారి గట్టిగా, స్పష్టంగా తట్టాడు.

'గౌరవమంటే యోగ్యత – ఉపయోగించటం కాదు.'

'యోగ్యత అంటే యేమిటి?' హాయిగా నెమ్మదిగా తట్టుతూ అడిగాడు, రుబషోవ్. ఇతనెంత ప్రశాంతంగా తట్టాడో, అతనంత మండి పడుతూ తట్టాడు.

'నీలాంటి వాళ్ళకెప్పుడూ అర్థం కానిది.'

రుబషోవ్ భుజాలు రిక్కించాడు.

'మేము యోగ్యత బదులు వివేచన అంటాం' అని సమాధానమిచ్చాడు. ఇక 402 నెంబరు యేమీ జవాబివ్వ లేదు.

రాత్రి భోజనానికి పూర్వం తాను వ్రాసినదంతా చదివాడు. రెండు మూడుచోట్ల తప్పులుదిద్ది వుత్తరం రూపంలో తానున్న రిపబ్లిక్ పబ్లిక్ ప్రాసిక్యూటరును వుద్దేశించి అదంతా తిరుగ వ్రాశాడు. చివరి పేరాలు క్రింద గీతలు గీసి గుర్తించాడు. వాటిల్లో ప్రతిపక్షం తీసుకోవలసిన చర్యల్ని వివరించాడు. దాన్ని యీ వాక్యంతో ముగించాడు.

'పార్టీ కేంద్రకమిటీలో పూర్వ సభ్యుడు, పూర్వ ప్రజా కమిస్సార్, విప్లవ సైన్యపు రెండవ దళ పూర్వ అధిపతి, ప్రజా శత్రువుముందు నిర్భయత్వానికి విప్లవ పతకాన్ని పొందిన పూర్వ వీరుడు, క్రింది సంతకందారైన యస్. యన్. రుబషోవ్ పై వివరించిన కారణాల దృష్ట్యా తన ప్రతిపక్ష దృక్పథాన్ని విసర్జించి, తన తప్పుల్ని బహిరంగంగా అధిక్షేపించటానికి నిర్ణయించుకున్నాడు.'

# 3

ఇవనోవ్ వద్దకు వెళ్ళటానికి వున్న రెండు రోజులు గడవటం కోసం యెదురు చూస్తున్నాడు. తన లాంగుబాటు పత్రాన్ని ముసలి వార్డరు కిచ్చినవెంటనే, అది జరుగుతుందను కున్నాడు. సరిగా ఇవనోవ్ యిచ్చిన గడువు పూర్తయ్యే రోజు అదే అయింది. కాని యెవరూ యితన్ని గురించి ఆదుర్దాగా వున్నట్లు కనిపించలేదు. ఇవనోవ్ తన 'సామ్య పరిణత సిద్ధాంతాన్ని' శ్రద్ధగా చదువుతుండవచ్చు. లేక బహుశా, అంతకంటె సమర్థుడైన పై అధికారికి తనపత్రం పంపబడివుండొచ్చు.

కేంద్రకమిటీ సభ్యుల్లోని 'సిద్ధాంత వాదుల్లో' అది కలిగించే సంభ్రమాన్ని తలచుకొని నవ్వుకొన్నాడు. విప్లవాత్పూర్వం, విప్లవానంతరం కొద్దికాలం వరకూ, పాతనాయకుడు బ్రతికుండగా, 'సిద్ధాంత వాదుల'కూ, 'రాజకీయ వేత్తల'కూ భేదం వుండేది కాదు. ఏ సమయంలో నైనా అనుసరించవలసిన యెత్తుగడల గమనాలు, పంటల స్వాధీనం, భూవిభాగం,పంపిణీలు, క్రొత్త నాణేలను ప్రవేశపెట్టటం, ఫ్యాక్టరీల పునర్నిర్మాణం - యదార్థానికి ప్రతి పాలకకార్యం-వగైరాలన్నీ తాత్వికాచరణ కార్యాలుగా వుండేవి. ఇవనోవ్ గదిలో ఒకప్పుడు వ్రేలాడిన ఫొటోలోని వాళ్ళల్లో ప్రతివాడికీ న్యాయ తత్వం, రాజకీయార్థిక విషయాలు యూరప్‌లోని విశ్వ విద్యాలయాల్లోని పండిత శ్రేష్టులందరికంటె యెక్కువగానే తెలుసు. అంతర్యుద్ధకాలంలో కాంగ్రెస్ మహా సభల్లో జరిగిన చర్చలు, యింతకుముం దెప్పుడూ చరిత్రలో యేరాజ

కీయసంస్థ జరవని స్థాయిలో జరిగేవి. అవి శాస్త్రీయ పత్రిక ల్లోని వ్యాసాలను పోలివుండేవి. అయితే యీ నిర్ణయాలు విప్లవ భవిష్యత్తును, కోట్లాది ప్రజల జీవిత భాగ్యోన్నతిని నిర్ణయించే భేదం ఒకటుంది.

ఇప్పుడు ముసలి రక్షకుని అవసరం తీరిపోయింది. విప్లవం, అంతర్గమనంవల్ల, విప్లవాన్ని గాలిలో వదలినందువల్ల సృష్టించబడిన అశేష సజీవ శక్తుల్ని ఆపటానికి, ప్రభుత స్థిరపడిన కొద్దీ అదంత క్రూరంగా వుండాలని చరిత్ర తర్కం శాసిస్తోంది. తాత్విక చర్చల కాంగ్రెస్‌లకాలం ముగిసింది. పూర్వ చిత్రాలకు బదులు ఇవనోవ్ గది గోడలమీద తెల్లని మచ్చలేర్పడ్డయ్. తాత్విక విధ్వంసక కాలం పోయి, సంపూర్ణ వంధ్యాత్వ కాలం వచ్చింది. నెం. 1 వుత్తమ బోధకుడుగా సంతృప్తపరిచిన, తేలికగా గ్రాహ్యమయ్యే ప్రశ్నోత్తర క్రమ విధానంతో, విప్లవసిద్ధాంతం పిడివాదపు పూజావిధానంగా గడ్డకట్టుకుపోయింది. అతని వుపన్యాసాలు, వ్యాసాలు, రీతి విషయంలో కూడ, నిర్దిష్ట ప్రశ్నోత్తర క్రమరూపంలో వుంటాయ్. యదార్థ సమస్యలకూ, విషయాలకూ అద్భుత సమైక్యతతో వాటిని ప్రశ్నోత్తరాలుగా విభజిస్తాడు. నెం. 1 కి 'ప్రజల సామ్య పరిణత న్యాయాన్ని' అన్వయింపజేసే సహజ బుద్ధి, నిస్సందేహంగా, వుంది.... పడకకుర్చీ విలాస రాజకీయవాదులు క్రూర ప్రభుతలో ప్రజల్ని ఆజ్ఞాబద్ధుల్ని చేశారు. నెం.1 వాళ్ళకు ఆజ్ఞల్ని గురించి ఆలోచించటం నేర్పాడు.

తన వుత్తరానికి పార్టీ సిద్ధాంతవాదులు యేమి జవాబిస్తారోననే భావనకలిగి రుబషోవ్ నవ్వుకున్నాడు. యదార్థ పరి

స్థితుల్లో యిది పెద్ద పుకారుగా వుంటుంది. ఈ సిద్ధాంతపితల మాటంటే వెలిబెట్టి విమర్శిస్తున్నారు. నెం. 1 కాలవ్యతిక్రమ వ్యక్తిత్వంకూడ భౌతికంగా చారిత్రక సందర్భాన్నిబట్టి నిర్ణయింప బడుతుంది. నెం 1. గంతులు, హఠాత్ మార్పుల్ని, నూతన తాత్త్వికవివరాలుగా సూత్రీకరించవలసిన విధిబద్ధులైన నేటి అభాగ్య సిద్ధాంతవాదులు వేదనతో గింజుకోవాలి.

నెం. 1 అప్పుడప్పుడు తన సిద్ధాంతవాదుల మీాద చిత్రమైన జిత్తుల్ని ప్రయోగిస్తుంటాడు. ఒకసారి పార్టీ ఆర్థిక పత్రిక సంపాదకవర్గ నిపుణుల సంఘాన్ని అమెరికా పారిశ్రామిక కల్లోలానికి కారణాలను వివరించమని అడిగాడు. ఈ పని పూర్తి చేయటానికి కొన్ని మాసాలు పట్టింది. చివరికి — నెం. 1 యిటీవల కాంగ్రెస్‌లో బహిర్గతం చేసిన పరిశోధక తత్త్వపన్యాసాధారంతో — మూడువందల పేజీల ప్రత్యేక సంచికను వెలువరించారు. అమెరికాలో వచ్చినకల్లోలం కేవలం బాహ్యానికి కన్పించేటటువంటిది మాత్రమేకాదనీ, యదార్థానికి అమెరికా కల్లోలం ఆర్థిక మాంద్యపు తీవ్రదశలో వున్నదనీ, అది కేవలం విజయవంతమైన విప్లవం వల్లనే మార్పు చెందాలనీ వివరించారు. ఈ ప్రత్యేకసంచిక వెలువడిన రోజునే నెం. 1 ఒక అమెరికావిలేఖరిని పిలిచి తన పొగాకు గొట్టపు రెండు పీల్పుల మధ్య కాలంలో ప్రపంచం, విలేఖరికూడ దడదడలాడేట్లుగా,

'అమెరికాలో కల్లోలం అణగిపోయి, వ్యాపారం మళ్ళీ మామూలు స్థితికొచ్చింది' అన్నాడు.

సంపాదకవర్గ నిపుణుల సంఘం తమ నిష్క్రమణను, బహుశా, అరెస్టును కూడ ఆశించి ఆ రాత్రికి రాత్రే తమ

విప్లవ ప్రతిఘాతుక సిద్ధాంతాలకు, తప్పుడు వివరణలకు పశ్చాత్తాపాన్ని వెల్లడిస్తూ, బహిరంగ క్షమార్పణలను అర్థిస్తూ వినతి చేసుకుంటూ వుత్తరాలు వ్రాశారు. కాని, రుబషోవ్ సహచరుడు ఇసకోవిచ్, సంపాదకవర్గ సభ్యుల్లో యితనొక్కడు మాత్రమే — పూర్వ రక్షకదళానికి చెందిన వాడు — ఆత్మహత్య చేసుకో నిర్ణయించుకొన్నాడు. నెం. 1 ఇసకోవిచ్ కి ప్రతిపక్ష పోకడలున్నాయని అనుమానించి, అతన్ని హతమార్చటానికే యీ పన్నాగమంతా పన్నాడని చివరకి నిర్ధారణయింది.

ఇదంతా ఒక అసహ్యపు నాటకం అనుకున్నాడు, రుబషోవ్. 'విప్లవతత్వం పేరుతో జరిగే యీ గారడీకంతకూ మూలం నియంతృత్వాన్ని బలపర్చటమే. తెరవెనుక యంత్రాన్ని చూడకుండా రంగంమీద కనిపించే దృశ్యాన్ని గురించి మాత్రమే తీవ్రంగా ఆలోచించేవాడికి మరీబాధ. పూర్వం విప్లవ విధానం బహిరంగ చర్చలద్వారా నిర్ణయింప బడేది. ఇప్పుడు తెరవెనుక- అదికూడ ప్రజల సామ్యపరిణత న్యాయానికి తార్కిక ఫలితాంశమే.

రుబషోవ్ మళ్ళీ గ్రంథాలయపు పచ్చదీపాల ముందు కూర్చుని, చారిత్రకాధారాలతో తన నూతనసిద్ధాంత పరిశోధనలు చేయాలని వుబలాటపడుతున్నాడు. విప్లవతత్వ పరిశోధనలకు, పఠనానికి యెక్కువగా ప్రవాసాలు, రాజకీయకార్యకలాపాల మధ్య యేర్పడే నిర్బంధ విశ్రాంతి కాలాలే వుపయోగిస్తాయ్. తనకు సంభవించబోయే రాజకీయ బహిష్కరణవల్ల అంతర్ప్రవాసంలో దొరికే రెండుసంవత్సరాలకాలంలో

యెలా గడపాలనే విషయాన్ని వూహించుకుంటూ గదిలో పచార్లు సాగించాడు. తన అభిప్రాయాన్నే బహిరంగంగా నిర సించటంతో కొంత విశ్రాంతి కాలాన్ని కొనుక్కుంటాడన్న మాట. తన లొంగుబాటుయొక్క బాహ్య స్వరూపానికి యెక్కువ విలువలేదు. కాగితంమీద యెన్నిసార్లు వీలుంటే అన్నిసార్లు నెం. 1 అమోఘత్వాన్ని గురించి, అతనియెడల తమ విశ్వాసాన్ని గురించి ప్రకటనలివ్వవచ్చు. అది కేవలం మర్యాదకు సంబంధించిన విషయం - అసహ్యంగా, నిరంతర పునశ్చరణవల్ల ప్రతి వాక్యాన్ని ప్రజలమనస్సుల్లోకి జొప్పించే అవసరంయొక్క పూజాక్రమం. ఒప్పుగా ప్రతిపాదించ బడేది పసిడివలె మెరవాలి. తప్పుగా ప్రతిపాదించబడేది చీకటి గొయ్యిగా వుండాలి. సంతల్లోని మిఠాయిలాగ రాజకీయ ప్రక టనలు రంగు రంగులుగా వుండాలి.

ఈ విషయాలేమీ 402 నెంబరుకు తెలియవనుకున్నాడు. గౌరవాన్ని గురించిన అతని సంకుచిత దృక్పథం యింకో తరా నిది. మర్యాద అంటే యేమిటి? ఇంకా, శూరులబల్లెపు పందేల సాంప్రదాయాలతోను, విధులతోను కూడిన ఒక విధ మైన ఆచారం. గౌరవానికి నూతన దృక్పథం వేరుగా యేర్ప డాలి. ఆఖరిఫలితం వరకు అహంకార రహితంగా సేవించటం...

'అగౌరవ పరచుకోవటం కంటె మరణించటం మేలు' అని 402 నెంబరు అన్నప్పుడు అతను మీసాలు మెలిపెట్టి వుంటాడనిపిస్తుంది. అది స్వీయ దురహంకార ప్రకటనకు పూర్వ విధానం. 402 నెంబరు తన మాటల్ని ఒంటద్దపు జోడుతో తట్టాడు. రుబషోవ్ ముక్కద్దాల్తో తట్టాడు. అక్కడేవుంది

భేదమంతా. ఇప్పుడతనికి కావలసిందంతా గ్రంథాలయంలో ప్రశాంతంగా కూర్చుని తన అభిప్రాయాలనుగురించి పరిశోధన చేయటమే. ఆ పని చాలకాలం పడుతుంది. ఒక మహాగ్రంథం వెలువడుతుంది. కాని ప్రజాస్వామిక సంస్థల చరిత్రను అర్థం చేసుకోవటానికీ, ప్రస్తుత కాలంలో స్పష్టంగా కనిపిస్తూ, పూర్వపు వర్గపోరాట సిద్ధాంతం వివరించలేకపోయిన ప్రజా మనస్తత్వ పూగిసలాటను అర్థం చేసుకోవటానికీ వుపయోగించే మొదటి గ్రంథమవుతుంది.

రుబషోవ్ పచార్లు జోరుచేశాడు, ముసిముసిగా నవ్వు కుంటూ. తన నూతన సిద్ధాంతాన్ని రూపొందించుకోవటానికి అవకాశ మిచ్చినంతవరకు యిబ్బందేమీ లేదు. పంటి నొప్పి పోయింది. బాగా మెలకువతో, సాహసంతో, వుద్రేకంతో వున్నట్లు భావించాడు. ఇవనోవ్‌తో అర్థరాత్రి సంభాషణజరిగీ, తాను వుత్తరం పంపీ రెండు రోజులైనా యింత వరకేమీ జవాబు రాలేదు. అతన్ని అరెస్ట్ చేసిన మొదటి రెండు వారాల్లోనూ దొర్లిపోయిన కాలం, యిప్పుడు ప్రాకుతోంది. అప్పుడు గంటలు, నిమిషాలు, సెకండ్లుగా గడిచిపోయినయ్. మూర్ఛ లోనూ, ఆవేశంతోనూ పనిచేయాల్సొచ్చింది; చారిత్రకాధా రాలు లేక ఆగిపోవలసివచ్చింది. ఎన్నోసార్లు పావుగంటసేపు తలుపు రంధ్రం వద్ద నిలబడ్డాడు, తనను ఇవనోవ్ వద్దకు తీసుకువెళ్ళటానికి ముసలి వార్డరు వస్తున్నాడేమో చూడటా నికి. కాని, పూర్వంలాగే విద్యుద్దీపం వెలుగుతూ, వరండా నిర్మానుష్యంగా వుంది.

అప్పుడప్పుడు ఇవనోవ్ తనగదికివచ్చి, తన వాఙ్మూలం

తనగదిలోనే తీసుకుంటే యెంతో బాగుండునని ఆశించాడు. ఈసారి సారాసీసాకు కూడ అభ్యంతరం చెప్పడు. తనవాజ్మూలంలో వాడే అలంకారయుత సమాసాలు, మధ్య మధ్య ఇవనోవ్ విసిరే విరక్తపు ఛలోక్తులు వగైరా సంభాషణంతా వివరంగా చిత్రించుకున్నాడు. చిరునవ్వుతో పచార్లు చేస్తూ, ప్రతి పది నిమిషాలకు గడియారం వైపుచూచాడు. ఆ రాత్రి, మరునాడే తనను పిలిపిస్తానని, ఇవనోవ్ వాగ్దానం చేయలా?

రుబషోవ్ ఆతురత తీవ్రమై జ్వర తీవ్రతలోకి దింపింది. ఇవనోవ్‌తో మాట్లాడిన మూడోనాటి రాత్రి నిద్రపట్టలేదు. చీకట్లో బల్లమీద పడుకుని అస్పష్ట, వికల ధ్వనుల్ని వింటూ, అటు, యిటు దొర్లుతూ, తానరెస్టయినప్పటినుంచీ యీనాడు మొదటి సారిగా, తన ప్రక్కలో, వేడిగా స్త్రీశరీరం వుంటే బాగుండు ననుకున్నాడు. ఉచ్ఛ్వాస, నిశ్వాసల్ని అదుపులో పెట్టుకొని నిద్రించటానికి యెంత ప్రయత్నిస్తే అంత దూరమౌతున్నదది. 'మర్యాద అంటే యేమిటి?' అనే ప్రశ్నానంతరం నుంచీ యిప్పటివరకూ మళ్ళీ యేమీ మాట్లాడని 402 నెంబరుతో సంభాషణ ప్రారంభించాలనే వుద్దేశాన్ని అణచుకోవటానికి యెంతో ప్రయత్నించాడు.

అర్థరాత్రివేళ, మూడు గంటల్నుంచీ పగిలిన కిటికీ అద్దాని కంటించిన వార్తా పత్రికవైపు చూచి, చూచి యిక ఆగలేక వ్రేళ్ళ కనుపుల్తో గోడమీద తట్టాడు. ఆతురతతో యెదురుచూచాడు. గోడ మూగబోయింది. 402 నెంబరు యింకా జవాబివ్వలేదు. కాని తప్పకుండా అతను గోడకవతల మెలకువతోనే కాలాన్ని హరిస్తూపూర్వసాహస కార్యస్మృతు

లను నెమరు వేస్తూ, పడుకునివుంటాడు. తనకు తెల్ల వారుఝాము ఒకటి రెండు గంటలవరకూ నిద్రరాదనీ, తానుచిన్నప్పటి అలవాట్లకు మళ్లుతున్నాననీ రుబషోవ్ తో స్వయంగా చెప్పాడు.

రుబషోవ్ వెల్లకిలగా పడుకొని చీకట్లోకి తేరిపారచూచాడు. పడుకున్న గడ్డి పరుపు అణిగిపోయింది. దుప్పటి బాగా వెచ్చబడి, ఒంటితడిని లాక్కొని చిరాకు గలిగిస్తోంది. కాని దుప్పటి తీసివేస్తే చలిఒణికిస్తోంది. వరసనే యేడోదో, యెనిమిదోదో సిగరెట్ కాలుస్తున్నాడు. పీకలుపక్కచుట్టూ క్రిందపడి వున్నయ్. ఏ మాత్రపు శబ్దం కూడ అణిగిపోయింది. కాలం నిలిచి పోయినట్లుంది. కాలం నిరాకారాంధకారంగా రూపొందినట్లుంది. రుబషోవ్ కళ్లుమూసుకొని ఆర్లోవా పరిచయ కుచద్వయం చీకట్లోకి పొడుచుకొచ్చి తనప్రక్కనే పడుకున్నట్లు భావించుకున్నాడు. బొగ్రోవ్ లాగ వరండాలో యీడవబడిందని మర్చిపోయాడు. నిశ్శబ్దం హోరుమంటూ పొంగుతున్నట్లుగా, తీవ్రమైంది. ఈ తేనెపట్టులో బంధింపబడ్డ రెండువేలమంది జనం యేంచేస్తున్నారు? వాళ్ల వినపడని శ్వాస, కనపడని స్వప్నాలు, భయాలు, కోర్కెల భావనలతో నిశ్శబ్దత బరువెక్కింది. చరిత్రే గనక లెఖ్ఖయినట్లయితే యీ రెండువేలమంది పీడకలల బరువెంత? ఈ రెండువేల నిస్సహాయ ప్రార్థనల వొత్తిడియెంత? ఇప్పుడు నిజంగా ఆర్లోవా పరిమళాన్ని పీలుస్తున్నాడు. ఉన్ని దుప్పటిక్రింద అతని శరీరం చెమటతో తడిసిపోయింది. గది తలుపు దభాలున తెరుచుకుంది. వరండాలో దీపకాంతి అతనికళ్లల్లో పొడిచింది.

ఇంతకుముందు రుబషోవ్ యెరగని యిద్దరు రివాల్వర్ బెల్టుల యూనిఫారం వుద్యోగులు ప్రవేశించారు. అందులో ఒకడు పొడుగ్గా, పశుప్రాయంగావున్న బొంగురు గొంతుకవాడు తన బల్లవద్ద కొచ్చాడు. అతని గొంతు రుబషోవ్‌కి చాల బిగ్గరగా వినిపించింది. ఎక్కడికో చెప్పకుండ తన ననుసరించమని రుబషోవ్‌ని ఆజ్ఞాపించాడు.

పక్కక్రింద తడుముకొని ముక్కద్దాలు తీసుకొని తగిలించుకొని బల్లమీదనుంచి లేచాడు. అతి భారంతో అలసట జెంది యూనిఫారం రాక్షసుడి ప్రక్కనే నడుస్తూపోతున్నాడు. రుబషోవ్ పైన తలకాయెత్తున్నాడు వుద్యోగి. రెండవవాడు వీళ్ళ వెనక అనుసరించాడు.

గడియారం వైపు చూచాడు, రెండయింది. అయితే కొంత నిద్రపోయాడన్నమాట- మంగలిషాపు వైపుగావెళ్లారు. బొగ్రోవ్‌నుకూడ యీదారినే తీసుకెళ్లారు. రెండో వుద్యోగి వీళ్ళకు రెండడుగుల దూరంలో వస్తున్నాడు. రుబషోవ్ మెడ మీద దురదపుట్టి గోక్కోవాలనిపించి, తలత్రిప్పి గోక్కోవాలనుకొని కూడ నిగ్రహించుకున్నాడు. పూర్తిగా నమ్మకం లేకుండానే తనను వాళ్లు తతంగం యేమీలేకుండా అంతం చేయరనుకున్నాడు. ఆ విషయమేమీ తన కంతగాపట్టలేదు, ఆ తంతు త్వరగా పూర్తి అయితేచాలు. భయపడిందీ, లేనిదీ పరికించుకోవాలనిపించింది. కాని మెడమీద దురద, తలత్రిప్పుకోవాలనేవాంఛ కలిగించే శారీరక బాధతప్ప యింకేమీలేదు.

మంగలిషాపు దాటగానే సన్నటి మెట్లవరస కనిపించింది. తన ప్రక్కనున్న రాక్షసుడి అడుగులు మందగిస్తయ్యో

మోనని చూచాడు. ఇప్పటికీ యేమీ భయపడలేదు. జిజ్ఞాస, వ్యాకులపాటు తప్ప యింకేమీ లేవు. కాని మెట్లుదాటగానే ఆశ్చర్యంగా, కాళ్లు వణుకుతున్నట్లుగా, తాను నిల దొక్కుకోవలసినట్లుగా గుర్తించాడు. అదే సమయంలో ముక్కద్దాలు తీసి, చొక్కా చేతిమీద తుడుచుకుంటున్నట్లుగా గ్రహించాడు. తనకు తెలియకుండానే మంగలిషాపు వద్దకు రాకముందే ముక్కద్దాలు తీసినట్లనిపిస్తోంది. ఇదంతా వంచన అనుకున్నాడు. వాళ్లు నన్ను కొడితే వాళ్లకు కావలసిన దేనిమీదనైనా సంతకం పెడతాను. కాని రేపు తిప్పి కొడతాను.

ఇంకా కొన్ని అడుగుల తర్వాత మళ్ళీ 'సామ్య పరిణత సిద్ధాంతం' మనసుకొచ్చింది. తన లొంగుబాటుమీద సంతకం చేయ నిశ్చయించుకొన్న విషయంకూడ స్ఫురణకొచ్చింది. ఎంతో ప్రశాంతి కలిగింది. అదేసమయంలో గత కొద్ది రోజుల్నుంచీ తానుచేసుకున్న నిర్ణయాన్నెలాపూర్తిగా మర్చిపోయానా అని ఆశ్చర్యపోయాడు. ఆ రాక్షసుడు ఆగి, తలుపుతీసి ప్రక్కగా నిలబడ్డాడు. ఇవనోవ్ గదిలాటి గదే తన ముందు కనిపించింది. కాని అసహ్యంగా పెద్దకాంతితో దీపపు వెలుగు కళ్లల్లో పొడిచింది తలుపు కెదురుగా బల్లకు వెనుక గ్లెట్కిన్ కూర్చున్నాడు.

రుబషోవ్ వెనక తలుపుమూసుకుంది. ఫైళ్ళకట్టమీద నుంచి దృష్టిమరలిచి రుబషోవ్ వైపు చూచాడు, గ్లెట్కిన్. 'దయచేసి కూర్చోండి' అన్నాడు, మామూలు యెండు గొంతుతో. రుబషోవ్ కి ముందునాటి సంభాషణ గుర్తుకొచ్చింది. గ్లెట్కిన్

తలమీద గాయంకూడ గుర్తించాడు. అతని కుర్చీవెనుక యెత్తుగాలోహపు సెమ్మెమీద అమర్చిన పెద్దదీపం తప్ప యింకొకటి లేకపోవటం వల్ల గ్లెట్కిన్ కనీడలో వున్నాడు ఆ దీపం ప్రసరిస్తున్న వెలుగు తీవ్రతకు కళ్ళుచీకట్లుకమ్మి కొంత సేపటివరకు ఆ గదిలో మూడోమనిషి వున్నసంగతే తెలియలేదు. తెరవెనుక కార్యదర్శి గదివైపుకు వీపుపెట్టి చిన్న బల్లముందు కూర్చుని వుంది.

బల్లముందు, గ్లెట్కిన్ కెదురుగా చేతుల్లేనికుర్చీ ఒకటే వుంటే రుబషోవ్ దానిమీద కూర్చున్నాడు. ఇబ్బందిగావుంది.

'కమిసార్ ఇవనోవ్ పరోక్షంలో మిమ్మల్ని విచారించటానికి నియమితుణ్ణయినాను. దీపకాంతి రుబషోవ్ కళ్ళకు చాల బాధగావుంది. ప్రక్కకు తలతిప్పి మాట్లాడుదామన్నా ఆ కాంతి కనుకొలకుల్లో పడి మరింత బాధను కలిగిస్తుందేగాని యేమీ తగ్గదు. పైగా అలా మాట్లాడటం అసందర్భంగా, మరీ యిబ్బందిగా వుంటుంది.

'ఇవనోవ్ చేత విచారింపబడటమే నాకు యిష్టం.'

'విచారణాధికారి పై అధికారులచే నియమింపబడ్డాడు. నీవు వాఙ్మూలం యివ్వటమో, తిరస్కరించటమో, అంతే నీకున్న హక్కు. నీ విషయంలో తిరస్కరించటమంటే రెండు రోజుల క్రిందట నీవుపంపిన వుత్తరం ప్రకారం చేయవలసిన ఒప్పుదల ప్రకటన చేయ నిరాకరించట మన్నమాట. అంతటితో యీ విచారణ ముగిసినట్లవుతుంది. ఆ పరిస్థితిలో నీ విషయమై పై అధికారులకు పంపటానికి నాకు అధికారం వుంది. వాళ్ళే అధికార రీత్యా నీ శిక్షను ప్రకటిస్తారు.'

రుబషోవ్ త్వరితంగా యీ విషయమై ఆలోచించాడు. ఇవనోవ్ విషయంలో యేదో తప్పకుండా జరిగి వుంటుంది. హఠాత్తుగా శెలవు పెట్టించారో, బర్తరఫ్ చేశారో లేక అరెస్టు చేశారో, బహుశా రుబషోవ్‌తో అతని స్నేహాన్ని గుర్తుకు తెచ్చుకొన్నారేమో; బహుశా, మానసికంగా పై స్థాయిలోవుండి చమత్కారంగా వుంటాడనేమో; నెం. 1 మెడ అతనుచూపే భక్తివిశ్వాసాలు తార్కిక బద్ధములై వుంటాయికాని గుడ్డి విశ్వాసం కాదనేమో. అతను చాల తెలివి గలవాడు, పాతతత్వపు వాడు, నవ్యతత్వపు వాళ్ళు గ్లెట్కిన్ రకం. అతని పద్ధతులు.... ఇవనోవ్, శాంతి కలుగు గాక! జాలిపడటానికి రుబషోవ్‌కి వ్యవధిలేదు; త్వరితంగా ఆలోచించాలి. కాని దీపకాంతి అడ్డు తగులుతోంది, ముక్కద్దాలు తీసి కళ్ళు మిటకరించాడు. ముక్కద్దాలు లేకుంటే నగ్నంగా, నిస్సహాయంగా కనిపిస్తానని తనకు తెలుసు. గ్లెట్కిన్ అవ్యక్త నేత్రాలు అతని ముఖకవళికలను ప్రస్ఫుటింప జేస్తున్నాయ్. ఇప్పుడు మౌనంగావుంటే ఆఖరే. ఇక వెనక్కు వెళ్ళటంలేదు. గ్లెట్కిన్ వొట్టి యేహ్యామృగం. కాని నూతన తరానికి ప్రతినిధి. పూర్వతరం వాళ్ళు వీళ్ళతో రాజీ చేసుకోవాలి. లేకపోతే హతమైపోవాలి; అంతకంటే యింకో గత్యంతరం లేదు. రుబషోవ్ హఠాత్తుగా వార్ధక్యాన్ని భావించాడు. ఇప్పటివరకు యిటువంటి భావమే యెరుగడు. తాను యాభయ్యోపడిలో పడినసంగతి తెలియనే తెలియదు. ముక్కద్దాలు తగిలించుకొని గ్లెట్కిన్ దృష్టుల్ని యెదుర్కో సిద్ధమయ్యేటప్పటికి దీపకాంతి జిల్లుమంటూ కళ్ళల్లోకి పారింది.

నీళ్ళు క్రమ్మాయి. ముక్కద్దాలు మళ్ళీ తీశాడు.

'వాఙ్మూలం యివ్వటానికి సిద్ధంగావున్నా,' స్వరంలోని రోషాన్ని నిగ్రహించుకున్నాడు. 'అయితే, నీమాయల్ని కట్టి పెట్టే నియమంతో మాత్రమే. ఆ మిరుమిట్లుగొలిపే దీపాన్ని ఆర్పివెయ్యి. ఈ పద్ధతుల్ని తాంత్రికుల మీద, ప్రతి విప్లవ కారుల మీద ప్రయోగించు.'

'నీవు నియమాలు శాసించేస్థితిలో లేవు' ప్రశాంత స్వరంతో అన్నాడు. 'నీకోసమని నాగదిలో దీపపుకాంతి మార్చను. నీవు పరిస్థితిని గుర్తించినట్లు లేదు. ముఖ్యంగా నీవు ప్రతివిప్లవ చర్యలకు నిందితుడవైవున్నావు. ఇంతకుముందు రెండుసార్లు బహిరంగ ప్రకటనద్వారా నీ నేరాన్ని అంగీకరించావు ఈ సారి అంత తేలికగా తప్పించుకోగలననుకోకు.'

'ఓరి పందీ,' అనుకున్నాడు రుబషోవ్. యూనిఫారంలో వున్న మురికి పంది. ముఖం కందగడ్డయింది. తాను వుద్రేక పడటం, అది గ్లెట్కిన్ గుర్తించటం గ్రహించాడు. ఈ గ్లెట్కిన్ గాడికెంత వయసుంటుంది? మహావుంటే ముప్ఫయ్యారు లేక ముప్ఫయ్యేడు. వీడు అంతర్యుద్ధంలో సిపాయిగా పనిచేసి వుంటాడు. విప్లవ కాలంలో చిన్నగుంట వెధవయి వుండాలి, వరద తర్వాత ఆలోచించటం మొదలుపెట్టిన తరం యిది. ఈ తరానికి సాంప్రదాయాలు లేవు. హరించిపోయినపూర్వపు స్మృతులుగాని, బంధనాలుగాని యేమీలేవు. అది బొడ్డు త్రాడు లేకుండా పుట్టిన తరం.... అయినా ఆ వైపునుంచి వాళ్ళకు హక్కుంది. న్యాయంగా ఆ త్రాడు త్రెంచాలి, పూర్వప్రపంచానికి సంబంధించిన పరువు, తాంత్రికమర్యాదల

నిష్ప్రయోజకాభిప్రాయాలకు బంధించివుంటే ఆఖరు బంధాన్ని త్రెంచివెయ్యాలి. గౌరవం, వ్యక్త్యహంకారం లేకుండ, తనకై లెక్కచెయ్యకుండా, చివరిఫలితం వరకు సేవించటంకోసమే.

రుబషోవ్ వుద్రేకం క్రమేణా నెమ్మదించింది. ముక్కద్దాలు చేత్తోపుచ్చుకొని గ్లెట్కిన్ వైపుతిరిగాడు. కళ్లుమూసుకోవలసి వచ్చింది. గనుక తను యింకా నగ్నంగా వున్నట్లు భావించాడు. కాని యిది యిక బాధించలేదు. మూసిన కనురెప్పలవెనుక అరుణకాంతి ప్రకాశించింది. ఇంతకుముందెప్పుడూ అటువంటి వొంటరిభావ తీవ్రతను అనుభవించలేదు.

'పార్టీకి పనికొచ్చే ప్రతిపనీచేస్తాను.' గొంతుబొంగురుపోయింది. కళ్ళుమూసుకునే వున్నాడు. 'నా నేరాన్ని సవివరంగా చెప్పమని విన్నవించుకొంటున్నాను. ఇప్పటి వరకు యిది జరగలేదు.'

మిటకరిస్తున్న కళ్ళతో చూడటం కంటే, గ్లెట్కిన్ కట్టె శరీరంలో ఒక చిన్న కదలికను విన్నాడు. కుర్చీమీద అతని చేతి కఫ్‌లు కిరుక్రుమన్నయ్. ఒక వరస దీర్ఘ నిశ్వాసం విడిచాడు.దాన్తోఅతని శరీరమంతా తెరపినబడినట్లుగా వుంది. గ్లెట్కిన్ తన జీవితంలో ఘన విజయం సాధిస్తున్నట్లు భావిస్తున్నాడని వూహించాడు. ఒక్క రుబషోవ్‌కు వల వెయ్యటమంటే జీవితంలో వున్నత స్థానాన్ని నిర్మించుకోవటమన్న మాట. ఒక క్షణం క్రిందటివరకు గ్లెట్కిన్ సంగతి ప్రతిదీ త్రాసులో వ్రేలాడుతోంది – ఇవనోవ్ గతి ఆ విషయం జ్ఞాపకంచేస్తుంది.

రుబషోవ్ హటాత్తుగ తనమీద గ్లెట్కిన్ కెంతఅధికారముందో, తనకు గ్లెట్కిన్‌మీద అంతేఅధికారముందని తెలుసు

కున్నాడు. 'నీ పీక నాచేతులో వుంది రాబిడ్డా', ముఖం శ్లేషగా వికృతంగా మార్చి అనుకొన్నాడు. మన పీకలు ఒకరి పీక యింకొకరి చేతుల్లో వున్నై. నేను గనక ఆ వూపులోనుంచి దూకానా నాతోబాటు నిన్నుకూడ లాక్కెళతాను. రుబషోవ్ యీ భావంతో ఆటలాడుకుంటుండగా గ్లెట్కిన్ మామూలు కష్టైతనంతోను, ఖచ్చితంగా పత్రాలుతిరగేస్తున్నాడు. అప్పుడు యీ భావాన్ని అణిచివేసుకుని, తన వ్యధిత నయనాలను మూసుకున్నాడు. ఆత్మఅహంకారపు తుది అవశేషాలనుకాల్చి వేయాలి — ఆత్మహత్య అంటే అహంకారపు అధోగమనం కాక యింకేమిటి? నిజానికి దీన్నే గ్లెట్కిన్ తన నేర్పరి తన మని నమ్ముతున్నాడు — కాని తనను లొంగుబాటుకు ప్రేరేపించిన ఇవనోవ్ వాదనలు కాదు. బహుశా, పై అధికారులను ఒత్తిడిచేసి యీ విషయమైవొప్పించి, ఇవనోవ్ పతనాన్ని తీసుకొచ్చి గ్లెట్కిన్ కూడ కృతకృత్యుడైనాడేమో. 'పంది' అనుకున్నాడు రుబషోవ్, కాని యీసారి కోపంతో మాత్రం కాదు. మా సృష్టికి ఫలితార్థంగా తయారైన యూనిఫారం పశువు — ఇప్పుడే ప్రారంభమౌతున్న నూతన యుగపు అనాగరికుడు. నీకు అసలువిషయం అర్థంకాలేదు. కాని నీవుమాకు నిరుపయోగమని తెలుసా?.... దీపపుకాంతిస్థాయి యింకొంచెం పెరిగినట్లు గుర్తించాడు. అడ్డుపరీక్ష సమయాల్లో యీ కాంతిదీపపు వెలుగుహెచ్చించటానికి, తగ్గించటాని కేర్పాటు లుంటాయని రుబషోవ్‌కు తెలుసు. తల త్రిప్పుకొనికంటినీరు తుడుచుకోవలసొచ్చింది. ఓరి పశువా, అనుకున్నాడుమళ్ళీ. ఐనా యిటువంటి పశుప్రాయపుతరమే కావాలిప్పుడు మాకు....'

గ్లెట్కిన్ యితని నేరాన్ని చదవటం ప్రారంభించాడు. అతని యేకస్వనగళం పూర్వం కంటే మరీ చిరాకు కలిగిస్తోంది. తల త్రిప్పుకొని, కళ్ళు మూసుకొని వింటున్నాడు.తన యీ ఒప్పుదలను సామాన్య మర్యాదగా పరిగణించ దలచుకున్నాడు. ఒక అవసరమైన అసంబద్ధంగా, యీ కోత బాధ దాన్ని ప్రేరేపించిన వాడికి తప్ప యింకెవరికీ అర్థం గాదు. అతను ఆశించిన అధమ స్థితికంటే అధమాధమంగా వుంది, గ్లెట్కిన్ చదివే నేరారోపణ.

రుబషోవ్ యీ పసి కుట్రలు పన్నాడని, గ్లెట్కిన్ నిజంగా నమ్ముతున్నాడా? కొన్ని సంవత్సరాల నుంచి తాను, 'ముసలి రక్షకుడు' కలిసి వేసిన పునాదులపై నిర్మితమైన భవనాన్ని కూలద్రోయటమే పనిగా ఆలోచిస్తున్నాడా? ఆ సంఖ్యాసూచిత శిరస్కులందరూ గ్లెట్కిన్ బాల్యంలో వీరులు; హఠాత్తుగా వాళ్ళను పతితులుగా, లంచగొండులుగా మార్చివేసే యేదో అంటువ్యాధి పాల్పడ్డారని, వాళ్లు విప్లవాన్ని నాశనం చేయటమే ఆశయంగా పెట్టుకున్నారని గ్లెట్కిన్ నమ్ముతున్నాడా? ఈ మహా రాజకీయచతురులు తమ విధానాలను యేదో అపరాధ పరిశోధక నవలనుంచి మెరువు తెచ్చుకున్నారను కొంటున్నాడా?

గ్లెట్కిన్ యేకస్వనంతో, యేవిధమైన యింపు, సొంపు లేకుండ, వయసుమీరిన తర్వాత చదువు నేర్చుకున్న వాళ్ల పొడిగొంతుతో, చదువుతున్నాడు. రుబషోవ్ "బి" లోవున్నప్పుడు ప్రస్తుత అధికారవర్గాన్ని పడగొట్టి, తాను అధికారాన్ని

దౌర్జన్యంగా హస్తగతం చేసుకోవాలనే కుట్రతో విదేశీ ప్రభుత్వ ప్రతినిధితో సంబంధాలు పెట్టుకొన్నాడని ఆరోపించ బడిన నేర స్వభావాన్ని చదువుతున్నాడు. ఆ విదేశీ ప్రతినిధి పేరు, సమావేశస్థలం, కాలంకూడ వుదహరించాడు. ఇప్పుడు రుబషోవ్ చాల శ్రద్ధగా వింటున్నాడు. తానుయెప్పుడో మర్చి పోయి మళ్ళీ యెన్నడూతలవని ఒకచిన్న అప్రాముఖ్యదృశ్యం స్ఫురణకొచ్చింది. త్వరితంగా ఆ నాటి తేదీని జ్ఞాపకం చేసు కున్నాడు. దాదాపు సరిపోయింది. అలాయితే ఆ త్రాడే యిప్పుడు తనను వురితీస్తుందన్నమాట? చిరునవ్వు నవ్వి జేబురుమాలుతో ఆర్ద్ర నయనాలు తుడుచుకున్నాడు....

గ్లెట్కిన్ బిరుగా, ఘోరమైన యేకస్వనంతో చదువుకు పోతున్నాడు. అతను చదివేదాన్నంతా నమ్ముతు న్నాడా? ఆచదివే విషయంలోని విపరీతాసంబద్ధాన్ని గుర్తిం చటంలేదా? ఇప్పుడు రుబషోవ్ అల్యూమినియం ట్రస్ట్ అధి పతిగా వున్న కాలంలో విషయాలను చదువుతున్నాడు. తొం దరపాటుతో అభివృద్ధిచేసిన యీ శాఖ అపసవ్య నిర్మాణం వల్ల యేర్పడిన విపరీతపు స్థితిని తెలియజేసే లెఖల్ని, ఆ పరి శ్రమకు బలియైన కార్మికుల సంఖ్యను, చెడులోహన్ని వయో గించటం వల్ల కూలిపోయిన విమానాల వరుస సంఖ్యల్ని యే కరువు పెడుతున్నాడు. ఇదంతా రుబషోవ్ సైతాను ఘాతుక చర్యల ఫలితం. 'సైతాన్' పదం ఆ పత్రాల్లో అనేకసార్లు సాంకేతిక పదాలు, వ్యక్తుల పేర్ల మధ్య వుదహరించబడింది. గ్లెట్కిన్ పిచ్చివాడైనాడనే భావాన్ని రుబషోవ్ కొంతసేపు వూహించాడు. ఈ తర్క, అసంబద్ధ మిశ్రమం మత అంతఃకల

హాన్ని గుర్తుకు తెచ్చింది. ఈ నేరారోపణ గ్లెట్కిన్ తయారు చేసింది కాదు. అతను నమ్మినా నమ్మకపోయినా యెలాగైనా దానికి విలువనిచ్చి — తాను మాత్రం చదువుతున్నాడు.

మసకగావున్న మూల కూర్చున్న స్టెనోగ్రాఫర్ వైపు చూచాడు, రుబషోవ్. ఆవిడ పల్చగా, పొట్టిగావుంది. కంటి అద్దాలున్నయ్. ఏకాగ్రితతో యిటువైపు తలైనా త్రిప్ప కుండ పెన్సిల్ చెక్కుకుంటున్నది. యథార్థంగా గ్లెట్కిన్ చదువుతున్న యీరాక్షస కృత్యాలన్నీ నమ్మదగినవి గానే వున్నాయని నమ్ముతున్నట్లుంటాామె. ఆవిడ యౌవనవతి. బహుశా యిరవైఐదు, ఆగుకంటె యెక్కువ వుండవు. ఆవిడ కూడ వరదతర్వాత పెరిగిందే. ఈ నవీన హృదయశూన్యపు తరానికి రుబషోవ్ పేరంటే యేమిటిగా వుందో? కళ్లుచీకట్లు క్రమ్మించే దీపకాంతిముందు కూర్చుని సజలనేత్రాలను తెరువలేక పోతున్నాడు. వాళ్లు సొంపులేని కంఠంతో చదువు తున్నారు. అవ్యక్త నయనాలతో, బల్లమీదున్న యేదో ఒక జడపదార్థంలాగా నిర్లక్ష్యంగా చూస్తున్నారతన్ని.

నేరారోపణ ఆఖరుపేరా చదువుతున్నాడు, గ్లెట్కిన్. అందులోనే అతిప్రాముఖ్యమైన విషయముంది. నెం. 1 ప్రాణాలు తీయటానికి పన్నిన పన్నుగడ, మొదటి విచారణ సమయంలో ఇవనోవ్ పేర్కొన్న ఆఅదృశ్యపు వ్యక్తి ప్రసక్తి మళ్లీవచ్చింది. ఈ వ్యక్తి నెం. 1 హడావిడిగా వున్నరోజుల్లో మధ్యాహ్నపు చల్లని భోజనం తెప్పించుకునే హోటలు సహా యాధిపతి అని తేలింది. బహుళ ప్రచారమైన, యీ స్పార్టన్ విధానపు భోజనం నెం. 1 కు చాల యిష్టం. రుబషోవ్ నెం.1

అకాల మరణానికి యీ భోజనాన్ని వుపయోగించాలని ఆ అదృశ్యవ్యక్తిని ప్రోత్సహించాడు. కళ్ళుమూసుకునే తనలో నవ్వుకున్నాడు; కళ్ళు తెరిచి చూచేసరికి గ్లెట్కిన్ చదవటం ఆపివేసి తనవైపు చూస్తున్నాడు. కొన్ని క్షణాలు నిశ్శబ్దంగానే గడచినతర్వాత గ్లెట్కిన్ తన మామూలు సాక్షీ స్వరంతో అన్నాడు, అది ప్రశ్నగాకంటే ప్రకటనలా వుంది.

'నీవు నీనేరంయేమిటో విన్నావు; నేరస్థుడవని తేలింది.'

రుబషోవ్ అతని ముఖంలోకి చూడాలని ప్రయత్నించాడు. కాని చూడలేకపోయాడు. మళ్ళీ కళ్ళుమూసుకున్నాడు. అతినిశితమైన సమాధానం నాలుక చివరిదాకా వచ్చింది కాని నిగ్రహించుకొని తెరవెనక వున్న సన్నపాటి కార్యదర్శి మెడసాచి వినవలసివచ్చేటంత లోస్వరంలో ప్రశాంతంగా అన్నాడు.

'ఈ ప్రభుత్వ విధానంవెనక వున్న ప్రాణాంతకపు ఒత్తిడి యేమిటో అర్థం చేసుకోలేక, అందువల్ల ప్రతిపక్ష భావాలను కలిగివున్న నేరాన్ని అంగీకరిస్తున్నాను. కొన్ని భావోద్రేకాలను లోనై, చారిత్రకావసరాలను వ్యతిరేకంగా యీడ్వబడిన నేరాన్నంగీకరిస్తున్నాను. బలిచేయబడినవారి ఆక్రందనాలను చెవి యొగ్గి, వాళ్ళను బలిచేయవలసిన అవసరాన్ని ఋజువుచేసేవాదాన్ని వినిపించుకోలేదు. దోష, అమాయకత్వాలకు, ప్రయోజన, ప్రమాదాలకంటే యెక్కువ విలువనిచ్చిన నేరాన్నంగీకరిస్తున్నాను. చివరికి మానవుడు అనే భావాన్ని మానవజాతి అనే భావంకంటే అధికంగా పరిగణించిన నేరాన్ని అంగీకరిస్తున్నాను....'

రుబషోవ్ కొంచెం ఆగి మళ్లీ కళ్లు తెరవ ప్రయత్నించాడు. వెలుగునుంచి తల త్రిప్పి కార్యదర్శివున్న వైపు మిట కరించి చూచాడు. తాను చెప్పింది వ్రాయటం ఆమె అప్పుడే పూర్తిచేసింది. ఆమె అర్థ ముఖాకృతి శ్లేష మందహాసంచేసి నట్లనిపించింది.

'నాకు తెలుసు' రుబషోవ్ చెప్పుకుపోతున్నాడు. 'నా యీ వెర్రిభ్రమను ఆచరణలో పెట్టటయితే విప్లవానికి ప్రాణాంతక ప్రమాదం యేర్పడివుండేది. చరిత్ర గమనంలో కల్లోలిత పరివర్తకాంశాలవద్ద ప్రతిపక్షంలోనూ విచ్ఛేదక క్రిములు ప్రవేశిస్తాయ్. అవే పార్టీని విచ్ఛేదంచేసి అంతర్యుద్ధానికి దారి తీస్తాయ్. ప్రజలు పరిణతిచెందని దశలో లోక హిత తత్వం, ఉదార ప్రజాస్వామ్యం విప్లవహత్య కుపయోగిస్తాయ్. అయినప్పటికీ నా ప్రతిపక్ష దృక్పధం యీ విధానాలకొరకు ఆశించటంమీద ఆధారపడి వుంది. బాహ్యంగా యెంతో వాంఛనీయంగానూ,యదార్థానికి ప్రాణాంతకంగానూ వుంటుంది. నియంతృత్వాన్ని వుదారంగా సంస్కరించటం కోసం, విశాలమైన ప్రజా స్వామ్యంకోసం, దౌర్జన్య హింసాకాండ నిర్మూలనకు, పార్టీలోని కఠిన నిర్మాణాన్ని సడలింపు చేయటానికి కోరటం ప్రస్తుత పరిస్థితుల్లో యదార్థంగా ప్రమాదమే. అందువల్ల ప్రతివిప్లవ స్వభావాన్నే సూచుస్తుంది....'

గొంతు బొంగురుపోయి, యెండిపోవటంవల్ల కొంచెం సేదతీర్చుకున్నాడు. కార్యదర్శి పెన్సిలు చెక్కుడు గరగరవినిపించింది: కళ్ళు తెరవకుండానే తల కొంచెం పైకెత్తి చెప్పుతున్నాడు ;

'ఈ వుద్దేశంతోనే, యీఒక్క వుద్దేశంతోనే నేను ప్రతివిప్లవకారుణ్ణి అనొచ్చు ఆ నేరారోపణల్లో వుదహరించిన అసంబద్ధపు నేరాంశాలకు, నాకు యేమీ సంబంధం లేదు.'

'పూర్తయిందా?' అడిగాడు గ్లెట్కిన్.

గ్లెట్కిన్ స్వరం చాల అమానుషంగా వుంది. రుబషోవ్ ఆశ్చర్యచకితుడై చూచాడు. బల్ల వెనుక నిటారుగా కూర్చున్న గ్లెట్కిన్ విగ్రహాపు నీడ దీపకాంతిలో ప్రకాశవంతంగా కనిపించింది గ్లెట్కిన్ వ్యక్తిత్వాన్ని ఒక్కమాటలో వర్ణించాలని చాల సేపటినుంచి ఆలోచిస్తున్నాడు: 'ఖచ్చితమైన పశుత్వం' అదే.

'నీ వాఙ్మూలం క్రొత్తదేమీకాదు. గ్లెట్కిన్ తన మామూలు యెండు, రాపిడి గొంతుతో అన్నాడు. 'ఇంతకు ముందు రెండుసార్లూ, ఒకటి రెండు సంవత్సరాల క్రితం, రెండోది సంవత్సరం క్రితం బహిరంగంగానే నీ దృక్పథం 'తప్పకుండా విప్లవ ప్రతీఘాతకమనీ, ప్రజాశ్రేయస్సుకు విరుద్ధమనీ' వొప్పుకున్నావు. రెండుసార్లూ పార్టీ క్షమాభిక్షను వేడి, నాయకత్వ విధానం యెడ నీ విశ్వాసాన్ని ప్రకటించావు. మళ్ళీ మూడోసారి అదే నాటకమాడాలనుకుంటున్నావు. ఇప్పుడు 'నీవాఙ్మూలం కేవలం కన్నీటితుడుపు. ప్రతిపక్ష దృక్పథాన్ని కలిగివున్నట్లు అంగీకరించావు, కాని దాని తార్కిక ఫలితాంశాలైన చర్యల్ని మాత్రం ఒప్పుకోవు. ఈసారి అంత తేలిగ్గా తప్పించుకు పోలేవని యిదివరకే చెప్పాను.'

గ్లెట్కిన్ యెంత త్వరితంగా ప్రారంభించాడో అంత త్వరితంగానూ ముగించాడు. ఇప్పుడేర్పడిన నిశ్శబ్దతలో దీపపు విద్యుత్ ప్రవాహ వేగ ఫలితంగా కలిగే ఝుంకారధ్వని విని

పిస్తోంది. అప్పుడే కాంతి యింకో స్థాయి హెచ్చింది.

'వెనక నేను చేసిన ప్రకటనలు కార్యసాధనకు యెత్తగడలు. పార్టీలో వుండటంకోసం ప్రతిపక్ష వర్గమంతా అట వంటి ప్రకటనలు చేయవలసొచ్చిన సంగతి నీకూ తెలుసు కాని యీ సారి నా వుద్దేశం వేరు.'

'అంటే యీసారి విశ్వాసంగా వున్నానంటావ్' గ్లెట్కిన్ అతిత్వరితంగా అడిగాడు. ఆ ఖచ్చిత స్వరంలో శ్లేష యేమీ లేదు.

'అవును' రుబషోవ్ ప్రశాంతంగా జవాబిచ్చాడు.

'మరి, వెనక అబద్ధాలాడావ్?'

'అలాగే అను.'

'ప్రాణం దక్కించుకోవటానికి?'

'పని చేసుకుపోవటానికి.'

'ప్రాణం లేకుండా యెవడూ పని చేయలేడు. అందువల్ల ప్రాణం దక్కించుకోవటానికి?'

'అలాగే అను.'

ఈ ప్రశ్నోత్తరాల మధ్య స్వల్ప విరామ కాలాల్లో కార్యదర్శి పెన్సిల్ గరగర, దీపపు ఝుంకార ధ్వని తప్ప యింకేమీ వినిపించటంలేదు. దీపం ప్రసరిస్తున్న కాంతి కెర టాలు నిలకడగా వేడిని ప్రసరిస్తూ రుబషోవ్ నుదురు మీద చెమటను సృష్టిస్తున్నయ్. ఎక్కువసేపు తన సజల నేత్రాలను తెరచి వుంచటం యెక్కువ బాధగావుంది. కాని అలా తెరచి వుంచే కాలం కొంచెం పెరుగుతోంది. నిద్రపడుతోనేసుకొస్తు న్నట్లు గుర్తించాడు. గ్లెట్కిన్ తన త్వరిత ప్రశ్నా పరంపరలనం

తరం విరామాన్ని పెంచుతున్నాడు, రుబషోవ్ తల ఒక విధమైన అశ్రద్ధవల్ల నిద్రతో వంగి, గడ్డం రొమ్ము కానుకుంటోంది. గ్లెట్కిన్ ప్రశ్న అతన్ని కుదిపినప్పుడు లేచి తానెంతసేపు నిద్రించిందీ నిశ్చయించలేని భావం కలిగింది.

'మళ్ళీ చెపుతున్నాను, నీ పూర్వ పశ్చాత్తాప ప్రకటనలు నీ నిజోద్దేశాలను కప్పిపుచ్చి పార్టీని మోసగించటానికి, నీ ప్రాణాలు దక్కించుకోవటానికి వుద్దేశించిన వన్నమాట.'

'అని యిదివరకే వొప్పుకున్నాను.'

'నీ కార్యదర్శి ఆర్లోవాను బహిరంగంగా అధిక్షేపించటంలో కూడ అదే వుద్దేశమా?'

రుబషోవ్ మౌనంగా తలవూగించాడు. కనుగుంటల్లో బయలుదేరిన వ్యథ వొత్తిడి కుడివైపు ముఖమంతా వ్యాపించింది. పంటినొప్పి మళ్ళీ బ్రద్దలు కొట్టటం ప్రారంభించింది.

'ఆర్లోవా విచారణసమయంలో యెప్పుడూ ఆమెరక్షణ కోసం నీ పేరును ప్రథమ సాక్షిగా పేర్కొన్నది. తెలుసా?'

'అలా అని విన్నాను.' పంటినొప్పిపోటు విపరీతమైంది.

'అప్పుడు నీ వాఙ్మూలం, యింతకు ముందు అబద్ధమని చెప్పావే, ఆమె మరణశిక్షకు ఆధారమైందని కూడ నిస్సందేహంగా తెలిసే వుంటుంది?'

'అలా అని విన్నాను.'

ముఖం కుడిభాగమంతా వూడిపోతున్నట్లుగా వుంది. తలంతా బరువెక్కి దిమ్ముగా వుంది. అతి ప్రయాసతో తల వాలిపోకుండ ఆపగలిగాడు.

'అయితే ఆర్లోవా అమాయకురాలన్నమాట.'

గ్లెట్కిన్ స్వరం యితని చెవుల్లో దూసుకుపోయింది.

'అది సాధ్యమే' రుబషోవ్, నోట్లో రక్తమాంసాలరుచి లాగవున్న అవశేషిత శ్లేషతో అన్నాడు.

'...మరి నీ ప్రాణాలను రక్షించుకోవటానికి నీవాడిన అబద్ధం ఫలితంగా ఆమె హతమార్చబడింది ?'

'అంతే.' అన్నాడు రుబషోవ్. 'నీ వొక శుంఠవు' సడలిపోయిన నిస్సారపు కోపంతో అనుకున్నాడు. 'నిజానికి నీవు చెప్పిందే నగ్నసత్యం. మనలో యెవరు పెద్ద శుంఠో తెలుసుకోవాలనే కుతూహలంగా వుంది.' కాని నా పీక వీడి చేతుల్లో గట్టిగా బిగుసుకుని వుంది. నన్ను నేను రక్షించుకోలేను; యెందుకంటే యీ వూపులోనుంచి బయటపడటాని కవకాశం వుండదు, నన్ను నిద్రపోనిస్తే బాగుండును. నన్నింకా వీడు యిలాగే వేధిస్తే యేమీ మాట్లాడను – దాన్తో నాపని ఆఖరు, వాడు కూడ నాతో బాటే జతౌతాడు.

'...మరి యింత జరిగింతర్వాత కూడ నిన్ను ప్రత్యేకంగా చూడాలని కోరుతున్నావు ? ఇంకా నేర కృత్యాలు చేయలేదని చెప్పటానికి సాహసిస్తున్నావు ? ఇంత జరిగినా నీవు చెప్పిందంతా నమ్మాలి ?' అదే పశుస్వరం పలికింది.

రుబషోవ్ తలెత్తుకుకూర్చునే ప్రయత్నం విరమించాడు. నిజానికి తనను నమ్మక పోవటంలో గ్లెట్కిన్ తప్పేమీలేదు. సత్యం, భ్రమల మధ్య మసక వెలుగులో గణించిన అసత్యాల పద్మవ్యూహం; తార్కికపు టక్కు లలో తాను పడిపోనారంభించాడు. అంతిమ సత్యం ఒకడుగు వెనక్కు వేసింది, సేవింప

దగిన ఉపాంత్య అసత్యం ఒకటే గోచరమయ్యేది. మరియేమి విషాద, వికారాలను కల్గించి, యేమిఆట ఆడిస్తున్నదని! ఈసారి తాను యదార్థంగా విశ్వాసంతో వున్నాననీ, తన స్థితి అంతిమ స్థానంలో వుందనీ చెప్పి గ్లెట్కిన్‌ను నమ్మించటమెలా ? నిద్ర పోవాలని, అదృశ్యం కావాలని ప్రగాఢంగా వాంఛించే సమయంలోనే యితరులతో మాట్లాడి, వాదించి, వొప్పించాల్సిన దుర్గతి పడుతుందెప్పుడూ....

'పార్టీ యెడ నా భక్తివిశ్వాసాలను మరోసారి ఋజువు చేసుకోవటం కంటే నేనేమీ కోరటం లేదు.' గ్లెట్కిన్ స్వరం వినవచ్చిన వైపునుంచి వ్యథతో తలతిప్పి రుబషోవ్ చెప్పాడు.

'నీ విశ్వ గలిగిన ఋజువు వొక్కటేవుంది. పూర్తి ఒప్పుదల. నీ ప్రతిపక్షపు దృక్పథాన్ని గురించిన వున్నతోద్దేశాలన్నిటినీ పూర్తిగ, బహిరంగంగా అంగీకరించటం కంటే వేరు మాకేమీ అక్కరలేదు. పార్టీవిధానం యెడ ప్రతిపక్షపు దృక్పథం తప్పని సరిగా యెక్కడకు దారితీస్తుందో ప్రజలకు హెచ్చరికగా, నీవు వ్యక్తిగతంగా బహిరంగపర్చటం ద్వారానే యింకా పార్టీకి సేవచేసే అవకాశముంటుంది.'

రుబషోవ్ నెం. 1 చల్లనిభోజనంగురించి ఆలోచించాడు. ముఖం మీదవుబ్బిన నరాలుఅమితంగా పోటుపెడుతున్నాయ్. నెం. 1 చల్లని భోజనం గురించి ఆలోచిస్తున్నాడు. ముఖకండరాలు వికృతంగా ముడుచుకున్నయ్.

'నేను చెయ్యని నేరాలను వొప్పుకోను.'

'లేదు, లేదు, అది నీ వెప్పుడూ చెయ్యలేవు' పలికింది గ్లెట్కిన్ స్వరం — అందులో మొదటిసారిగా అవహేళన

వున్నట్లు భావించాడు రుబషోవ్.

ఆ నిమిషంనుంచి ఆ విచారణ స్మృతి అస్పష్టంగా వుంది. 'అది నీ వెప్పుడూ చేయలేవు' అన్న వాక్యం విచిత్రంగా పలకటంవల్ల అది కొంతసేపటివరకు చెవుల్లో గింగురమని మనస్సును శూన్యంగా వుంచింది. ఆ తర్వాత తాను నిద్రించినట్లు, ఒక చిత్రమైన మధురస్వప్నంకూడ వచ్చినట్లున్నది. బహుశా కొద్దిక్షణాలు మాత్రమే ఐ వుంటుంది. తన తండ్రి విహారవనంలో బారులుతీరిన సుపరిచితములైన బూరుగు చెట్లు, తన బాల్యంలో ఒకసారి చూచిన ప్రత్యేక ప్రకృతి దృశ్యాలు.

తనకు గుర్తున్న యింకో విషయం, ఆ గదిలో మూడో మనిషిఎవరో వున్నారు. గ్లెట్కిన్ పోలికేకలు పెడుతున్నాడు. బహుశా, లేచిబల్లమీదుగాతనమీదకువంగిఅరుస్తున్నాడేమో

'ఈ విచారణను శ్రద్ధగా వినమని విన్నవించుకొంటున్నాను, యీ మనిషిని గుర్తించావా?'

రుబషోవ్ తలవూగించాడు. తొర్రిపెదవివాణ్ణి,మామూలుగా ఆవరణలో వ్యాయామ సమయాల్లోవలె బిగదీసుకుపోయిన గూని భుజాలమీద వాటార్ ప్రూఫ్ గుడ్డ కప్పుకోక పోయినప్పటికీ, వెంటనే గుర్తించాడు. సుపరిచితమైన అంకెల వరుస రుబషోవ్ మనో వీధిలో మెరిసింది... 'తొర్రిపెదవివాడు నీకు అభివాదాలు పంపుతున్నాడు.' ఏ సందర్భంలో 402 నెంబరు యీవార్త చెప్పాడో?

'ఎప్పుడు, యెక్కడ యెరుగుదువు?'

మాట పెకిలిరావటానికి కొంతశ్రమ కావలిసొచ్చింది.

అతని నీటిలు వాడిన నాలుకమీద పుల్లటి రుచి కలిగింది.

'ఆవరణలో నడక వ్యాయామం చేస్తున్నప్పుడు, చాల సార్లు నా కిటికీగుండా చూచాను.'

'అంతకుముందు అతన్నెరగవా?'

తొర్రిపెదవివాడు రుబషోవ్ కుర్చీ వెనుక, కొన్ని అడుగుల దూరంలో, తలుపు దగ్గర నిలబడినాడు. దీపకాంతి పూర్తిగ అతనిమీద పడుతోంది. మామూలు పచ్చని ముఖం సున్నపు తెలుపుకు తిరిగింది, ముక్కుకొన తేలివుంది. చీలికైన పై పెదవి కండరం బయట పడిన చిగుళ్ళమీద వణుకుతోంది. అతనిచేతులు వదులుగా మోకాళ్ళవరకు వ్రేళ్ళాడుతున్నయ్. రుబషోవ్ వెనక్కు తిరిగిచూచి అతను రంగస్థలపు నేల దీపాల కాంతిలో నిలబడిన భూతంలా వున్నట్లు భావించాడు. ఒక కొత్త అంకెలవరస రుబషోవ్ మనస్సులో దూసుకుపోయింది: 'నిన్న హింసించారు.' దాదాపు అదే సమయంలో అందని స్మృతిఛాయ మనస్సులో మెరిసింది – 404 నెంబరు రాక ముందు, చాలాకాలం క్రిందట యెక్కడో, ఒకసారి యీ సజీవ మానవ కంకాళాన్ని చూచిన స్మృతి.

'సరిగా యెక్కడో తెలియదు,' గ్లెట్కిన్ ప్రశ్నకు తటపటాయిస్తూ జవాబిచ్చాడు. 'ఇప్పుడు బాగా గుర్తొస్తోంది. ఇంతకు ముందే యెక్కడో కలుసుకున్నట్లుంది.'

ఆ వాక్యం పూర్తి చెయ్యకముందే అలా చెప్పకుండా వుంటే బాగుండే దనుకున్నాడు. గ్లెట్కిన్ తనకు గుక్కతిప్పు కోవటానికి కొద్ది వ్యవధిస్తే బాగుండుననే తీవ్ర వాంఛ కలిగింది. గ్లెట్కిన్ ప్రశ్నపరంపరల్ని విశ్రామం లేకుండ త్వరి

తంగా కురిపించే పద్ధతిచూస్తే పక్షి తనకు దొరికిన జీవాన్ని ముక్కుతో పొడిచి తినేపద్ధతి గుర్తొచ్చింది.

'ఇతన్ని ఆఖరుసారి యెక్కడ కలుసుకున్నావ్? నీ జ్ఞాపకశక్తిని ఒకప్పుడు పార్టీలో సామెతగా చెప్పుకునేవారు.'

రుబషోవ్ మౌనం వహించాడు. ఎంత తన్నుకున్నా, ఆ మిరుమిట్ల కాంతిలో వణుకుతున్న పెదవులతో నిలబడ్డ భూతాన్ని యెక్కడ చూచిందీ గుర్తుకు రాలేదు. తొర్రిపెదవి వాడు కదల్లేదు. నాలుకతో పై పెదవి చీలికను తుడుచుకున్నాడు. రుబషోవ్, గ్లెట్కిన్‌ల వైపు చంచల దృష్టితో చూస్తున్నాడు.

కార్యదర్శి వ్రాయటం ఆపేసింది. గ్లెట్కిన్ కఫలకిర్రు, దీపపు ఝుంకారం తప్ప యింకేమీ వినిపించటంలేదు. కుర్చీ చేతుల మీద మోచేతులాన్చి ముందుకువంగి ప్రశ్నించాడు.

'అయితే సమాధానం చెప్పవన్నమాట.'

'నాకు గుర్తులేదు.'

'అయితే మంచిదే.' గ్లెట్కిన్ తన శరీరాన్ని పూర్తిగా తొర్రిపెదవి వాడివైపుత్రిప్పి, యింకా ముందుకువంగి అడిగాడు.

'రుబషోవ్‌కి జ్ఞాపకం చేయటానికి కొంచెం సాయపడతావ్? నీ వెప్పుడు ఆఖరుసారి అతన్ని కలుసుకున్నావ్?'

అతని ముఖం యింకా తెల్లబడింది. అప్పుడే కార్యదర్శి వున్నట్లు గుర్తించిన అతని కళ్ళు కొద్దిక్షణాలపాటు చంచలమైనయ్. కాని వెంటనే విశ్రాంతి స్థలశోధన కొరకన్నట్లుగా వెదకినయ్. మళ్ళీ పై పెదవి చీలికను నాలుకతో తడిమి, హడావిడిగా, ఒక్క గుక్కలో చెప్పాడు.

'పార్టీ నాయకుడికి విషం పెట్టమని రుబషోవ్ నన్ను ప్రేరేపించాడు.'

ప్రథమంగా యీ మానవ కంకాళం నుంచి తలవని తలంపుగా వెలువడ్డ సుస్పష్టశ్రావ్యస్వరానికి విస్మితుడయ్యాడు. ఆ స్వరం వొక్కటే అతనిలో మిగిలిన పూర్ణవస్తువు. విగ్రహానికీ, స్వరానికీ యేమీ సంబంధమున్నట్లులేదు. అతనుచెప్పిన దాన్ని రుబషోవ్ కొద్దిక్షణాల తర్వాతగాని పోల్చుకోలేక పోయాడు. తొర్రిపెదవివాడొచ్చినప్పటినుంచీ యిటువంటి సంఘటన వూహించి, ప్రమాదాన్ని శంకించాడు. కాని యిప్పుడు నేరాంశపు భయంకరాకృతికి అతీతంగా ఆలోచిస్తున్నాడు. ఒకక్షణం తర్వాత తన వెనుక గ్లెట్కిన్ స్వరం వినిపించింది. వ్యాకులంగా ధ్వనించిందా స్వరం,

'నిన్నప్పుడే ఆప్రశ్న అడగలేదు. ఆఖరుసారిగా రుబషోవ్ నెక్కడ కలుసుకున్నావని అడిగాను.'

తప్పు అనుకున్నాడు, రుబషోవ్. అతను తప్పు సమాధానమని నొక్కి చెప్పకూడదు. నేను గుర్తించి వుండకపోవచ్చును. ఇప్పుడు తన మనస్సు నిర్మలంగా ఒక విధమైన తీవ్ర జాగరితావస్థలో, పోలికకోసం వెదుకుతున్నాడు. ఈ సాక్షి దానంతట అదే వాగేవాద్యం అనుకున్నాడు. ఇప్పుడే తప్పుడు రాగం మ్రోగించింది. తొర్రిపెదవి వాడి మరోసమాధానం మరింత శ్రావ్యంగా వుంది;

''బి'లో వాణిజ్య ప్రతినిధివర్గానికి సన్మానం జరిగిన తర్వాత కలుసుకున్నాను. అక్కడ పార్టీనాయకుడి ప్రాణాల కోసం పన్నిన దౌర్జన్య కుట్రకు నన్ను ప్రేరేపించాడు.'

మాట్లాడేటప్పుడు వెనుకనున్న అతని దృష్టి రుబషోవ్ మీద నిలిచి అక్కడే వుండిపోయింది. రుబషోవ్ ముక్కద్దాలు తగిలించుకొని అతని చూపును నిశిత జిజ్ఞాసాపూరిత దృక్కులతో జవాబిచ్చాడు. కాని అతని కళ్ళల్లో క్షమ వేడికోలు లేదు. ఒక విధమైన సౌభ్రాతృత్వం, నిస్సహాయస్థితితో నిండివున్నయ్, ఆ యువకుని కళ్ళు. ముందుగా రుబషోవ్ తన దృష్టిని మరల్చాడు.

రుబషోవ్ వెనక గ్లెట్కిన్ ఆత్మవిశ్వాస పూరిత పశు గళం మళ్ళీ ధ్వనించింది.

'ఆ సమావేశపు తేదీ గుర్తుందా?'

'నాకు బాగా జ్ఞాపకం' అసహజ శ్రావ్య కంఠంతో చెప్పాడు తొర్రిపెదవివాడు. 'ఇరవయ్యో విప్లవ వార్షికోత్సవ సందర్భంలో చేయబడిన విందు తర్వాత.'

ఇంకా అతని దృష్టి రుబషోవ్ కళ్ళమీద నగ్నంగా లగ్నమైవుంది. అతని మనస్సులో మొదట మసకగా, తరువాత స్పష్టంగా ఒక స్మృతిభావన కలిగింది. చివరికి యిప్పుడు తొర్రిపెదవి వాడెవ్వరో స్ఫురణకొచ్చింది. ఈశోధన దాడాపు అతనికి వ్యధితాశ్చర్యాన్ని కలిగించింది. గ్లెట్కిన్ వైపు తిరిగి దీప కాంతిలో కళ్ళు మిటకరిస్తూ, ప్రశాంతంగా చెప్పాడు.

'ఆ తేదీ సరైనదే. నేను మొదట కీఫర్ పండితుని కొడుకుని గుర్తించలేక పోయాను; యింతకు ముందొక్కసారే చూడటంవల్ల – అదికూడ అతను మీచేతుల్లో పడక ముందు. మీ శ్రమ ఫలితానికి మిమ్మల్నభినందించాల్సిందే.'

'అయితే అతన్నెరుగుదువనీ, యింతకు ముందు చెప్పిన

సందర్భంలో కలుసుకున్నావనీ వొప్పుకుంటూ వన్న మాట ?'

'అదే యిప్పుడు చెప్పింది.' విసుగ్గా అన్నాడు రుబ షోవ్. తీవ్ర జాగ్రదవస్థ మాయమై తలలో మందపుపోటు మళ్ళీ ప్రారంభమైనయ్. 'నా అభాగ్యమిత్రుడు కీఫర్ కొడుకే యితడని నీవుముందే చెప్పివుంటే వెంటనే గుర్తించేవాణ్ణిగా?'

'నేరారోపణలో అతని పూర్తి పేరుంది.'

'ఇతరులందరిలాగే కీఫర్ పండితుని మారుపేరు మాత్రమే తెలుసునాకు.'

'అది అనవసరపు వివరణ,' అన్నాడు గ్లెట్కిన్. మళ్ళీ తొర్రిపెదవివాడివైపుకు తిరిగి, ఆ యిద్దరిమధ్య నున్న స్థలాన్ని ఆక్రమించి అతన్నినిలిపేస్తాడా అన్నట్లుగా ముందరకువంగాడు. 'నీ రిపోర్టు కానీ, ఆ సమావేశం యెలా జరిగిందో చెప్పు.'

నిద్ర మత్తుగావున్నప్పటికీ, మళ్ళీ తప్పు అనుకున్నాడు, రుబషోవ్. 'అది అనవసర వివరణేమీ కాదు. అతనితో కలిసి కుట్ర పన్నివుంటే పేరు తెలిసినా తెలియక పోయినా మని షిని చూచిన తక్షణం గుర్తుకొచ్చివుండేది.' అంత వివరంగా జవాబివ్వటానికి వోపిక లేదతనికి, పైగా మళ్ళీ దీపం వైపు తిరగవలసి వస్తుంది. ఉన్నస్థితిలోనే, గ్లెట్కిన్ వైపు వీపుత్రిప్పి కూర్చోగలడు.

అతని పోలికను గూర్చి వీళ్లు వాదించుకొంటున్న విరా మంలో చీలికపెదవి వ్రేలాడవేసుకుని, తలవ్రుంగిపోయి తొర్రిపెదవివాడు నిలబడ్డాడు, మిరుమిట్లుకొల్పుతున్న దీపపు కాంతిలో. రుబషోవ్ ప్రఖ్యాత విప్లవ చరిత్రకారుడు, తన పూర్వ మిత్రుడు కామ్రేడ్ కీఫర్‌ను గురించి ఆలోచిస్తున్నాడు

అతడు గడ్డాలవాళ్లతో, కాంగ్రెస్ ప్రతినిధులున్న ప్రసిద్ధ చిత్రంలో ముసలి రక్షకునికి యెడమ వైపున కూర్చున్నాడు. చరిత్ర విషయాల్లో ఆయనకు సహకారి, చదరంగపు టాటలో ప్రత్యర్థి, బహుశా యేకైక ప్రాణమిత్రుడేమో. 'ముసలివాడు' చనిపోయిన తర్వాత కీఫర్ కంటె ఆయన వ్యక్తిగత జీవిత విశేషాలెక్కువ తెలిసినవాడు లేడు; గనక యితన్నే ఆయన జీవిత చరిత్ర వ్రాయమని ఆదేశించారు. దానికోసం పది సంవత్సరాలు కృషిచేశాడు. కాని దానికి బయటపడే యోగం లేకపోయింది. ఈ పది సంవత్సరాల్లోనూ విప్లవ ఘటనలలో చిత్రమైన మార్పు వచ్చింది. అధికార ప్రతిలో ఆ విప్లవంలోని ప్రముఖ పాత్రధారుల పాత్రల విషయమై తిరగవ్రాయవలసి వచ్చింది. విలువలు మారినయ్ కాని ముసలి కీఫర్ పెంకెగా వున్నాడు, నెం. 1 అధీనంలోని నూతన తరపు అంత ర్తర్కాలు అతని కేమీ అర్థం కాలేదు...

'మానాన్న, నేనూ' తొ్రిపెదవివాడు తనమామూలు అసహజ శ్రావ్యస్వరంతో అన్నాడు, 'అంతర్జాతీయ నరజాతి శాస్త్ర మహాసభకు – నేనుకూడ ఆయనతో వెళ్ళాను– హాజరై తిరిగి వచ్చేటప్పుడు మా నాన్న తన మిత్రుడు రుబషోవ్‌ను చూడాలని 'బి'లో దిగాం....'

రుబషోవ్ జిజ్ఞాస,విచార విచిత్ర సమ్మిశ్రభావంతో వింటున్నాడు. ఇప్పటివరకు సరిగ్గానే నడిచింది కథ; తన హృదయం విప్పి చెప్పుకోవటానికీ, సలహా అడగటానికీ ముసలి కీఫర్ తనను చూడవచ్చాడు. బహుశా వాళ్ళిద్దరు కలిసి హాయిగా

గడిపిన ఆ సాయంకాలమే ముసలి కీఫర్ జీవితంలో ఆఖరు మధుర క్షణాలేమో.

'ఒక రోజు మాత్రమే అక్కడ వుండగలం' రుబషోవ్ ముఖం వైపు – ఆ ముఖంలోనే తనకు కావలసిన ప్రోత్సాహోద్రేకాలు పొందగలిగేటట్లు– తదేకంగా చూస్తూ చెప్తున్నాడు. 'ఆ నాడే విప్లవవార్షికోత్సవం, అందుకే నాకంత బాగా గుర్తున్నదా తేదీ. ఆ వేళంతా రుబషోవ్ విందు కలాపాలతో తీరిక లేక తిరిగాడు, మా నాన్నతో కొన్ని క్షణాలు మాత్రమే మాట్లాడ గలిగాడు. ఆ సాయంకాలం రాయబార కార్యాలయంలో విందు అనంతరం మా నాన్నను తన నివాసానికి పిలిపించాడు. నేనుకూడ మా నాన్నతో వెళ్ళాను. రుబషోవ్ అలిసిపోయి డ్రెస్సింగ్ గౌను వేసుకొని వున్నాడు. కాని మమ్మల్ని యెంతో ఆదరంతో ఆహ్వానించాడు. మా నాన్నను కౌగలించుకుని 'అంతిమ వీడ్కోలువిందు' అంటూ ఆహ్వానించి, బిస్కత్తులు, సారావగైరాలతో ఆతిథ్యమిచ్చాడు.

రుబషోవ్ వీపు వెనుక వున్న గ్లెట్కిన్ అడ్డొచ్చియిలా అన్నాడు :

'అప్పుడు వెంటనే తన కార్యసాధనకు నిన్ను పయోగించుకొనే యత్నంలో మీకు మత్తెక్కించ ప్రయత్నిస్తున్నట్లు నీవు గుర్తించలేదా ?'

తొర్రిపెదవివాడి ముఖంలో చిరుమందహాసం మెరిసినట్లుగావుంది. రుబషోవ్‌కి మొదటిసారి ఆ నాటి సాయంకాలం చూచిన యువకుని పోలికలు కొన్ని కనిపించినా యితనిలో. కాని, ఆ భావం వెంటనే అదృశ్యమైంది. తొర్రిపెదవివాడు

కళ్లు మిటకరించి, పెదవి చీలికను నాకాడు.

'కొంచెం అనుమానాస్పదంగానే కనిపించాడు. కాని అతని పన్నాగం లోతుపాతులింకా తెలియలేదు.'

పిచ్చిపంది, నిన్నెంత దూరం తెచ్చారు, అనుకున్నాడు, రుబషోవ్....

'ఊఁ, కాసీ' మొరిగింది గ్లెట్కిన్ గొంతు.

ఆ అడ్డంకు తర్వాత తొర్రిపెదవివాడు మళ్ళీ కుదటబడటానికి కొంత వ్యవధి పట్టింది. ఆ విరామ కాలంలో సన్నపాటి కార్యదర్శి పెన్సిల్ చెక్కే గరగరమాత్రమే వినిపించింది.

'రుబషోవ్, మానాన్న చాలసేపు తమ బాల్యస్మృతులను నెమరు వేసుకున్నారు. వాళ్లు చాలకాలంనుంచీ కలుసుకోలేదు. వాళ్లు విప్లవ పూర్వపు దినాలను గురించి నేను కర్ణాకర్ణిగా మాత్రమే విన్న పాతతరం వాళ్లనుగురించీ, అంతర్యుద్ధాన్ని గురించీ మాట్లాడుకున్నారు. వాళ్లు యెక్కువగా పూర్వగాథలుగా మాట్లాడుకున్నారు. పూర్వ స్మృతులకు నవ్వుకున్నారు. నాకేమీ అర్థం కాలేదు.'

'బాగా తాగారా?' గ్లెట్కిన్ అడిగాడు.

తొర్రిపెదవివాడు వెలుగులో నిస్సహాయంగా కళ్లు మిటకరించాడు. మాట్లాడేటప్పుడిక యెంతోసేపు నిలబడలేడేమోనన్నట్లు గజగజవణికిపోవటం రుబషోవ్ గుర్తించాడు.

'చాల విషయాలు మాట్లాడుకున్నారు. గత కొన్ని సంవత్సరాలుగా మా నాన్న అంత హుషారుగా మాట్లాడటం నేను చూడలేదు.'

'అది మీ నాన్న ప్రతివిప్లవ చర్యలు బయటపడ్డ

మూడు మాసాలను ముందుకాదూ ? ఆతర్వాత మూడు నెల్లకు ఆయన్ని వురితీశాం,' గ్లెట్కిన్ గొంతు మ్రోగింది.

తొ్రిపెదవివాడు పెదవులు నాకి, దీపంవైపు నీరసంగా చూస్తూ మౌనంగా వుండిపోయాడు. రుబషోవ్ ఒక ఉద్రేక ప్రేరణలో గభాలున గ్లెట్కిన్ వైపు తిరిగి దీపకాంతిలో కళ్లు జిగేలు మనటంవల్ల మూసుకుని, మళ్ళీ నెమ్మదిగా వెనక్కి తిరిగి, చొక్కా చేతిమీద ముక్కద్దాలు తుడుచుకున్నాడు. కార్యదర్శి పెన్సిల్ కాగితంమీద బరబరమనటం ఆగిపోయింది. అప్పుడు మళ్ళీ గ్లెట్కిన్ గొంతు వినిపించింది.

'ఆ సమయానికే నీవు మీనాన్న ప్రతివిప్లవ చర్యల్లో పాల్గొంటున్నావా ?'

తొ్రిపెదవివాడు పెదవులునాకి, 'అవును' అన్నాడు.

'రుబషోవ్ కూడ మీనాన్న అభిప్రాయాలతో యేకీభవించినట్లు నీకు తెలుసుగా ?'

'అవును.'

'వాళ్ళ సంభాషణలో ముఖ్యాంశాలు మాత్రం చెప్పి అనవసర వివరణలన్నీ వదిలెయ్.'

తొ్రిపెదవివాడు చేతులు కలిపి మెడవెనక పెట్టుకొని, భుజాలు గోడకు ఆనించి నిలబడ్డాడు.

'కాసేపటికి మానాన్న రుబషోవ్ వర్తమాన విషయాల్లోకి దిగారు. పార్టీ నాయకత్వ విధానాలు, పార్టీలో ప్రస్తుతం జరుగుతున్న వ్యవహారాలను గురించే చాలహీనంగా మాట్లాడారు. మానాన్న, రుబషోవ్ పార్టీనాయకుణ్ణి నెం. 1 అనే వుదహరించారు, నెం. 1 పార్టీపైన కూర్చుండటం వల్ల క్రింద

వాళ్ళకు ఊపిరి పీల్చటానికి కూడ వీలులేకుండ పోయిందనీ, అందువల్లనే తాను విదేశరాయబారాలకు వెళ్ళటానికే యెక్కువ సిద్ధపడతాననీ రుబషోవ్ చెప్పాడు.'

గ్లెట్కిన్ రుబషోవ్ వైపు తిరిగాడు.

'అది నీవు పార్టీనాయకుని యెడ నీ భక్తి ప్రపత్తుల్ని మొదటిసారి ప్రకటించటానికి కొంచెంముందు కాదూ?'

రుబషోవ్ దీపంవైపు సగంతిరిగి, 'అదినిజమే'నన్నాడు.

'ఆ సాయంకాలం అటువంటి ప్రకటన చేయాలనే వుద్దేశాన్ని వెలిబుచ్చాడా?' గ్లెట్కిన్ తొర్రిపెదవివాణ్ణి అడిగాడు.

'అవును. మానాన్న రుబషోవ్‌ని అదేకారణాన నిందించాడు. రుబషోవ్ విషయంలో నిరాశచెందానని చెప్పాడు. రుబషోవ్ నవ్వి మానాన్నను వెర్రి ముసలాడా, డాన్‌క్విక్సోట్ అని తిట్టాడు. పీకలైనంత వ్యవధి సంపాదించడం, దెబ్బతీయటానికి సమయం కోసం వేచివుండటం ముఖ్యమన్నాడు.'

''సమయంకోసం వేచివుండటం' అనటంలో అతని వుద్దేశమేమిటి?'

మళ్ళీ ఆయువకుడు నిస్పృహతో, దీన దృష్టితో రుబషోవ్ ముఖంవైపు చూచాడు. అతడు గోడవద్దనుంచి వచ్చి తన నుదురుమీద ముద్దు పెట్టుకొంటాడేమోనన్న అసంబద్ధ భావం కలిగింది, రుబషోవ్‌కి. శ్రావ్య కంఠం జవాబివ్వటం వింటూ యీ భావానికి మందహాసం చేశాడు.

'పార్టీ నాయకుణ్ణిఅతనిస్థానంనుంచి తొలగించే ఘడియ'

రుబషోవ్ మందహాసం చూచిన గ్లెట్కిన్ నిస్సారంగా అడిగాడు,

'ఈ స్మృతులు నిన్ను సంతోష పెడుతున్నయ్యా?'

'బహుశా,' అని రుబషోవ్ మళ్ళీ కళ్ళు మూశాడు.

గ్లెట్కిన్ చేతి కఫ్‌ను సరిచేసుకుని తిరిగి పెదవి వాణ్ణి ప్రశ్నించసాగాడు.

'అయితే రుబషోవ్ పార్టీ నాయకుణ్ణి అతని స్థానం నుంచి తప్పించే ఘడియను గురించి మాట్లాడాడన్న మాట. అదెలా చెయ్యాలనుకున్నారు?'

'ఏదో ఒకరోజున అతని పాత్ర దార్లి పోతుంది. అప్పుడు పార్టీయే అతన్ని దింపుతుంది; లేక రాజీనామా పెట్టమని వొత్తిడి చేస్తుంది. ఈ అభిప్రాయాన్నే ప్రతిపక్షం ప్రచారం చెయ్యాలని మానాన్న ఉద్దేశం.'

'మరి రుబషోవ్?'

'రుబషోవ్ నవ్వి, మళ్ళీ వెర్రిముసలాడా, డాన్ క్విక్సోట్ అన్నాడు, మానాన్నని. నెం. 1 స్వభావం అకస్మాత్తుగా కలిగిన పరిస్థితులవల్ల ఏర్పడ్డది కాదనీ, అతడు ఒకానొక మానవ స్వభావానికి ప్రతిరూపమనీ, స్వీయవిశ్వాసం దోషరహితమైనదని సంపూర్ణంగా నమ్మడమే ఆస్వభావమనీ అన్నాడు. అందువల్ల బుద్ధి పూర్వకంగా రాజీనామా పెట్టడనీ, దౌర్జన్యంగానే దింపి వేయాలనీ అన్నాడు. నెం. 1 పార్టీ ముక్కుత్రాళ్ళన్నిటనీ తన చేతులో పెట్టుకోవటం వల్ల గాని, పార్టీ అధిష్ఠాన వర్గాన్ని తనతోబాటు నిలబడి, పడిపోయే — ఆ సంగతి వాళ్ళకు తెలిసికూట — కీలుబొమ్మలుగా చేయటం వల్లగాని పార్టీలో యెవ్వరూ యేమీ ఆశించటానికి వీల్లేదు అన్నాడు.'

రుబషోవ్ నిద్రమత్తుగావున్నప్పటికీ యీ యువకుడు తన మాటల్ని అతిభద్రంగా, ఖచ్చితంగా జ్ఞాపకముంచుకున్నాడే, అనుకున్నాడు. తనకా సంభాషణ వివరాలు గుర్తులేవు, కాని తొర్రిపెదవివాడు విశ్వాసంతో వల్లిస్తున్నదాన్ని శంకించ లేదు. ఒకనూతన ప్రజ్వలితాసక్తితో యువకకీఫర్‌ను ముక్క ద్దాల్లోనుంచి పరిశీలిస్తున్నాడు.

'అయితే రుబషోవ్ నెం. 1 మీద దౌర్జన్య ప్రయో గావసరాన్ని నొక్కించాడు - అంటే పార్టీ నాయకునికి భిన్నంగా ?' గ్లెట్కిన్ గొంతు మొరిగింది. తొర్రిపెదవివాడు తలూపాడు.

'మరి అతని వాదనలు, అతిగా త్రాగటంవల్ల, నీమీద బాగా పనిచేశాయన్నమాట.'

యువక కీఫర్ వెంటనే జవాబివ్వలేదు. పూర్వంకంటె కొంచెం లోస్వరంతో చెప్పాడు, తర్వాత.

'యదార్థంగా యేమీ త్రాగలేదు. కాని, అతను చెప్పిన దంతా నాలో ముద్రితమై పోయింది.'

రుబషోవ్ తలవంచుకున్నాడు. ఒక సందేహం బయలు దేరింది, అది దాదాపు శారీరక బాధగా మారి తదితరమంతా మరపింపజేసింది. ఈ అభాగ్య యువకుడు తన ఆలోచనా క్రమాన్ని యీవిధంగా అర్థం చేసుకుని, అతని తార్కిక ఫలి తాంశాలకు ప్రతిరూపంగా యీ దీపకాంతిలో తనముందు నిలబడివుండటం సంభవమేనా ?

గ్లెట్కిన్ యీ ఆలోచనను పూర్తికానివ్వలేదు. అతని గొంతు గరగర మంది.

'...సిద్ధాంత రీత్యా నిన్నుతయారుచేసి, ప్రత్యక్షంగా కార్యాచరణకు పురికొల్పాడన్నమాట ?'

తోగ్రిపెదవివాడు మౌనం వహించి, వెలుగులో కళ్ళు మిటకరించాడు.

గ్లెట్కిన్ జవాబుకోసం కొన్ని నిమిషాలు ఆగాడు. రుబషోవ్ కూడ నిరుద్దేశంగా తల పైకెత్తాడు. కొన్నిక్షణాలు గడిచాయ్. ఆ విరామంలో దీప ఝంకారం మాత్రం వినిపించింది. అప్పుడు గ్లెట్కిన్ గొంతు మరింత ఖచ్చితంగా, నిస్సారంగా పలికింది.

'జ్ఞాపకం చేయటానికి సాయపడాలా?'

గ్లెట్కిన్ యీ వాక్యాన్ని కేవలం యథాలాపంగా అడిగాడు. కాని తోగ్రిపెదవివాడు కొరడా దెబ్బతిన్నట్టుగా వణికిపోయాడు. పెదవులు నాకాడు, అతని కళ్ళల్లో జంతు భీతి ప్రజ్వలించింది. అప్పుడుమళ్ళీ అతనిశ్రావ్య కంఠం వినిపించింది.

'నన్ను ఆ సాయంత్రమే ప్రోత్సహించలేదు. ఆ మరునాడుదయం మా యిద్దరి మధ్యా యిష్టాగోష్ఠిలో జరిగింది.'

రుబషోవ్ మందహాసంచేశాడు. మరునాటికి వాయిదా వేయబడ్డ ఊహాకల్పిత సంభాషణ తప్పకుండ గ్లెట్కిన్ కల్పిత సృష్టే. విషంబెట్టి హత్యచేయమని తనకొడుక్కి బోధచేస్తుంటే ముసలి కీఫర్ ఆనందంతో వింటూ కూర్చున్నాడంటే యెంతైనా అసంబద్ధమైన విషయం.... తనకు ఈ క్షణంలో కలిగిన గగుర్పాటును మర్చిపోయాడు; గ్లెట్కిన్ వైపు తిరిగి దీపం వైపు మిటకరిస్తూ అడిగాడు: 'ప్రత్యక్ష విచారణలో ప్రతివాదికి ప్రశ్నలడిగే హక్కున్నదనుకుంటాను ?'

'అవును. నీకు పాతికన్నది'

రుబషోవ్ యువకుడి వైపు తిరిగాడు. తన ముక్కద్దాల్లోనుంచి చూస్తూ, 'నాకు జ్ఞాపకమున్నంత వరకు, నీవు, మీ నాన్న నన్ను చూడవచ్చిన సమయానికి, అప్పుడే విశ్వవిద్యాలయంలో నీ చదువు ముగించి వచ్చావనుకుంటాను?' అని అడిగాడు.

తొ్రిపెదవివాడితో ప్రత్యక్షంగా మాట్లాడం అదే మొదటిసారి. ఆశాపూరిత, విశ్వాసదృష్టి మళ్ళీ తిరిగివచ్చిందతని ముఖానికి. తలవూపాడు.

'అయితే అది నిజమే. నాకు సరిగా జ్ఞాపకంవుంటే, ఆసమయంలో మీనాన్న చేతిక్రింద చరిత్రపరిశోధక సంస్థలో పని ప్రారంభించాలనే వుద్దేశంవుంది, నీకు. ఆ పనిచేశావా?'

'అవును,' తొ్రిపెదవివాడు అని, కొంచెం తటపటాయించి మళ్ళీ చెప్పాడు. 'మా నాన్న అరెస్టయ్యే వరకు.'

'నా కర్థమైంది. ఈ సంఘటన నీవా సంస్థలో వుండటాని కంతరాయం కల్గించింది. అందువల్ల యేదో లోకజీవిత పోషణ మార్గాన్ని న్వేషించాలి సొచ్చింది....' కొంచెం ఆగి గ్లెట్కిన్ వైపు తిరిగి,

'...అంటే యీ యువకుడు నన్ను కలుసుకున్నప్పుడు అతనుగాని, నేనుగాని అతని భవిష్యత్ వుద్యోగాన్ని గురించి వూహించలేదని ఋజువౌతోంది. అందువల్ల విషంబెట్టి హత్య చేయమని ప్రోత్సహించటమనేది తార్కికంగా అసాధ్యం.'

కార్యదర్శి పెన్సిల్ హఠాత్తుగా నిలబడి పోయింది.

ఆవిడ వ్రాయటం ఆపేసిందని రుబషోవ్‌కు తెలుసు. కొనతేలిన చుంచు మొఖాన్ని గ్లెట్కిన్‌వైపు తిప్పింది. తొర్రిపెదవివాడు కూడ గ్లెట్కిన్‌వైపు తేరిపారజూచి, పైపెదవి నాకాడు. అతని కళ్లల్లో సంభ్రమాశ్చర్యాలు తప్ప ప్రశాంతతలేదు. రుబషోవ్ ఘన విజయపు క్షణిక భావం మాయమైంది. నిరాఘాటంగా జరుగుతున్న క్రతువుకు అంతరాయం కల్పించాననే విచిత్రభావం కలిగింది. గ్లెట్కిన్ గొంతు యదార్థానికి పూర్వం కంటే మరింత కఠినంగా, మరింత ఖచ్చితంగానూ పలికింది.

'ఇంకేమైనా ప్రశ్నలున్నయ్యా?'

'ప్రస్తుతానికంతే.'

'నీ సలహాలు కేవలం విషంపెట్టమని హంతకుణ్ణి ప్రోత్సహించాయని యెవరూ నిర్ధారించలేదే. మార్గనిర్ణయం నీచేతి యంత్రానికి వదిలేశావ్.' తొర్రిపెదవివాడివైపుతిరిగి, 'అంతేనా?' అనిఅడిగాడు.

'అవును,' అనిచెప్పాడు, తొర్రిపెదవివాడు. అతని కంఠంలో ఒక విధమైన ఉపశాంతి ధ్వనించింది.

రుబషోవ్‌కి నేరారోపణలో 'విషప్రయోగంతో హత్య చేయటం' అనే వాక్యంతో విస్పష్టంగా చెప్పబడినట్లు గుర్తు, కాని యిప్పుడదంతా హఠాత్తుగా తారు మారైనట్లు కనిపించింది. ఆ యువకుడు నిజంగా వెర్రి ఆవేశంతో ప్రయత్నం చేశాడోలేదో; లేక అటువంటి కుట్రకు పన్నాగం పన్నాడో; అతని ఒప్పుదలంతా కృత్రిమంగా అతనిలో యెక్కించారేమో; లేక అందులో కొన్ని భాగాలే యెక్కించారో అనే విషయాలు కేవలం చట్టసంబంధాంశాలు. ఇవి యేవిధంగానూ

అతని నేర స్వభావంలో మార్పు తేవు. ఇక్కడ గమనించా ల్సిన ముఖ్యాంశ మేమంటే యీ దౌర్భాగ్య వ్యక్తి తన తార్కిక ఫలితాంశాలకు రక్తమాంసాల ప్రతిరూపంలా వున్నాడు. పాత్రలు తారుమారైనయ్. అతి స్పష్టంగా వున్న నేరం, వెంట్రుకల్ని చీల్చటంవల్ల అతి కళ్ళంగా తయా రైంది; గ్లెట్కిన్‌వల్ల కాదు, కేవలం రుబషోవ్‌వల్లనే. ఇప్పటి వరకు అత్యంత అసంబద్ధంగా కనిపించిన నేరం యథార్థంగా—అస్తవ్యస్తంగానే ఐనా– అఖండమైన తార్కిక గొలుసు లోని ఖాళీలు భర్తీ చేయబడ్డాయ్.

అయినప్పటికీ ఒకమాటలో చెప్పాలంటే తనకు అన్యా యం జరుగుతున్నట్టు కనిపించింది, రుబషోవ్‌కి. ఆ భావానికి అక్షరరూపకల్పన చేయలేనంత అశక్తుడైనాడు.

'ఇంకేమైనా ప్రశ్నలున్నాయా?' గ్లెట్కిన్ అడిగాడు. రుబషోవ్ తలూపాడు.

'నీవు వెళ్ళొచ్చు.' తొర్రిపెదవివాడితో చెప్పాడు గ్లెట్కిన్. గంటమీట నొక్కాడు, ఒక యూనిఫారం వార్డరు వచ్చి యువక కీఫర్ చేతులకు కంకణాలు తగిలించాడు. బయ టికి వెళ్ళేముందు ఒకసారి, ఆవరణలో వ్యాయామానంత రం చూచినట్లుగా వెనుదిరిగి రుబషోవ్ వైపు చూచి వెళ్ళాడు. ఆ చూపు రుబషోవ్‌కి భారంగా తోచింది; ముక్కద్దాలు తీసి చొక్కా చేతిమీద తుడిచి, దృష్టి మరల్చాడు.

తొర్రిపెదవివాడు పోగానే అతనిమీద యీర్ష్య కలి గింది. గ్లెట్కిన్ గొంతు, రుబషోవ్ చెవుల్లో ఖచ్చితమైన పశు స్వరంతో మార్మ్రోగింది.

'ఇప్పుడైనా నా కేఫర్ ఒప్పుదల, ముఖ్యాంశాల్లోని యదార్థాని కనుగుణ్యాంగా వుందని వొప్పుకుంటావా ?'

రుబషోవ్ మళ్ళీ దీపంవైపు తిరగాల్సొచ్చింది. దీపపు ఝుంకారం చెవుల్లో గింగురుమంటోంది, కనురెప్పల్లోనుంచి దీపపు మెర్రటి, వేడికాంతి ప్రసరిస్తోంది. అయినా 'ముఖ్యాంశాల్లో' అనే పదం గుర్తుంది. ఈ పదంతో నేరారోపణలోని 'విషప్రయోగంతో హత్యకు ప్రేరణ' అనేదాన్ని కేవలం 'హత్యకు ప్రేరణగా' గ్లెట్కిన్ మార్చాడు.

'ముఖ్యాంశాల్లో - అవును,' రుబషోవ్ అన్నాడు.

గ్లెట్కిన్ కఫ్‌లు కిర్రుమన్నయ్. స్టెనోగ్రాఫర్ కూడ కుర్చీలోనుంచి కదిలింది. రుబషోవ్ తాను నిర్ణయం తేల్చే వాక్యాన్ని చెప్పితన నేరాంగీకారాన్ని కప్పివేశాననుకున్నాడు. ఈ బుర్రతక్కువ వెధవలకి తాను 'నేరం' అంటే యేమనుకుంటున్నాడో యెప్పటికైనా తెలుస్తుందా?- అతని ప్రమాణాల దృష్ట్యా 'సత్యం' అంటే యేమిటో అర్థమౌతుందా ?

'దీపం వల్ల నీకు బాధగావుందా ?' గ్లెట్కిన్ హఠాత్తుగా అడిగాడు.

రుబషోవ్ మందహాసం చేశాడు. గ్లెట్కిన్ దాని ప్రతిఫలం యిచ్చాడు. అదే యీ శుంఠల మనస్తత్వం. అయినప్పటికీ దీపకాంతి కొంచెం మందగించే టప్పటికి రుబషోవ్ కొంత వుపశాంతిపొంది ఒక విధమైన కృతజ్ఞతను భావించాడు.

మిటకరిస్తూ చూస్తున్నప్పటికీ గ్లెట్కిన్ ముఖంస్పష్టంగా చూడగలిగాడు. మళ్ళీ అతని నున్నగా గొరిగిన బుర్రమీద మెర్రటి దెబ్బమచ్చ కనిపించింది.

'... నేను చాల అవసరంగా భావించే ఒక విషయం తప్ప' రుబషోవ్ అన్నాడు.

'అంటే ?' గ్లెట్కిన్ అడిగాడు. మళ్ళీ కట్టెలా, ఖచ్చితంగా తయారయ్యాడు.

ఇప్పుడు, నిజానికి, ఆకుర్రాడు చెప్పిన యిష్టాగోష్టి అసలు జరగలేదని నాభావ మనుకుంటాడని అనుకున్నాడు రుబషోవ్. అదే అతనికి కావలసింది.

'నాకు కావలసిన అంశం యిది.' బిగ్గరగా అన్నాడు. 'ఆనాడు నా నిశ్చితాభిప్రాయాల ప్రకారం, దౌర్జన్యంగానే వర్తించాల్సిన అవసరం వుందనుకున్నమాట యదార్థం. అంటే నా వుద్దేశం రాజకీయంగాగాని, వ్యక్తిగత దౌర్జన్యం కాదు.'

'అలాఅయితే అంతర్యుద్ధం కోరావన్నమాట ?'

'కాదు, ప్రజావిప్లవం.'

'అది అంతర్యుద్ధానికి అనివార్యంగా దారి తీస్తుందని నీకూ తెలుసు. నీవు అధికంగా విలువనిచ్చే విభేదం అదేనా?'

రుబషోవ్ జవాబివ్వలేదు. ఒక నిమిషం క్రిందటివరకు అతి ముఖ్యంగా కనిపించిన ఆ అంశంకూడ యిప్పుడు విలువ లేకుండ పోయిందతనికి. యదార్థానికి, అంతర్యుద్ధంవల్ల ప్రస్తుత పార్టీ అధిష్టానవర్గాన్ని తొలగించి, ప్రతిపక్షానికి విజయంచేకూర్చగలిగితే – యెక్కువ రక్తపాతం లేకుండా, త్వరితంగా జరిగే పని, నెం. 1 భోజనంలో విషంబెట్టి అతన్ని అంతంచేయటం వల్ల యీ వర్గం కూలిపోతుంది – యెందుకు మంచిదికాదు ? ఏవిధంగా, రాజకీయంగా ప్రజానాశనం కంటే రాజకీయ హత్య గౌరవనహీనం ? ఆ దౌర్భాగ్య యువకుడు తన అభి

ప్రాయాన్ని అపార్థం చేసుకున్నట్లు స్పష్టమౌతోంది– కాని గత కొద్ది సంవత్సరాల తన ప్రవర్తనలో కంటే ఆకుఠ్రాడి అపార్థంలో యెక్కువ అనుగుణ్యత లేదూ ?

నియంతృత్వాన్ని వ్యతిరేకించేవాడు తప్పక అంతర్యుద్ధాన్ని సాధనగా అంగీకరించాలి. అంతర్యుద్ధంనుంచి వదలి పోయేవాడు ప్రతిపక్షాన్ని వదిలి నియంతృత్వాన్ని అంగీకరించాలి.

ఒకతరంక్రిందట 'మితవాదుల'ను వ్యతిరేకిస్తూ వ్రాసిన వాద గ్రంథంలో తాను వ్రాసిన యీ సామాన్య వాక్యాల్లో నేటి తన నింద యిమిడివుంది. గ్లెట్కిన్‌తో వాదన కొనసాగించటానికి వుత్సాహంలేదు. తను సంపూర్ణంగా ఓటమి చెందినట్లు తెలుసుకొని ఒక విధమైన వుపశాంతిని పొందాడు. పోరాటాన్ని కొనసాగించాల్సిన ధర్మం, బాధ్యతాభారం తన నుంచి తొలగించ బడ్డాయ్; పూర్వపుమైకం మళ్ళీ వచ్చింది. తలలోపోటు మందంగా ప్రారంభమైంది, తాను ఆఖరిసారి శెలవు తీసుకొనేటప్పుడు తనవైపు శ్లేషపూరిత దృష్టులతో చూచిన నెం. 1, గ్లెట్కిన్ స్థానంలో కూర్చున్నట్లు కొన్ని క్షణాలపాటు భావించాడు. ఎర్మాస్సిన్స్‌లో సెయింట్ - జెస్ట్, రాబెస్పెరీ, వాళ్ళ పదహారుగురు కామ్రేడ్స్‌ను సమాధిచేసిన గోరీలదొడ్డిపై చదివినశిలాక్షరాలుగుర్తొచ్చినయ్. ఒకే మాట:

నిద్రకు

ఆ క్షణంనుంచి రుబషోవ్ స్మృతి మళ్ళీమసకబారింది. బహుశా, మళ్ళీరెండోసారి కొద్దిక్షణాలపాటు మగతక్రమ్మింది. కలవచ్చినట్లు గుర్తు లేదు. వాజ్మూలంమీద సంతకం చేయ

టానికి బహుశా గ్లెట్కిన్ లేపివుంటాడు. గ్లెట్కిన్ పెన్ యిచ్చాడు, అది యింకా అతని జేబువేడితో వుండటం, స్వల్ప విరక్తితో, గమనించాడు. స్టెనోగ్రాఫర్ వ్రాయటం ఆపేసింది, సంపూర్ణ ప్రశాంతత ఆవరించింది. విద్యుద్దీప కాంతి కూడ తగ్గిపోయింది; మసకకాంతి, బయటి ఉషఃకాంతి కిటికీ నుంచి ప్రసరిస్తోంది.

రుబషోవ్ సంతకం చేశాడు.

బాధ్యతా రహితమైన వుపశాంతి భావం కలిగింది, దానికి కారణం మర్చిపోయాడు; నిద్రభారంతోనే, తాను పార్టీ నాయకునికి విషప్రయోగం చేయటానికి యువకకీఫరును ప్రోత్సహించినట్టుగా వ్రాసిన వాఙ్మూలం చదివాడు. కొన్ని క్షణాలపాటు యిదంతా ఘోరమైన అభిప్రాయభేదం అనిపించింది. తన సంతకం కొట్టేసి ఆ కాగితం చింపెయ్యాలనే ఆవేశం కలిగింది, మళ్లీ అంతాగుర్తొచ్చి చొక్కాచేతిమీద ముక్కద్దాలు తుడిచి వాఙ్మూలపు పత్రం గ్లెట్కిన్ కందించాడు.

ఎంతో సేపటిక్రితం తనను గ్లెట్కిన్ గదికి తోడ్కొని వచ్చిన యూనిఫారపు భూతం మళ్లీ తనను తన గదికి తీసుకు రావటంమాత్రమే గుర్తుంది. అర్ధ నిద్రతోనే మెట్లు, మంగలి గది దాటి వచ్చాడు. దారిలో పూర్వపు భయాలు పెనవేసినవి, తనకే ఆశ్చర్యం కలిగి, నిస్సారంగా శూన్యం వైపు మందహాసం చేశాడు. ఆ తర్వాత అతని వెనక తలుపు గభాలున మూసుకుంది. భౌతికానందంతో బల్లమీదవ్రాలాడు, బూడిద వర్ణపు ఉషఃకాంతి కిటికీ తలుపుమీద, పరిచితమైన వార్తా పత్రికమీద పడుతోండటం చూచి వెంటనే నిద్రపోయాడు.

మళ్ళీ గది తలుపు తెరుచుకొనేసరికి యింకా పూర్తిగ తెల్లవారలేదు. గట్టిగా గంటసేపైనా నిద్రపోలేదతను. ఉదయపు భోజనం తెచ్చారేమో ననుకొన్నాడు మొదట, కాని ముసలి వార్డరుకు బదులు యూనిఫారం భూతమే బయట ప్రత్యక్షమైంది. మళ్ళీ గ్లెట్కిన్ గదికెళ్ళాలనీ, అడ్డుపరీక్ష సాగుతుందనీ అర్థమైంది.

వాష్ బేసిన్‌లో ముఖం, మెడ చల్లటి నీళ్ళతో శుద్ధి కడుక్కొని, ముక్కద్దాలు పెట్టుకొని, తనకు తెలియకుండానే నడుస్తూ ఆ భూతాన్ననుసరించి వెళ్ళాడు.

# 4

అప్పటినుంచీ రుబషోవ్ మనస్సులో మంచుతెర మరింత దట్టమైంది. ఆ తర్వాత చాలరోజులపాటు రాత్రిందివాలు మధ్య మధ్య ఒకటిరెండుగంటల వ్యవధిలో సాగిన అడ్డుపరీక్షలో అక్కడక్కడ కొన్ని సంభాషణభాగాలు మాత్రమే గుర్తున్నయ్. ఎన్నాళ్ళుసాగిందో విచారణ తెలియదు. బహుశా ఒక వారంపైగా జరిగుండవచ్చు. ఇలాటి నిర్విరామ నేరవిచారణల్లో యిద్దరుముగ్గురు విచారణాధికారులు వరసనే ఒకరి తర్వాత ఒకరుగా విచారించటం రుబషోవ్‌కి తెలుసు. కాని యిక్కడగ్లెట్కిన్ విధానంలోని ప్రత్యేకత యేమిటంటే, తనకు విశ్రాంతి నిచ్చేవాళ్లు లేకుండానే రుబషోవ్‌నెంత బాధించాడో తాను అంత బాధపడుతూ విచారణ జరిపాడు. ఆవిధంగా రుబషోవ్‌కు అంతిమ మనస్తత్వాశ్రయం లేకుండచేశాడు: అవ

మానితుని విషాదం నేరస్థుని నైతికాధిక్యత.

అలా నలభైమెనిమిది గంటలు జరిగినతర్వాత రుబషోవ్‌కి రాత్రింబవళ్లు విచక్షణే నశించింది. ఒకగంట నిద్ర తర్వాత యూనిఫారం భూతం వూపిలేపినప్పుడు కిటికీ బయటివెలుతురు ఉషఃకాంతో, సంధ్యకాంతో తెలియటంలేదు. వరండాలో, మంగలిషాపులో, మెట్లమీద, తానునడిచేదారిలో మామూలు విద్యుద్దీప మసకకాంతి ప్రసరిస్తోందెప్పుడూ. విచారణసమయంలో కిటికీనుంచి క్రమంగా వెలుతురు కనిపిస్తే తెల్లవారిందనుకోవాలి. చీకటి పడుతుంటే, గ్లెట్కిన్ దీపం వెలిగిస్తే సాయంత్ర మైందనుకోవాలి.

విచారణసమయంలో రుబషోవ్‌కి ఆకలైతే, గ్లెట్కిన్ టీ, మాంసపు రొట్టెలు తెప్పించి యిచ్చేవాడు. కాని అతనికి అరుదుగా ఆకలయ్యేది. అంటే ఆకలి మందుపోయేది; కాని రొట్టె ముందు పెట్టినప్పుడు వికారం కలిగేది. అతని యెదుట గ్లెట్కిన్ యెప్పుడూతినలేదు. కాని రుబషోవ్ ఆహారం అడగటానికి, యేదో అనిర్వచనీయ కారణాలవల్ల, తలకొట్టేసినట్లుండేది. ఎన్నడూ యేవిధమైన అలసట లేకుండ, ఆవలించకుండా, సిగరెట్లు త్రాగకుండ, అన్నపానీయాలు కూడ లేనట్లే కనిపించేది. ఎప్పుడూ ఆ బల్ల వెనకాల అదే ఖచ్చితమైన భంగిమలో, ఆ బిగుతు యూనిఫారంలో, కఫ్‌లు కిర్రుమంటూ, కూర్చునివున్న గ్లెట్కిన్ ముందు యే శారీరకావసరాన్నికూడ కోరటం రుబషోవ్‌కి చిన్నతనంగావుంది. బయటి కళ్ళాలని అడిగినప్పుడు చచ్చేటంత ఆత్మావమానం పొందాడు.

మామూలు భూతాన్నిచ్చి వాసుగుదొడ్డికి పంపాడు, గ్లెట్కిన్.
ఒకసారి రుబషోవ్ ఆ లోపలే నిద్రపోయాడు. అప్పటినుంచీ తలుపు ఓరగా వేసి వుండేది.

అతని స్థితి, విచారణసమయంలో, వుదాసీనత, కునుకుపాటుల మధ్యలో తిరుగుతుండేది. ఒక్కసారి మాత్రమే నిస్పృహ వచ్చింది. తరుచు ఆ స్థితికి దరిదాపుల కెళ్ళేవాడు. కాని ఒక అహంకారభావం చివరిక్షణంలో కాపాడుతుండేది. సిగరెట్ వెలిగించి మిటకరిస్తుంటే, విచారణ సాగిపోయేది.

అప్పుడప్పుడు తాను తట్టుకో గలిగినందుకు, ఆశ్చర్యపోయేవాడు. మానవుడి శారీరక బాధాసహనానికి, సామాన్యుని దృష్టిలో, చాల సంకుచిత పరిధులేర్పడి వున్నయ్యని అతనికి తెలుసు, వాటికి అద్భుతమైన స్థితిస్థాపకత్వ శక్తి వున్నదని వాళ్ళకు తెలియదు. పదిహేను, యిరవైరోజులు నిద్రలేకుండా చేసినా తట్టుకోగలిగిన ఖైదీలవిషయం విని వున్నాడు.

గ్లెట్కిన్ వద్ద జరిగిన మొదటి విచారణానంతరం తన వాఙ్మూలం మీద సంతకం పెట్టటంతో యీ తతంగమంతా ముగిసిందనుకున్నాడు. రెండో విచారణ సమయంలో యిది ప్రస్తావనేనని స్పష్టమైంది. నేరారోపణలో యేడు అంశాలున్నయ్. మరి యిప్పటికి తాను ఒకదానికే ఒప్పుదలయ్యాడు. అతినీచంగా ఆత్మావమాన కషాయం త్రాగినట్లు భావించాడు. ఇప్పుడు తన నిర్వీర్యతకు శక్తికివున్నన్ని తరాలున్నయ్యనీ, పరాజయం విజయమంత ఘనమైనదని, దాని లోతులకు అవధులు లేవని కనుక్కోవాలి. మరి గ్లెట్కిన్ అతన్ని ఒక్కొక్క మెట్టే నిచ్చెన క్రిందికి నెట్టేశాడు.

నిజానికి, తను దాన్ని సులభం చేసుకోగలిగేవాడు, వాళ్లు అడిగిన ప్రతిదానిమీద సంతకం పెట్టేయటమో, లేక అన్నీ తిరస్కరించటమో చేస్తే శాంతికలిగివుండేది. ఈ విధంగా చేయటానికి ఒకవిధమైన సంకులవిధి భావం అడ్డు వుండేది. 'ప్రేరణ' అనే దృగ్విషయాన్ని గురించి సిద్ధాంతరీత్యా తనకు తెలుసుననే పరమోద్దేశంతోనే రుబషోవ్ జీవితం నిండి వుంది. ఇప్పుడు అభేద్యమైన రాత్రిం దివాలు ప్రేరణ తనను అనుసరిస్తోంది. వరండాల్లో నడుస్తున్నప్పుడూ, గ్లెట్కిన్ దీప కాంతి ముందు, పరాజితుల గోరీలదొడ్డిపైన వ్రాయబడిన శిలాక్షరాలలో నిబిడీకృతమైన ప్రేరణ: నిద్ర.

ఆ ప్రశాంత ప్రేరణను తప్పించుకోవటం చాలకష్టం. అది మూగది. దానికి వాదనలు లేవు. వాదనలన్నీ గ్లెట్కిన్ పక్షాన వున్నయ్; అది మంగలి యిచ్చిన కాగితంలో వ్రాసిన 'మౌనంగా మరణించు' సందేశాన్ని కేవలం వల్లిస్తుంది.

అప్పుడప్పుడు ఉదాసీనత, కునుకుపాటుల మధ్య అతని అవస్థ వూగులాడేటప్పుడు పెదవులు కదిలేవి. కాని గ్లెట్కిన్‌కి ఆ మాటలు వినిపించేవి కావు. అప్పుడు గ్లెట్కిన్ గొంతు సవరించుకొని, కఫ్‌లను యథాస్థానంలో సర్దుకొనేవాడు. రుబషోవ్ ముక్కద్దాలు చొక్కాచేతిమీద తుడుచుకొని సంభ్రమంతో, మందకొడిగా తల వూపేవాడు. ఇక్కడగాని మరెక్కడగాని అవసరంలేని ఆ మూగ ప్రత్యర్థికి, ప్రేరకునికిమధ్య వున్న తారతమ్యం పోల్చుకున్నాడు. వ్యాకరణ గల్పిక....

'అలాయితే విదేశీ ప్రభుత్వ ప్రతినిధుల సహాయంతో, ప్రస్తుత ప్రభుత్వాన్ని కూలద్రోయటానికి ప్రతిపక్షం తరఫున,

రాయబారాలు నడపలేదంటావు? ప్రత్యక్షంగా గాని, పరోక్షంగా గాని వచ్చే సహాయానికి ప్రతిఫలంగా కొంత భూభాగాన్నివ్వ సమ్మతించావనే - అంటే మన దేశంలో కొన్ని రాష్ట్రాలను త్యాగం చేయటానికి - నేరాన్ని వాదిస్తావన్న మాట?'

అవును, రుబషోవ్ వాదించాడు; ప్రస్తుతం పరిశీలనలో వున్న విదేశీ రాయబారితో సంభాషించిన తేదీ, సందర్భం మళ్లీ గ్లెట్కిన్ గుర్తుచేశాడు; గ్లెట్కిన్ నేరారోపణ చదువుతున్నప్పుడు, ఆ అప్రాముఖ్య దృశ్యం అతని స్మృతిపథంలో వూగులాడింది. నిద్రమత్తుతో కంగారుగా గ్లెట్కిన్ వైపు చూచాడు. ఆ దృశ్యాన్ని వివరించటంవల్ల ప్రయోజనమేమీ వుండబోదని తెలుసు. 'బి' లో రాయబారవర్గం కార్యాలయంలో రాయబారవర్గపు విందుభోజనం తర్వాత యీ సంఘటన జరిగింది. రుబషోవ్, స్థూలకాయుడైన హెర్ వాన్ జ. ప్రక్కనే కూర్చున్నాడు; కొద్దిమాసాలక్రితం తనపళ్ళు వూడబెరికిన దేశపు విదేశాంగ కార్యాలయంలో అతను రెండో కౌన్సిలర్; హెర్ వాన్ జ. విహారవనంలోను, రుబషోవ్ తండ్రి విహారవనంలోను పెంచిన ఒక అపురూపజాతికి చెందిన పంది రకాన్ని గురించి చాల సరదాగా మాట్లాడుకున్నారు; యీ యిద్దరి తండ్రులు వాళ్ళ కాలంలో యీ పందుల పిల్లల్ని మార్పిడి చేసుకున్నారు కూడ.

'మీనాన్న బరిణె పంది లిప్పుడేమైనయ్?' హెర్ వాన్ జ. అడిగాడు.

'విప్లవసమయంలో కోసుకు తినేశారు.'

'మా వాటిని యేర్పాట్ల కొవ్వుగా మార్చేశారు,' హెర్ వాన్ జ. దిగులుతో చెప్పాడు. తన దేశంలోని నూతన వ్యవస్థ యెడ తన క్రోధాన్ని దాచుకో ప్రయత్నించలేదు. ప్రస్తుతం తానున్న వుద్యోగంనుంచి ప్రభుత్వం అతణ్ణి అదృష్ట వశాత్తు నెట్టివేయ లేదులావుంది, బహుశా.

'నీవూ, నేనూ నిజంగా ఒకేస్థితిలో వున్నాం,' కులాసాగా అని సారా గ్లాసు ఖాళీచేశాడు. 'మనం మన కాలాన్ని వెళ్ళబుచ్చుకున్నాం, పందుల పెంపకం అయిపోయింది. మనం సామాన్యుడి శకంలో బ్రతుకుతున్నాం.'

'నేను ఆ సామాన్యుడి తరపునవున్నానని మర్చిపోకు,' మందహాసం చేస్తూ అన్నాడు, రుబషోవ్.

'నే నన్నదదికాదు. ఆ వరసకొస్తే, పెడబొబ్బలు పెట్టకుండా వుంటే మాత్రం మా నల్లమీసాల పొట్టివాడి కార్యక్రమంతో నేనూ యేకీభవిస్తాను. చివరికి, యెవరి విశ్వాసానికి వాళ్ళు బలికావలిసిందే.' కాఫీ త్రాగుతూ చాలసేపు కూర్చున్నారు. రెండోసారి కాఫీ త్రాగేటప్పుడు హెర్ వాన్ జ. చెప్పాడు. 'మిస్టర్ రుబషోవ్, యీసారి మీ దేశంలో మరో విప్లవం రావటం, నెం. 1 ను దింపివేయటం జరిగితే బరిణె పందుల విషయంలో కొంచెం శ్రద్ధతీసుకో – 'అదే జరగటం దుర్ఘటంగా కనిపిస్తోంది.' అని కొంచెం ఆగి,'... నీ స్నేహితుల్లో ఒకరు యీ విధానంద్వారా సాధించ ప్రయత్నించినా సాధ్యంకాదా ?' అని రుబషోవ్ అడిగాడు.

'తప్పకుండా,' అదే సరళస్వరంతో హెర్ వాన్ జ. అన్నాడు. 'నీ గతవిచారణాంశాలను బట్టి మీ దేశంలోయెవ్వో

విచిత్ర పరిణామాలు జరుగుతున్నాయని వూహించాం.'

'అప్పుడు, నీ మిత్రుడికి అటువంటి అసాధ్య సందర్భంలో మీ నుంచి పొందదగు సహాయాన్ని గురించికూడ ఒక అభిప్రాయం వుండొచ్చా ?'

తాను యీ ప్రశ్నను ఆశించినట్లుగా, ఖచ్చితంగా జవాబిచ్చాడు. 'కొంచెం అబద్ధమాడు. కాని, దానికి వెలవుంది.

బల్లప్రక్కనే, కాఫీ కప్పులు చేత్తో పుచ్చుకొని, నిలబడి వున్నారు. 'అప్పుడే ఆ మూల్యంకూడ నిర్ణయమైందా?' తన గొంతు తేలికపడినట్లు భావిస్తూ, రుబషోవ్ అడిగాడు.

'తప్పకుండా,' హెర్‌వాన్ జ. జవాబిచ్చాడు, ఒక అల్పసంఖ్యాక జాతి నివసించే, గోధుమపండే ఒక రాష్ట్రం పేరు చెప్పాడు. అప్పుడు పరస్పరం శెలవు తీసుకున్నారు....

ఈ విషయాన్ని కొన్ని సంవత్సరాలవరకు ఆలోచించలేదు సరికదా, కనీసం స్మృతిపథంలోకికూడ రాలేదు. కాఫీ, బ్రాందీల మధ్య జరిగిన కాలక్షేపపు సోదెను గురించి గ్లెట్కిన్‌కు యేమని వివరించాలి ? మామూలుగా, శిలావిగ్రహంలా తన కెదురుగా కూర్చున్న గ్లెట్కిన్ వైపు రుబషోవ్ త్వరితంగా చూచాడు. బరిణెపందుల్ని గురించి మళ్ళీ యితనితో మాట్లాడం అసంభవం. ఈ గ్లెట్కిన్ గాడికి ఆ పందుల సంగతేమి తెలుస్తుంది ? ఇతను హెర్‌వాన్‌జతో యెప్పుడూ కాఫీ త్రాగలేదు. గ్లెట్కిన్ యెన్నిసార్లు ఆపి ఆపి చదివాడో, యెంత అపస్వరంతో చదివాడో పునరాలోచించాడు. ఇతని పుట్టుక కార్మిక కుటుంబంలో, వయసువచ్చిన తర్వాత చదువను, వ్రాయను నేర్చుకున్నాడు. బరిణె పందులను గురించి ప్రారంభ

మైన సంభాషణ యెక్కడ అంతమౌతుందో భగవంతుడికే తెలియాలిగాని, ఏడి కెన్నడైనా తెలుస్తుందా ?

'అయితే సంభాషణ జరిగిందని వొప్పుకుంటూ వన్న మాట?'

'ఏమీ ప్రమాదంలేనిది,' విసుగుతో రుబషోవ్ అన్నాడు. గ్లెట్కిన్ తనను నిచ్చెనమీద నుంచి యింకోమెట్టు క్రిందకు నెట్టాడని తెలుసునతనికి.

'ప్రస్తుత ప్రభుత్వాన్ని దౌర్జన్యంగా పడగొట్టవలసిన అవసరాన్నిగూర్చి యువక కీఫర్‌కు నీవు బోధించిన సిద్ధాంత, రాద్ధాంతాలంత ప్రమాద రహిత మైనది' గ్లెట్కిన్ అన్నాడు.

రుబషోవ్ చొక్కా చేతిమీద కంటద్దాలు తుడిచాడు. తనను నమ్మించుకో ప్రయత్నించినంత ప్రమాదరహితమైన దేనా, ఆ సంభాషణ? తాను మంతనాలు జరుపలేదు. వొడంబడికకు రాలేదు, పైగా సరదా పురుషుడు హెర్ వాన్ జ.కు ఆవిధంగా చేయటానికి అధికారంకూడ లేదు. ఈ కాండ నంతనూ మంత్రాంగవ్యవహార భాషలో 'ధ్వనిస్తోంది' అనటం కంటె, దీనికి అధిక ప్రాముఖ్యత లేదు. ఆ సమయంలో తన ఆలోచనాక్రమంలోని ఖాళీలను కలిపే వారధిలా పనిచేసిందా రకమైన 'ధ్వనించటం', పైగా యిదికొన్ని పార్టీసాంప్రదాయాలకు అనుగుణ్యంగానే వుంది. విప్లవానికి కొంచెంపూర్వం తాను ప్రవాసంనుంచి బయటపడటానికి, విప్లవాన్ని విజయవంతంగా నడపటానికి, పాత నాయకుడు అదే దేశపు సైనిక కార్యాలయ సహాయాన్నుపయోగించుకోలేదా? ఆ తర్వాత ప్రథమ శాంతిఒడంబడికలో ప్రశాంతంగా వుండనిచ్చినందుకు

గాను కొంత ప్రదేశాన్ని వదులుకోలేదా ? ఒకసారి రుబషోవ్ మిత్రుడొకడు అతనితో హాస్యంగా 'ముసలివాడు కాలవ్యవధి సంపాదించటానికి స్థలం త్యాగం చేస్తాడు' అన్నాడు. మరుగునపడిన 'హానిరహిత' సంభాషణ తన గొలుసుకట్టులో చక్కగా అమరిందనుకొన్న దాన్ని, యిప్పుడు గ్లెట్కిన్ దృష్టితో తప్ప తదితరదృష్టితో చూడలేకపోతున్నాడు, రుబషోవ్. బహుశా, బరిణె సందుల్ని గురించి యేమీ తెలియక పోవటం వల్లనే నేమో యీ గ్లెట్కిన్ మోటుగా ఆలోచించటం, సామాన్య గ్రామ్యానిర్ణయాలకు రావటం, మోటుగా చదవటం!... అది సరేగాని, ఆ సంభాషణ గురించి గ్లెట్కిన్ కెలా తెలిసింది ? చాటుగా విన్నైనా వుండాలి; అది ఆసందర్భంలో జరగటానికవకాశం లేదు, లేక సరదా పురుషుడు హెర్ వాన్ జ. విచ్ఛిన్న ప్రేరకుడుగా పనిచేస్తూనైనా వుండాలి – యే నిగూఢ కారణాలవల్ల యిలా చేస్తున్నాడో భగవంతుడికే తెలియాలి. ఇటువంటివి యింతకుముందు కావలసినన్ని జరిగినయ్. గ్లెట్కిన్, నెం. 1 ల లాంటి అనాగరిక మనస్తత్వాల పన్నుగడల ననుసరించి, వెనక ఒకసారి ఒకవల పన్నారు. రుబషోవ్ సకాలానికి అందులో చక్కగా దూరాడు.

'హెర్ వాన్ జ. తో నా సంభాషణంతా నీకు పూర్తిగా తెలియవచ్చినప్పుడు, దానికి ఫలితాంశమేమీ లేదనికూడ తెలిసివుండాలి.'

'తప్పకుండ, సకాలానికే నిన్ను అరెస్టుచేసి, ప్రతిపక్షాన్ని దేశవ్యాప్తితంగా నాశనంచేసినందుకు అభివాదాలు. అలాటేం చేయకపోతే ప్రయత్నించిన కుట్ర జరిగివుండేది.'

దానికేమిటి సమాధానం? రుబషోవ్ ముసలివాడై పార్టీ సాంప్రదాయాల కనుగుణ్యంగా వర్తించుకోలేనంత బక్క చిక్కి వుండకపోయినట్లయితే, గ్లెట్కిన్ తన స్థానంలో వుండి ప్రవర్తించినట్లు ప్రవర్తించకపోయినట్లయితే యే పరిస్థితుల్లోనూ తీవ్ర పరిణామాలు కలిగేవికావా? తనలాగే పూర్వ రక్షక దళం కూడ శిథిలమైనందువల్లనా, నామమాత్రంగా వున్న ప్రతిపక్ష చర్యలన్నీ వొట్టి కబుర్లుగా తయారైంది? వాళ్ళ యవ్వన కాలం సగభాగం చట్టవిరుద్ధపు పోరాటాలలోనూ, కారాగారాల గోడల తేమ తినెయ్యటం వల్లనూ వ్యయమైపోయింది; నిరంతరం, తమ అభిప్రాయాలను బహిర్గతం చేయ వీల్లేక లోలోపలనే అణిచిపెట్టుకోవటంవల్ల నైతికంగా పిప్పి ఐపోయారు—యీ పరిస్థితిని యెవరికివారే సంవత్సరాలతరబడి, దశాబ్దాలుకూడ, చూచుకోవలసి వచ్చింది. సంవత్సరాల తరబడి అనుభవించిన ప్రవాసక్లేశం, పార్టీలో యేర్పడిన తీవ్రతరమైన ముఠాలవల్ల, వాటిని యెదుర్కొన్న నియమరహిత విధానంవల్ల వాళ్ళు నీరసించిపోయారు; నిరంతర పరాజయాలవల్ల, అంతిమ విజయం దుర్నీతికరం గావటంవల్ల వాళ్ళు నీరసించిపోయారు. ఎప్పుడూ నెం. 1 నియంతృత్వానికి వ్యతిరేకంగా నిర్మాణాత్మకమైన తీవ్రప్రతిపక్షం లేదనీ, యీ పూర్వతరం నైతికంగా, భౌతికంగా పీల్చివేయబడి, సర్వస్వం కోల్పోవటంవల్ల మిగిలింది వొట్టి ప్రేలాపనగా మిగిలిందనీ, ఎరాన్సిస్‌లో గోరీల్లో గతించినవాళ్ళకు మిగిలిన భవిష్యత్తు, రతి తమకు న్యాయం కలుగజేసేవరకు నిద్రిస్తూ, యెదురు

చూడటం లాటి ఆశతో వుండటమేననీ తాను చెప్పుకోవాలా?

ఈ అడివిమనిషికి యేమని జవాబివ్వాలి? తానుసర్వవిష యాల్లోనూ సమంజసంగానే వున్నాడు. కాని ఒక్క ప్రధాన మైన తప్పు చేశాడు. గ్లెట్కిన్ కెదురుగా కూర్చున్నది రుబషోవ్ ఛాయ ఐతే యింకా ఆ పూర్వపురుబషోవ్ కూర్చుని వున్నా డనుకోవటం. తాను యదార్థంగా చేసిన కార్యాలకుగాక నిర్లక్ష్యించిన వాటికి శిక్షింపబడటంగా యిదంతా పరిణమిం చింది. సరదాపురుషుడు హెర్ వాన్ జ. చెప్పాడు. 'మానవుడు స్వీయ విశ్వాసాల పేరుమీదుగానే శిలువ వేయబడతాడు...'

వాజ్మూలంమీద సంతకంచేసి తన గదికి పోయి బల్ల మీదపడి, మళ్లీ చిత్రహింస ప్రారంభమయ్యేవరకు, మత్తుగా నిద్రపోవటానికి తీసుకుపోబడే ముందు గ్లెట్కిన్ని ఒక ప్రశ్న అడిగాడు. ప్రస్తుతం చర్చనీయాంశానికి సంబంధంలేదు, కాని ప్రతిసారీ తానొక క్రొత్తవాజ్మూలం మీద సంతకం చేయా లనీ, గ్లెట్కిన్ ఛాయామాత్రుడేననీ రుబషోవ్కు తెలుసు - గ్లెట్కిన్ జవాబిచ్చాడు. రుబషోవ్ అడిగిన ప్రశ్న ఇవనోవ్ గతికి సంబంధించింది.

'ఇవనోవ్ పౌరుణ్ణి అరెస్టుచేశారు.' గ్లెట్కిన్ చెప్పాడు.

'కారణం తెలుసుకోవచ్చా?'

'ఇవనోవ్ పౌరుడు నీ విషయంలో చాల నిర్లక్ష్యంగా విచారణ జరిపాడు, పైగా ఒకనాటి యేకాంత సంభాషణలో యీ నేరారోపణసవ్యతనుగురించిసందేహాలనువెలిబుచ్చాడు.'

'అతను నమ్మకపోతేనేం? ఒకవేళ నామీద మంచి అభిప్రాయముందేమో?' రుబషోవ్ అడిగాడు.

'అటువంటప్పుడు తాను పరిశోధించటంమానేసి, తనపై అధికారులకు తన అభిప్రాయంలో నిరపరాధివని చెప్పాల్సింది.'

గ్లెట్కిన్ తన్ను అవహేళన చేస్తున్నాడా? పూర్వంలాగే ఖచ్చితంగా, మొద్దుగా కనిపించాడు.

తర్వాత గ్లెట్కిన్ వెచ్చటికలం రుబషోవ్ చేతో పుచ్చుకొని ఆనాటి పత్రాలపై వంగివున్న స్థితిలో—అప్పటికే కార్యదర్శి వెళ్ళిపోయింది—ప్రశ్నించాడు.

'నిన్ను యింకో ప్రశ్న అడగనా?'

అలా అడుగుతూనే గ్లెట్కిన్ తలమీదున్న పెద్ద మచ్చవైపు చూచాడు.

'నీవు "కఠినవిధానం" అభిమానివని విన్నాను. నా మీదెప్పుడూ ప్రత్యక్ష శారీరకపు టొత్తిడిని ప్రయోగించలేదేం?'

'అంటే శారీరకవధ అనా?' గ్లెట్కిన్ యాదాలాపంగా అన్నాడు. 'మన నేర శిక్షాస్మృతిలో దాన్ని నిషేధించారు.'

కొంచెం ఆగాడు. రుబషోవ్ సంతకం పూర్తిచేశాడు.

'అదిగాక,' గ్లెట్కిన్ కొనసాగించాడు, 'నేరస్థుల్లో ఒకరకం కేవలం శారిరకపుటొత్తిడికే నిజంచెపుతారు, కాని బహిరంగ విచారణలో మాట త్రిప్పివేస్తారు. నీవా మొండిజాతికి చెందినవాడవు. విచారణ సమయంలో నీ వొప్పుదల యొక్క రాజకీయ ప్రయోజనం, తన స్వచ్ఛందస్వభావాన్ని గురించే అబద్ధమాడిస్తుంది.'

బహిరంగ విచారణను గురించి గ్లెట్కిన్ మాట్లాడటం యిదే మొదటిసారి. యూనిఫారంభూతం వెనుక నీరసంగా చిన్న చిన్న అడుగులు వేస్తూ పోతున్నప్పుడు యీవిషయమై

పట్టించుకోలేదు. కాని 'నీవా మొండిజాతికి చెందినవాడవు' అన్నమాటను గురించే మథనపడ్డాడు. తనకయిష్టంగావే, యీ వాక్యం అతనికెంతో ఆహ్లాదకరమైన ఆత్మసంతృప్తి నిచ్చింది.

బల్లమీద పడుకుని నేను వృద్ధుణ్ణి, పసివాణ్ణి ఔతున్నాననుకున్నాడు. అయినా నిద్రపోయేవరకూ ఆ యాహ్లాద భావంతోనే వున్నాడు.

ప్రతిసారి, మొండివాదన తర్వాత ఒక క్రొత్త వొప్పుదలను సంతకంచేసి యిచ్చి, అలిసిపోయినప్పటికి ఒక గంటకో లేక యెక్కువైతే రెండు గంటలకో లేపుతారుకదా అనే ఒక విచిత్రమైన తృప్తితో, పడుకొని ఒక్కటి కోరుకునేవాడు. గ్లెట్కిన్ తనను ఒక్కసారైనా పూర్తిగ పడుకోనిచ్చి పూర్తిగ మెలకువ వచ్చేవరకు వూరుకుంటాడని. ఈ వివాదం పూర్తయ్యేవరకు, ఆఖరుసారిగా 'నేను' వ్రాయటం పూర్తయ్యేవరకూ, ఆ కోర్కె నెరవేరదని తనకూ తెలుసు—ప్రతిక్రొత్త వివాదంకూడ తన ఓటమితోనే ముగుస్తుందనీ, ఆఖరికి యే ఫలితం కలుగుతుందో కూడ తెలుసు. అయినప్పుడు యెందుకీ ఆత్మపీడన, పరాజితవాదం; వదిలేసి శాశ్వతంగా నిద్రపోక? మరణభావం యేనాడో తన తాత్వికస్వభావాన్ని కోల్పోయింది. వెచ్చని శారీరక మోహార్థం కలిగివుంది—నిద్ర. అయినా ఒక విచిత్ర వక్రిత విధిభావం, సేల్కాని తుదిదాకా పోరాటాన్ని సాగించమని—కేవలం గాలిచక్రాలతో పోరాటమైనాసరే—పీడిస్తోందితన్ని. గ్లెట్కిన్ తనను నిచ్చెన తుది మెట్టువరకూ నెట్టేవరకూ, యీ వికృత నిందారోపణపై తుది 'నేను' వ్రాసేవరకూ కొనసాగించవలసిందే. దారి చివరి

వరకూ వెళ్ళాలి. కళ్లు తెరుచుకునే అంధకారంలో ప్రవేశించి నప్పుడే యెన్నడూ లేవబడని సుఖనిద్ర పోవటానికి హక్కు కలుగుతుంది.

ఈ నిరంతర విచారణ తతంగపు గొలుసుకట్టు సందర్భంలో గ్లెట్కిన్‌లో కూడ కొంతమార్పు కలిగింది. అంత అధికం కాకపోయినా రుబషోవ్ పరిత ప్తనేత్రాలు గుర్తించి నయ్. చివరివరకూ కట్టెలాగ, ప్రతిమామూర్తిలాగ, కఫ్‌లు కిర్రుమనుకుంటూ బల్ల వెనుక దీపపుసీడలో కూర్చున్నాడు. కాని క్రమేణ దీపాన్ని మామూలుస్థితి కొచ్చేవరకు కొద్ది కొద్దిగా యెలా తగ్గించేవాడో అలాగే క్రమేణ కొద్దికొద్దిగా అతనిలోని పశుత్వం యెగిరిపోయింది. ఎన్నడూ నవ్వలేదు, యీ అడవిమనుషులు యెన్నడైనా నవ్వగలరా, వీళ్ళ గొంతుల్లో యే భావప్రకటనాశక్తైనా వుందా అని ఆశ్చర్యపోయాడు. కాని ఒకసారి, కొన్ని గంటలసేపు చర్చజరిగిన తర్వాత రుబషోవ్‌కు సిగరెట్లయిపోతే గ్లెట్కిన్ తన జేబులోనుంచి ఒక పెట్టెతీసి బల్లమీద పడవేశాడు.

రుబషోవ్ ఒక్క అంశంలో విజయం సాధించాడు. అల్యూమినియం ట్రస్ట్‌ను ధ్వంసం చేశాడనే అంశం విషయంలో ఇప్పటికే అంగీకరించిన యితర నేరాలమొత్తంతో యిది సరితూగ లేదు. అయినా పూర్వపు నిర్ణయాంశాల విషయంలోలాగే యిందులోనూ అదే పట్టుదలతో వాదించాడు. ఇద్దరూ యెదురెదురుగా రాత్రంతా కూర్చున్నారు. రుబషోవ్ ఆరోపిత నేరంలో ప్రతి అంశాన్ని, యేకపక్ష సంఖ్యల్ని త్రిప్పికొట్టాడు. అలసటతో బరువెక్కిన స్వరంతో, తిమ్మిరెక్కిన తలలో

అద్భుతంగా సకాలానికి గుర్తుకొచ్చిన తేదీలనూ, అంకెలనూ వల్లించాడు. అంతసేపూ కూడా గ్లెట్కిన్ తన తార్కిక గొలుసు చుట్లను యెక్కడ వూడతీయాలో తెలియక తన్నుకున్నాడు. ఇప్పటికే రెండు మూడు సమావేశాలలో, పూర్వం వలె యీ యిద్దరికి ఒకవిధమైన ఒడంబడిక కుదిరింది. నేరారోపణమూలం సక్రమమని గ్లెట్కిన్ బుజువుచేస్తే — అది కేవలం తార్కిక, నిగూఢ స్వభావపూరితమైనా సరే — తేలికగా, కావలసిన మిగతా వివరాలన్నిటినీ పూరించేవాడు. రుబషోవ్ అన్నట్లుగా 'నేను' లు వ్రాయటం. ఈ విషయాన్ని గమనించకుండానే వాళ్లు యీక్రీడా నియమాలకు అలవాటు పడ్డారు. అందులో యెవరూకూడ రుబషోవ్ చేసిన పనులకు, అతని ఆలోచనలకు ఫలితాలుగా వూహించబడిన ఫలితాలకు తారతమ్యం గుర్తించలేదు. వాళ్ళకు క్రమంగా ఆకారం, యదార్థత, తార్కిక కల్పిక, వాస్తవం మధ్య విభేదజ్ఞానమే నశించింది. అప్పుడప్పుడు, మనస్సు నిర్మలంగావున్న సమయాల్లో రుబషోవ్ యీ విషయమై ఆలోచించేవాడు, మళ్ళీ ఒక విచిత్ర మత్తుస్థితి నుంచి మేల్కొంటున్నట్లు భావించేవాడు; గ్లెట్కిన్ యెన్నడూ గమనించినట్లే కనిపించలేదు.

తెల్లవారే ఝాముకి, యింకా రుబషోవ్ అల్యూమినియం ట్రస్ట్ విచ్ఛిత్తి విషయమై వదిలిపెట్టినప్పుడు, మొదట్లో తొట్రిపెదవివాడు తప్పజవాబిచ్చినప్పటిలాగ గ్లెట్కిన్ కంపిత హీన స్వరంతో మాట్లాడాడు. దీపకాంతిని యింతకు ముందెన్నడూ చేయనంత తీవ్రతరం చేశాడు. కాని రుబషోవ్ శ్లేష మందహాసం చూచి మళ్ళీ తగ్గించాడు. ప్రయోజనంలేని

కొన్ని ప్రశ్నలడిగి, ముగిస్తూ చెప్పాడు.

'అయితే నీ అధీనంలో వుంచిన పరిశ్రమవిషయంలో యేవిధమైన దుష్కృత్యాలు, విచ్ఛిన్నయత్నాలు చేయలేదు. కనీసం అటువంటివి తలపెట్టలేదంటూ వన్నమాట?'

ఏంజరుగుతుందోననే మత్తుజిజ్ఞాసతోనే, రుబషోవ్ తల వూపాడు. గ్లెట్కిన్ స్టెనోగ్రాఫర్ వైపుతిరిగి,

'వ్రాయి; సాక్ష్యం లేనందున యీ ఆరోపణను తొలగించమని విచారణాధికారి సిఫారసుచేస్తున్నాడు' అనిచెప్పాడు.

పొరలుకొచ్చిన పసితనపు విజయోత్సాహ తరంగాకృతిని మరుగుపర్చటానికి త్వరితంగా సిగరెట్‌ముట్టించాడు. గ్లెట్కిన్‌మీద మొదటిసారిగా విజయాన్ని సాధించాడు. పరాజితమైన పోరాటంలో అదొక స్వల్పకరుణాపూరిత విజయం. అయినా విజయమే. ఇటువంటి భావన కలిగి కొన్ని మాసాలు, సంవత్సరాలు కూడ అయింది.... ఇటీవల వాళ్ళిద్దరిమధ్య జరుగుతున్న క్రతువుప్రకారం గ్లెట్కిన్ ఆ నాటి పత్రాలన్నీ తీసుకొని, కార్యదర్శిని పంపించివేశాడు.

వాళ్ళిద్దరూ వొంటరిగా వున్నప్పుడు, రుబషోవ్ సంతకం చేయటానికి లేచి నిలబడినప్పుడు కలం అందిస్తూ, గ్లెట్కిన్ అడిగాడు.

'అనుభవాన్నిబట్టి ప్రతిపక్షం ప్రభుత్వానికి కష్టాలు కల్పించటానికీ, కార్మికుల్లో అసంతృప్తిని రేకెత్తించటానికీ పారిశ్రామిక విచ్ఛిత్తి అత్యంత ఫలప్రదమైన మార్గం. అటువంటప్పుడు నీవు ఆ మార్గాన్ని వినియోగించ లేదనీ, కనీసం తలచలేదనీ అంతగట్టిగా వాదిస్తున్నావేం?'

'ఎందుకంటే అది కేవలం సాంకేతికంగా అసంగతం. విచ్ఛిన్నకుడంటూ యెవడో ఒకణ్ణి దిష్టిబొమ్మలాగ కాల్చటం అదే పనిగా పెట్టుకుంటే, అది అంటువ్యాధిలాగ తయారౌతోంది. అది నాకు తలనొప్పి.'

చిరకాలంగా లోపించిన విజయోత్సాహం రుబషోవ్‌కు అహ్లాదాన్ని కలిగించి, మామూలుకంటె బిగ్గరగా మాట్లాడించింది.

'విచ్ఛిన్న క్రియలు కేవలం కల్పితమైనవంటే నీ వుద్దేశంలో, మన పరిశ్రమల్లో అసంతృప్తికరపరిస్థితికి యదార్థ కారణాలేమిటంటావ్ ?'

'మరీతక్కువ రోజుకూలి, బానిస విధానం, అనాగరిక క్రమశిక్షణ ప్రమాణాలు. అతిగా అలిసిపోవటంవల్ల కొంచెం యేమరిపాటుగా పనిచేసినందుకుగాను నా ట్రస్ట్‌లో యెంతోమంది కూలీలను విచ్ఛిన్నకులుగా కాల్చి వేయటం నాకు తెలుసు. ఏ కార్మికుడైనా రెండు నిముషాలు ఆలస్యంగావస్తే అతన్ని కాల్చివేస్తారు. లేక యెక్కడా వుద్యోగం దొరక్కుండా అతని పోలికపత్రాలమీద ఒక ముద్రబిళ్ల అంటిస్తారు."

మామూలు అవ్యక్తదృష్టితో నేరుబషోవ్ వైపుచూచాడు గ్లెట్కిన్. అదే స్వరంతో అడిగాడు.

"నీకు చిన్నప్పుడు గడియారం యిచ్చారా ?"

రుబషోవ్ అతనివైపు విస్మితుడై చూచాడు. ఈ అడవిమనుష్యుల స్వభావంలో అతిస్పష్టంగా కన్పించే లక్షణం యెప్పుడూ రుసరుసలాడటం. యింకా ఖచ్చితంగా చెప్పాలంటే చమత్కారరహిత తుచ్ఛప్రవృత్తి.

'నా ప్రశ్నకు జవాబివ్వవా?' గ్లెట్కిన్ అడిగాడు.

'తప్పకుండా,' రుబషోవ్ మరింత విస్మయంతో అన్నాడు.

'నీకు గడియారం యిచ్చినప్పుడు నీ వయసెంత?'

'బాగా తెలియదు. బహుశా యెనిమిదో, తొమ్మిదో.'

'నేను, గంటకు అరవై నిమిషాలని నేర్చుకున్నప్పుడు నాకు పదహారేళ్లు. మా వూరినుంచి పట్నానికి వెళ్లాలంటే రైతులు సూర్యోదయ సమయానికి రైలుస్టేషను కెళ్ళి రైలు వచ్చేవరకు పడుకునేవాళ్ళక్కడ. సాధారణంగా ఆ రైలు మధ్యాహ్నానికొచ్చేది. ఒక్కొక్కసారి సాయంత్రానికో లేక మరునాటి వుదయానికోగాని వచ్చేదికాదు. ఆ రైతులేయిప్పుడు మన ఫ్యాక్టరీల్లో పనిచేసేది. ఉదాహరణకి, మావూళ్లో యిప్పుడు ప్రపంచంలోకల్లా పెద్ద ఉక్కు రైలుపట్టాలఫ్యాక్టరీ వుంది. అక్కడ యీ కార్మికులు పొయ్యి కాళీచేసే వ్యవధుల మధ్య పడి నిద్రపోయేవారు, చివరకు కాల్చేవరకు. ఇతర దేశాల్లో రైతులు సాంకేతిక నైపుణ్యం సంపాదించి యంత్రాలను నడిపేశక్తి సంపాదించటానికి ఒకటి, రెండు వందల సంవత్సరాలు పట్టింది. కాని మనదేశంలో పట్టుమని పది సంవత్సరాలు కాలేదు. వాళ్ళను ప్రతి చిన్నతప్పుకీ తన్ని, కాల్చి పని చేయించకపోతే పొగగొట్టాలనిండా గడ్డి మొలిచి ఫ్యాక్టరీలు నాశనమై, పూర్వస్థితికొచ్చేవరకు వాళ్ళు ఫ్యాక్టరీ ఆవరణలో పడి నిద్రపోతారు. క్రిందటి సంవత్సరం మాంచెస్టర్ నుంచి మహిళా ప్రతినిధివర్గం వచ్చిందిక్కడికి. వాళ్ళకన్నీ చూపించాం. ఆ తర్వాత ఇంగ్లండులో నేత కార్మికులు యిటువంటి ఆదరణ

రీతి నెప్పుడూ సహించరని అసహ్యపు వ్యాసాలు వ్రాశారు. మాంచెస్టరులో పత్తి పరిశ్రమ రెండు వందల సంవత్సరాల పూర్వపుదని చదివాను. ఆ పరిశ్రమ ప్రారంభదశలో వున్నప్పటిలాగే యిప్పుడూ కార్మికుల ఆదరణరీతి వున్నదని కూడ చదివాను. ఇప్పుడు, కామ్రేడ్ రుబషోవ్, ఆ మహిళా ప్రతినిధి వర్గం వాదించినట్లుగానే వాదించావు. వాళ్ళకంటే యదార్థంగా నీ కెక్కువ తెలుసుననుకో. అందువల్ల నీవు అదేవాదన చేస్తుంటే కొంచెం ఆశ్చర్యం కలుగుతుంది. కాని వాళ్ళకు, నీకు కొంత పోలికవుంది. నీకు చిన్నప్పుడే గడియారం యిచ్చారు....'

రుబషోవ్ యేమీ మాట్లాకుండ యినుమడించిన శ్రద్ధతో గ్లెట్కిన్ వైపు చూచాడు. ఏమిటిది? ఈ అడవి మనిషి తనగూట్లోనుంచి బయటికొస్తున్నాడా? కాని గ్లెట్కిన్ యధాప్రకారం కట్టెలాగ, అవ్యక్తంగానే కూర్చునివున్నాడు.

'నీవు కొన్ని విషయాల్లో సవ్యంగానే వుండొచ్చు,' చివరికి రుబషోవ్ అన్నాడు. 'ఈ సమస్యను ప్రారంభించింది నీవేగా, పనులవైఫల్యానికి గల సహజకారణాలు నీవు యెంతో నేర్పుతో వర్ణించినప్పుడు ఈ కష్టాలకు కారణంగా బలిమేకల్ని సృష్టించట మెందుకు?'

గ్లెట్కిన్ యిలా అన్నాడు: 'ప్రజానీకానికి కష్టమైన, క్లిష్టమైన విధానాలకు సరళమైన, సులభగ్రాహ్యమైన వివరణలో చెప్పాలని అనుభవం నేర్పుతోంది. నాకు అర్థమైన చరిత్రను బట్టి మానవజాతి బలిపశువులు లేకుండ వుండలేదు. అది యెల్లకాలాల్లోనూ అనివార్యమైన సంస్థని నా విశ్వాసం. నీమిత్రుడు ఇవనోవ్ అది మతసంబంధ మూలకమని నాకు

బోధించాడు. నాకు జ్ఞాపకం వున్నంతవరకు అతడు, సంవత్స రానికొకసారి సర్వపాప భరితమైన మేకల్ని బలియిచ్చే హీబ్రూ ఆచారంనుంచి ఆ మాట పుట్టిందని చెప్పాడు.' గ్లెట్కిన్ కొంచెం ఆగి కఫలను సర్దుకొన్నాడు. 'అంతేగాక చరిత్రలో స్వచ్ఛందపు బలిమేకల వుదాహరణలు కూడ వున్నయ్. నీకు గడియారం యిచ్చిన వయస్సులో మాపూరి పురోహితుడు ఏసుక్రీస్తు తానొక పాపపూరితమైన మేకపిల్ల నని చెప్పుకొన్నట్లు, చెప్పేవాడు. ఎవరైనా త్యాగం కోసమే త్యాగం చేస్తున్నాడనటం మానవజాతి కేవిధంగా వుపకరి స్తుందో నా కెప్పుడూ అర్థంకాదు. కాని రెండువేల సంవత్స రాలనుంచి ప్రజలు దాన్ని అతిసహజంగా చూస్తున్నారు.'

రుబషోవ్ అతనివైపు చూచాడు. ఇతను దేన్ని వుద్దే శిస్తున్నాడు? ఈ సంభాషణోద్దేశ మేమిటి? ఈ అడవిమనిషి యే పద్మవ్యూహంలో దారితప్పి తిరుగుతున్నాడు?

'అదేమైనప్పటికీ,' రుబషోవ్ అన్నాడు. 'మన వుద్దే శాల ప్రకారం ప్రజలకు, ప్రపంచాన్ని విచ్ఛిన్నకులతోనూ, భూతాలతోనూ నింపటంకంటే, సత్యం చెప్పటం మంచిది.'

'మా వూళ్ళో వాళ్ళకు, విప్లవానంతరం ఫ్యాక్టరీలు స్థాపించిన తర్వాతకూడ వాళ్లు యింకా వెనుకబడి వున్నారనీ, నెమ్మదిగా పనిచేస్తున్నారనీ చెప్పినందువల్ల వాళ్ళల్లో మార్పేమీ రాదు. వాళ్లు కార్యశూరులనీ, అమెరికన్లకంటే యెంతో మెరుగనీ, చెడు అంతా విచ్ఛిన్నకులవల్ల, భూతాల వల్లా వస్తుందనీ చెప్పితే కొంత ప్రయోజనం వుండొచ్చు. మానవుల కేది ప్రయోజనకారో అదే సత్యం. ఏది వినాశ

కారో అదే అసత్యం. వయోజనుల సాయంకాలపు పాఠశాలల నిమిత్తం పార్టీ ప్రచురించిన చరిత్రలో, మొదట కొన్ని శతాబ్దాలు క్రీస్తు మతం ప్రజల భౌతికాభివృద్ధిని సాధించిందని, నొక్కి చెప్పబడింది. క్రీస్తు తాను తన్నూ, భగవంతునికీ పుట్టానని చెప్పినప్పుడు అతడు నిజం పలుకుతున్నాడో లేదో యే బుద్ధిమంతుడూ పట్టించుకోడు. అది సంజ్ఞామాత్ర మంటారు. కాని, రైతులు దాన్ని యథాతథంగానే భావిస్తారు. మనకు కూడ రైతులు యథాతథంగా భావించే కొన్ని సజ్ఞామాత్ర విషయాలను సృష్టించే అధికారముంది.'

'నీ వాదన అప్పుడప్పుడు ఇవనోవ్ వాదనను గుర్తుకు తెస్తుంది.'

'ఇవనోవ్ పౌరుడు, నీలాగే, పూర్వ మేధావివర్గపు వాడు. అతనితో సంభాషించటంవల్ల, సరిగా స్కూలుకెళ్లి చదువుకోకపోవటం వల్ల తెలియని చారిత్రక జ్ఞానం కలుగుతుంది. మాకున్న భేదం యెక్కడంటే, నేను నాకున్న జ్ఞానాన్ని పార్టీ సేవకు వినియోగిస్తాను, కాని ఇవనోవ్ పౌరుడు విరక్తుడుగా వుండేవాడు.'

'వుండేవాడు.......?' ముక్కద్దాలుతీస్తూ రుబషోవ్ అడిగాడు.

'ఇవనోవ్ పౌరుడు, అధికారనిర్ణయం ప్రకారం, గత రాత్రి కాల్చివేయబడ్డాడు,' గ్లెట్కిన్ అవ్యక్త నేత్రాలతో రుబషోవ్ వైపు చూస్తూ చెప్పాడు.

ఈ సంభాషణానంతరం గ్లెట్కిన్ రుబషోవ్‌ను రెండు గంటలసేపు పూర్తిగ నిద్రపోనిచ్చాడు....తన గదికి తిరిగెళ్లే

టప్పుడు ఇవనోవ్ మృతి తనలో యేమీ ముద్రితంకాలేదా మూ అని ఆశ్చర్యపడ్డాడు. తన స్వల్ప విజయోత్సాహాన్ని హరించి మళ్ళీ అలసట, మైకం రావటానికుపయోగపడింది. ఏవిధమైన తీవ్రోద్వేగమూలేని స్థితికొచ్చాడు. ఎలాగైనా ఇవనోవ్ మరణ వార్త వినకముందే తన నిరర్థక విజయోత్సాహానికి సిగ్గు పడ్డాడు. తన విజయాలను కూడ గ్లెట్కిన్ వ్యక్తిత్వం పరాజ యాలుగా మార్చివేసింది. రుబషోవ్‌లు, ఇవనోవ్‌లు చేసిన త్యాగాల ఫలితంగా యేర్పడి, తన మనుగడే వాళ్ళకు ఋణ పడివున్న ప్రభుత్వానికి అనాకరిక ప్రతిరూపంగా, మొద్దులాగ అవ్యక్తంగా గ్లెట్కిన్ కూర్చుని వున్నాడు. వాళ్ళ రక్తమూం సాలు స్వేచ్ఛగా పెరిగాయ్. బుద్ధితక్కువగా అయినయ్. ఇవనోవ్ కీ పూర్వ మేధావివర్గానికీ నైతికవారసుడుగా గ్లెట్కిన్ చెప్పుకోలేదా? గ్లెట్కిన్, అతనితోటి నూతన తరపు అడవి జాతి, సంఖ్యాసూచిత శిరస్కులు ప్రారంభించిన కార్యాన్నే పూర్తి చేస్తున్నారని తనలో నూరోసారిగా చెప్పుకున్నాడు. అదే సిద్ధాంతం, వున్నపాటుగా, కేవలం వాతావరణ కారణాలవల్లనే వీళ్ళ నోళ్ళల్లో అమానుషంగా తయారైంది. ఇవనోవ్ అదే విధంగా వాదించినప్పుడు హరించిపోయిన పూర్వ ప్రపంచపు స్మృతి ఫలితంగా అతని గొంతు లోస్వరంలో పలికేది. ఎవ డైనా తన బాల్యాన్ని కాదనగలడుగాని పూర్తిగా తుడిచి పారెయ్యలేడు. ఇవనోవ్ చివరిదాకా తన గతాన్ని వెంటతీసు కెళ్లాడు. అతనుచెప్పే ప్రతిదాంట్లోను తుచ్ఛమైన వ్యాకుల పాటువుండటానికదే కారణం. అందుకనే గ్లెట్కిన్ అతన్ని విరక్తుడన్నాడు. ఈ గ్లెట్కిన్‌లు తుడిచివేయటానికేమీలేదు.

వాళ్ళు గతాన్ని తిరస్కరించనక్కరలేదు; యెందుకంటే వాళ్ళ కేమీ లేదు గనుక. వాళ్లు బ్రాహ్మణత్వం, అల్పత్వం, వ్యాకులం యేమీ లేకుండా పుట్టారు.

# 5

యస్. యస్. రుబషోవ్ దినచర్యలో భాగం.

'... నిర్గమించే మనం యే హక్కుతో, అటువంటి ఆధిక్యభావంతో గ్లెట్కిన్‌లను చిన్నచూపు చూస్తున్నాం? మొదటి అడవిమనిషి భూమి మీద కనిపించినప్పుడు అడవికోతులు నవ్వుకొని వుంటాయ్. అధికంగా నాగరికమైన అడవికోతులు వయ్యారంగా, చెట్టుకొమ్మలమీద అటూయిటూ వుయ్యాల వూగినయ్. అడవిమనిషి మోటుగా నేలకంటిపెట్టుకొనే వున్నాడు. అడవికోతులు కడుపు నింపుకొని, ప్రశాంతంగా వికారపు చేష్టలతో ఆడు కున్నాయి, లేక తాత్విక యేకాగ్రతతో పురుగుల్ని పట్టుకొన్నాయి; అడవి మనిషి గదతో కొట్టుకుంటూ విచారంగా ప్రపంచమంతా తిరిగాడు. అడవి కోతులు అతనిమీద కాయల్ని విసిరాయి. అప్పుడప్పుడు వాటిని భీతి ఆవరించేది. సున్నితమైన నాజూకుతనంతో పళ్ళు, యిగుళ్ళు తిన్నాయి అడవిమనిషి పచ్చిమాంసాన్ని పీక్కుతిన్నాడు; మృగాల్ని, తోటివాళ్ళను వధించాడు; చిరకాలంనుంచివున్న చెట్లను నరికాడు; కాల నిర్ణయంలేని కొండల్ని కొట్టి కదిల్చాడు. ప్రతి అడవిశాసనాన్ని, సాంప్రదాయాన్ని వ్యతిరేకించాడు; అతి నాగరికమైన అడవికోతుల దృష్టిలో యీ అడవిమనిషి మూర్ఖుడు; కూౄరుడు; యేమాత్రం మృగగౌరవంకూడా లేనివాడు; చరిత్రయొక్క అనాగరిక ప్రకోపం. ఇప్పటికీ మిగిలిన ఆఖరు చింపాంజీజాతి కూడ మనిషిని చూస్తే, ముక్కులెగురవేసి వెక్కిరిస్తాయి....'

## 6

ఐదారు రోజులకు ఒక సంఘటన జరిగింది. విచారణ సమయంలో రుబషోవ్ మూర్ఛపోయాడు. నేరారోపణలోని ఆఖరు అంశంవద్ద కొచ్చేరప్పుడే. రుబషోవ్ చర్యలకు మూలోద్దేశ సమస్య. నేరారోపణలో అతనిది ప్రతిఘాతుక మన స్తత్వమనీ, అది స్వయంసాక్షి భూతమైనట్టుగా, అతను విదేశ శత్రువులకొలువు చేస్తున్నాడనీ యాదాలాపంగా వర్ణించాడు. ఆ వర్ణనపద్ధతి మీద రుబషోవ్ ఆఖరు పోరాటం సాగించాడు. తెల్లవారుఝామునుంచి బాగా ప్రొద్దెక్కే వరకూ వాదించి ఒక ప్రశాంతక్షణంలో కుర్చీలోనుంచి జారి, నేలమీదపడి, అలాగే వుండిపోయాడు.

కొన్ని నిమిషాలనంతరం డాక్టరు తెల్లబొచ్చు తల కాయ తనపై వంగి సీసాతో చల్లటినీళ్లు ముఖంమీద జల్లి, కణతలు రుద్దుతూండటం గుర్తించాడు. డాక్టరు ఉచ్ఛ్వాస, నిశ్వాసలనుంచి పెప్పరమెంట్, రొట్టె వాసనకొట్టి వికారించు కొన్నాడు. డాక్టరు తన కీచుగొంతుకుతో తిట్టి, ఒక నిమిషం రుబషోవ్‌ను గాలిలోకి తీసుకెళ్ళమన్నాడు. గ్లెట్కిన్ మా మూళ్లు భావశూన్య నేత్రాలతోనే చూచాడీ దృశ్యాన్ని. గంటగొట్టి సిపాయిని పిలిచి జంపఖానా తుడవమని, రుబషోవ్‌ను అతని గదికి పంపించాడు. కాసేపటికి ముసలి వార్డరు వ్యాయామానికి తీసుకెళ్ళాడు.

కొంతసేపటివరకు బయట చల్లగాలికి రుబషోవ్‌కి మత్తెక్కినట్లయింది. ఊపిరితిత్తులు ప్రాణవాయువును పీల్చి

నట్లు, హాయిగొలిపే తీయటి పానీయం త్రాగినట్లుగా వుంది. సూర్యుడు నిర్మలంగా, పాలిపోయినట్లు ప్రకాశిస్తున్నాడు. అప్పుడే ఉదయం పదకొండు గంటలైంది. ఎంతో కాలం క్రిందట యీ సుదీర్ఘ రాత్రిందివాల మనక వరస ముందు తాను వ్యాయామానికెళ్ళే గంట. ఈ వరాన్ని ఆనందించలేని బుద్ధిహీనుడు! మనకయెండ మొఖానికి తగుల్తూ నుంచులో తిరుగుతూ, గాలి పీలుస్తూ నడవటాని కేవడైనా యెందుకు బ్రతకగూడదు? గ్లెట్కిన్ గది భయంకర స్వప్నాలను, దీపపు దేదీప్యమానకాంతి, ఆ పీడ దృశ్యం అంతట్నీ విదిలించేసి యితరులందరిలాగ యెందుకు బ్రతకగూడదు?

అదివ్యాయామానికి మామూలుసమయమే గనుక తనను తోడుగాపూర్వపు బక్కపలచని రైతే గడ్డిచెప్పులతో వచ్చాడు. రుబషోవ్ తనప్రక్కనే కొంచెంతడబడుతూ నడుస్తుంటే వాలుమూపులుమాస్తూ, ఒకటిరెండు సార్లు సకిలించి, వార్డర్లను కనిపెడుతూ అన్నాడు.

'తమర్ని యీమధ్య చాలకాలంనుంచీ చూడటంలేదు. ఇక యెక్కువకాలం బ్రతికనట్లుగా, సుస్తీగావున్నారే. మళ్లీ యుద్ధం వస్తుందంటున్నారు వాళ్ళు.'

రుబషోవ్ మాట్లాడలేదు. క్రిందనుంచి మంచుతీసి ముద్దగా తనచేతితో నొక్కుదామనుకున్నాడు. ఆవరణచుట్టూ నెమ్మదిగా నడుస్తున్నారువాళ్ళు.

'విత్తనాలకాలం దగ్గరకొచ్చింది. మంచు కరగటం కాగానే గొర్రెలు కొండలమీదికి వెళ్తాయ్. అక్కడికి వెళ్ళటానికి మూడురోజులు పడుతుంది. ఇంతకు ముందు జిల్లాల్లో

అన్నిపూళ్ళవాళ్ళూ ఓకేరోజున గొర్రెల్ని బయలుదేరతీసేవాళ్ళు. సూర్యోదయ సమయంలో బయలుదేరేవి. దారుల్లో, పొలాల్లో, ప్రతిచోటా గొర్రెలే. మొదటినాడు పూరంతా వాటివెంట వెళ్ళేవాళ్ళు. బహుశా, తమరు మీ జీవితంలో యెప్పుడూ అన్నిగొర్రెల్ని, అన్ని కుక్కల్ని, అంత దుమ్ము, అన్నికుక్కలు మొరగటం, అన్ని గొర్రెలు అరవటం వినివుండరు.... ఓ దైవమాతా, అదంతా యెంత సంబరంగా, వుల్లాసంగా వుంటుందని?...'

రుబషోవ్ సూర్యునివైపు చూచాడు. సూర్యుడింకా పాలిపోయినట్లే వున్నాడు. కాని అప్పటికే గాలికి కొంచెంగోరు వెచ్చదనం తగిలింది. మరతుపాకి గోపురంపైన జారుతూ, గెంతుతూ చెర్లాటలాడుకుంటున్న పక్షుల్ని చూచాడు.

రైతు మూలుగుగొంతు చెప్పుకుపోయింది.

'మంచు గాలిలోకరిగిపోయే యిటువంటిరోజంటే నాకు చాలాయిష్టం. మనిద్దరం యెంతోకాలం బ్రతకంబాబూ. మనం ప్రతీఘాతుకులమని మనల్ని నొక్కేశారు. మనం హాయిగా బ్రతికిన పూర్వపురోజులు తిరిగిరావు....'

'ఆ రోజుల్లో నిజంగా నీవు సుఖంగావున్నావా?' రుబషోవ్ అడిగాడు. కాని రైతు యేదో తెలియకుండ గొణిగాడు. అతని గొంతుకాయ గొణిగేటప్పుడు చాలసార్లు క్రిందికీ, పైకీ కదిలింది. రుబషోవ్ ప్రక్కగాచూచి కొంతసేపటికి అడిగాడు.

'బైబిల్‌లో, ఎడారి మూక "మనం ఒక నాయకుణ్ణి నన్నుకుందాం, ఈజిప్టు కెళ్ళిపోదాం" మని అరిచినఘట్టంగుర్తుందా?'

రైతు అర్థంగాక, ఆతురతతో తల వూపాడు.... అప్పుడు వాళ్ళను గదులకు తీసుకుపోయారు.

మంచి చల్లనిగాలి సుఖం పోయింది. బరువైన తల దిమ్ము, తిరుగుడు, వికారం మళ్ళీప్రవేశించినయ్. ముఖద్వారం వద్ద రుబషోవ్ వంగి చేతినిండా మంచు తీసుకొని నుదురు మీద, మండుతున్న కళ్ళమీద రుద్దుకున్నాడు.

తా నాశించినట్లుగా తన గదికికాక, సరాసరి గ్లెట్కిన్ గదికి తీసుకెళ్ళారు. రుబషోవ్ బయటి కెళ్ళేటప్పుడు యే భంగిమలో కూర్చుని వున్నాడో అదే భంగిమలో వున్నాడిప్పుడు కూడ. ఎంతసేపైంది? రుబషోవ్ పరోక్షంలో అతడు అసలుయేమీ కదిలినట్లే లేదు. తెరలు లాగివున్నయ్. దీపం వెలుగుతోంది. మురికిగుంటలో లాగఆ గదిలో కాలం స్థంభించి నట్లుంది. గ్లెట్కిన్ కెదురుగా కూర్చునేటప్పుడు రుబషోవ్ దృష్టి జంపఖానామీద వున్న తడిమరకమీద పడింది తన సుస్తీ గుర్తొచ్చింది. అయితే, అంతా కలిపి తాను అక్కడి నుంచి వెళ్ళి గంటమాత్రమే అయింది.

'ఇప్పుడు కొంచెం తేరుకున్నావనుకుంటా' గ్లెట్కిన్ అడిగాడు. 'నీ ప్రతివిప్లవోద్దేశాల సమస్యను గురించిన చివరి ఘట్టంలో వున్నాం.'

ఇంకా మంచుపట్టుకొని వున్న రుబషోవ్ కుడిచేతివైపు కొంచెం విస్మయంతో చూచాడు, అతనిచెయ్యి కుర్చీ చేతి మీద పెట్టేటప్పుడు. రుబషోవ్ అతనిచూపును గమనించి, మందహాసంచేసి చెయ్యి దీపందగ్గర పెట్టాడు. దీపపువేడికి చేతిలో మంచు కరగటం యిద్దరూ గమనించారు.

'నీ ఆంతర్యోద్దేశానికి చెందిన సమస్యే ఆఖరుది. దీనిమీద కూడ సంతకం చేస్తే మనకు పని తీరిపోతుంది.'

చాల సేపటినుంచీ లేని కాంతితో దీపం వెలుగొందు తోంది. రుబషోవ్ మిటకరించక తప్పలేదు.

'...అప్పుడు నీవు విశ్రాంతి తీసుకోవచ్చు,' గ్లెట్కిన్ చెప్పాడు.

రుబషోవ్ తన కణతలమీద చెయ్యి పెట్టి తడిమి చూచు కున్నాడు. కాని మంచు చల్లదనం పోయింది. గ్లెట్కిన్ వాక్యం ముగిస్తూ అన్న 'విశ్రాంతి' అనే మాట ఆ నిశ్శబ్దతలోనే పూగిసలాడింది; విశ్రాంతి, నిద్ర. ఒకనాయకుణ్ణి మొన్నకుని ఈజిప్టు కెళ్ళిపోదాం......ముక్కద్దాల్లోనుంచి మిటకరించి, గ్లెట్కిన్ వైపు చూచాడు.

'నా వుద్దేశాలను గురించి నాకు తెలిసినంత నీకూ తెలుసు. నేను 'ప్రతివిప్లవ మనస్తత్వం'తో లేననీ, విదేశీ ప్రభుత్వపు కొలువులోనూ లేననీ నీకు తెలుసు. నే నాలో చించిందీ, చేసిందీ నా నిశ్చయాల కనుగుణ్యంగానే, బుద్ధి పూర్వకంగా ఆలోచించే, ప్రవర్తించాను.'

గ్లెట్కిన్ బల్ల సొరుగులోనుంచి ఒకకట్ట తీసి అందులో నుంచొక కాగితంలాగి ఏకస్వన స్వరంతో చదివాడు.

'"...మనకు ఆంతరంగిక సదుద్దేశాల సమస్యతో ప్రసక్తి లేదు. తప్పుదారిలో పడ్డవాడు మూల్యం చెల్లించా ల్సిందే. సక్రమమార్గంలో వున్నవాడు విముక్తి చెందుతాడు. అదీ మన ధర్మం...." నీవు అరెస్టయిన వెంటనే వ్రాసుకున్న డైరీలో యిట్లా వ్రాశావు.'

రుబషోవ్‌కి పరిచితమైన దీపపుమెరుపు కనురెప్పల లోపల కనిపించింది. తాను ఆలోచించి, వ్రాసిన ఆ వాక్యం గ్లెట్కిన్ నోటివెంట నగ్నంగా పలికింది — ఒక అనామక పురోహితుని కుద్దేశించబడిన ఒప్పుదలలాగ, గ్రామఫోన్ రికార్డు రెక్కించిపెడ్తే యిప్పుడు ఆ రికార్డు బరబరమంటూ మోగుతున్నట్లు వినిపించింది.

కాగితాలకట్టలో నుంచి మరొక కాగితం లాగి, రుబషోవ్ మీదనే దృష్టి నిలిపి, ఒకే ఒకవాక్యం చదివాడు.

'గౌరవమంటే, ఆత్మాహంకారం లేకుండ చివరి ఫలితాంశం వరకూ సేవించటమే.'

గ్లెట్కిన్ చూపును తట్టుకోవటానికి ప్రయత్నించాడు.

'ప్రపంచంయెదుట పార్టీ సభ్యులు మట్టిలోపడి దొర్లటం పార్టీకేమంత ఘనతో నా కర్థంకావటంలేదు. నన్ను సంతకం పెట్టమన్న చోటనల్లా సంతకం పెట్టాను. ఒక అక్రమ, భౌతికంగా ప్రమాద విధానాన్ని అనుసరించాననే తప్పిదాన్ని వొప్పుకొన్నాను. నీ కంతవరకు చాలదా ?'

ముక్కద్దాలు పెట్టుకొని, దీపకాంతిలో నిస్సహాయంగా మిటకరించి చూస్తూ, అలిసి బొంగురుబోయిన గొంతుతో ముగించాడు.

'ఏమైనప్పటికీ యన్. యస్. రుబషోవ్ పేరు పార్టీ చరిత్రలో ఒక భాగం. ఆ పేరును మట్టిలో యీడిస్తే విప్లవ చరిత్రనే పంకిలం చేయట మౌతుంది.'

గ్లెట్కిన్ కాగితాలకట్ట తిరగేశాడు.

'దానికి సమాధానం నీ వ్రాతల్నించే వుదహరించగలను,

నీవు వ్రాసిందేమంటే. 'ప్రతి వాక్యాన్ని, పదే పదే అంటూ సులభంగాచేసి ప్రజల కెక్కించటం అవసరం. సక్రమంగా ప్రతిపాదితమైనది బంగారంలా మెరవాలి. అక్రమంగా ప్రతిపాదితమైనది నల్లగా మురికి గుంటలా వుండాలి. రాజకీయ క్రమాలన్నిటికీ, ప్రజలు స్వీకరించటం కోసం, సంతలో మిఠాయిలాగ రంగులు పూయాలి.'

రుబషోవ్ మౌనం వహించాడు. కాసేపటికి,

'అదన్న మాట నీ వుద్దేశం. నీ హాస్యగాడిఆటలో నేను దెయ్యపుపాత్ర ధరించాలన్న మాట — పళ్ళు కొరుక్కొని, నాలుక పీక్కొని — అదికూడ స్వచ్ఛందంగానే. డాంటన్‌కు, అతడి మిత్రులకు కనీసం యీ దుర్దశ తప్పింది.'

గ్లెట్కిన్ కట్టకట్టేశాడు. కొంచెం ముందుకు వంగి కఫ్‌లు సర్దుకున్నాడు.

'విచారణ సమయంలో నీ విచ్చే ప్రమాణ్యాం ఒక్కటే. నీవు పార్టీకి చేయగలిగిన చివరిసేవ.'

రుబషోవ్ జవాబివ్వలేదు. అలిసినవాడు యెండలో నిద్రపోయినట్టుగా దీపకాంతిలో కళ్ళుమూసుకుని వుపశమించాడు. కాని గ్లెట్కిన్ గొంతునుంచి మాత్రం తప్పించుకొనే మార్గంలేదు.

'నీ డాంటన్, ఆ సమావేశం యిప్పుడున్న ప్రమాద స్థితితో పోలిస్తే అదొక వుల్లాసక్రీడ. దాన్నిగురించి నేనూ పుస్తకాల్లో చదివాను. వాళ్ళు జుట్టుపిలకలకు పౌడిఅద్ది తమ వ్యక్తిగత గౌరవాన్ని గురించి వుపన్యాసాలు దంచారు. వాళ్ళకు ఘనతావాభంగిమతో చావటమే ముఖ్యం; అది మంచి

చెయ్యనీ, చెడు చెయ్యనీ.'

రుబషోవ్ మాట్లాడలేదు. అతని చెవుల్లో ఝుంకారం, గునగొణ ప్రతిధ్వనించినయ్. గ్లెట్కిన్ స్వరం అతన్ని మించింది. అది ప్రతివైపునుంచీ చుట్టుముట్టింది. నొప్పిగా వున్న తలమీద నిర్దయతో మొట్టింది.

'ఇక్కడ ప్రమాదంలో పడిందేమిటో నీకు తెలుసు. చరిత్రలో మొదటిసారిగా విప్లవం అధికారాన్ని జయించటమే కాక దాన్ని నిలబెట్టుకొన్నది. మనదేశాన్ని నూతన యుగానికి కోటబురుజుగా చేశాం, మనం. మనదేశం ప్రపంచంలో ఆరోవంతువుంది; మనప్రజలు ప్రపంచ జనాభాలో పదోవంతు వున్నారు.'

గ్లెట్కిన్ గొంతు యిప్పుడు రుబషోవ్ వెనుక ధ్వనిస్తోంది. లేచి గదిలో అటూ యిటూ తిరుగుతున్నాడు. ఇలా జరగటం యిదే మొదటిసారి. ప్రతి అడుక్కీ బూట్లు కిర్రుమంటున్నయ్. గంజిపెట్టిన యూనిఫారం కీచుమంటోంది. చెమట, తోలు వాసనల పుల్లటికంపు కొడ్తోంది.

'మన దేశంలో విప్లవం విజయమైనప్పుడు, మనం మిగతాప్రపంచమంతా మనల్ని అనుసరిస్తుందని నమ్మాం. దానికిబదులు ప్రతీఘాతుక తరంగం లేచింది; మనల్ని మట్టం చేయటానికి. పార్టీలో రెండు ప్రవాహాలున్నయ్. అందులో ఒకటి, మనకున్న దానితో యితర ప్రపంచ మంతటా విప్లవం తేవాలని తెగించి ముందుకొచ్చేది. నీవు అందులోవాడవు. ఈ ప్రవాహంప్రమాదకరమైనదని గుర్తించి దాన్ని హరింపచేశాం.'

రుబషోవ్ యేదో మాట్లాడటానికి తలెత్తబోయాడు.

కాని గ్లెట్కిన్ పాదధ్వని బుర్రలో ప్రతిధ్వనించింది. బాగా సాక్కివున్నాడు. వెనక్కు ఆనుకొని, కళ్లుమూశాడు.

గ్లెట్కిన్ కంఠం చెప్పుకుపోయింది:

'పార్టీ నాయకుడికి విశాలమైన దూరదృష్టి, పట్టుదలగల యుక్తులు వున్నయ్. ప్రపంచవ్యాపిత ప్రతీఘాతానికి తట్టుకొని కోటబురుజును కాపాడటంమీదే సర్వం ఆధారపడివుందని గ్రహించాడు. ప్రపంచం నూతన విప్లవానికి సిద్ధపడటానికి పది, యిరవై, బహుశా యాభై యేళ్ళుకూడ పట్టవచ్చునని గుర్తించాడు. అప్పటివరకు మనం ఒంటరిగా వుండాల్సిందే. అప్పటివరకు మనకు ఒకటే విధి: పతనం కాకుండ వుండటం.'

రుబషోవ్ స్మృతిపథంలో ఒక వాక్యం మెరిసింది. 'తన ప్రాణం కాపాడుకోవటం విప్లవకారుని విధి.' ఎవరు చెప్పారు? తనేనా? ఇవనోవ్ అన్నాడా? ఆ సూత్రంమీద ఆధారపడే తాను ఆర్లోవాను బలిచేశాడు. అది తననెక్కడ కీడ్చుకుపోయింది?

'...పతనం కాకుండటానికి' గ్లెట్కిన్ స్వరం ధ్వనించింది. 'ఏ త్యాగంవల్లనైనాసరే, యెంత ఖరీదైనా సరే యీ నిర్మాణాన్ని నిలబెట్టాలి. పార్టీ నాయకుడు అద్వితీయ సూక్ష్మదృష్టితో దీనిని గుర్తించి, నిరంతరం అన్వయింపజేశాడు. మన జాతీయ విధానానికి అంతర్జాతీయ పార్టీ విధానం లోబడివుండాలి. ఈ అవసరాన్ని గుర్తించని వాళ్ళనందర్నీ హతమార్చాలిసిందే. యూరపులోని మన కార్యకర్తల వర్గాలన్నీ భౌతికంగా నాశనం కాబడాలిసిందే. మన కోటబురుజును రక్షించుకోవటం కోసం విదేశాల్లోని మన బలగాన్ని

త్రోక్కియ్యటానికి మనం యెప్పుడూ వెనుకాడలేదు. అకాలంలో రేగిన విప్లవాల నణచివేయటానికి మన శత్రుదేశాల ప్రతీఘాతుక ప్రభుత్వ పోలీసుశాఖతో చేతులుకలపటానికి యెప్పుడూ వెనుకాడలేదు. మన కోటబురుజును కాపాడుకోవటానకి మన మిత్రుల్ని వంచించి, శత్రువులతో రాజీపడటానికెప్పుడూ వెనుకాడలేదు. ప్రథమ విజయవిప్లవ ప్రతినిధులమైన మనకు చరిత్ర చెప్పినపని అది. దీన్ని హ్రస్వదృష్టివాళ్లు, విలాస పురుషులు, నీతివాదులు అర్థం చేసుకోలేదు. కాని విప్లవనాయకుడు యిదంతా ఒకే విషయం మీాద ఆధారపడి వుందని అర్థం చేసుకొన్నాడు— తెలివిగా తప్పుకోవటం.'

గ్లెట్కిన్ పచార్లు ఆపాడు. రుబషోవ్ కుర్చీవెనుక ఆగాడు. చెమటతో అతని తలమీాద గాయపుమచ్చ మెరిసింది. రొప్పి జేబుగుడ్డతో తల తుడుచుకున్నాడు. తన ఆచారబద్ధ ప్రత్యేకతను సడలించినందుకు కొంచెం తత్తరపడినట్లు కనిపించాడు. బల్లకు వెనుక మళ్ళీ కూర్చుని, దీపకాంతి కొంచెంతగ్గించి, మామూలు అవ్యక్తస్వరంతో కొనసాగించాడు.

'పార్టీ పంథా సూక్ష్మంగా వివరించబడింది. దాని యెత్తుగడలు, గమ్యం మార్గాన్ని సమర్థిస్తుందనే సూత్రం మీాద ఆధారపడి నిర్ణయింపబడ్డాయ్. యే మార్గమైనసరే. రుబషోవ్, యీా సూత్రబలంతో నే పబ్లిక్ ప్రాసిక్యూటరు నీ ప్రాణాల్ని తీయాలంటాడు.

'రుబషోవ్, నీ ముఠాను నాశనం చేశాం. నీకు పార్టీని విడదీయటమంటే అంతర్యుద్ధమని తెలిసినప్పటికీ పార్టీని విడదీయ ప్రయత్నించావు. తమమీాద ప్రయోగించిన బలివిధాన

స్వరూపమేమిటో యింకా తెలియని రైతుల్లో యెంత అసంతృప్తి వుందో నీకు తెలుసు. కొద్దిమాసాల్లోనే యుద్ధం రావచ్చు; అప్పుడు యిటువంటి ఆలోచనలు కల్లోలానికి దారి తీయగలవు. అందువల్ల పార్టీ ఐక్యంగా వుండటం అత్యంతావసరం. ఒకే మూసలో అచ్చుపోసినట్లుండాలి– గుడ్డి క్రమశిక్షణతో, సంపూర్ణ విశ్వాసంతో. రుబషోవ్, నివు, నీ మిత్రులు పార్టీలో చీలిక తెచ్చారు. మీ పశ్చాత్తాపమే నిజమైతే ఆ చీలికను మూపటానికి సాయపడాలి. నీకు చెప్పాను, యిదే పార్టీ నిన్ను కోరే ఆఖరుసేవ అని.'

'నీ పని చాల తేలిక. నీ వేతయూరు చేశావు;ఒప్పును మెరిపించటం, తప్పుకు మసిబూయటం. ప్రతిపక్ష విధానంతప్పు. అందువల్ల నీ పనేమిటంటే ప్రతిపక్షాన్ని అపహాస్యం చేయటం. ప్రతిపక్షమే నేరమని, ప్రతిపక్షనాయకులు నేరస్థులనీ ప్రజానీకానికి అర్థమయేటట్లు చెప్పాలి. ప్రజల కర్థమయ్యే తేలికభాష అదే. నీ సంకీర్ణ భావాలను గురించి మాట్లాడటం ప్రారంభించావా వాళ్ళలో మరింత గందరగోళం పుట్టించినవాడవౌతావ్. రుబషోవ్, నీ పని దయా, సానుభూతులను ప్రదీపింపచేయకుండటమే. ప్రతిపక్షం పట్ల దయా, సానుభూతులు చూపటమంటే దేశానికి ప్రమాదం.

'కామ్రేడ్ రుబషోవ్, పార్టీ నీకప్పగించినపని అర్థమైందనుకుంటాను.'

వాళ్ళిద్దరి పరిచయం ప్రారంభమైన తర్వాత యిదే, రుబషోవ్‌ను మొదటిసారిగా 'కామ్రేడ్' అని సంబోధించటం.

రుబషోవ్ తొందరగా తల పైకెత్తాడు. తనలో ఒక వేడి కెరటం పైకుబికినట్లయింది, కాని నిస్సహాయుడు. ముక్కుద్దాలు తగిలించుకొనేటప్పుడు గడ్డం కొంచెం వణికింది.

'అర్థమైంది.'

'పార్టీ నీ కేవిధమైన బహుమాన మివ్వబోవటంలేదని గుర్తించు. కొంతమంది నేరస్థులు శారీరక బాధతో లొంగారు. మిగతావాళ్ళు తమ ప్రాణాలు కాపాడతామంటే లొంగారు; లేక మాకు శత్రువులుగా చిక్కిన తమ బంధువుల్ని కాపాడతామంటే లొంగారు. కామ్రేడ్ రుబషోవ్, నీతో బేరమేమీ లేదు. నీకు వాగ్దానమేమీ లేదు.'

'అర్థమైంది.'

గ్లెట్కిన్ కాగితాల కట్టవైపు చూచాడు.

'నీ పత్రికలో ఒక వ్యాసభాగం నన్ను ముగ్ధుణ్ణి చేసింది. నీవు వ్రాశావు: "నేను అవసరమైనరీతిని ఆలోచించి, వర్తించాను. నేను సక్రమమైతే పశ్చాత్తాప పడనక్కరలేదు. అక్రమమైతే మూల్యం చెల్లిస్తాను."'

ఆ కాగితాలకట్టనుంచి దృష్టి రుబషోవ్ మీదికి తిరిగింది. రుబషోవ్ ముఖంలోకి చూస్తూ,

'కామ్రేడ్ రుబషోవ్, నీవు తప్పుకాబట్టి చెల్లించు. పార్టీ ఒక్కటే వాగ్దానం చేస్తుంది. విజయానంతరం, ప్రతిపక్షం ఏమీ చేయలేదని తేలిన తర్వాత యీ రహస్యపు బీరువాలలోని విషయమంతా ప్రకటింపబడుతుంది. అప్పుడు ప్రపంచం, నీ వన్నట్లు, యీ హాస్యగానిఆట వెనుక ఏముందో తెలుసుకుంటుంది. మేం చరిత్రపాఠాల కనుగుణంగా నడుచు

కున్నామని తెలుసుకుంటుంది !'

కొంచెం తటపటాయించాడు. కఫ్‌లు సర్దుకుని వికృతంగా ముగించాడు. అప్పుడు నెత్తిమీద మచ్చ యెర్రబడింది.

'మరి అప్పుడు నీకు, పూర్వతరపు నీ మిత్రులు కొందరికి, యీనాడు నిరాకరించబడిన, దయా, సానుభూతులు లభిస్తాయ్.'

మాట్లాడుతూనే, సిద్ధం చేసిన వాఙ్మూలం రుబషోవ్ వద్దకు త్రోసి కలంకూడా ప్రక్కనే పెట్టాడు. రుబషోవ్ నిలబడి వ్యధిత మందహాసంతో అన్నాడు.

'అడవిమనుషులు భావుకులుగామారితేయెలావుంటుందా అనియెప్పుడూఆశ్చర్యపోయేవాడిని.ఇప్పుడు తెలుసుకున్నాను.'

గ్లెట్కిన్ కూడ నిలబడి, 'నా కర్థంకాలేదు' అన్నాడు.

ప్రతివిప్లవోద్దేశాలతో తను నేరాన్ని చేసినట్లూ, విదేశీ ప్రభుత్వాలకొలువులో వున్నట్లూ ఆరోపింపబడినదానికి ఒప్పుదలమీద సంతకంచేశాడు. తలెత్తగానే అతని దృష్టి యెదుటి గోడమీద వ్రేలాడుతున్న నెం. 1 వర్ణచిత్రం మీదపడింది. తాను కొన్ని సంవత్సరాలనాడు శెలవు తీసుకున్నప్పుడు నవ్విన మర్మాంతకపు నవ్వు గుర్తుకొచ్చింది. ఆ సర్వవ్యాపిత చిత్రం లోనుంచి మానవజాతిమీద ప్రసరింపజేసే వ్యాకులవిరక్తత.

'నీ కర్థం కాకపోతే ఫర్వాలేదులే. పూర్వతరపు ఇవనోవ్‌లు, రుబషోవ్‌లు, కీఫర్‌లు మాత్రమే అర్థంచేసుకోగలిగిన విషయాలున్నయ్. అది యిప్పుడయిపోయింది.'

'విచారణ ప్రారంభమయ్యేవరకూ నిన్ను బాధించవద్దని ఆజ్ఞయిస్తాను' అని కొంచెం ఆగి గ్లెట్కిన్ చెప్పాడు,

మామూలు పద్ధతినే. రుబషోవ్ మందహాసం చిరచిరలాడిం చింది. 'ఇంకేమైనా ప్రత్యేకపుకోర్కె వుందా?'

'నిద్ర పోవాలని' రుబషోవ్ చెప్పాడు. వార్డరు భూతం ప్రక్కనే తెరచినవాకిట్లో నిలబడివుంటే, ముక్కద్దాలతోను, గడ్డంతోను, చిన్నవాడుగా, వయస్సుమీరి, అల్పంగా కన్పించాడు.

'నీ నిద్రకు భంగం కలిగించొద్దని ఆజ్ఞాపిస్తాను.' గ్లెట్కిన్ చెప్పాడు.

రుబషోవ్ వెనుక తలుపు మూసుకున్నతరువాత తన బల్లవద్ద కెళ్ళాడు. కొంచెంసేపుప్రతిమలాకూర్చుని, కార్యదర్శి కోసం గంటమ్రోగించాడు. ఆమెవచ్చి, మూల తన యధా స్థానంలో కూర్చుని 'నీ విజయానికి అభినందిస్తున్నాను, కామ్రేడ్ గ్లెట్కిన్!' అన్నది.

గ్లెట్కిన్ దీపాన్ని యధాస్థితికి తగ్గించాడు.

దీపం వైపు దృష్టిబరపి 'అదీ, నిద్రలేమి, శారీరక అల సట యీ మూడూకారణం. ఇదంతా శారీరక ప్రకృతికి సంబం ధించింది' అన్నాడు.

# వ్యాకరణ గల్పిక

'మార్గం చూపకుండా ఆశయం చూపకు. ఎందుకంటే, భూమ్మీద గమ్యాలు, మార్గాలు పెనవేసుకొని వున్నయ్. మార్గం మారిస్తే ఆశయం కూడా మార్చు, ప్రతి విభిన్న మార్గంలో యితర గమ్యాలు కనిపిస్తుం టాయి.

ఫెర్డినాన్డ్ లస్సలె :
ఫ్రాన్జ్ వాన్ సికింజెన్

# 1

'నేరస్థుడైన రుబషోవ్ తప్పుచేసినట్లు ఒప్పుకొన్నావా అని అడిగినప్పుడు, 'అవును' అని స్పష్టంగా అన్నాడు పబ్లిక్ ప్రాసిక్యూటరు నేరస్థుడు ప్రతివిప్లవ ప్రతినిధిగా పని చేశాడా లేదా అని అడిగినదానికి మళ్ళీ 'అవును' అని లోస్వరంతో జవాబిచ్చాడు....'

కాపలా వాసిలిజ్ కూతురు ప్రతి అక్షరం విడదీసి నెమ్మదిగా చదివింది. వార్తాపత్రిక బల్లమీదపరిచి వ్రేలితో పంక్తుల్ని తడుముతూ చదువుతోంది; అప్పుడప్పుడు పువ్వుల తలరుమాలును తడుముకొంటున్నది.

'...ప్రతివాదం చేయటానికి న్యాయవాదిని నియమించుకుంటావా అని అడిగితే నేరస్థుడు తనకున్న హక్కును వదలుకొంటానన్నాడు. అప్పుడు న్యాయస్థానం వారు నేరారోపణను చదివారు....'

వాసిలిజ్ గోడవైపు మొఖంపెట్టి పడుకున్నాడు. వెరా వాసిల్జోవ్నాకు తాను చదువుతున్నది తన తండ్రి వింటున్నాడో లేక నిద్రపోతున్నాడో సరిగా తెలియలేదు. అప్పుడప్పుడు తనలోతాను గొణుక్కున్నాడు. ఆవిడ అదేమీ పట్టించుకోకుండా ప్రతిదాన్నీ బిగ్గరగాచదివేది—'కేవలం జ్ఞానం కోసం' — ఫ్యాక్టరీలోపని అయింతర్వాత సెల్ సమావేశాని కెళ్ళి, యింటికి ప్రొద్దుపోయి వచ్చినప్పటికీ.

'... నేరవిచారణలో నేరస్థుడు రుబషోవ్ నేరారోపణ లోని అన్ని అంశాల విషయంలోనూ దోషి అని, ప్రాథమిక విచారణలో అంగీకరించినదాన్ని బట్టీ, లిఖితరూపక సాక్ష్యం బట్టీ ఋజువైంది. న్యాయస్థాన అధ్యక్షుడు యేమైన ప్రాథమిక విచారణకు అభ్యంతరాలు వున్నాయా అని అడిగి నప్పుడు నేరస్థుడు లేవన్నాడు, పైగా తన ప్రతివిప్లవ నేరా లకు హృదయపూర్వక పశ్చాత్తాపంతోనే ఒప్పుదలను యిచ్చానని చెప్పాడు....'

వాసిలిజ్ కదల్లేదు. అతని పక్క పైన తలకు సరిగా పైన గోడమీద నెం. 1 చిత్రం వ్రేలాడుతోంది. దాని ప్రక్కనే ఒకతుప్పుపట్టిన మేకు గోడకు కొట్టివుంది, ఆ మేకుకు కొద్ది కాలంక్రితం వరకు దేశీయ సేనాపతిగా రుబషోవ్ చిత్రం వ్రేలాడుతుండేది. తన కూతురుకు తెలియకుండ గడ్డిపరుపులో నలిగి, మాసిన బైబిల్‌ను దాచుకున్నప్రాంతం కోసం వాసి లిజ్ తడిమాడు; రుబషోవ్ అరెస్టు అనంతరం అతని కూతురు చూచి కేవలం వైజ్ఞానిక కారణాలవల్ల బైబిల్ తీసిపారేసింది.

'... ప్రాసిక్యూటరు కోరినమీదట నేరస్థుడు రుబషోవ్ పార్టీ విధానంయెడ తనవ్యతిరేకత రానురాను ప్రతివిప్లవ వాది గాను, పితృభూమికి దేశద్రోహిగాను మార్చిన పరిణామ క్రమాన్ని వివరించాడు. క్రిక్కిరిసివున్న ప్రేక్షక సమూహం యెదుట తన వాఙ్మూలం యీవిధంగా చెప్పాడు: 'పౌర న్యాయమూర్తులారా, విచారణాధికారి యెదుట, మన దేశపు న్యాయప్రతిసిద్ధులైన మీ। యెదుట నా లొంగుటను సకారణంగా వివరిస్తాను. నా గాథ మీకు, పార్టీవిధానం యెడ

యేమాత్రపు విభేదమైనా యేవిధంగా తప్పనిసరియైన ప్రతివిప్లవపు బందిపోటుతనానికి దారితీస్తుందో స్పష్టంచేస్తుంది. మన ప్రతిపక్షపోరాటపు అవసరఫలితం యేమంటే, మనల్ని ముందు ముందుకు త్రోసుకుపోయి బురదగుంటలో పడేస్తుంది. నా పతనం, యీ నిర్ణయసమయంలోకూడ యింకా అస్థిమితంగా వూగులాడేవాళ్ళకు, పార్టీసక్రమవిధానం యెడ, నాయకత్వం యెడ గుప్తసందేహాలున్న వాళ్ళకు హెచ్చరిక అని వర్ణిస్తాను. సిగ్గుతో మునిగి మట్టిలోత్రొక్కబడి, చావుకుసిద్ధమైన దేశద్రోహి విషాదపరిణామగాథను కోటానుకోట్ల దేశీయులకు గుణపాఠంగానూ, భయంకర వుదాహరణగాను వివరిస్తాను. ...'

వాసిలిజ్ రెండోవైపుకు తిరిగి ముఖం గడ్డిపరుపులో దూర్చి అదుముకున్నాడు. భోజనం యెంత అధ్వాన్నంగా తయారైనా రుబషోవ్ సేనాపతి వాతావరణాన్ని యెంత ఆహ్లాదకరంగా తయారుచేసేవాడో తలుచుకున్నాడు. 'మట్టిలో త్రొక్కబడి, చావుకు సిద్ధమై. ...' అంటూ వాసిలిజ్ మూలిగాడు. బైబిల్ పోయింది, కాని అందులోభాగాలు యెన్నో కంఠతా వచ్చు.

'...ఈ అంశంవద్ద పబ్లిక్ప్రాసిక్యూటరు నేరస్థుని కథాక్రమానికి కొంత భంగంకలిగించాడు. రుబషోవ్‌కి పూర్వకార్యదర్శి ఆర్లోవా దేశద్రోహకరచర్యలకు వురితీయబడిన గతికి సంబంధించిన ప్రశ్నలడిగాడు. నేరస్థుడు రుబషోవ్ చెప్పిన సమాధానాలను బట్టి, పార్టీ అప్రమత్తతవల్ల తానొకమూలలకు తప్పుకొని, తనప్రాణాలను కాపాడుకోటానికి తర్వాత తన సిగ్గు

మాలినచర్యల్ని కొనసాగించటానికి, తన నేరాలన్నిటికి ఆమెను బాధ్యురాలిని చేశాడు. యన్. యస్. రుబషోవ్ తన పైశాచిక నేరాల్ని సిగ్గులేకుండ, విరక్త నిష్కాపట్యంతో అంగీకరించాడు. 'నీ కేమీ నైతికజ్ఞానం లేనట్టుగా కనిపిస్తుంది' అన్న ప్రాసిక్యూటరు వ్యత్తిహాసుపుకు నేరస్థుడు అవహేళనాపూరిత మందహాసంతో 'కనిపిస్తోంది' అని జవాబిచ్చాడు. అతని ప్రవర్తన ప్రేక్షకుల్ని పదే పదే కోప, ద్వేషాలతో చప్పట్లు చరిచి, కేకలు వేసి, అల్లరి చేసేటట్లు చేసింది. కాని న్యాయస్థాన అధ్యక్షుడు వెంటనే కల్పించుకుని ఆ సద్దును త్వరితంగా అణచివేశాడు. ఒకసారి యీ విప్లవ న్యాయభావప్రకోపం వుత్సాహోద్రేక ప్రకర్షకు కూడ మూలమైంది. నేరస్థుడు తనకు పంటినొప్పి భరింపశక్యంకానంత తీవ్రంగావుంది కాబట్టి విచారణాక్రమాన్ని కొన్ని నిమిషాలపాటు నిలుపుచేయమని కోర్టును విన్నవించుకొన్నప్పుడు, విప్లవన్యాయం ప్రకారం అధ్యక్షుడు అతని కోర్కెను మన్నించి, ద్వేషంతో భుజాలెగురవేసి, ఐదు నిమిషాలసేపు విచారణ నిలుపుచేయమని ఆజ్ఞాపించి, విప్లవ న్యాయసాంప్రదాయాన్ని నిలబెట్టాడు.'

వాసిలిజ్ వెల్లకిల పడుకొని, రుబషోవ్ విదేశీయుల చేతుల్లోనుంచి తప్పించుకొని స్వదేశానికి తిరిగివచ్చినప్పుడు సభలకు, సమావేశాలకు ఘనవిజయోత్సాహంతో వూరేగించిన సందర్భాలు, వుపన్యాస వేదికల మీద అలంకరించిన అరుణపతాకలు, అలంకరణలమధ్య వూతకోలల మీద ఆనుకునినిలబడి మందహాసం చేస్తూ, మెడతెగని ఆనందోత్సాహ, జయ జయధ్వానాలమధ్య, ముక్కద్దాలు తుడుచుకుంటూ

చూస్తున్న దృశ్యం గుర్తుకొస్తే, ఆలోచిస్తున్నాడు.

"మరి ఆ సైనికులు అతన్ని ప్రెటోరియమ్ అనే సభామందిరానికి తీసు కెళ్ళారు; అందర్నీ పిలిచి ప్రోగుచేశారు. అతని నెత్తిమీద ముళ్ళకిరీటం పెట్టారు, ఉమ్మివేశారు; ఆ తర్వాత మోకాళ్ళమీద వంగి, పూజించారు."

అని బైబిల్‌లోని ఒకభాగాన్ని వాసిలిజ్ గొణిగాడు.

'ఏమిటి గొణుక్కుంటున్నావ్?' కూతురు అడిగింది.

'ఏం లేదులే' అని వాసిలిజ్ గోడవైపుకు తిరిగాడు.

గడ్డిపరుపులో ఖాళీభాగాన్ని చేత్తో తడిమిచూచాడు, కాని అది ఖాళీగానే వుంది. కూతురు రుబషోవ్ చిత్రాన్ని గోడమీదనుంచి తీసి పాచిడబ్బాలో పారవేసినప్పుడు తానేమీ వద్దనలేదు – ఇప్పుడు జైలు పరాభవాన్ని సహించ లేకున్నాడు.

కూతురు చదవటం ఆపేసి, బల్లమీదటీ తయారు చేయ టానికి స్టౌ పెట్టింది. ఇల్లంతా ఘాటు పెట్రోలువాసన కొట్టింది. 'నేను చదివేది వింటున్నావా?' అని అడిగింది కూతురు.

వాసిలిజ్ సవినయంగా ఆమెవైపు తలత్రిప్పి, 'అంతా విన్నాను' అన్నాడు.

'అయితే యిప్పుడు తెలిసిందిగా,' వెరా వాసిల్జోవ్నా స్టౌలో పెట్రోలు యెక్కిస్తూ అన్నది. 'తనకు తానే దేశ ద్రోహినని చెప్పుకున్నాడు. అది నిజంకాకపోతే అలా చెప్పు కోడు. మా ఫ్యాక్టరీ సమావేశంలో అప్పుడే తీర్మానించాం, దానిమీద అందరూ సంతకాలుచేయాలి.'

'నీకు దాన్ని గురించి చాలా తెలియాలి!' వాసిలిజ్ నిట్టూర్చాడు. ఆమె చటుక్కున అతని వైపు చూచింది. అతడు

తలగోడవైపుకు త్రిప్పుకున్నాడు. ఆమె అలాచూచిన ప్రతిసారీ, ఆ యింటి భాగమంతా తనకై ప్రత్యేకించుకోవాలనుకొన్న తన కూతురు కోర్కెను భంగం కలిగిస్తున్నానా అనుకుంటాడు. మూడువారాల క్రితం ఆమె, తాను పనిచేసే ఫ్యాక్టరీలో ఒక చిన్న యంత్రకారుడు కలిసి వివాహరిజిస్టరులో పేర్లు నమోదు చేశారు, కాని యీ జంటకు యిల్లు లేదు; ఆ కుర్రాడు తన సహచరు లిద్దరితో కలిసి వుంటున్నాడు; యీరోజుల్లో గృహ నిర్మాణసంస్థ యెవరికైనా యిల్లు చూపించాలంటే చాల సంవత్సరాలు పడుతోంది.

చివరికి స్టౌ వెలిగింది. టీ పాత్ర దానిమీద పెట్టింది వాసిల్జోవ్నా.

'మా సెల్ కార్యదర్శి తీర్మానం చదివి వినిపించాడు. అందులో దేశద్రోహులు నిర్దాక్షిణ్యంగా నిర్మూలించబడాలని కోరుతున్నామని వ్రాశారు. వాళ్ళయెడల దయా దాక్షిణ్యాలు చూపించినవాడు కూడ దేశద్రోహిగానే పరిగణింపబడి, బహిరంగంగా అధిక్షేపించబడాలి' వుద్దేశపూర్వకంగానే యాదాలాప స్వరంతో వివరించింది. కార్మికులు అప్రమత్తులై వుండాలి. మేమంతా సంతకాలు పెట్టటానికి మాకు ఆ తీర్మానం ప్రతులు తలకొకటి యిచ్చారు.'

వెరా వాసిల్జోవ్నా జాకెట్‌లోనుంచి కొంచెం నలిగిన కాగితం వొకటి తీసి బల్లమీదపెట్టి సాఫీగా చేసింది. వాసిలిజ్ వెల్లకిలపడుకున్నాడు. గోడకుకొట్టిన తుప్పుపట్టిన మేకు సరిగా యితని నెత్తికి పైగావుంది. స్టౌ ప్రక్కనే పరిచివున్న ఆ కాగితంవైపు వోరగాచూచి, గభాలున తల త్రిప్పివేశాడు.

'మరి అతను చెప్పాడు: పీటర్, నీకు చెప్తున్నాను; యివాళ నీవు నన్ను యెరగనని మూడుసార్లు చెప్పేవరకు కోడి కూయదు....'

అని బైబిల్ భాగాన్ని గొణిగాడు.

'అంతర్యుద్ధంలో వాళ్ళంతా కూడ సంతకం చెయ్యాలా?' అన్నాడు.

పువ్వుల తలగుమాలుతోనే టీ పాత్రమీదికి వంగింది; అతని కూతురు. పూర్వపు విచిత్రదృష్టితోనే, 'ఎవ్వరూ అక్కరలేదు,' అంది. 'ఫ్యాక్టరీలో వాళ్ళకు, నిజానికి, అతను యీ యింట్లో కొన్నాళ్ళున్నాడని తెలుసు. మా సెల్ కార్యదర్శి మీరిద్దరూ చివరిదాకా మిత్రుల్లాగా వున్నారా అనీ, యెక్కువగా మాట్లాడుకునేవారా అనీ నన్నడిగాడు.'

వాసిలిజ్ ఒక్కదూకుతో పరుపుమీద యెగిరికూర్చున్నాడు. ఆ వూపుతో దగ్గువచ్చింది. సన్నటి ముడతలుపడ్డ మెడమీద నరాలు వుబ్బినయ్.

కూతురు రెండుగ్లాసులు బల్లచివర పెట్టి కాగితపు సంచిలోనుంచి కాస్త తేయాకు గ్లాసుల్లో విదిలించింది. 'మళ్ళీ యేమిటి గొణుక్కుంటున్నావ్?' అని అడిగింది.

'ఆ పాడుకాగితం యిట్లాయివ్వు.'

కూతురు కాగితం అందించింది. 'నేను చదవనా? అందులో యేముందో సరిగా తెలుస్తుంది.'

'వద్దు' అని దానిమీద తనపేరు వ్రాశాడు. 'నాకు తెలుసుకోవాలని లేదు, ఇప్పుడు కాస్త టీ యివ్వు.'

కూతురు గ్లాసు అందించింది. ఆ పసుపుపచ్చని ద్రవం నెమ్మదిగా చప్పరిస్తూ, వాసిలిజ్ యేమిటోగొణుక్కున్నాడు.

వాళ్లు టీ త్రాగిన తర్వాత కూతురు వార్తాపత్రిక చదవటం సాగించింది. 'నేరస్థులు రుబషోవ్, కీఫర్ ల విచారణ ఘట్టం ముగింపుకొస్తున్నది. పార్టీ నాయకుని హత్యాపన్నాగం మీద చర్చ జరిగేటప్పుడు ప్రేక్షకుల్లో ఆగ్రహజ్వాలలు ప్రజ్వరిల్లినయ్. "పిచ్చికుక్కల్ని కాల్చండి" అనే కేకలు మిన్ను ముట్టినయ్. నేరస్థుడు రుబషోవ్ చర్యలకు సంబంధించిన చివరి ప్రశ్నను పబ్లిక్ ప్రాసిక్యూటరు అడిగినప్పుడు రుబషోవ్ హతాశుడైనట్లు కనిపించాడు; అలిసిపోయి, యీడ్చు గొంతుతో జవాబిచ్చాడు :

'మేము, ప్రతిపక్షం ఒకసారి, విప్లవ పితృభూమి ప్రభుత్వాన్ని కూలద్రోయాలనే కూర్రాశయాన్ని కలిగివున్నప్పుడు, ఆ కార్యసాధనకు కావలసిన అటువంటి నీచపు, దౌర్భాగ్యపు చర్యల్నే అవలంబించామనీ మాత్రమే నేను చెప్పగలను.'

వెరా వాసిల్జోవ్నా కుర్చీని వెనక్కునెట్టి, 'అది విసుగెత్తిస్తున్నది. అతను నోరుచించుకునే పద్ధతి నీకు రోగాన్ని కూడ తెస్తుంది' అన్నది.

వార్తాపత్రిక నొకవైపున పెట్టివేసి స్టౌను, గ్లాసుల్ని సర్దేసింది, గలగలమంటూ. వాసిలిజ్ ఆవిణ్ణి పరిశీలిస్తున్నాడు. వేడి టీ కొంత ధైర్యాన్నిచ్చింది. లేచి కూర్చున్నాడు.

'నీకు అర్థమైందనుకుంటున్నావు కదూ, అలా చెప్పినప్పుడతని మనస్సులో యేముందో భగవంతుడికే తెలియాలి. మీకు పార్టీ బాగా టక్కరితనం నేర్పింది. బాగా టక్కరిగా తయారైనవాళ్ళకు మాన, మర్యాదలు పూర్తిగ పోతయ్. గూఢలు రిక్కించటం మంచిదికాదు.' కోపంతో చెప్పాకుపోతు

న్నాడు. 'ఇప్పుడు ప్రపంచంలో తెలివితేటలు, మానమర్యాదలు తలపట్లు పట్టుకున్నయ్, అందులో ఒకదాన్ని సమర్థించేవాళ్ళు రెండోదాన్ని వదిలిపెట్టాలి. ఏ విషయాన్నైనా చివరికి తెగేదాక లాగటం మానవుడికంత శ్రేయస్కరంకాదు. అందుకనే నీ సమాధానం "అవును, అవును; కాదు, కాదు అని మాత్రమే వుండాలి; అంతకు మించి యేదివచ్చినా విషాదమే ఔతుంది" అనిచెప్పారు.'

పరుపుమీదపడి తన కూతురు ముఖకవళికలలో మార్పును చూడకుండటంకోసం తల అటువైపు త్రిప్పివేసుకున్నాడు. చాలాకాలంనుంచి ఆమెను యింత ధైర్యంగా యెదిరించలేక పోయాడు. అందువల్ల యేమైనా జరగవచ్చు. వొకసారి తనకు, తన భర్తకూ ఆ యింటిభాగం కావాలనుకొన్నది. ప్రస్తుతం జీవితంలో టక్కరిగా వుండకపోతే వృద్ధాశ్రమంలో జైలుకైనా వెళ్ళాలి, లేదా చలిలో వంతెనక్రిందైనా పడుకోవాలి. తెలివితేటల్లోనైనా వుండాలి, లేక మానమర్యాదల్లోనైనా వుండాలి. ఆరెండూకలిసి ఒకేచోటవుండవు.

'ఇప్పుడు చివరిభాగం చదువుతాను,' కూతురు ప్రకటించింది.

'పబ్లిక్ ప్రాసిక్యూటరు రుబషోవ్‌ను అడ్డు పరీక్ష చేయటం పూర్తియింది. తరువాత నేరస్థుడు కీఫర్‌ను మరొకసారి పరీక్షచేశారు; హత్యాప్రయత్నం విషయమై తనపూర్వవాఙ్మూలాన్ని పునశ్చరణ చేశాడు, సవివరంగా... న్యాయస్థాన అధ్యక్షుడు:రుబషోవ్‌నుకీఫర్ నేమైనా ప్రశ్నలడుగుతావా అని అడిగినప్పుడు రుబషోవ్ తానీ హక్కును వదులుకొం

టున్నా నన్నాడు. ఇంతటితో సాక్ష్యవిచారణముగిసి వాయిదా పడింది. మళ్ళీ విచారణ ప్రారంభమైనప్పుడు, పబ్లిక్‌ప్రాసిక్యూ టరు సారాంశాలను చదవనారంభించాడు....'

ముసలి వాసిలిజ్ ప్రాసిక్యూటరు ప్రసంగం వినదలచుకోలేదు. గోడవైపుకు తిరిగి నిద్రపోయాడు. ఆ తర్వాత తానెంత సేపు నిద్రపోయాడో, కూతురు యెన్నిసార్లు దీపంలో నూనెపోసిందో, యెన్నిసార్లు చదివిందో అతని కేమీ తెలియదు. పబ్లిక్‌ప్రాసిక్యూటరు సారాంశాలను ముగించి మరణ శిక్షను కోరినప్పుడు మెలకువవచ్చింది. బహుశా, చివరికొచ్చేసరికి కూతురు స్వరంమార్చివుండొచ్చు,కొంచెంఆగివుండొచ్చు; యేమైనా, పెద్దక్షరాలతోవున్న పబ్లిక్‌ప్రాసిక్యూటరు ప్రసంగపు ఆఖరువాక్యం దగ్గరకొచ్చేటప్పటికి మేలుకున్నాడు.

'ఈ పిచ్చికుక్కలందర్నీ కాల్చాలని కోరుతున్నాను.'

అప్పుడు నేరస్థులందరు తమ అంతిమ వాక్యాలు చెప్పుకోవటానికి అనుమతించారు.

'....ముద్దాయి కిఫర్ న్యాయమూర్తులవైపు తిరిగి, తన చిన్నతనం కారణంగా తన ప్రాణాన్ని రక్షించవలసిందిగా ప్రాధేయపడ్డాడు. మరొకసారి తన నేరపునైచ్యాన్ని అంగీకరించి, దానికి పూర్తి బాధ్యతంతా ప్రేరకుడు రుబషోవ్ మీాద వెయ్యాలని ప్రయత్నించాడు. ఆ సందర్భంలో ఆందోళనతో నత్తులు కొట్టాడు, ప్రేక్షకుల్లో కలవరం బయలుదేరింది. కాని అధ్యక్షపౌరుడు వెంటనే అణచివేశాడు. అప్పుడు రుబషోవ్ మాట్లాడటానికనుమతించారు....'

ఇక్కడ రుబషోవ్ ముద్దాయి యేవిధంగా 'ప్రేక్షకు

లందరి వైపు కలియ జూచి సానుభూతి ముఖం ఒక్కటీ కనిపిం చక నిస్పృహతో తలదించేసుకున్నాడో' పత్రికావిలేఖరి వివ రంగా వర్ణించాడు.

'రుబషోవ్ అంతిమప్రసంగం చాలకష్టంగా వుంది. ఇప్ప టికే అతని ప్రవర్తన ప్రేక్షకుల్లో కలిగించిన అసహ్యతను యీ ప్రసంగం మరింత తీవ్రపరచింది.

'పౌరాధ్యక్షా, యిక్కడ నా జీవితంలో ఆఖరుసారి మాట్లాడుతున్నాను. ప్రతిపక్షం చావమోదబడి, నాశనం చేయబడింది. 'నేను యెందుకు మరణిస్తున్నాను?' అని యివ్వాళ నన్నే ప్రశ్నించుకుంటే, నన్ను సంపూర్ణ శూన్యం యెదుర్కొంటుంది. పార్టీతోను, ఉద్యమంతోను, పశ్చాత్తాప పడకుండా, సఖ్యపడకపోతే దేనికోసమూ, యెవడూ మరణించ నక్కరలేదు. అందువల్ల నా యీ అంతిమఘడియల ద్వారంలో వుండి దేశానికీ, ప్రజానీకానికీ, సర్వప్రజలకు శిరస్సు వంచుతు న్నాను. రాజకీయ కపటవేషపుటాట, చర్చలు, కుట్రల కపట వేషధారణ తతంగం పూర్తయినయ్. మా తలల్ని పబ్లిక్ ప్రాసిక్యూటరు కోరకముందు, యెంతోకాలం క్రితమే మేం రాజ కీయంగా మరణించాం. చరిత్రదుమ్ములో యీడ్చిన పరాజితు లకే దుఃఖం. పౌర న్యాయమూర్తులారా, మీ ముందు నా కొక్కటే సమర్థన వుంది, నాకై నేను దేన్నీ తేలికచేసుకో లేదు. అహంకారం, అహంభావ అవశేషాలు నాకుచెప్పినయ్, "మౌనంగా మరణించు, యేమీచెప్పవద్దు. లేక హృదయ విదారక హంసగానంతో రాజసంగా మరణించు, నీ హృద

యాన్ని విప్పిచెప్పి నీపై ఫిర్యాదుల్ని సవాలుచెయ్యి. పూర్వ తిరుగుబాటుదారుకు యిదేసులువైనమార్గం" కానిఆ ప్రేరణను అధిగమించాను. దాన్తో నా పని పూర్తయింది. నేను చెల్లించాను, చరిత్రలో నా ఖాతా సరిచేసుకున్నాను. మిమ్మల్ని క్షమాభిక్ష వేడుకోవటం నగుబాటుగా వుంటుంది. ఇంతకంటే చెప్పవలసిందేమీలేదు.'

'...కొద్ది సమాలోచన తర్వాత అధ్యక్షుడు శిక్షను చదివాడు. ప్రధాన విప్లవన్యాయస్థానపు కౌన్సిల్ ముద్దాయిలకు ప్రతినేరానికీ అంతిమ శిక్ష విధించింది. కాల్చిచంపటం; స్వంత ఆస్తిని ప్రభుత్వాధీనం చేసుకోవటం.'

ముసలి వాసిలిజ్ తన తలకు పైగావున్న మేకువైపు వెర్రిగా చూచాడు.

'వాళ్లు ఐపోతారు, శాంతిశ్శాంతి.' గొణిగి గోడ వైపుకు తిరిగాడు.

## 2

ఆ విధంగా అంతా యిప్పటికి పూర్తయింది. అర్థరాత్రిలోపున తన జీవితం పరిసమాప్తిచెందుతుందని రుబషోవ్‌కు తెలుసు.

గదిలో పచార్లు చేశాడు. విచారణ గందరగోళం తర్వాత, ఆరున్నర అడుగులు ముందుకు, ఆరున్నర అడుగులు వెనక్కు. కిటికీవద్ద మూడో నల్ల పెంకుమీద నిలబడి వింటున్నప్పుడు, సున్నపుగోడల మధ్యనుంచి, కూపాగాధంనుంచి

వచ్చినట్లుగా నిశ్శబ్దత వచ్చి యెదురౌతోంది. లోపల, బయటా కూడ యింత ప్రశాంతత యెందుకు ఆవరించివున్నదో తెలియటం లేదతనికింకా. కాని యికముందు యేదీ తన ప్రశాంతతను భగ్నపరచలేదని తెలుసు.

వెనక్కు తిరిగిచూస్తే యీ దివ్యప్రశాంతి తనకెప్పుడు కలిగిందో కూడ జ్ఞాపకం తెచ్చుకోగలడు. తాను అంతిమ ప్రసంగం చేసేముందు విచారణ కాలంలో కలిగిందీ ప్రశాంతి తన మనస్సునుంచి ఆత్మాభిమాన అహంకారాల అవశేషాలను తొలగించి కాల్చివేశానను కున్నాడు. కాని ఆ క్షణంలో తన కళ్ళు సానుభూతికోసం, ప్రేక్షకులముఖాలు వెదుకుతోంటే నిర్లక్ష్యం, నగుబాటులు ప్రత్యక్షమైనప్పుడు, ఆఖరుసారిగా యీ మాత్రపు స్వల్ప దయార్ద్రదృక్కుల కోసం ఆతురపడ్డాడు. బిగుసుకుపోతూ తన మాటలతోనే తనను వేడిచేసుకో జూచాడు. ఆ యాకర్షణ తన గతాన్ని గురించి మాట్లాడి, ఒకసారి విజృంభించి, ఇవనోవ్, గ్లెట్కిన్‌లు తనను బంధించిన వలను త్రెంచిపారెయ్యాలని, డాంటన్ లాగ తన ఫిర్యాదులకు 'మీరు నా సంపూర్ణ జీవితంమీద చేతులువేసి అణిచివేశారు. అది లేచి, విజృంభించి మిమ్మల్ని సవాలు చేస్తుందిలే!...' అని యెలుగెత్తి చాటాలనుకునేంత తీవ్రంగా పట్టి వుంచింది. విప్లవ విచారణసంఘం ముందు డాంటన్ యిచ్చిన ప్రసంగం అతనికెంతో బాగా జ్ఞాపకముంది. ప్రతిమాట వల్లించగలడు. తాను కుర్రాడుగా వున్నప్పుడే కంఠస్థం చేశాడు. 'మీరు విప్లవాన్ని రక్తంలో ప్రార్థించా లనుకుంటున్నారు. ఎంతకాలం స్వేచ్ఛాపథాలు గోరీల శిలలుగా

వుండాలి? నిరంకుశత్వం కాలుకదిపింది. ఆమె మేలిముసుగు చింపివేసింది, తల పైకెత్తింది. ఆమె మన శవాలమీాదుగా అంగలు వేస్తుంది.'

ఆ మాటలు అతని నాలుకమీాద ప్రజ్వరిల్లినవి, కాని ఆ ప్రేరణ క్షణికమే. అతను అంతిమప్రసంగం చేయ ప్రారంభించేసరికి నిశ్శబ్దపుగంట మ్రోగింది. చాల ఆలస్యమైనదని గుర్తించాడు.

వచ్చినదారినే వెనక్కు మరలటానికి, మళ్ళీ తనపూర్వ జీవితానుభవాల్ని మరొకసారి వల్లించటానికి కాలాతీతమైనది. మాటలిప్పుడు పనిచేయవు.

అట్టి వాటన్నిటికీ కాలాతీతమైనది. ప్రపంచం మొదట అవి ప్రత్యక్షమయ్యే ఘడియ ఆసన్నమైనప్పుడు వాళ్ళెవ్వరు ఖైదీల విచారణ బోనును పక్షిముక్కుగా మార్చలేరు. వాళ్ళెవ్వరూ సత్యాన్ని ప్రపంచానికి మరుగుపరచలేరు. డాంటన్‌లాగ తన న్యాయమూర్తులకే నేరారోపణను త్రిప్పికొట్టలేరు.

కొందరు శారీరక భయంతో అణిచివేయబడ్డారు. తోట్రిపెదవివాడిలాగ, కొంతమంది తమ తలల్ని కాపాడుకోవాలనుకున్నారు. కొంతమంది కనీసం తమ భార్యాబిడ్డలు గ్లెట్కిన్‌ల వుచ్చుల్లో చిక్కుకోకుండ కాపాడుకోవాలనుకున్నారు. అందులో ఉత్తములు తాము బలిమేకల్లా ఆత్మ బలిదానం చేసి, పార్టీకి అంతిమసేవ చేయటానికి, నిశ్శబ్దంగా అంతమయ్యారు – పైగా ఆ వృత్తములకు కూడ ఒక్కొక్కడి మనస్సులో ఒక్కొక్క ఆర్లోవా వుంది; వాళ్ళు సంపూర్తిగ

తమ గతపు అంతరాళ్లో చిక్కుకుపోయారు. తమ వక్రనీతి, వక్రోతర్కాలతో అల్లిన సాలెగూడులో పట్టుబడ్డారు. వాళ్ళు దోషులే. కాని తమకై తాము నిందించుకున్న చర్యలవల్ల మాత్రం కాదు. వాళ్ళకు వెనుదిరిగే మార్గంలేదు. వాళ్ళు యేర్పరచుకున్న విచిత్రమైన క్రీడానిబంధనల ననుసరించే, వాళ్లు రంగంనుంచి నిష్క్రమించటం జరిగింది. ప్రజానీకం వీళ్ళనుంచి హంసగానం ఆశించలేదు. వాళ్లు పాఠ్య గ్రంథాను గుణ్యంగా నడుచుకో వలసివుంది, రాత్రిళ్ళు తోడేళ్ళ అరు పులు అరవటమే....

ఆ విధంగా యిప్పుడది పూర్తయింది. ఇక దాన్తో తనకు సంబంధమేమీలేదు. ఇకతాను తోడేళ్ళతోబాటు అరవనక్కరలేదు. అతను చెల్లించాడు. ఖాతా సర్దుబాట యింది. అతను సర్వబంధనాలను వదిలించుకొని, తన ఛాయ నే గోల్పోయిన మానవుడు. అతను ప్రతిఆలోచననూ అంతిమ ఫలితాంశంవరకూ అనుసరించి, చివరివరకు, అదేవిధంగా వర్తిం చాడు. అతనికివున్న వ్యవధి, తార్కికాలోచన అంతమైనచోట నుంచి ప్రారంభమైన ప్రదేశానికి చెందిన, మాన ప్రత్యర్థి కి చెందివుంది. ఉత్తమపురుష యేకవచన ప్రయోగం మొద పార్టీ తన భక్తులకు మొక్కించిన లజ్జా భావంతో నేతాను దానికి 'వ్యాకరణ గల్పిక' అని నామకరణం చేశాడు.

406 నెంబరు గదికీ,తనగదికీ మధ్యనున్న గోడకానుకొని నిలుచున్నాడు. ఆ గది రిప్ వాన్ వింకిల్ వెళ్ళినదగ్గరనుంచి ఖాళీగానే వుంది. ముక్కద్దాలు తీసి దోపిలాగ గదంతా కలియజూచి తట్టాడు.

'నేను....'

పసితనపు సిగ్గుతో వింటూ మళ్లీ తట్టాడు;

'నేను....'

వింటూ, అవే అక్షరసంజ్ఞల్ని పదేపదే తట్టాడు. గోడ మూగపోయింది. ఇంతకుముందు తానెప్పుడూ బుద్ధిపూర్వకంగా 'నేను' అనే మాట తట్టలేదు. బహుశా, యెప్పుడూ యేవిధంగా కూడ తట్టలేదు. ప్రతిధ్వని లేకుండానే ఆ తట్టటం ఆగిపోయింది.

గదిలో పచార్లు సాగిస్తూనే వున్నాడు. నిశ్శబ్దపుగంట మోగినప్పటినుంచి కొన్ని ప్రశ్నలు కలవరపెడుతున్నయ్. కాలాతీతం కాకపోతే వాటికి సమాధానలను వెదకటాని కెంతో కుతూహాలపడేవాడు. అవి కొంతవరకు స్వాభావిక ప్రశ్నలు. అవి బాధపడుటకు సంబంధించినవి, యింకా సరిగా చెప్పాలంటే, అర్థసహితంగానూ, అర్థరహితంగానూ బాధపడుటకు మధ్యనున్న భేదం. తప్పనిసరియైన బాధకు మాత్రమే అర్థం వుందని స్పష్టమాతుంది. అంటే శారీరక ఆపదలకు సంబంధించినది. ఇంకోవైపున సంఘమూలక బాధంతా ఆకస్మికం. అందువల్ల అర్థరహిత బాధపడుటను నిర్మూలించటమే విప్లవానికి యేకైక వుద్దేశం. కాని యీ రెండోరకపు బాధానిర్మూలన, తాత్కాలికంగా మొదటి బాధయొక్క మొత్తం యితోధికంగా అనుభవించటంవల్లనే సాధ్యమాతుందని తేలుతోంది. అలాంటప్పుడు ప్రశ్నయిది. అటువంటి వ్యవహారం సమర్థనీయమా, నిగూఢమైన 'మానవజాతి'ని గురించి మాట్లాడినప్పుడు స్పష్టంగా సమర్థనీయమే'.

కాని యేకవచనంలో మానవుడి 'నేను' అనే పూర్ణానుస్వార్రానికి, రక్తమాంసాలున్న మానవునికి అన్వయించినప్పుడు యీా సూత్రం శుద్ధ అసంబద్ధమౌతుంది. కుర్రతనంలో పార్టీలో పనిచేస్తూంటే యిటువంటి ప్రశ్నలన్నిటికీ సమాధానాలు దొరుకుతాయని నమ్మాడు. ఇప్పటికి నలభైసంవత్సరాలు పని చేశాడు. మరియేసమాధానాలకోసం తాను పార్టీలోజేరాడో వాటిని మొదట్లోనే మర్చిపోయాడు. ఇప్పుడు నలభైసంవత్సరాలు పూర్తయినయ్. కాని అతను కుర్రతనపు సంభ్రమస్థితికే వెళ్ళాడు. పార్టీ అతను యివ్వగలిగిందంతట్నీ తీసుకుంది, కాని యెప్పుడూ అతని ప్రశ్నలకు సమాధానమివ్వలేదు. ఖాళీగది గోడమీాద తట్టిన మాంత్రిక నామధేయుడు, నిశ్శబ్ద భాగస్వామైనా సమాధానం చెప్పలేదు. ఈ భాగస్వామి, యెంతటి అవసరం, సాహసవంతమైనా, అటువంటి ప్రత్యక్ష ప్రశ్నలు పెడచెవిని బెడతాడు.

అయినా అతన్ని అందుకోవటానికి మార్గాలున్నయ్. అప్పుడప్పుడు, అతను ఒక రాగానికి, లేక రాగస్మృతికి, లేక పియెటా ముకుళిత హస్తాలకు, లేక బాల్యకాల దృశ్యాలస్మృతులకు తలవనితలంపుగా జవాబిస్తుంటాడు, వాయిద్యం మీాద మెట్టుతీగను మీాటినప్పటిలాగ సమాధాన తరంగాలు వస్తుంటాయ్. ఒకసారి యిది ప్రారంభమైందా ఋషులు 'ధ్యాన'మనీ, మాయవాదులు 'పారవశ్యత' అనీ పిలిచే ఒకస్థితి యేర్పడుతుంది. నవీన మనస్తత్వ శాస్త్రవేత్తల్లో గొప్పవారు, బుద్ధిశాలురు యీా స్థితిని యదార్థంగా గుర్తించి దీన్ని 'సముద్ర తరంగబుద్ధి' అన్నారు. మరి, నిజంగా, వ్యక్తిత్వం సముద్రంలో

లవణరేణువులాగా కరగిపోయింది. కాని అదే సమయంలో అనంతమైన సముద్రమంతా అ లవణరేణువులోనే అంతర్భూతమైనట్లు కనిపిస్తుంది. ఆ రేణువు ఎప్పుడూ స్థల, కాల పరిధులలో బంధింపబడి వుండదు. ఆ స్థితిలో బుద్ధి తన దిక్కును వదలి అయస్కాంత కేంద్రంవద్ద దిక్సూచి ముల్లులాగ, వర్తులంగా తిరుగుతుంది; విరుసునుంచి విడిపడి, రాత్రికాలంలో కాంతిపుంజంలా, స్వేచ్ఛగా అవకాశంలో తిరిగేవరకూ, అంతరాత్మ క్రకచాళంనుంచి వికేంద్రీకరింపబడి, ఒకే కాంతికిరణంనుంచి వెదజల్లబడే వర్ణకిరణాలవలె అన్ని ఆలోచనలు, భావనలు, కష్ట, సుఖాలు కనిపించేంతవరకు తిరుగుతుంది.

రుబషోవ్ గదిలో పచార్లు చేశాడు. పూర్వమైతే యీ పసిఆనందాన్ని లజ్జావదనంతో తిరస్కరించేవాడు. ఇప్పుడు సిగ్గుపడటం లేదు. మత్యువులో తత్వం యదార్థమైంది. కిటికీవద్ద ఆగి నుదురు తలుపు అద్దానికానించాడు. మరతుపాకి గోపురంపైగా నీలివర్ణపుమచ్చ ఆకాశంలో కనిపిస్తోంది. ఆ నీలిమచ్చ పాలిపోయింది. అతను చిన్నతనంలో తన తండ్రి వుద్యానవనంలో పచ్చిగడ్డిమీద పడుకుని, అడవిబూరుగుచెట్ల కొమ్మలు ఆకాశంవైపు వూగులాడుతుంటే, చూచిన నీలిమచ్చ గుర్తుకొచ్చింది. ఈ నీలిమచ్చ దృశ్యంకూడ చాలు సముద్ర తరంగిత స్థితి కలగటానికి. ఇటీవల జ్యోతిశ్శాస్త్ర పరిశోధనల ఫలితంగా ప్రపంచపు ఘనపరిమాణం పరిమితమనీ, అవకాశానికి పరిధులు లేకపోయినా భూభాగపు పైమట్టంవలె స్వయంబద్ధంగా వుంటుందనీ — చదివాడు. ఆ విషయం అతనికెప్పుడూ అర్థంకాలేదు, కాని యిప్పుడు అత్యవసరంగా అర్థంచేసుకోవా

లని తాపత్రయపడుతున్నాడు. ఆ విషయమై యొక్కడ చదివాడో కూడ జ్ఞాపకమున్నది. జర్మనీలో తాను అరెస్టయిన మొదటిసారి కొంతమంది కామ్రేడ్స్ రహస్యంగా అచ్చువేసిన పార్టీపత్రిక కాగితంఒకటి దొంగతనంగా తెచ్చారు; ఆ కాగితం పైభాగంలో మూడుకాలాల మేర వడుకునూలు మిల్లులో కార్మికులసమ్మెను గురించి వుంది; ఒకకాలం క్రిందభాగంలో, చోటునింపటానికి, విశ్వం పరిమితమన్న పరిశోధనఫలితాన్ని చిన్న అక్షరాలతో వేశారు, ఆ వార్త మధ్యలో కాగితం చిరిగిపోయింది. ఆ చిరిగిపోయిన ముక్కలో యేముందో తన కెప్పుడూ తెలియలేదు.

రుబషోవ్ కిటికీప్రక్కన నిలబడి ఖాళీగోడమీద ముక్కద్దాల చట్రంతో తట్టాడు. చిన్నతనంలో తప్పకుండ జ్యోతిశ్శాస్త్రం చదవాలనుకున్నాడు. కాని నలభై సంవత్సరాల నుంచి మరొక పనిచేశాడు. పబ్లిక్ ప్రాసిక్యూటరు, 'ముద్దాయి రుబషోవ్, అనంతం సంగతేమిటి?' అని యెందు కడగలేదు? తాను సమాధానం చెప్పలేకపోయేవాడు — అదే, అదే అతని యదార్థ నేరానికిమూలం.... అంతకంటే మహాపరాధం యింకేమైనా వుంటుందా?

ఆ వార్తాపత్రికలోని వార్తను చదివినప్పుడు, అప్పుడు కూడ తన ఖైదుగదిలో, అంతకుముందే హింసపెట్టినప్పటి కీళ్ళపోటుతో బాధపడుతూ, ఒంటరిగానే వున్నాడు ఒక విచిత్రమైన ఆత్మోన్నత్యస్థితిలో పడ్డాడు — 'సముద్రతరంగిత బుద్ధి' ముంచేసింది. తరువాత లజ్జితుడైనాడు. పార్టీ ఖండిస్తుల్ని

నిరసించింది. వాటిని పెట్టీ బూర్జువా మాయావాదమన్నది; రాజప్రసాద ప్రవేశ మన్నది. 'కార్యవిముఖత,' 'వర్గపోరాటాన్ని విడిచి పారిపోవటం' అన్నది. 'సముద్రతరంగిత బుద్ధి' ప్రతివిప్లవ స్వభావం.

పోరాటంలో ప్రతివాడు తన రెండుకాళ్ళనూ భూమిమీద గట్టిగాఆన్చి నిలబడాలి; అదెలాగో పార్టీ నేర్పింది. అనంత మనేది రాజకీయంగా అనుమాన ప్రమాణం. 'నేను' అనేది అనుమాన స్వభావం. పార్టీ దానివునికే యెప్పుడూ గుర్తించదు. వ్యక్తికి నిర్వచనం: లక్షమంది జన బాహుళ్యాన్ని లక్షతో విభాగించటం.

పార్టీ వ్యక్తి స్వేచ్ఛాబుద్ధిని తిరస్కరించింది — అప్పుడే అతని బుద్ధిపూర్వక ఆత్మత్యాగాన్ని తీసుకున్నది. రెండు గత్యంతరాలలో దేనిని స్వీకరించాలనే విషయంలో అతని హక్కును హరించింది—అప్పుడే సక్రమమైన దాన్ని యెల్లప్పుడూ యెంచుకోవాలని శాసించింది. మంచి చెడ్డలను గుర్తించే విచక్షణాశక్తిని నిరసించింది - అదే సమయంలో ద్రోహం, విశ్వాసఘాతుకాలను గురించి హృదయవిదారంగా మాట్లాడింది. వ్యక్తి ఆర్థికవుపద్రవ చిహ్నంగా నిలబడి వున్నాడు.ఆపశక్యంకాని,యెడతెగక సర్వకాలాల్లోనూ తిరుగు గడియారపు చక్రగమనంలాంటిది - పార్టీ ఆ చక్రం గడియారపుగమనాని కెదురుతిరిగి, గమనాన్నే మార్చాలని కోరింది. ఈ లెక్కలో యెక్కడో పొరపాటున్నది; యీ సామ్యంసరిగా పనిచేయలేదు.

నలభై సంవత్సరాలు ఆర్థికోపద్రవానికి వ్యతిరేకంగా

పోరాడాడు, అదే మానవజాతి మూలరోగం; లోభాగాలను తినివేస్తున్న మహారోగం. శస్త్రచికిత్సచేయాలి; పుండు ఆ తర్వాత అదే మానుతుంది. మిగతాదంతా విలాసార్థ విద్యాభ్యాసం, అభూతకల్పన, ప్రగల్భాలు. శారీరక వ్యాధిగ్రస్తునికి దివ్యోపదేశాలతో నయంచేయటం సాధ్యంకాదు. శస్త్రవైద్యుని శస్త్రం, అతని దీర్ఘాలోచన ఒక్కటే పరిష్కారమార్గం. కాని యెక్కడెక్కడ శస్త్రం ప్రయోగింపబడుతుందో ఆ చోటునల్లా పాతవాటికన్నా చే క్రొత్తక్రొత్త రణాలు బయలు దేరినయ్. మళ్ళీ ఆ సామ్యం పనిచెయ్యలేదు.

నలభై సంవత్సరాలు నిక్కచ్చిగా పార్టీ ఆదేశానుసారం ప్రవర్తించుకొన్నాడు. తార్కికగణన సూత్రాలకే అంటిపెట్టుకొని వున్నాడు. పూర్వావశేషాలను కాల్చి మసి చేశాడు. వివేకపు ఆమ్లంతో తన అంతఃకరణం నుంచి కుతార్కిక నీతితత్వాన్ని కాల్చివేశాడు. నిశ్శబ్ద భాగస్వామి ప్రేరణలనుంచి తిరిగిపోయి 'సముద్రతరంగిత బుద్ధి'తో తన శక్తికొద్దీ పోరాడుతున్నాడు. అది తన నెక్కడకు తీసుకుపోయి వదలింది? నిరాక్షేపణీయ సత్యమైన పూర్వ సిద్ధాంతాలు సంపూర్ణంగా అసంబద్ధస్థితికి దారితీసినయ్; ఇవనోవ్‌ల, గ్లెట్కిన్‌ల నిరాక్షేపణీయ సంకలనలు అతన్ని సరాసరి బహిరంగవిచారణ అనే భయంకర పైశాచిక క్రీడకు తీసుకెళ్ళినయ్. ప్రతి ఆలోచనయొక్క తార్కిక నిర్ణయాలను గురించి ఆలోచించటం బహుశా మానవునికి సరిపడదు.

కిటికీ చువ్వల్లోనుంచి మరతుపాకి గోపురంపైన కనిపించే నీలిమచ్చ వైపు తేరిపార చూస్తున్నాడు. గతంలోనికి తిరిగి

చూస్తే, నలభై సంవత్సరాలు వీరావేశంతో పరుగెత్తినట్లు కనిపించింది — అనుభవరహిత హేతువాదపు వీరావేశం. బహుశా, మానవుడు పూర్వబంధనాలనుంచి సంపూర్ణ స్వేచ్ఛను పొందటం సరిపడదు; 'నీవు చేయకూడదు' 'నీవు చేయకపోవచ్చు' అనే నిలుకడకలిగించు ప్రేరకలనుంచి స్వేచ్ఛను పొంది, గమ్యంవైపు సరాసరి అనుగమించటానికి అనుమతింపబడటం కూడ సాధ్యంకాదేమో!

ఆ నీలిమచ్చ గులాబిరంగుకు తిరుగుతోంది; చీకటి పడుతోంది. గోపురంచుట్టూ నల్లటి పక్షులగుంపు నెమ్మదిగా, నిస్పృహతో, రెక్కలు కొట్టుకుంటూ తిరుగుతున్నది. లేదు, ఆ సామ్యం పనిచేయలేదు. మానవుడిచేతికి కత్తియిచ్చి అతని దృష్టిని గమ్యంవైపు త్రిప్పినంతమాత్రంతో సరిపోదని స్పష్టమౌతున్నది. ఆ కత్తితో ప్రయోగం చేసి చూడటం అతనికి సరిపడదు. బహుశా, తర్వాత యెప్పుడో ఒకనాడు కావచ్చు; ప్రస్తుతం అతను యింకా యవ్వనుడే, వికృతంగాకూడ వున్నాడు. అతను విప్లవ పితృభూమిలో, స్వాతంత్ర్యపు కోట బురుజుకోసం చేసిన మహాప్రయోగశాలలో యేవిధంగా వీర విహారం చేశాడు! ఆ కోటబురుజును కాపాడటంకోసం యేపని చేసినా తప్పులేదనే సూత్రాన్ని గ్లెట్కిన్ సమర్థించాడు. కాని దాని ఆంతర్యంలో యేవిధంగా కనిపిస్తుంది? సిమ్మెంట్, రాళ్ళతో స్వర్గాన్ని నిర్మించలేరెవరూ. కోటబురుజు రక్షింపబడవలసిందే, కాని అది ప్రపంచానికిచ్చే సందేశంగాని, ఆదర్శంగాని యేమీలేదు. మధ్యయుగపు క్రైస్తవమత ప్రధానాచార్యులు క్రైస్తవ సామ్రాజ్యాదర్శానికి మసిబూసినట్లు,

సెం. 1 పాలన సామాజిక ప్రభుత్వాదర్శానికి మసిబూసింది. విప్లవపతాక ధ్వజం క్రిందకు సగానికి దిగింది.

రుబషోవ్ గదిలో పచార్లుచేస్తున్నాడు. గది నిర్మలంగా, బాదాపు చీకటిగావుంది. వాళ్ళు అతన్ని తీసికెళ్ళటానికి రావాటానికెంతో వ్యవధిలేదు. ఆ సామ్యంలో యెక్కడో పొరబాటున్నది — కాదు, మొత్తం యీ ఆలోచనాక్రమ గణిత విధానంలోనే వుంది పొరబాటు. ఇప్పటికెన్నడోతనలోనే దాని తాలూకు అవ వేషం గూడుకట్టుకుని వున్నది — రిచర్గాధ, పిమెటాల సంఘటనలప్పటినుంచి. కాని దాన్ని అంగీకరించటాని కతనికిధైర్యంచాలలేదు. బహుశా, విప్లవం, అసహ్యంగా వికలాంగాలతో కూడిన గర్భస్రావంలా అకాలంలో జరిగిందేమో. బహుశా, అదంతా కాలనిర్ణయంలో యేర్పడిన పొరబాటేమో. రోమన్నాగరికత కూడ క్రీ. పూ. మొదటి శతాబ్దంలోనే శిథిలమైనది; మన నాగరికత లాగే మొదలంట కుళ్ళిపోయింది; అప్పుడుకూడ వుత్తమ బుద్ధిమంతులు మహాపరివర్తనకు కాలం పండిందని విశ్వసించారు; అయినప్పటికీ పూర్వ శిథిలలోకపు రీతి ఐదు వందల సంవత్సరాలవరకూ సాగింది. చరిత్రకు నాడి నిదానం; మానవుడు సంవత్సరాలలో అంచనా వేసినదాన్ని చరిత్ర తరాలలో అంచనా వేస్తుంది. బహుశా, యిప్పటికి జీవోత్పత్తి జరిగి రెండో రోజేనేమో. తాను బ్రతికి, ప్రజానీకపు సామ్యపరిణత సిద్ధాంతాన్ని పెంపొందించాలని యెంత ఆశిస్తున్నాడు!...'

గదిలో నిర్మలంగావుంది. నేలమీద పరచిన పెంకుల మీద తన అడుగుల చప్పుడు తప్ప యింకేమీ వినిపించటం

లేదు. ఆరున్నర అడుగులు తలుపు వద్దకు వెడితే, అక్కడ నుంచే తనను తీసుకుపోతారు వాళ్ళు; ఆరున్నర అడుగులు కిటికీవద్దకు, దాని వెనుకనే చీకటి పడుతోంది. త్వరలోనే సర్వం సమాప్తమవుతుంది. కాని, యెందుకు యథార్థంగా నీవు మరణిస్తున్నావని ప్రశ్నించుకున్నప్పుడు అతనికేమీ సమాధానం దొరుకలేదు.

ఆ విధానంలోనే పొరబాటువుంది; యే ధర్మ నియమం కోసం యితరులను బలిచేసి, తాను బలికాబోతున్నాడో, యే ధర్మనియమం నిర్వివాదమైనదని యిప్పటివరకు అనుకున్నాడో బహుశా, అందులోనే పొరపాటున్నదేమో; అంత్యం మార్గాన్ని సమర్థిస్తుందనే ధర్మనియమం. ఈ వాక్యమే విప్లవ తత్వంలోని మహోత్కృష్ట భాతృత్వాన్ని చంపివేసి, వాళ్ళందర్ని పిచ్చెత్తి పరుగెత్తేటట్లు చేసింది. ఒకనాడు తన దినచర్యలో యేమిరాసుకున్నాడు? 'మనం సాంప్రదాయాలన్నిటినీ అవతలకు నెట్టేశాం; మన యేకైక మార్గదర్శక సూత్రం ఫలితాంశ తర్కనిర్ణయమే; మన నావ నైతిక లోబరువు లేకుండ ప్రయాణిస్తోంది.'

బహుశా, చెడుగు కూడుకట్టుకుని వున్నదేమో. బహుశా, మానవజాతికి లోబరువు లేకుండా ప్రయాణించటం సరిపడదేమో. ఆ వంకరటింకర, మెలికలదారిన మధ్యవరకు వెళ్ళినతరువాత గమ్యం గోచరించకపోవటానికి హేతువాదం అనే తప్పుడు దిక్సూచియే కారణమేమో.

బహుశా, యిప్పుడే గాఢాంధకారం అలముకోంటుంది. బహుశా తర్వాత, చాలాకాలం తర్వాత, నూతనో

ద్యమం ఒకటి ప్రవృవిస్తుంది - నూతన పతాకలతో, ఆర్థిక ఉపద్రవాన్ని, 'సముద్రతరంగిత బుద్ధి'ని అర్థం చేసుకోగలిగిన నూతనోత్సాహంతో ఆవిర్భవిస్తుంది. బహుశా, నూతనోద్యమ సభ్యులు మార్గాలపవిత్రతయే గమ్యాన్ని సమర్థిస్తాయని, కాషాయాంబరధారులై బోధిస్తారు. బహుశా, మానవుడు, లక్షను లక్షతో భాగించగావచ్చే భాగాహారలబ్ధమని చెప్పే మతం తప్పని నేర్పుతారు. గుణాకారంమీద ఆధారపడిన ఒక నూతన గణితం ప్రవేశపెడతారు. లక్షమంది వ్యక్తుల్ని, ఒక నూతన సత్వం - రూపరహిత ప్రజ యేమాత్రం కాదు - సమైక్యం చేయటంవల్ల ఒక అంతఃకరణ, స్వయంవ్యక్తిత్వం, అనంతమైన స్వయంబద్ధావకాశంలో లక్షరెట్లు సముద్ర తరంగిత భావం వృద్ధిచెంది, అభివృద్ధి చెందుతాయ్.

రుబషోవ్ పచార్లు మానివేసి వింటున్నాడు. డోలు మ్రోత వరండాచివరకు వచ్చినట్లు వినవచ్చింది.

# 3

ఆ డోలు మ్రోత సుదూరం నుంచి గాలిగి కొట్టుకొచ్చినట్లుంది; ఇంకా చాలదూరాన్నుంచి, దగ్గర కొస్తోంది. రుబషోవ్ కదల్లేదు. అతని కాళ్ళు పెంకులమీద వున్నాయి; తన స్వాధీనంలో లేవు; భూమికి ఆకర్షణ శక్తి నెమ్మదిగా పెరుగుతున్నట్లుంది. రహస్యరధ్రం మీదనుంచి దృష్టి మరల్చకుండ కిటికీ వైపు మూడడుగులు వెనక్కు వేశాడు. దీర్ఘ ఉచ్ఛ్వాసం తీసుకొని, సిగరెట్ ముట్టించాడు. పక్కప్రక్క

నున్న గోడమీద తట్టాడు. శబ్దం వినిపించింది.

'తొర్రిపెదవి వాణ్ణి తీసుకొస్తున్నారు. నీకు అభివంద నాలు తెలుపుతున్నాడు.'

కాళ్ళల్లో బరువు తగ్గిపోయింది. తలుపువద్దకెళ్ళి రెండు చేతుల్తోనూ తలుపుగోహంమీద లయ, వరసలతో త్వరితంగా కొడుతున్నాడు. 406 నెంబరుకు యీవార్త నిప్పుడందించినందు వల్ల ప్రయోజనంలేదు. గదంతా ఖాళీగావుంది, అక్కడితో వరస తెగిపోయింది. అతను తట్టి రహస్యరంధ్రానికి కన్ను ఆన్చి నిలబడ్డాడు.

యథాప్రకారంగా వరండాలో మసకవిద్యుద్దీపం వెలుగుతోంది. యథాప్రకారంగా కనిపించే 401 నుంచి 407 వరకు గదుల యినప తలుపులు చూచాడు. డోలుమోత యెక్కువైంది, అడుగులు నెమ్మదిగా, యీడ్చుకుంటూ దగ్గరైనయ్, పెంకులమీద చప్పుడు స్పష్టంగా వినిపించింది. అకస్మాత్తుగా తొర్రిపెదవివాడు దృష్టిపథంలో నిలబడ్డాడు; గ్లెట్కిన్ గదిలో దీపప్రకాశంలో నిలబడినట్లుగా వణుకుతున్న పెదవులతో నిలబడ్డాడు; అతని చేతుల్ని చిత్రంగా వెనక్కి విరిచిపెట్టి అరదండాలు వేశారు. తలుపు రంధ్రం వెనుకనున్న రుబషోవ్ కన్ను అతను చూడలేడు. అందువల్ల గుడ్డిగా వెదుకుతున్న దృష్టితో, తన అంతిమవిముక్తి ఆశ ఆ తలుపువెనుకనే వున్న దన్నట్లు చూచాడు. అప్పుడతను ఆజ్ఞాపితుడై, విధేయతతో వెనుదిరిగాడు. అతని వెనుక యూనిఫారం భూతం రివాల్వరు బెల్టును తగిలించుకొని వచ్చాడు. ఒకరివెనుక వొకరు వాళ్ళు రుబషోవ్ దృష్టిపథంనుంచి దాటిపోయారు.

డోలు మోత అణగిపోయింది. మళ్ళీ అంతా నిర్మలంగావుంది. ప్రక్క పక్కనున్న గోడమీద తట్టుడు ధ్వని వినిపించింది.

'అతను అతిమంచిగా ప్రవర్తించాడు....'

402 నెంబరు కు తన లొంగుబాటును తెలియజేసిన నాటినుంచి వాళ్ళిద్దరూ మాట్లాడుకోవటం లేదు. 402 నెంబరు తట్టుతున్నాడు :

'నీకింకా పది నిమిషాలు వ్యవధివుంది, ఎలా వున్నావు?'

402 నెంబరు రుబషోవ్ కున్న స్వల్పవ్యవధిని విసుగు లేకుండ చేయటానికి, సంభాషణ ప్రారంభించినట్లు తెలుసుకున్నాడు. అందుకు కృతజ్ఞుడైనాడు. పక్కమీద కూర్చుని జవాబు తట్టాడు.

'ఇప్పటికే పూర్తయితే బాగుండుననిపిస్తోంది....'

'నీ కేమాత్రం పికరు లేదు. నీ వొక దెయ్యపు మనిషివని మాకు తెలుసు...' కొంచెం ఆగి మళ్ళీ త్వరితంగా ఆఖరు మాట తట్టాడు, 'దెయ్యపుమనిషి...' అని. సంభాషణ ఆగిపోవటం యిష్టంలేదని అతని ఆరాటమే స్పష్టపరుస్తోంది.

'నీకింకాగుర్తున్నదా? షాంపేన్ గ్లాసుల్లాటి రొమ్ములు"

'హా హా! దెయ్యపు మనిషి....'

వరండాలో ధ్వనికోసం రుబషోవ్ వింటున్నాడు. ఏమీ వినిపించ లేదు. 402నెంబరు అతని ఆలోచనల్ని వూహించినట్లు వెంటనే తట్టనారంభించాడు :

'వినకు, వాళ్ళు వచ్చేటప్పుడు నేను చెపుతాను...

నిన్ను క్షమిస్తే యేంచేస్తావు?'

రుబషోవ్ ఆలోచించాడు. అప్పుడు తట్టాడు:

'జ్యోతిశ్శాస్త్రం చదువుతాను.'

'హా, హా! బహుశా, నేను కూడ. ఇతర గ్రహాలు కూడ నివాసయోగ్యంగా వున్నాయని చెపుతా. నీకు శాస్త్ర సలహా యివ్వనివ్వు.'

'తప్పకుండ,' రుబషోవ్ విస్మయంతో జవాబిచ్చాడు.

'కాని చెడుగా తీసుకోను. సిపాయి సాంకేతిక సూచన, కడుపు ఖాళీచేసుకో. ఇటువంటి పరిస్థితుల్లో అది చాలమంచిది. జీవుడు యిష్టపడుతున్నాడు కాని దేహం బలహీనంగా వుంది. హా - హా!'

రుబషోవ్ మందహాసం చేసి, విధేయంగా, బకెట్ వద్దకెళ్ళాడు. అప్పుడు మళ్ళీ బల్లమీద కూర్చుని తట్టాడు.

'అభివాదాలు. బలే వృద్దేశం. నీ భవిష్యత్తేమిటి?'

కొన్ని క్షణాలు మౌనంగా వుండి, పూర్వాంకంటె నిదానంగా తట్టాడు. 'ఇంకా పద్దెనిమిది సంవత్సరాలు. అది సరి కాదు, 6530 రోజులు మాత్రమే...' కొంచెం ఆగి, మళ్ళీ తట్టాడు.

'నిజంగా నాకు నీలాగైతే బాగుండును.' మళ్ళీకొంత విరామం తర్వాత, 'ఆలోచించు - ఆడది లేకుండా మరో 6530 రాత్రుళ్ళు.'

రుబషోవ్ జవాబివ్వలేదు. తర్వాత తట్టాడు.

'కాని నీవు చదువుకోవచ్చు, నేర్చుకోవచ్చు....'

'అందు కొరకు వలసిన బుర్ర లేదు,' తర్వాత బిగ్గరగా,

హడావిడిగా 'వాళ్లొస్తున్నారు...' అని తట్టాడు.

రెండు క్షణాల తర్వాత,

'ఒక విచారం, మనం యిప్పుడెంతో ముచ్చటగా పిచ్చాపాటీ చెప్పుకొంటున్నాం....'

రుబషోవ్ బల్లమీదనుంచి లేచి, ఒకనిమిషం ఆలోచించి, తట్టాడు.

'నాకు చాలసహాయం చేశావ్. నమస్కారం.'

తాళంలో తాళపుచెవి గరగరమంది. తలుపు తెరచుకొంది. బయట యూనిఫారం భూతం, ఒకపౌరుడు వున్నారు. ఆ పౌరుడు రుబషోవ్‌ను పేరుపెట్టి పిలిచి, కాగితాల కట్టలోనుంచి ఒకపత్రం తీశాడు. అతని చేతులు వెనక్కి విరిచిపెట్టి దండాలు తగిలించేటప్పుడు 402 నెంబరు హడావిడిగా తట్టటం విన్నాడు, రుబషోవ్.

'నాకు నీలాగ్గ తే బాగుండును. నీకు వీడ్కోలు.'

బయట వరండాలో మళ్లీ డోలుమ్రోత ప్రారంభమైంది. వాళ్లు మంగలిగదివద్ద కెళ్ళేవరకూ అనుసరించిందా మ్రోత. దారిపొడుగునా ప్రతి తలుపు రహస్య రంధ్రంలోనుంచి ఒక్కొక్క కన్ను తనను చూస్తున్నదని రుబషోవ్‌కు తెలుసు. కాని కుడివైపుగాని, యెడమవైపుగాని చూడలేదు. అరదండాలు ముంజేతుల్ని ఒరిపిడిపెట్టినయ్. యూనిఫారం భూతం వాటిని తగిలించేటప్పుడు గట్టిగా బిగించాడు, చేతులు వెనక్కి పెట్టేటప్పుడు మెలిపెట్టాడు, అవి బాధపెడుతున్నయ్.

మెట్లు కనిపించినయ్. రుబషోవ్ అడుగులు మందగించినయ్ పౌరుడు మెట్లపైన ఆగి రుబషోవ్‌ను అడిగాడు. అతను

చిన్నమనిషి, కళ్లు కొంచెం ప్రశ్నెత్తుగా వున్నయ్.

'నీ కింకొక కోర్కె ఏమైనా వుందా?'

'ఏమీలేదు,' అని చెప్పి రుబషోవ్ మెట్లుదిగ నారంభించాడు. పౌరుడు మెట్లపైనే నిలబడి వుబ్బెత్తు కళ్ళతో అతనివైపు క్రిందికి చూచాడు.

మెట్లు యిరుకుగా మసక కాంతిలో వున్నయ్. మెట్ల ప్రక్క కడ్డీలను పుచ్చుకోవటానికి వీలులేదు గనుక జారిపడకుండా రుబషోవ్ జాగ్రత్తగా దిగుతున్నాడు. యూనిఫారం వాడు తనవెనుక మూడడుగుల దూరంలో దిగుతున్నట్లు వింటున్నాడు.

సత్తగుల్లాకారంలో మెట్లు మెలితిరిగినయ్. దారిస్పష్టంగా చూడటానికి ముందుకు వంగాడు, ముక్కద్దాలు జారి రెండు మెట్లకవతల మెట్టుమీద పడి, ముక్కముక్కలై క్రిందకు జారి ఆఖరు మెట్టుమీద పడివుంది. రుబషోవ్ ఒకక్షణం తటపటాయించి మిగతా మెట్లుదిగి పోతున్నాడు. తన వెనుకవాడు వంగి పగిలిన ముక్కద్దాలు తీసి జేబులో పెట్టుకొన్న శబ్దం విన్నాడు, కాని వెనుదిరిగి చూడలేదు.

ఇప్పుడు యేమీ చూడలేకపోతున్నాడు, కాని కాళ్ళ క్రిందభూమి గట్టిగానే తగులుతోంది, ఒక పొడుగాటివరండాలో ప్రవేశించాడు; దృష్టి చెదరింది. వరండాచివర కనిపించటం లేదు. యూనిఫారం వాడు యెప్పుడూ మూడడుగులు వెనుకనే వుంటున్నాడు. వాడు తన మెడమీదనే దృష్టి నిలిపినట్లు రుబషోవ్ భావించాడు; కాని వెనుదిరిగిచూడలేదు. జాగ్రత్తగా ఒక్కొక్క అడుగే వేసుకుంటూ పోతున్నాడు. ఇప్పటికప్పుడే

కొన్ని నిముషాలనుంచి ఆ వరండాలో నడుస్తున్నట్లుంది. ఇంక యేమీ జరగలేదు. బహుశా, యూనిఫారంవాడు రివాల్వర తీసేటప్పుడు తనకు వినిపిస్తుంది. అయితే అప్పటివరకు వ్యవ వుంది; తాను భద్రంగానే వుంటాడు. లేక రోగిని పరీక్షించే ప్పుడు చొక్కా-చేతిలో తన పరికరాలను దాచుకొన్న దం వైద్యుడి లాగే యీ మనిషి నడుస్తున్నాడా? రుబషోవ్ యింకొక విషయాన్ని ఆలోచించాలని ప్రయత్నించాడు. కా వెనక్కు తిరిగి చూడకుండ వుండటానికి తన శక్తినంతను వుపయోగించవలసి వచ్చింది.

విచారణ సమయంలో, ఆ దివ్యప్రశాంతి తనను ఆవరి చిన నిమిషంలో విచిత్రంగా వంటినొప్పిమాయమైంది. బహుశ ఆ నిమిషం లోనే కురుపు బద్దలైందేమో. తాను వాళ్ళకేవి చెప్పాడు? 'నేను దేశంయెదుట, ప్రజానీకం యెదుట, సర ప్రజల యెదుట శిరస్సు వంచుతున్నా....' మరి అప్పుడేమైంది ఈ ప్రజా నీకానికి, ప్రజలకు యేమి జరిగింది? నలభై సంవత్ రాలు యెడారిలో బెదరింపులతో, వాగ్దానాలతో, వూహిం భీతి, వూహిత బహూకృతులతో తరుముబడింది. కాని యెక్క డుంది ఆ బంగారుభూమి?

ఈ సంచార మానవజాతికి అటువంటి గమ్యం నిజంగా యెక్కడైనా వున్నదా? కాలాతీతం కాకముందు సమాధానం తెలుసుకోవాలనుకున్న ప్రశ్నల్లో యిదొకటి. మోజెస్‌ను కూడ ఆ బంగారుభూమిలో ప్రవేశింపనీయలేదు. కాని మోజెస్ ను పర్వతాగ్రం పైనుంచి, చూడనిచ్చారు. ఆ విధంగా గమ్యం తనకళ్ల ముందు ప్రత్యక్షమౌతుండగా మరణించటం

తానిర్మలంగా అయింది. సముద్రం ఘోషిస్తోంది మళ్ళీ. తరంగం అతన్ని నెమ్మదిగా పైకెత్తింది; అది యెంతో రాన్నుంచి వచ్చి ప్రశాంతంగా సాగిపోయింది.

అది కాలపురుషుని చిద్విలాసం.